జాతీయగ్రంథమాల

# హరిజనసమస్య.

*　　*　　*　　*



K. U. V. Press, Cuddapah

*
* *

# భారతీనికేతనము,
# కాకినాడ.

* *
*

కాకినాడముద్రాక్షరశాల
కాకినాడ.

## పో ష కు లు.

శ్రీయుత పొన్నపల్లి వీర
రాఘవసోమయాజులుగారు,
వరసాపురము.

శ్రీయుత దేశోద్ధారక
కాశీనాధుని నాగేశ్వరరావు
పంతులుగారు,
చెన్నపురి.

## శాశ్వతచందాదారులు.

1. శ్రీయుత మల్లిపూడి పల్లంరాజుగారు, కాకినాడ.
2. ,, బిక్కిన వేంకటరత్నముగారు, చోడవరము.
3. ,, కళా వేంకటరావుగారు, ముక్కామల.
4. ,, నరసింహదేవర సత్యనారాయణగారు, ఆలమూరు.
5. ,, పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.
6. ,, ఎఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారు, నర్సాపురం.
7. ,, భూపతిరాజు సుబ్బరాజుగారు, వేండ్ర.
8. ,, సమయమంత్రి అచ్చన్నపంతులుగారు, కాకినాడ.
9. ,, కలిదిండి గంగరాజుగారు, తాడేపల్లిగూడెం.
10. ,, తెన్నేటి విశ్వనాథంగారు, విశాఖపట్నం.

## స హా యు లు.

1. శ్రీయుత తోటకూరి వెంకట్రాజుగారు, తాడేపల్లిగూడెం.
2. ,, నిడమర్తి గౌరీశంకరదత్తుగారు, నిడమర్రు.
3. ,, డా॥ బొమ్మకంటి రామమూర్తిశాస్త్రిగారు, నిడదవోలు.
4. ,, డా॥ జేడిగుంట కామరాజుగారు, నిడదవోలు.
5. ,, డా॥ ఎర్రమిల్లి దీక్షితులుగారు, నిడదవోలు.
6. ,, పులుగుర్త వెంకటకృష్ణారావుగారు, రామచంద్రపురం.
7. ,, మల్లిడి సత్యనారాయణరెడ్డిగారు, రామచంద్రపురం.
8. ,, డా॥ తోలేటి కనకరాజుగారు, రామచంద్రపురం.
9. ,, ముక్కవిల్లి వెంకటనారాయణగారు, రామచంద్రపురం.
10. ,, మెట్ల రామమూర్తిగారు, ధవళేశ్వరం.
11. ,, పున్నమరాజు వెంకట్రాయుడుగారు, కాకినాడ.
12. ,, పోలిశెట్టి స్వామినాయుడుగారు, గూడాల.
13. ,, పోకులూరి సుబ్బారావుగారు, రామచంద్రపురం.
14. ,, బిక్కిన వీరరాఘవులుచౌదరిగారు, చోడవరం.
15. ,, సిరుకొండ వెంకటరత్నంచౌదరిగారు, సీతానగరం.
16. ,, శ్రీపాద వెంకన్నగారు, కాకినాడ.
17. ,, పోకల సరయ్యనాయుడుగారు, కాకినాడ.

18. శ్రీయుత డా॥ పి. వి. రమణమూర్తిగారు, కాకినాడ.
19. ,, మెర్ల ఫణిశాస్త్రిగారు, ఆర్యావటం.
20. ,, వట్టికూటి ఆదినారాయణగారు, కూర్మాపురం.
21. ,, డా॥ వేదాంతం వెంకటకృష్ణయ్యగారు, కాకినాడ.
22. ,, నాగదేవర సూర్యారావుగారు, సోమేశ్వరం.
23. ,, చిట్టూరి వెంకటదుర్గాప్రకాశరావుగారు,
కూళ్ళమల్లవరం.
24. ,, బుద్ధవరపు మహాదేవుడుగారు, రామచంద్రపురం.
25. ,, జ్యోతిష్యుల రామచంద్రరావుగారు,
రామచంద్రపురం.
26. ,, బాలాంత్రపు వెంకటకృష్ణారావుగారు,
రామచంద్రపురం.
27. ,, మిత్తింటి మందేశ్వరరావుగారు, రామచంద్రపురం.
28. ,, డా॥ కె. యల్. నరశింహారావుగారు, రాజమండ్రి.
29. ,, డా॥ ఎస్. వి. రామారావుగారు, రాజమండ్రి.
30. ,, డా॥ పాలకోడేటి గురుమూర్తిగారు, రాజమండ్రి.
31. ,, డా॥ బి. నాగేశ్వరరావుగారు, రాజమండ్రి.
32. ,, బిక్కిన వీరాస్వామిగారు, రాజోలు.
33. ,, మారిన సుబ్బారావుగారు, దోసకాయలపల్లి.
34. ,, కాకుళవరపు శేషగిరిరావుగారు, కాకినాడ.
35. ,, ములుకుట్ల వెంకటశాస్త్రిగారు, కాకినాడ.
36. ,, పెద్దాడ రామస్వామిగారు, కాకినాడ.
37. ,, గంటి నరశింహాశర్మగారు, పేరూరు.

38. శ్రీయుత చాగంటి అచ్యుతలింగంగారు, అమలాపురం.
39. ,, నేత్రకంటి యోగానందరావుగారు, కాకినాడ.
40. ,, బులుసు గంగారాయుడుగారు, కొమానపల్లి.
41. ,, చాగంటి వేణుగోపాలకృష్ణారావుగారు, నల్లూరు
42. ,, ఉప్పలూరి రామమూర్తిగారు, మూలస్థానము.
43. ,, చెలికాని సూర్యనారాయణమూర్తిగారు,
ఆర్యవటం.
44. ,, వేమూరి విశ్వనాథశర్మగారు, రాజమండ్రి.
45. ,, కొమాండూరి వెంకటాచార్యులుగారు,
హైదరాబాదు.
46. ,, ముళ్లపూడి తిమ్మరాజుగారు, తణుకు.
47. ,, శ్రీపాద లక్ష్మీనరశింహంగారు, నర్సాపురం.
48. ,, చావలి రామసోమయాజులుగారు, కాకినాడ.
49. ,, యల్లాజ్యోశ్యుల వెంకటేశ్వర్లుగారు, కాకినాడ.
50. ,, సాగిరాజు సత్యనారాయణరాజుగారు,
రాపర్తిరాయవరం.
51. ,, డా॥ సత్తిరాజు వేంకట్రావుగారు, అత్తిలి.
52. ,, భావరాజు సత్యనారాయణగారు,
రామచంద్రపురం.
53. ,, అత్యం నరశింహమూర్తిగారు, పాలకొల్లు.
54. ,, ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ.
55. ,, చీమలకొండ సూర్యనారాయణగారు,
చిలకలంపాడు.

56. శ్రీయుత చెలికాని బుచ్చి వేంకట్రావుగారు, భావవరం.
57. ,, గొల్లపల్లి వీరరాజుగారు, పెద్దాపురప్పాడు.
58. ,, డా॥ ముల్పూరి రంగయ్యగారు, ఏలూరు.
59. ,, సామవేదం సత్యనారాయణగారు, వసంతవాడ.
60. ,, కొమ్మిరెడ్డి ఆంజనేయులుగారు, పోతునూరు.
61. ,, కొమ్మిరెడ్డి సత్యనారాయణగారు, పోతునూరు.
62. ,, మన్నె వెంకటనారాయణగారు, దేవ.
63. ,, మన్నె సత్యనారాయణగారు, కొడమంచిలి.
64. ,, గొడవర్తి నాగేశ్వరరావుగారు, ఆచంట.
65. ,, రావిపాటి సత్యనారాయణగారు, దంగేరు.
66. ,, ముప్పర్తి వెంకటరత్నంగారు, కాకినాడ.
67. ,, జోయనపల్లి రామశర్మగారు, కాకినాడ.
68. ,, దంతుర్తి శాంతయ్యగారు, చామర్లకోట.
69. ,, గోదావరి సత్యనారాయణగారు, కోటిపల్లి.
70. ,, కమ్మ బుచ్చయ్యగారు, కపిలేశ్వరపురం.
71. ,, బలుసు సర్వారాయుడుగారు, కపిలేశ్వరపురం.
72. ,, మారిశ నరసన్నగారు, రాజమండ్రి.
73. ,, నేమాని చినసుబ్బారావుగారు, శృంగవరము.
74. ,, పైండా వెంకటనారాయణగారు,
జమీందారు, కాకినాడ.
75. ,, పెద్దాడ సీతాపతిరావుగారు, రాజమండ్రి.
76. శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు, మైసూరు.

# విషయసూచిక.



# ప్రథమఖండము

## ఉపోద్ఘాతము.

# ద్వితీయఖండము.

మహాత్ముని యంగ్ ఇండియా వ్యాసములు.

# తృతీయఖండము.

## మహాత్ముని ప్రాయోపవేశదీక్ష.

# చతుర్థఖండము.

## మహాత్ముని ప్రకటనలు.

పుట.

# పంచమఖండము.

## మహాత్ముని రెండవ ఉపవాసదీక్ష.

# మనవి.

మా గ్రంథమాలయందు తృతీయపుష్పముగా "హరిజనసమస్య" అను ఈ సద్గ్రంథము గాంధిమహాత్ముని ఉపవాసవ్రతదీక్ష సలుపుచున్న ఈ ఇరువదియొక్క పర్వదినములలో ప్రకటింపగలుగుట మాభాగ్యముగా నెంచుచున్నాము. ఇందులకు మాకు తోడ్పడిన ముద్రాపకులు కాకినాడ ప్రింటింగు వర్క్సువారికి ధన్యవాదములు. కేవల భారతవర్షదృక్పథమే గాక ప్రపంచమంతటిదృష్టియుకూడ కేంద్రీకరింపబడిన యీసమస్యనుగూర్చి మన ఆంధ్రదేశములో నింకను విశేషప్రచారము గావింపవలసియున్నదనుట నిర్వివాదాంశము. ప్రజాబాహుళ్యమునకు ఇందలి విషయములన్నియు బాగుగా వెల్లడిగావలసిన ఆవశ్యకత చాలగలదు. ఇందునుగూర్చిన ప్రబోధమును, జ్ఞానాభివృద్ధియు గావింపబడినచో సంస్కరణము సులభసాధ్యమగును. కావున నీయదనున నీపుస్తకమందులకు సహకారియగునని యాసించుచున్నాము.

ఈ సమస్య రెండుభాగములుగానున్నది. (1) అస్పృశ్యతానివారణము (2) హరిజనాభ్యుదయము అనునవి. అందు ప్రథమాంశమే ప్రధానమైనదని మాయభిప్రాయము. కాని ప్రస్తుత మెచ్చటజూచినను "హరిజనోద్ధరణము"న కెక్కుడు ప్రాముఖ్యత నిచ్చుచున్నట్లు కానవగును. అస్పృశ్యత తొల

గించబడినచో హరిజనాభ్యుదయమును సులభతరమగును. అట్టిచో స్వశక్తికై నాధారపడి తమకు గావలసిన మార్పులను వారే యొనర్చుకొన గలుగుదురు. ఆతరుణమున సవర్ణు లనబడు వారు వారికి తోడ్పడుట అత్యంతవిధాయకమగును. అట్లనుటచే హరిజనాభివృద్ధికి వలయు వాతావరణమునుగాని, సదుపాయములుగాని కావింపవలదని మాయభిప్రాయముగాదు. మరియు నీరెంటను పరస్పర మాధారపడిన విషయములే యనికూడ యంగీకరింతుము కాని యస్పృశ్యత నిర్మూలింపబడనంతకాలము "హరిజనోద్ధరణము"న కెంతకృషిజరిగినను బూడిదలో పోసిన పన్నీరువలె వ్యర్థమేయని మాభావము. మరియు హరిజనులకు ప్రత్యేకముగా నూతులు, పాఠశాలలు, భోజనవసతులు మున్నగువాని నేర్పరచుటచే వారి కాయస్పృశ్యతాదోషము కూడా యటులనే యుండిపోవుననియు; అట్లుగాక సవర్ణులతో పాటు వారును తోటిహిందువులగానే పాటింపబడి సవర్ణులతో కలసిమెలసియుండుటయే ప్రధానముగ నెంచబడినచో వారిలో నత్యద్భుతమగుమార్పును, సుహృద్భావమును కల్గుటయే గాక పరస్పర ప్రేమయు, నభేదభావమును పెంపొందునని మా తలంపు. ఇట్లస్పృశ్యత నిర్మూలింపబడవలెనన్నచో విశేషత్యాగమునకును కష్టనిష్ఠురములకును హరిజనసేవ యొనర్చువారు గురిగావలసియుండు ననుట యథార్థమే.

అట్టి కార్యదీక్షయు నిష్కళంకమగు ప్రేమయు వర్ధిల్లిన గాని యట్టి ప్రదర్శనములచే కార్యసాఫల్యముగాదు.

కావున నిట్టి మహత్తరమగు మార్పు రావలెనన్నచో కష్టనిష్ఠురములకోర్చి చిరకాలమునుండి దీక్షతో పనిచేయు చున్న హరిజనసేవకు లీవిషయమునకు ప్రాధాన్యమొసగి కృషిసల్పవలెననియు, "ఇంటగెలిచిన రచ్చగెలువవచ్చు"నను సూత్రమే యందులకు సాధనమనియు మనవిచేయుచున్నాము.

విశేషశ్రమకోర్చి, చరిత్రాంశములను సేకరించి మహాత్ముని వ్యాసములను, నాయకులసందేశములను మృదుమధుర శైలిని యనువదించి దయతో మాకొసంగిన శ్రీ నండూరి వేంకటకృష్ణమాచార్యులుగారికి మాయభివాదములు. ఆంధ్ర నాయకమణియు సుప్రసిద్ధవక్తయు, హరిజనోద్యమప్రచార దీక్షాబద్ధకంకణులునగు శ్రీ చెరుకువాడ వేంకటనరసింహం గారు మాయందలి ప్రేమచే నీపవిత్రగ్రంథమునకు పీఠిక వ్రాసి యిచ్చిరి. వారికి మావినయపూర్వక నమస్కృతులు.

ఈక్లిష్టపరిస్థితులలో మాయుద్యమమునం దత్యంతా దరమునుజూపుచు మాకు ప్రోత్సాహమొసగుచున్న, మా గ్రంథమాలాపోషకులును, ఆంధ్రరాష్ట్రీయఅస్పృశ్యసేవా సంఘాధ్యక్షులునగు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావుపంతులుగారికి మేమనేక కృతజ్ఞతాభివందనములర్పించు

చున్నాము. జాతీయాభ్యుదయమునకై కృషిసల్పుచున్న మా యుద్యమునం దభిమానముంచి ఆంధ్రసోదరసోదరీమణు లెల్లరు మాకు ప్రోత్సాహ మొసంగ కోరుచున్నాము.

జాతీయగ్రంథమాల.
కాకినాడ.
29-5-1933.

బాలాంత్రపు సత్యనారాయణరావు,
పైడిమర్రి సత్యనారాయణమూర్తి,
సంపాదకులు.

# పీఠిక.

'జాతీయగ్రంథమాల' వారు ప్రచురించిన ఈ "హరిజనసమస్య" అనేపుస్తకాన్ని నేను స్థాలీపులాకన్యాయంగా చదివినాను. ఈ గ్రంథమాలాప్రకాశకులైన నామిత్రులు బాలాంత్రపు సత్యనారాయణరావు, పైడిమర్రి సత్యనారాయణమూర్తిగార్లను, ఆంగ్లభాషరాని ఆంధ్రమహాజనుల శాశ్వత ఉపయోగానికై, ఇట్టిగ్రంథమును సమయంలో ప్రచురించినందుకు మెచ్చియు అభినందిస్తున్నాను. న్యాయానికి ఈపుస్తకములోనున్న విషయాలన్ని గాంధిమహాత్ములు వ్రాసిన వ్యాసాలలోని ముఖ్యభాగాలకు సరియైన తర్జుమాలైనా, చక్కని నిర్దుష్టమైన తేటతెనుగులో, స్వతంత్రముగా వ్రాయబడిన అసలుగ్రంథంవలె ఉండడం యెంతయు సంతోషదాయకము. ఇందులకు రచయితయగు శ్రీనండూరి వేంకటకృష్ణమాచార్యులుగారు ప్రశంసనీయులు.

ఈపుస్తకం ప్రథమఖండంలో హరిజనసమస్యయొక్క ఉపోద్ఘాతమున్నూ, ఆంధ్రదేశంలో గడచిన పాతికముప్పది సంవత్సరములనుంచి జరుగుచున్న నిమ్నజాత్యుద్ధరణ ప్రయత్నాల సంగ్రహచరిత్రయున్నూ ఉదహరింపబడినవి. మహాత్ములవారు అసహాయోద్యమారంభమునుండి అస్పృశ్యతా

నివారణమునుగురించి [illegible] చక్కగా సమకూర్చి ఈగ్రంథంలో చెప్పబడినవి. [illegible] ప్రతికూలురయొక్క శాస్త్రవాద [illegible] కూడ మహాత్ముడొసంగిన [illegible] చెప్పబడెను. భారతవర్షంలో మనదేశములో [illegible] సంపూర్ణంగా నిర్మూలం అయ్యేవరకు ఈ పుస్తకంలోని అభిప్రాయాలు, భావాలు, ఆంధ్రదేశంలోని మారుమూలలకు గ్రామాల్లో కూడా వ్యాపింపవలసిన అవశ్యం కనిపిస్తూవున్నది. హరిజనోద్యమాభిమానులందరు యీ గ్రంథాన్ని, దీనిలోని అభిప్రాయాల్ని, వీలైనంతవరకు వ్యాపింపజేసి సఫలీకృతమనోరథులవుతారని ఆశిస్తువున్నాను.

మన దేశంలో ఇప్పుడు హరిజనులనబడువారు ఎప్పుడు ఎందులకేర్పడిరో అనే విషయాన్నిగూర్చి ఇందులో రెండు మూడు కారణాలు వివరింపబడినవి. అవిగాక నేనువిన్న మరియొక కారణంగూడ ఈ సందర్భములో మనవిచేస్తున్నాను.

ఈదేశము ఆర్యులు రాకపూర్వము కొందరి లెక్క ప్రకారం సుమారు ఎనిమిదివేల సంవత్సరాలకిందట అనార్యులగు ద్రివిడులతో నిండి వుండేదనిన్నీ; మరికొందరు పరదేశములనుండి కెల్టిక్సు, సిథియన్లు, గ్రీకులు, మంగోలియనులు మున్నగు అనేక జాతులవారుగూడ ఈ దేశంలోకి వచ్చియున్నారనిన్ని; మధ్యఆసియానుండి బ్రాహ్మ, క్షత్రియ,

వైశ్య, శూద్రులను చాతుర్వర్ణ విభాగములు కలిగిన (తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు, రంగులుగల) ఆర్యులు ఈదేశంలో ప్రవేశించి అదివరకు ఈ దేశంలో వున్నవారిని, పరదేశాలనుండి వచ్చినవారిని, గుణకర్మవిచక్షణచే తమ నాలుగువర్ణాలలోను చేర్చుకుని, వారందరికి, ఆర్యులభాష, నాగరికత, విజ్ఞానము, సాంప్రదాయాలు, ఆచారమర్యాదలు మున్నగునవి యొసగి, ఆర్యసభ్యతలో చేర్చుకుని ఆర్యధర్మప్రచారం చేశారనిన్నీ, ఈకార్యం అనేక వేల సంవత్సరాలు చేయుగాచేయుగా యేర్పడినవారే ప్రస్తుతం ఈచాతుర్వర్ణ విభాగాంతర భాగములతో వ్యవహరింపబడు హిందువులనిన్నీ; కాలక్రమమున ఉత్సాహావేశశక్తిసామర్థ్యములు సన్నగిల్లి ఆర్యధర్మప్రచార మాగిపోయిందనిన్ని; అప్పటికి మిగిలిపోయిన అనార్యజాతులను ఆర్యులు పంచములుగా భావించి, కొన్ని నీచవృత్తులకుమాత్రము అవకాశమిచ్చి హీనంగా చూస్తూయుండిరనిన్ని; వారే ఇప్పటి మనహారిజనుల మూలపురుషులనిన్ని, కొందరు పండితుల యభిప్రాయము. హారిజనోత్పత్తి నిగూర్చి చెప్పేకారణాలన్నిటిలోను యిదే యెక్కువ సమంజసంగాయున్నట్లు నాకు తోస్తోంది.

మన ఆర్యమహాఋషులు వదలిపెట్టిన కార్యాన్నే నేడు గాంధిమహాత్ములు పూనుకొని, ఇన్నివేల సంవత్సరముల నుండి ఆర్యధర్మసాంప్రదాయాలకు ప్రక్కనుండి వారినే

ఆశ్రయించి, అనుకరిస్తూయున్న నాలుగుకోట్లమంది అనార్య జాతులను, అంటుదోషం పోగొట్టి, వారినికూడ ఆర్యధర్మ సాంప్రదాయాల్లో చేర్చుకొనుటకై మహోద్యమం చేస్తూన్న ప్రయత్నం ఆర్యధర్మవ్యాప్తికి తోడ్పడునదేగాని అనర్థదాయకం ఎంతమాత్రం కాజాలదు. దేశాభ్యుదయమునుకోరు ఆంధ్రదేశంలోని స్త్రీపురుషులంతా ఈపుస్తకంలోని అభిప్రాయాలను ప్రచారంచేసి కృతకృత్యులయ్యెదరుగాక యని కోరుచున్నాను.

చెరుకువాడ వేంకటనరసింహం.



# ఉపవాసమహిమ.

"తపో నానశనా త్పరం" తైత్తిరీయోపనిషత్తు॥

అనగా ఉపవాసవ్రతముకంటె అధికమైన తపస్సు లేదని. మరియు భారతం అనుశాసనీకపర్వం చతుర్థాశ్వాసంలో ఉపవాసమహిమనుగూర్చి ఇట్లు చెప్పబడినది.

క. "విను వైశ్యులకును శూద్రుల
కును నాలుగు గుడుపు లుడుగుకొలదికి మిగులన్
జన దుపవసింప నుపవా
స నిరూఢత పెంపు కల్గమియు వారలకున్.

తే గీ. వత్సరంబెల్లఁ బక్షోపవాసనియతి
గడపునతనికి పుణ్యలోకంబులెల్ల
వాసభూములు, మాసోపవాసవృత్తి
యైన బ్రహ్మలోకంబు సౌఖ్యంబుగలుగు.

ఆ. ఎంతనిష్టగలిగెనేనియు మాసంబు
లోనియందు మెక్కుడైనదినము
లధిప! యుపవసింపనగుగాని మాసాధి
కోపవాసవృత్తి పాపమండ్రు

వ॥ యుగసామర్థ్యంబుననుం బురుషమహానుభావ విశేషంబుననుం జేసి యుపవాసవ్రతంబు మహాధికకాలకృతంబైనను గీడుం జేయక యత్యంతఫలంబై యుండు.

చం. అనశననిష్ఠ జేసి సుర
లాదిమునుల్ మహితానుభావులై
రనఘ! సహస్రవర్షసమ
నంతరకల్పితమైన యేకభు
క్తనియమ తంత్రముల్ నడపి
గాధితనూజుడు బ్రాహ్మణత్వమున్
గనియె, మహోపవాసముల
గాని ఫలంబులు లేవు భూవరా!

క కావున నుపవాసవ్రత
సేవనము శరీరమునకు జిత్తంబునకున్
బావన మైహికమహిమయు
దేవనిలయ సుఖము నిర్వ్యాధిన్ సమకూరున్ "

ఇట్టి ఉపవాసవ్రతప్రభావముచే మహాత్ముడు హరిజనసమస్యను పరిష్కరింపబూనుట మహాఋషులనుష్ఠించిన సనాతనధర్మము ననుసరించియేయని స్పష్టముగాగలదు.

# కృతజ్ఞత.

ఈ గ్రంథరచనయందు నాకు నీదిగువ గ్రంథములు చాల తోడ్పడినవి. ఆగ్రంథకర్తలకు కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించుచున్నాను.

1. Epic Fast by Pyrelal.
2. The Impending Fast of M. K. Gandhi. by C. Rajagopalachari.
3. విరుద్ధభారతము—శ్రీమంగిపూడి వెంకటశర్మగారు.
4. Punjab Achhut Uddar Mandal Report for 1926–'31.
5. Legislative Assembly Debates of 16th Nov. '28.
6. Lothian Committee Report Vol. 2 & 3.
7. Simon Commission Report Vol. I.
8. Castes and Tribes of Bengal.
9. Castes and Tribes of Madras.
10. Mother India by Miss Mayo.
11. Cochin Castes and Tribes by Ananta Krishna Iyer
12. Census Reports Govt. of India and Native States 1931.

మిత్రు లనేకులు నేను వ్రాసినదానిని పరిచూచియు, అమూల్యమగు సూచనల గావించియు, వారికడ నీవిషయమునకు సంబంధించిన గ్రంథము లొసంగియు చాల సహాయపడిరి. వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు,

గ్రంథకర్త.

# హరిజనసమస్య.

## ప్రథమ ఖండము.

---

హరిజను లెవరు ?

లోకములో రాజ్యాధికారముగలవారి భాషకే నెక్కుడు వ్యాప్తియు, ప్రాముఖ్యతయు కలుగుచున్న విషయము చరిత్ర ప్రసిద్ధమైనది. మన దేశమును ప్రస్తుతము విదేశస్థులగు ఆంగ్లేయులు పాలించుచున్నారు. అందుచేత వారి మాతృభాషయగు ఆంగ్లభాషయే మనకు రాజభాషయైనది దానితో నంతకు పూర్వమున్న హిందూస్థానీయును, దేశభాషలును విద్యాధికుల యాదరమును గోల్పోయినవి. క్రమక్రమముగా నాంగ్లభాషలోని పదములు కొలదిమార్పులతో మనభాషలలో చేరదొడగినవి. అట్లు వీలుకానిసందర్భములందు వాటి యనువాదములు గైకొనబడుచున్నవి. నేడు 'ఆంధ్రపత్రిక' మున్నగు తెనుగుపత్రికలలో విరివిగా నుపయోగింపబడుచున్న 'నిమ్నజాతులు' 'అస్పృశ్యుల'ను పదములు యీరెండవతరగతికి చేరినవి. ఇవి 'డిప్రెస్డ్ క్లాసెస్' (Depressed Classes) 'అన్‌టచబుల్సు' (Untouchables) అను యాం

గ్లభాషాపదముల కాంధ్రీకరణములు. కాని 'డిప్రెస్డ్ క్లాసెస్' అను పదమునకు అణచివేయబడినజాతులవా రని యర్థము. నిమ్న జాతులను పదముకూడ నదేయర్థమున నుపయోగింపబడుచున్నది. ఈజాతులే పూర్వము సంస్కృత గ్రంథములలో ఛండాల, ప్లవ, మాతంగ, పుల్కస, అంత్యవాసులను నామములతో పేర్కొనబడిరని చెప్పుదురు. కాని సంస్కృతభాష యనుదినవ్యవహారములోనుండి పోయి దాని స్థానమున దేశభాషలు వచ్చుటచే వీరికా పేరులు పోయి వేరునామములు వచ్చినవి మాలలు, మాదిగలు, పంచములు, చెప్పరానివారు, పెద్దింటివారు, అంటరానివారు మొదలుగాగల పేరులతో నాంధ్రదేశములో వీరు వ్యవహరింపబడుచున్నారు. కాని యీ పేరు లాయాజాతులవారికి అవమానకరముగ దోచుటచే వారు, ఆదియాంధ్రులమని ఆంధ్రదేశములోనను, ఆదికర్ణాటకుల మని కర్ణాటదేశములోనను, ఆదిద్రావిడులమని ద్రావిడదేశములోనను, ఆదిహిందువులమని యన్యప్రాంతములలోను చెప్పుకొనుచున్నారు. ఇప్పుడు అంటరానివారుగను, చేరరానివారుగను చూడబడుచున్న యీజాతులవారే యీ దేశములోని ఆదిమనివాసులని చరిత్ర పరిశోధకులు కొందరు వ్రాయుటయే పై పేరుల నాయాజాతులవారు చెప్పుకొనుటకు కారణము. కాని మహాత్ముడు తన ప్రాయోపవేశదీక్షానంతరమునుండి వారలను "హరిజనులు"

అని పేర్కొనుచున్నాడు. హరిజను లనుపదమునుగురించి మహాత్ముడే 'హరిజన్' అను యాంగ్లవారపత్రికయొక్క ప్రథమసంచికలో నిట్లు వ్రాసెను.

"అస్పృశ్యులకు హరిజనుడను పేరేల నుపయోగించుచున్నావని విలేఖరు లనేకమంది నన్నడిగిరి. ఆంగ్లేయులగు స్నేహితులు కొందరాపేరున కర్థము తెల్పుమని కోరిరి. ఆపేరు నేను కల్పించినది కాదు. 'నవజీవన్' పత్రికలో 'అస్పృశ్యుడను పదము నుపయోగించుచున్నానని కొన్ని సంవత్సరములకు పూర్వము అస్పృశ్యులగు విలేఖరు లెందరో విమర్శించుచు వ్రాసిరి (ఫిర్యాదుచేసిరి.) 'అస్పృశ్యుడ'ను పదము అన్‌టచబుల్ (Untcnchable) అను యాంగ్లపదమునకు సరియైన అనువాదము. అంతట నేను వారల నంతకంటె మంచిపేరును తెల్పుమని కోరితిని. వారిలో నొక విలేఖరి "హరిజనుడ"ను పదమును సూచించెను. ఆపదమునే మనకు తెలిసినంతవరకును గుజరాతుదేశములోని భక్తులగు కవీంద్రులలో నెల్ల ప్రథముడగు కవీంద్రు డుపయోగించెనని తెల్పి ప్రమాణముగా పద్యమునొకదాని నంపెను. ఆవిలేఖ, నిర్ధారణచేయగోరినయర్థ మాపద్యమునందు స్ఫురింపక పోయినను నే నాపదము బాగున్నదనియే తలంచితిని. 'హరిజనుడ'నగా హరియొక్క జనుడని యర్థము. లోకములోని మతధర్మను లన్నియు భగవంతుని ముఖ్యముగా నిస్సహా

యులకెల్ల సహాయునిగను, దుర్బలులకెల్ల సంరక్షకునిగను, హితులులేనివారికెల్లరకును హితునిగను వర్ణించుచున్నవి. తక్కిన ప్రపంచముమాట యెట్లున్నను, అస్పృశ్యులుగ పరిగణింపబడుచున్నట్టియు నాలుగుకోట్లో లేక యింతకు మించియో యున్నట్టియు, హిందువులగువీరికన్న నిస్సహాయులును, దుర్బలులును, స్నేహితులులేనివార లింకెవ్వరీభారతభూమిలో గలరు ? కావున, హరియొక్క జనులని వర్ణింపబడుటకు తగినజాతి యేదైన నున్నచో నిశ్చయముగ వారలీ నిస్సహాయులును, సవర్ణులచే నసహ్యించుకొనబడువారును, దుర్బలులునగు వీరలేయగుదురు. అందువల్ల పైనచెప్పబడిన ఉత్తరప్రత్యుత్తరములు నడచినప్పటినుండియు "అస్పృశ్యుడ"ను పదమునకు బదులు "హరిజనుడ"ను పదమునే నేను "నవజీవన్" పత్రికలో నుపయోగించుచుంటిని. నేను జైలులో శిక్ష ననుభవించుచున్నను, వారిసేవకై భగవంతుడు నన్నే నిర్దేశించినప్పుడు, వారిని పేర్కొనుటకు నే నింకేపదమును వాడజాలకపోయితిని. ఆపదమును, ఆపదమునకు గలయర్థమును తలంచినంతనే నేను భయోద్భ్రాంతుడ నగుదును. పేరు మార్చినంతనే వారల కెక్కువతాహతు కలుగునని కాదు. నిందాస్పదమగు పేరుతోనైన వారిని పిలవకుండనుండవచ్చును. తమంతట తామే సవర్ణహిందువులు తమ విశ్వాసముల కనువుగ నేడుగల యస్పృశ్యతను తొలగద్రో

సినప్పుడు మనమందరము కూడ 'హరిజనులమ'నియే పిలువ బడుదుము. అట్లు వారొనర్చుటవల్ల అల్పుడనగు నాయభిప్రాయముప్రకారము వారు భగవత్కరుణకు పాత్రులగుదురు. అంతట 'హరిజనుల'ని పిలువబడుట కర్హులేయగుదురు."

హరిజనుడనుపదము నేడు మనదేశమునందన్నిపత్రికలలోను కనబడుచున్నది. సభలలో వినబడుచున్నది. ఆ హరిజనులకు సంబంధించిన సమస్యలను చర్చించుటకు నీగ్రంథములో ప్రయత్నించుటచే దీనికి "హరిజనసమస్య" యని పేరుపెట్టబడినది.

పుట్టుపూర్వోత్తరములు.

అస్పృశ్యతయను యీపిశాచము భారతదేశమునందిప్పుడున్నవిధమున నెంతకాలమునుండి వచ్చుచున్నదో, ఎప్పుడు పుట్టినదో, ఎందులకుపుట్టినదో, నిర్ణయించుటకు తగినయాధారములు లేవు. తద్విషయమై వేరువేరుమనుజులు వేర్వేరు కారణములను తెల్పుచున్నారు. వేరువేరు సిద్ధాంతముల చేయుచున్నారు. అందులో నెల్ల నతిప్రాబల్యముగాంచిన సిద్ధాంతములు మూడు కలవు. అస్పృశ్యులనబడు నీజాతులవారెల్లరును బ్రాహ్మణస్త్రీలయందు శూద్రులకు జన్మించిన సంకరులనునది మొదటిసిద్ధాంతము. ఈసిద్ధాంతవాదులు మనుస్మృతిమున్నగు స్మృతుల నాధారముగ చూపించెదరు. వీరిప్రకారము చూచినచో నస్పృశ్యత హిందూధర్మముయొక్క నిగ్గు

కాని కళంకముకాదు. రెండవసిద్ధాంతవాదులు ఆంగ్లవిద్యాధికులగు చరిత్ర పరిశోధకులు. వీరలీజాతులవారు ఆర్యులు రాకపూర్వ మీదేశములో రాజ్యములుగల్గి, కృషి వాణిజ్యాది సర్వపరిశ్రమలలో నారితేరిన ఆదిమనివాసులనియును, ఆర్యులు వీరల జయించి దేశమును స్వాధీనముచేసికొని ప్రస్తుత స్థితికి నాప్రజల తీసుకువచ్చిరనియును చెప్పెదరు. జయించిన ఆర్యులకును ఓడిపోయినయాదిమనివాసులకును ఒండొరుల యందవిశ్వాసము మనస్పర్థలుండుట సహజమనియు, తత్కారణముననే వారిరువురు నొక్కచోటనే నివసింపక దూర దూరముగ నివసించుచు వచ్చిరనియు నాపరిశోధకుల యభిప్రాయము. మూడవ సిద్ధాంతము ప్రకారము ఈ యస్పృశ్యులందరును మొట్టమొదట ఆర్యులకు నిషిద్ధములగు యాహార ముల భుజించు అనాగరికులగు యడవిజాతులవారు తమ కంటె సర్వవిధముల నధమస్థితియందుండుటచే నార్యులు వీరలకు గ్రామబహిఃప్రదేశముల నివాసమేర్పరచి సనాతన ధర్మమందు చేర్చుకొని, చర్మకారకాదివృత్తుల నప్పగించిరనియు, పూర్వము వీరలిప్పుడు చూడబడుచున్నంత క్రూరముగా నార్యులు చూచెడివారు కారనియు, కాలముగడచిన కొలది ప్రజలాచారమునకు దాసులై, నిజతత్వమును గ్రహించుట కసమర్థులై, యీజాతుల నుచ్ఛదశకు తీసికొని వచ్చుటకు బదులు పూర్వముకంటె నధమాధమ స్థితికి తెచ్చిరనియు

కొందరి తలంపు. ఈమూడింటిలో నేదియో యొకటి సరి యైనదనికాని, లేక మూడును సత్యములేయనికాని చెప్పుట కష్టము. మునుపెన్నడో జరిగినదానిని ఊహించుకొని, ఎవరియూహ సరియైనదని వారు వాదవివాదములతో ప్రొద్దుపుచ్చుటకంటె నేడు మనదేశమునందలి వివిధరాష్ట్రములలో గల హరిజనుల స్థితిగతుల తెలిసికొని వారల నిప్పు డున్నట్లే యుంచుట అధర్మమగునో కాదో మనమహర్షుల ధర్మబోధలను జ్ఞప్తియందుంచుకొని, హృదయములపై చేతు లిడికొని ఆత్మపరీక్ష గావించుకొనుచు నిర్ణయించుకొనుట లాభకరమగును.

హారిజనుల స్థితి గతులు.

హరిజనులస్థితిగతులు దేశమునందలి యన్నిరాష్ట్రములలో నొకేవిధముగా లేవు. వారితో సవర్ణహిందువులు వ్యవహరించు పద్ధతులలో కూడ నొకరాష్ట్రమునకు నింకొకరాష్ట్రమునకు చాలభేదము కలదు. ఉత్తరహిందూస్థానమునందు గల హరిజనుడస్పృశ్యుడు మాత్రమే. దక్షిణదేశమునందాతడు సవర్ణుల దాపునకే రాకూడదు. దక్షిణదేశములోగల దృష్టిదోష మంత వికృతరూపమున మహారాష్ట్రదేశమునను ఉత్తరదేశమునను గన్పడదు. మన రాష్ట్రములో బ్రాహ్మణులమధ్యనే యుద్ధగోడలు లేచినవి. ఇక తక్కిన సవర్ణములవారిమాట చెప్పనక్కర లేదు. మహారాష్ట్రదేశమునం దట్లుగాక ఒకేగది

లో పంక్తి భేదమునుమాత్రము పాటించి బ్రాహ్మణక్షత్రియు లాదిగాగల సవర్ణులొండొరులను తాకకుండ కలసి భోజనముల గావించెదరు. ఒకే గ్రంథములను హిందువులెల్లరు ప్రమాణగ్రంథములుగ భావించునప్పుడును, హరిజనులు కూడ హిందూధర్మములోనివారైనప్పుడును, వారియెడల సవర్ణుల ప్రవర్తన భిన్నముగా నుండుటెందులకో చదువరు లూహించుకొందురుగాక ! దేశకాలపాత్రములను బట్టి ఆచారములు మారుననుటకును, అస్పృశ్యతకూడ నట్టి యాచారమేగాని మహాధర్మము కాదని చూపుట కింతకంటె నింకేమి కావలయును? ఇక యస్పృశ్యతను పాటింపని రాష్ట్రములతో ప్రారంభించి హరిజనుల స్థితిగతులను సంగ్రహముగ వివరించెదను.

అస్సాము రాష్ట్రము.

అస్సామురాష్ట్రమునందు అస్పృశ్యత యనునది లేదు. అస్పృశ్యులనే నిమ్నజాతులక్రింద చేర్చవలెనని "లోథియను" సంఘమువారు వ్రాసినను ప్రభుత్వము, కొండజాతుల వారిని, యీరాష్ట్రములోగల తేయాకుతోటలలో నొకప్పుడు కూలీలుగా పనిచేసిన వారిని, నిమ్నజాతులవారుగా చేర్చినది. దరిచేరరానివారని దక్షిణదేశమునందు చెప్పబడువార లీరాష్ట్రమునందు లేనేలేరు అందరి పిల్లలనుగూడ నెట్టినిర్బంధములు లేక పాఠశాలలలోను, కళాశాలలలోను, చేర్చుకొనబడు చున్నారు. ఈరాష్ట్రములోగల కూలివారిలో నధికభాగము తదితరరాష్ట్రములలో

నస్పృశ్యులుగ నెంచబడువారైనను యీరాష్ట్రమునం దడుగిడినంతనే వారిమీాదనుండి యీామచ్చపోయినది.

పిమ్మట పేర్కొనతగినది పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రము. ఈరాష్ట్రములో దాదాపు అందరును ముసల్మానులే.

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రము.

ఇస్లాముమతమునందు మానవులందరును సమానులే. జన్మవల్లనే హెచ్చుతగ్గులేర్పడవు. అందుచేత నస్పృశ్యత కీరాష్ట్రమునందు తావు లేకుండపోయినది. కాని జనాభాలెక్కలలో 5, 468 మంది నిమ్నజాతులకు చెందినవారుగ వ్రాయబడిరి. వీరిలో 3, 514 గురు "నౌషేరా తహసీల్"నకు చెందినవారే. వీరందరును సరిహద్దును కాపాడుట కుంచబడిన సైన్యము వెంటవచ్చిన నౌకరులు.

పంజాబు రాష్ట్రము.

ఈరాష్ట్రమునందీ క్రిందనీయబడిన జాతులవారు నిమ్నజాతులలో చేర్చబడిరి.

(1) ఆదిహిందువులమని చెప్పుకొనువారు.

(2) ఈక్రిందికులములకు చెందినవారు.

| | |
|---|---|
| 1. బవరియా | 2. చమర్ |
| 3. చుహ్రా | 4. డాగి లేక కోలి |
| 5. దూమ్న | 6. మేఘ్ |
| 7. ఓడ్ | 8 రామదాసి |
| 9. సంసి | 10. సరె |

మద్రాసు రాష్ట్రములో చూడబడునట్లు చూడబడు నిమ్నజాతు లీరాష్ట్రమునందు లేరు. కాని అస్పృశ్యతమాత్ర ము కలదు. పాకీవాండ్రను, "చమార్"లను పంజాబులోని సవర్ణహిందువు లస్పృశ్యులగనే చూచెదరు. కాని గ్రామము లందు పాకీదొడ్లుగాని, పాకీవాండ్రుగాని లేరు. 'జాట్'కులస్థుని గృహమునందుగాని రాజపుత్రునియింటియందుగాని బ్రాహ్మ ణుడు మంచినీరు త్రాగడు ఎట్టిసందర్భములయందైనను సరే నీటితో వండిన ఆహారపదార్థములనంటుకొనడు. కాని తైలపక్వ పదార్థములను నిరభ్యంతరముగా గైకొనును. "జాట్" కుల స్థుడుగాని రాజపుత్రుడుగాని నూతినుండియైనను నదినుండి యైనను తెచ్చియిచ్చిననీరు త్రాగును. "చమార్," పాకీవాడు తెచ్చిన జలమునంటుకొనడు. వారిస్పర్శవల్లనే యాజలము మైలపడిపోవును.

ఇకనీయస్పృశ్యులకు మానవుల కత్యావసరమైన ప్రాథ మికములగుహక్కులు లేవు. వారుతదితరహిందువులతోపాటు ఊరిబావులను, సత్రములను, పాఠశాలలను దేవాలయముల నుపయోగించుటకు వీలు లేదు. విద్యలో వారు చాల వెనుక పడియున్నారు. ఆర్థికముగావారు గర్భదరిద్రులు. ప్రభుత్వో ద్యోగులును, జమీందారులును, వారిని బలవంతపెట్టి "వెట్టి వాకిరి" చేయించుకొనెదరు. ప్రతిఫలమునీయరు. సవర్ణహిం దువులచే నస్పృశ్యులుగ నెంచబడు వీరిలో నొకకులమువారి

నింకొకకులమువా రంటరానివారుగ నెంతురు. త్రాగుడు మున్నగు దురభ్యాసములు వీరిలోకలవు. చచ్చినగొడ్డుమాంసమును, సవర్ణులు దినగామిగిలిన యెంగిలిపదార్థములను తినెదరు. పరిశుభ్రతయనుమాటనే వీరెరుగరు. జన్మవల్లనే మానవులస్పృశ్యులగుదురన్న సిద్ధాంతమునంగీకరింపని శిక్కు, యిస్లాము ధర్మము లీరాష్ట్రమునందు ప్రబలియుండుటయే యిక్కడ నస్పృశ్యత యంత తీవ్రరూపమున పాడగట్టకుండుటకు కారణము.

అగ్రవర్ణు లనబడుహిందువులచే నుపయోగింపబడు బావులు, చెరువులు మున్నగువాటి నుపయోగింప వీలులేని

సంయుక్త రాష్ట్రములు.

వారలను, మలినవృత్తులనియు, దుర్మాంసాహారులనియు, తదితరహిందువులచే నీచముగా చూడబడునట్టిజాతులను నిమ్నజాతులుగ చేర్చినచో యీరాష్ట్రములందు వారిజనసంఖ్య 4,59,000 దాటదు. 'డోమ్' 'భంగీల'ను రెండుజాతులవారే హరిజనులనదగుదురు.

హరిజనులని తెలిసినచో వారలనీరాష్ట్రములో కూడ సవర్ణులు తాముపెట్టిన హోటలులలోనికి, భోజనశాలలకు, సత్రములలోనికి రానీయరు. వారు ముట్టుకొనినజలమును గైకొనరు. వారుసంఘములోని యధమాధములుగను, బానిసలుగను చూడబడుచున్నారు. నలుగురితోపాటు గ్రామములలో

నుండుటకు వారికివీలు లేదు. ఊరిబయట వారి నివాసము. హిందువులైనను వారు హిందూదేవాలయములోనికడుగుపెట్ట రాదు. నీలాటిరేవులలో వారు స్నానముచేయకూడదు. పుర పాలకసంఘము వారిచే త్రవ్వబడిననూతులలోనుండికూడ వారు నీరుచేదుకొనకూడదు. గుఱ్ఱములుమున్నగు వాహన ములెక్కి వారు పురవీధులలో పోరాదు. ఆగ్రా నగరములో నొకభాగ్యవంతుడగు "చమార్" పెండ్లికొడుకు (చర్మకా రుడు) గుర్రముమీాద కూర్చొనియుండుటచే పెండ్లియూరేగిం పు పురవీధులనుండి వెళ్ళుటకు సవర్ణులడ్డుపెట్టిరి.

ఈరాష్ట్రప్రభుత్వముకూడ విద్యావిషయమునందు నను, నాగరికతయందునను, వెనుకబడియున్న యితరకొండ జాతులవారిని నిమ్నజాతులవారలుగాచేర్చి వారికి శాసనసభ లలో ప్రాతినిధ్యమొసంగినది. అందువల్లనే నిమ్నజాతుల జనసంఖ్య 67 లక్షలకు పైగాపెరిగినది.

ఈక్రింద నీయబడిన జాతులువార లీరాష్ట్రములో నిమ్నజాతులు (హరిజనులు) క్రింద ప్రభుత్వ మువారిచే చేర్చబడిరి.

బీహారు ఒరిస్సాలు

(1) ముషర్ (3) చమార్

(2) దోసద్ (4) డోమ్

(5) మెహాతర్,

ఇక్కడకూడ హరిజనసమస్య బొంబాయి, మద్రాసు రాష్ట్రములందున్నంత తీవ్రముగ లేదు. ఈయస్పృశ్యుల గృహములందు జరుగు కార్యములకు శ్రోత్రియబ్రాహ్మణులెవ్వరును పురోహితులుగ పోరు. వీరిని హిందూ దేవాలయములలోనికి రానియరు. వీరలనుముట్టుకొనిన సవర్ణహిందువులపవిత్రులైనట్లెంచుకొనెదరు వీరలీరాష్ట్రజనసంఖ్యలో నూటికి తొమ్మండుగురు చొప్పునగలరు.

ఈరాష్ట్రములలోని చమారులలో వారి యుత్పత్తిని గురించి యొక విచిత్రకథ ప్రచారమునందున్నది. పూర్వమెన్నడో యొకనాడు బ్రాహ్మణవర్ణమునకు చెందిన నలుగురు సోదరులు గంగానదిలో స్నానముచేయ వెడలిరట. వారానదీ తీరమునకు చేరినంతనే ప్రవాహములో కొట్టుకొనిపోవుచున్న యొకగోవు వారికంటబడినదట. అగ్రజులు మువ్వురును కనిష్ఠ సోదరు నాగోవును రక్షించుటకు పంపిరట. కాని యాతడు గోవుదరిచేరునప్పటి కాగోవు మరణించినదట. అంతట నాజ్యేష్ఠులు తమకనిష్ఠసోదరునిచేత నాయావున కంత్యసంస్కారములచేయించి ఆపనిచేసినందులకాతనిని వెలివేసిరట. ఆనాల్గవసోదరుని సంతతివారే నేటిచమారులని, చమారులు చెప్పుకొనెదరు.

బెంగాలు రాష్ట్రమునందు, బ్రాహ్మణ, వైద్య, కాయస్థులను వారు మువ్వురు నగ్రవర్ణములకు చెందినవారు. వీరిలో

వీరలొండొరులతో వివాహాది సంబంధములగావించుకొనరు. కాని గ్రామనౌకరులగు మంగలి, చాకలి మున్నగువారు వీర లందరకును సేవచేయుదురు. తమసౌఖ్యముల కొరకో లేక మరియేకారణమువల్లనోగాని వీరు తమతరువాత తొమ్మిదికులములవారికి తమకంటె కొంచెము తక్కువస్థానము నొసంగిరి. వారిని "నవశాఖ" లందురు. కుమ్మరులు, మంగళ్ళు మొదలుగాగల వారలీ "నవశాఖ"లలోనివారు. ఈనవశాఖలకుచెందినవా రందరదగ్గరనుండి, పైమూడువర్ణములవారు నీటినిపుచ్చుకొ నెదరు. వారల నస్పృశ్యులుగచూడరు. వంటియింటిలోనికి, దేవాలయములలోనికి వారిని రానిచ్చెదరు. వారుగాక మరికొ న్నికులములవారు తమకుగల రాజకీయాధికారమువల్లను, విద్యాధిక్యతవల్లను, ధనమూలమునను సంఘములో గౌరవ స్థానమును బడయగలిగిరి. షాలు, సువర్ణవణిక్కులాదిగాగల వార లీతరగతికిచెందినవారు. మిగిలినవారందరును పైపన్నెం డు కులములవారికిని యస్పృశ్యులే. వారు ముట్టుకొనిన నీరును గైకొనరు. వారువంటయింటిలో ప్రవేశించిన నందుగలయాహా రమెల్ల మైలపడిపోయినట్లెంతురు. వారిని దేవాలయముల లోనికి రానీయరు. వారుదేవాలయములలో నడుగిడినంతనే పూజాద్రవ్యములు అపవిత్రములగునట్లు భావించెదరు. ఆకుల ములవారి గృహములలో జరుగుశుభాశుభకర్మలకు శ్రోత్రియ

బెంగాలు రాష్ట్రము.

బ్రాహ్మణులు పౌరోహిత్యము జరుపరు. వారికి తాముపెట్టిన భోజనశాలలందు భోజనముపెట్టరు హోటళ్ళలోనికిరానీయ రు. గ్రామసౌకరులగు చాకలి మంగలి కులములవారు వారి కడ పనిచేయరు. అట్టికులములు బెంగాలుప్రభుత్వముప్రకా రం తోంబదికలవు.

వీరిలో చమార్, డోమ్, నామశూద్రు లనుకులములు ముఖ్యములు. ఈనామశూద్రులనువారలే పూర్వబౌద్ధు లని ప్రతీతి. వీరు 20,94,957 మందిగలరు. పై తొంబది కులములలో కొండజాతులవారుకూడ చేర్చబడిరి. ప్రభుత్వ లెక్కలప్రకారము ఈరాష్ట్రములోని నిమ్నజాతుల జన సంఖ్య 10,311,268 వీరిలో తాము నిమ్నజాతులకు చెంద మని చెప్పుకొను కులములవారు కూడ చేర్చబడిరని కలకత్తా లోని 'మాడర్న్‌రివ్యూ' అను ఆంగ్లమాసపత్రికాసంపాద కులును, విఖ్యాతపురుషులునగు శ్రీరామానంద ఛటర్జీగారు సప్రమాణముగ 1933 సంవత్సరము ఫిబ్రవరి నెల సంచికలో వ్రాసిరి.

ఇందు నిమ్నజాతుల జనసంఖ్య 1,750,424. వీరిలో మాంగ్ (మాదిగ), ధేడ్, మహార్, భంగీ, చమారులను వారు ముఖ్యులు. వీరందరును గ్రామముల వెలుపలనే నివసించుచున్నారు. దేవాలయ ములలోనికి పోవుటకుగాని, పాఠశాలలందు

బొంబాయి రాష్ట్రము.

తదితరహిందువులపిల్లలతోపాటు వీరిపిల్లలుకూడ విద్యాభ్యాసముచేయుటకుగాని వీరికి హక్కు లేదు. ఈరాష్ట్రములో కూడ నంటరానితనమేకాని మద్రాసురాష్ట్రములోనున్నట్టి చేరరానితనములేదు. కాని జన్మవల్లనే మానవులు కొందరస్పృశ్యులగుదురన్న నమ్మక మీప్రాంతములోని సవర్ణహిందువులలో కూడ గలదు.

మధ్య రాష్ట్రములు- బీరారు.

ఈరాష్ట్రమునందు 2,965,490 మంది యస్పృశ్యులు గలరు. వీరలొకజిల్లాలో చూడబడునట్లింకొక జిల్లాయందు చూడబడుట లేదు. ఒకజిల్లాలో యస్పృశ్యులుగ భావింపబడువారు ఆజిల్లా వదలిపెట్టినంతనే యాకళంకమునుండి విముక్తినొందుచున్నారు. మెహార్ లేక మహార్, బసోర్, బురాద్ మెహ్తార్ లేక భంగి, డోమ్, చమార్, సతనామి, మోచి, గర్దా, మాంగ్ లనువారు, మధ్యరాష్ట్రములు బీరారునందలి యన్నిజిల్లాలలో నస్పృశ్యులుగనే పరిగణింపబడుచున్నారు. కోరి, మాల, మాదిగలు జబ్బల్పూరుజిల్లాలో నస్పృశ్యులుగ చూడబడుచున్నారు నాగపూరు, బీరార్ డివిజనులలో బాలహి, మాదిగ, ప్రధాన్, ఘాసియా, కాటియా, పాంకా, ఖటిక్, కయికారి, దోహోరులను కులమువార లంటరానివారుగ నెంచబడుచున్నారు. తమిళ, కర్ణాటక, ఆంధ్ర దేశములలోని సవర్ణహిందువుల సమీపమున కేపోవుటకుతగని

వారని చెప్పబడువారలు ఈరాష్ట్రములలోని కొన్నిజిల్లాల యందు గలరు. వారలాజిల్లాలలోనే యస్పృశ్యులుగ చూడబడుచున్నారు. ఆజిల్లాల వీడి మరియొకజిల్లాకు పోయినంతనే వారలక్కడి సవర్ణహిందువులతో కలసిమెలసి తిరుగుటకవకాశము కలుగుచున్నది.

మదరాసు రాష్ట్రము.

ఇకమిగిలినది మదరాసు రాష్ట్రము. ఈరాష్ట్రములోని సవర్ణహిందువులు తక్కినరాష్ట్రములలోని సవర్ణులవలె జన్మచేతనే మానవులలో కొంద రస్పృశ్యులగుదురని నమ్ముటయే గాక నింకొక అడుగు ముందుకువైచి, జన్మచేతనే కొందరు మానవులు అగ్రవర్ణుల సమీపించుటకే తగని వారనియు, వారినీడ మీదపడినను, మడి కట్టుకొనినప్పు డామానవులు కంటపడినను, బ్రాహ్మణులు మైలపడిపోవుదురని కూడ నమ్ముచున్నారు. ఈనమ్మక మీరాష్ట్రమునం దన్నిప్రాంతముల నొకేవిధముగ నుండక కొన్నిప్రాంతముల నతివికృతరూపమును దాల్చి పొడకట్టుచున్నది. ఈవిషయములో ఆంధ్ర, తమిళ,కర్ణాటక దేశములొకయెత్తు- మలబారుదేశ మొకయెత్తు.

ఆంధ్రదేశమునందు మాలలు మాదిగలు నిమ్నజాతులకు చెందినవారు. వీరు గ్రామమునకు దూరముగ గుడిసెలు వైచుకొని వసింతురు. మాదిగలు చచ్చిన గొడ్డుమాంసమును తినెదరు. చెప్పులు కుట్టెదరు. మాల మాదిగలను బ్రాహ్మ

ణులు తమ దగ్గరకు రానీయరు. గ్రామములలోని బ్రాహ్మణ వీధులలో వీరలను నడువనీయరు. ఊరి బావులనుండి నీరు

ఆంధ్రదేశము.

తోడుకొనుటకుగాని, గ్రామపాఠశాలలకుతమ పిల్లలను పంపుటకుగాని వీరికి వలనుపడదు. దుకాణములకు దూరముగానుండియే వీరు తమకు వలయు పదార్థముల కొనవలయును. రాజబాటమీదనైనను, బరువెత్తికొని వచ్చుచున్నను, బ్రాహ్మణులు మున్నగువారెదురైనచో వీర లొకప్రక్కకు తొలగిపోవలసియుండును. తొలగుటకు తగినంత వెడల్పుగ బాటలేకున్నను, లేక బాట ప్రక్కన బోదులు, కాలువ లున్ననుసరే వా రట్లుచేయక తప్పదు. తొలగిపోకున్నచో తిట్లు, కొన్నిసమయములలో దెబ్బలు వారలకు తప్పవు. పొలములలో పనిచేయునప్పుడు వీరలతో కలసిమెలసి సంచరించినను, ఆయక్కర తీరినంతనే శూద్రులు కూడ వారి నస్పృశ్యులుగనే చూచెదరు. ఈ మాల, మాదిగలలో చాలమంది మద్యము త్రాగుదురు. ఎంగిలిపదార్థముల తినెదరు. విద్యయందును, శుభ్రతయందును, సంపదయందునను, వీ రితరహిందువులకు చాల వెనుక పడియున్నారు. అంతియగాక వీరిలోవీరల కస్పృశ్యతకలదు. మాలలు, మాదిగలకంటె గొప్పవారమని చెప్పుదురు.

తమిళదేశమునందుగల పరయనుల యొక్కయు కర్ణాటకదేశమునందుగల హొలియనుల యొక్కయు స్థితిగతులు, మాల, మాదిగల స్థితిగతులకు తుల్యముగనేయున్నవి.

'అస్పృశ్యత' యనువిష మీదేశప్రజల రక్తములో కలసిపోయి వెఱ్ఱితలలువేసినది. ఇక్కడ మానవుడు జన్మవల్ల నస్పృశ్యుడగుటయేగాక, సవర్ణులని చెప్పబడువారి కన్నుల కగపడుటకు కూడ తగనివాడగుచున్నాడు. అంటరానితనముతో నీచెడుగు ఆగలేదు. చేరరానితనమునకు కూడ దిగినది. అగ్రవర్ణముల వారిదరికి జేరరాని కులములవారిలోకూడ నీచెడుగు వ్యాపించియున్నది.

మలబారు దేశము.

వారిలోని యొకకులమువారి కింకొకకులమువారస్పృశ్యులే కాక దరిచేరరానివారుకూడ నగుచున్నారు. ఇట్టికులముల వారి నందరను, నాలుగు తరగతులక్రింద విభజింపవచ్చును.

౧. వడ్రంగులు, కమ్మరులు, తాపీ మున్నగు చేతిపనులు చేయువారు.

౨. తియ్యాలు, ఎజువాలు, చోవాలు మున్నగువారు.

౩. పరయనులు, పులయనులు, వెట్టువానులు మొదలగువారు.

౪. నాయాడీలు.

పై తరగతులవారందరును సవర్ణహిందువుల దగ్గరకు పోవుట కర్హులుకారు. వీరిలో వీరొకరిదగ్గర కొకరు పోకుం

చుట చూడ చాల విచిత్రముగనే కన్పట్టును. లజ్జాకరమును, భయంకరమునగు నీవిషయము సత్యమే. నాల్గవతరగతికి చెందిన నాయాడీకులస్థుడు మూడవతరగతివారి కడనుండి 64 అడుగుల దూరమున నిలబడి యుండవలెను. మూడవతరగతికి చెందినవారిలో నెవ్వరైనను 32 అడుగులుదాటి రెండవతరగతివారి చేరువకు పోరాదు. రెండవతరగతికి చెందిన మనిషి 8 అడుగుల దూరము దాటి మొదటితరగతివారికడ కరుగ రాదు. ఈ మొదటితరగతివారలకును సవర్ణులకును మధ్య నుండవలసినదూరము కూడ 8 అడుగులే. ఇది యంతయు నస్పృశ్యులలో నొకతరగతివారికి నింకొకతరగతివారికిని సంబంధించినంత వరకు మాత్రమే. వీరిలో నొక్కొకతరగతివారికిని అగ్రవర్ణములవారికిని మధ్య నుండవలసిన దూరములు వేరు. నాయాడీ కనపడిననే చాలు—అగ్రవర్ణములవారు మైలపడిపోవుదురు. పరియనులుగాని పులయనులుగాని అగ్రవర్ణములవారికి 32 గజముల దూరముననుండియే మాట్లాడవలెను. అంతకు మించి వారి సమీపమునకు పోరాదు. రెండవతరగతికి చెందిన తియ్యాలు మున్నగువారు అగ్రవర్ణముల వారినుండి 32-64 అడుగుల దూరమున నుండవలెను. వారుండవలసిన దూరము వారి వృత్తులమీద నాధారపడి యుండును.

మూడవతరగతికి చెందిన పులయనులు, పరియనులు మున్నగువారలు బానిసలు. పొలములలో పాటుపడుదురు. పొలములతోపాటు వారుకూడ భూఖామందుయొక్క స్వంత యాస్తిగనే చూడబడుచున్నారు. భూమిని అమ్మినప్పుడాభూమిని కొన్నవారికి వీరుకూడ సంక్రమించుదురు. ఆ భూఖామందు లేరి పాలిటికి దేవతలు, భర్తలు, దండనాధికారులు.

నాలగవతరగతికి చెందిన నాయాడీలు, పేరునకు మాత్రమే మానవులు. వారు జీవితముల నెట్లో గడపుచున్నారు. వారు జీవించుచున్నారనుటకు వీలులేదు. తోడి మానవుల దృష్టిపదమున వారు పడుటయే మహాపరాధమగుచున్నది. అందువల్ల వారు కడుపుకొరకు బిచ్చమెత్తుకొనవలసి వచ్చినది. అగ్రవర్ణములవారు వసించు ప్రదేశములకు దూరముగా బాటప్రక్క నొక గుడ్డపరచి, వారు దాపునయున్నగా అరఫర్లాంగు దూరమున గల చెట్లగుంపులలోగాని, లేక యరణ్యములలోగాని, కనపడకుండ దాగుకొనెదరు. ఆదారినిపోవువారికి తామున్నట్లు తెలియజేయుటకు, ఆహార పదార్థముల నాగుడ్డమీద పడవేయుడని ప్రార్థనారూపకముగ కీచుగొంతుకతో కేక వేయుదురు. డబ్బుగాక యాహారపదార్థములనే వా రడుగుటకుగల కారణము- డబ్బున్నను వారు దుకాణములకడకేగి కావలసిన వస్తువుల కొని తెచ్చుకొనుటకు వీలులేకపోవుటయే. అగ్రవర్ణములవారినుండి కొంతదూరము

లోపుగ వా రూపిరిపీల్చుటకైనను వలనుపడదు. ఆగుడ్డపై పడవేయబడిన యాహారపదార్థములను కుక్కలు కాకులు మున్నగునవి తినుచున్నను, అవి పడవేసినసవర్ణుడు చూపు మేరదూరము దాటిపోవువరకును వారు చూచుచుండవల సినదే! పిమ్మట కడుపుకక్కురితిచే మిగిలిన పదార్థముల తిన వలసినదే! కుక్కలు మున్నగు జంతువులు దరికివచ్చినను మైలపడని యుగ్రవర్ణములవారు "నాయాడీ" కనబడినంతనే అపవిత్రులైపోవుదురు. ఇంత దుస్థితిలోనున్నను, వీర లింత క్రూరముగా చూడబడుచున్నను వీరు పులయనులు పరయ నులు మున్నగువారలనుండి యన్నము మున్నగు యాహారప దార్థముల పుచ్చుకొనరు. అవి పుచ్చుకొనిన తాము మైలపడి పోవుదుమని వీరి మూఢనమ్మకము!

దేశకాలపరిస్థితులను బట్టి కొంత మార్పుజెందినను, భారతదేశమునందలి వివిధప్రాంతములందు, జన్మవల్లనే మాన వులు కొందర స్పృశ్యులగుదురను విశ్వాసము పాదుకొని యున్నదనుట సత్యదూరము కాజాలదు. ఇట్లు అస్పృశ్యులు గను, కొన్నిరాష్ట్రములందు కనబడుటకు తగనివారుగ నెం చబడు యాదీనజనుల దుర్దశను మిస్. మేయో యనునామె 'మదర్ ఇండియా' (Mother India) యను తన గ్రంథ ములో నిట్లు వర్ణించెను.

"మానవులకంటె తక్కువగ నెంచబడు వీరలకు నీచాతినీచములని భావించబడు పను లప్పగింపబడినవి. వారినామము తలచుటయే యవమానకరమగు విషయమగుచున్నది. వారిలో కొందరు వీధుల తుడుచుటకును, పాకీదొడ్లను బాగుచేయుటకే యనుమతింపబడిరి. అజ్ఞానాంధకారమున త్రోసివేయబడుటవల్ల వారిలో కొంద రతియసహ్యాకరములగు యలవాటుల గలిగియున్నారు. వారి కేవిధమైన విద్య బడయుటకును వీలులేదు. హిందూధర్మగ్రంథములను వారు చదువరాదు. వాటిని దగ్గరనుంచుకొనరాదు. బ్రాహ్మణపురోహితులెవ్వరును వారి యిండ్లలో జరుగు శుభాశుభ కార్యముల జరిపించుటకు వెళ్ళరు. ఎక్కడనోతక్క దైవపూజకొరకు గాని, ప్రార్థనలు సల్పుటకుగాని, వారు హిందూదేవాలయములలో ప్రవేశించుటకు వీలులేదు. సర్వజనోపయోగముకొరకు పెట్టబడిన పాఠశాలలలోనికి వారిపిల్లలు పోరాదు. ఊరిబావుల నుండి వారు నీరు తోడుకొనరాదు. నీరు దొరకుట కష్టముగానున్న ప్రదేశముల వారు కాపురమున్నచో వారి కష్టములగాంచి సవర్ణహిందువులు దయచూపరుసరికదా మరింత కష్టముల పాల్జేయుదురు. కోర్టులలోనికి వారు పోరాదు. రోగులకు మందు తెచ్చుకొనుటకు వారు వైద్యాలయములో నడుగిడరాదు. సత్రములలో దిగరాదు. కొన్నిరాష్ట్రములయందు వారు రాజబాటనుకూడ నుపయోగింపరాదు. వారి

లో కూలిపనిని చేయువారును, వ్యవసాయదారులును తమకు కావలసిన వస్తువుల కొనుటకుగాని, తాము తయారుచేసిన వస్తువులను పండించిన కొద్దిపాటి ధాన్యమును విక్రయించుటకు దుకాణములదరికిగాని, బజారునకుగాని పోరాదు. ఆ పనుల కొరకు స్వార్థపరులగు దళారులపై నాధారపడి యమితనష్టమునకు పాల్పడవలసినదే. వారిలో ఘోరముగ నధోగతిపాల్జేయబడిన కొందరు పనిచేయుటకుకూడ వీలులేదు. దేనినైన ఆఖరునకు తమ రెక్కలనైన అమ్ముకొనుటకు వీలులేదు. బిచ్చమెత్తుకొనియే వారు జీవించవలెను. బిచ్చమెత్తుకొనుటకైనను సరే వారు రాజబాటలమీద పోరాదు. దూరముగ నెవ్వరును కనపడకుండ నుండుస్థలములలో దాగుకొని, బిచ్చముకొరకు అరువవలెను. బిచ్చముపెట్టువారైనను దానిని బాటప్రక్కకు విసరివేయుదురు. అట్లువేసిన యాదాతలు చూపుమేరను దాటిపోయిన తరువాత, రోడ్డుమీద నెవ్వరు లేకుండ చూచి, ఆ నిర్భాగ్యులు పోయి, తమకొరకు పడవేయబడిన పదార్థముల కంగారుగా నెత్తుకొని పారిపోవలెను.” ఈవిషయమై మిస్. మేయో వ్రాసిన వర్ణనలో నతిశయోక్తి లేదు.

కర్మలవల్లనే అస్పృశ్యు లగుదురు.

పూర్వకాలమందు మానవులు జన్మవల్లగాక, వారు చేయుకర్మలనుబట్టియే అస్పృశ్యులుగ చూడబడినట్లు దృష్టాంతము

లనేకములు మన గ్రంథములందు గలవు. నీచకులములనబడు వాటియందు పుట్టినవారలు సద్గుణవంతులును, సత్కర్మపరాయణులైనచో చాలును- వారు గౌరవింపబడెడివారు. అట్టి వారనేకులు మహాకవులుగను, సాధులుగను, యోధులుగను, మహాభక్తులుగను, మన ప్రాచీనచరిత్రలందు పొడగట్టుచున్నారు. మన కందరకును మార్గదర్శకముగ ఆర్యనాగరికతా ప్రపంచమున తేజోరూపులై వెలుంగుచున్నారు. జన్మవల్లనే తోడిమానవులలో కొందరన్పృశ్యులగుదురని చెప్పు యీనాటి సనాతనధర్మావలంబకులమని చెప్పువారలుకూడ నామహాపురుషులను పూజించుచున్నారు.

ఛాందోగ్యోపనిషత్తునందొకఋషిని గురించి యీ క్రిందికథకలదు.

జాబాలపుత్రుడగు సత్యకాముడు తల్లి నిట్లడిగెను. "నేను బ్రహ్మచర్యాశ్రమమందు ప్రవేశింపగోరెదను. అమ్మా! నే నెవ్వరికి పుట్టితిని?"

ఆమె యిట్లు జవాబిచ్చెను. "పుత్రా! నాకు తెలియదు. నా యవ్వనకాలమున దాసినై మెలంగినదినములలో నీవు జనించితివి. సత్యకామా! నీ వెవ్వరికిపుట్టితివో నేచెప్పజాలను."

అంతట నాతడు గౌతముని దగ్గరకుపోయి యిట్లు ప్రశ్నించెను. "దేవా! మీకడ బ్రహ్మచారిగా నుండగోరెదను. నన్నుశిష్యునిగా చేర్చుకొనెదరా?"

గౌతము డాతని నిట్లుప్రశ్నించెను. "కుమారా! నీవె వరికుటుంబములోనివాడవు?" దానికి సత్యకాము డిట్లుజవాబు నొసంగెను. "దేవా! నేనెరుగను. ఈవిషయమై మాఅమ్మను ప్రశ్నింప నామె యిట్లుచెప్పినది. నా జవ్వనమందు నే దాసిగా మెలంగినదినములలో నీవు జనించితివి. నీ వేకుటుంబమునకు చెందెదవో నాకు తెలియదు. నాపేరు జాబాల. నీపేరు సత్యకాముడు."

అది విని గౌతము డిట్లుపలికెను. "నిజమైన బ్రాహ్మణుడే కాని మరియెవ్వరును నీవలె ఉన్నదున్నట్లు చెప్పరు. కుమారా! పోయి సమిధలతెమ్ము. ఉపదేశ మొనర్చెదను. నీవు సత్యమార్గమునందుండి యేమాత్రమును తొలగియుండలేదు."

పంచమవేద మనబడుమహాభారతమును, భాగవతాద్యనేక మహాగ్రంథముల రచించిన వేదవ్యాసులవారు పరాశరునకును, పల్లెజాతికన్యయగు సత్యవతికిని జన్మించినవారలు. పరాశరు డన్ననో మాల స్త్రీకి పుట్టినవాడు. నేడు మనమందర మాపరాశరుని బ్రహ్మర్షిగ నెంచుచున్నాము. ఇనకుల పురోహితుడగు వసిష్ఠమహర్షి వేశ్యకడుపున బుట్టినవాడు. ఆయన మాలెతయగు అరుంధతీదేవిని పెండ్లియాడెను. ఇట్టివెన్నియో కలవు. కాని గ్రంథవిస్తరభీతిచే వాటినెల్ల నిచ్చట వివరించుటలేదు. ఈవిషయమై యింకను తెలియగోరువారు

శ్రీయుత మంగిపూడి వేంకటశర్మగారిచే రచింపబడిన 'నిరుద్ధ భారతము'ను పద్యగ్రంథమును చదువగోరెదము.

ధర్మాధర్మములకును, మంచిచెడుగులకునుగల పోరాటమనాదినుండీ వచ్చుచున్నది. ఇప్పుడుకూడ జరుగుచున్నది. రాబోవు యుగములలో జరుగుచునేయుండగలదు. జన్మవల్లనే మే మధికులమని కొందరు చెప్పుకొనుచు వేరొక కొందరను నీచజన్ములనియు, అస్పృశ్యులనియు నేనాటినుండి చెప్ప మొదలిడిరో ఆనాటినుండి కూడ అన్యాయమును అధర్మమునగు నాక్రూరసిద్ధాంతమును పూర్వపక్షము చేయుటకు మహానుభావులు జన్మించుచునేయున్నారు. అందు దయామయుడును, ప్రేమస్వరూపుడును, అహింసావ్రతుడును, సర్వసముడు నగు బుద్ధదేవుడు సుప్రసిద్ధుడు. బ్రాహ్మణులు మున్నగువారు తా మగ్రవర్ణులమని చెప్పుకొనుచు నీచకులస్థులని తమ తోడి మానవులనే నీచాతినీచముగ చూచుచు క్రూరహింసలపాల్చేయుచుండుట చూచినంతనే యామహాపురుషుని హృదయము కరగిపోయినది. వర్ణభేదములపాటింపక మానవులందరు సమానులేయనియు, సద్గుణములందు సత్కర్మలందు దృష్టినిలుపవలెననియు, పాపులకంటె పాపమును, దుష్కర్ములకంటె దుష్క్రియల నసహ్యించుకొనవలెనని బోధించెను. బుద్ధదేవుని బోధనలప్రకారము బౌద్ధభిక్షువులు వర్ణభేదముల పాటిం

పూర్వయుగము–మహాత్మ్మీయయుగము.

వక జనులెల్లరనుండి భిక్షమడిగి భుజింపవలసియుండుటచే నా కాలమున జనులలోగల గొప్పకొలదు లనుభేదభావములు తగ్గిపోయినవి.

బౌద్ధమతము క్షీణదశలో నుండగా జన్మించిన ఆదిశంకరులుకూడ నేడు ప్రబలియున్నమాదిరి యస్పృశ్యత నంగీకరించనట్లు ఈక్రిందికథవల్ల తెలియగలదు.

శ్రీశంకరు డొకనాడు కాశీనగర వీథులలో వెళ్లుచుండగా చండాలు డొక డెదురయ్యెను. ఆయన యాతని తొలగిపొమ్మనెను. అంతటనాచండాలుడు అద్వైతసిద్ధాంతవాదియగు నాదిశంకరులను "మనయిరువురియందునను, జగత్తంతటను నిండియుండిన బ్రహ్మమొక్కటేకదా? న న్నేలతొలగిపొమ్మనెద"వని ప్రశ్నించెను. అంతట తనతప్పు నెరిగి ఆదిశంకరులే యాచండాలునకు సాష్టాంగదండప్రణామ మాచరించెను.

ఆదిశంకరుని తరువాత, బుద్ధదేవు నంతటికరుణార్ద్రహృదయుడును, దక్షిణహిందూస్థానమునందు పుట్టిన సంస్కర్తలలోకెల్ల నగ్రేసరుడునగు శ్రీరామానుజుడు తన వైష్ణవమతమునం దెల్లవర్ణములవారిని స్పృశ్యాస్పృశ్య లనుభేదములు పాటింపక చేర్చుకొనెను. గురువుల యాజ్ఞలకు విరుద్ధముగా నామహామహుడు కంచిలోని గోపురముపై నెక్కి గోపురము క్రిందగల తీర్థయాత్రికుల కందరకు వినబడునట్లు మహామంత్రము నొకదానిని పఠించెను. అచ్చట జేరినయాత్రికులలో సర్వవ

ర్ణములవా రుండియుందురనుటకు సందేహము లేదు. రహస్య
ముగ బ్రాహ్మణాది యగ్రవర్ణములవారికే యుపదేశింపవలసిన
మహామంత్రము నట్లు పఠించినందులకు గురువులు కుపితులై
“రౌరవాదినరకముల బడుదువని రామానుజు”ని భయపెట్టిరి.
ఆ మహామంత్రమును వినుటవల్ల నచ్చట చేరిన యాత్రికుల
కందరకు మోక్షము లభించినచో తాను నరకలోకమునకు
పోవుటకైన వెనుకాడనని సర్వజనమోక్షమును కాంక్షించు
నాయతిరాజు జవాబిచ్చెనట. ఆయన మానవుని పుట్టుకకు
గాక యాతని గుణకర్మలకే ప్రాధాన్యమిచ్చెను. విష్ణ్వాలయ
ములలో గల యాళ్వారాదులలో పంచములును ముస
ల్మానులు కూడగలరు. మైసూరురాజ్యములోని మేలుకోట
లోని విష్ణుదేవాలయమునందు సంక్రాంతిపండుగ మూడురో
జులును స్వామి కర్చనజేయుట కాయన పంచములకు హక్కు
నొసంగెను. రాబోవుతరములవా రాపంచముల పురోభివృద్ధికై
ప్రయత్నించి వారలనెల్ల దేవాలయములలోనికి ప్రతిరోజునను
రానిచ్చి, తమతో సమానులుగ వారలచూచుకొనెదరని ఆ
మహామహుడు యాశించెననుట కింతకంటె ప్రబలనిదర్శన
మింకేమి కావలయును ?

శ్రీరామానుజుని సంస్కరణోద్యమమునే ఉత్తరహిం
దూస్థానమునందు రామానందస్వామియు, బంగాళరాష్ట్రము
నందు శ్రీకృష్ణచైతన్యులును కొనసాగించిరి. మహాభక్తుడును

చర్మకారుడు (చమార్) నగు "రోహిదాస్" రామానంద స్వామి ముఖ్యశిష్యులలో నొకడు.

విశిష్టాద్వైతసిద్ధాంతస్థాపకుడగు రామానుజుడు పంచమాభ్యుదయమున కెంతపాటుబడెనో వీరశైవమతస్థాపకుడగు శ్రీబసవేశ్వరుడుకూడ వారికొరకంత పాటుపడెను. కులభేదముల నాతడు నిరాకరించెను. జనులందరును మానవులను ఒకేకులమునకు చెందినవారని బోధించెను. అట్లు బోధించుటయేగాక తననిత్యజీవితములో నట్లే వ్యవహరించెను మహారు (పంచములు) లిరువురతో చెట్టాపట్టాలు వైచుకొని, కల్యాణరాజ్యమునకు మంత్రియగు నాపుణ్యుడు పురవీధుల బహిరంగముగా సంచరించెను. అదిగాంచినంతనే తమయాధిక్యత మాయమగునన్న భయమువల్ల కుత్సితులగు బ్రాహ్మణోత్తములు కొందరు మహారాజగు బిజ్జలునికడకేగి-బసవేశ్వరునిపై కొండెములచెప్పి యాతనితో రాజవీధుల తిరిగిన యామహారులిరువురి కంటిగ్రుడ్లనూడబెరికించిరి. బసవేశ్వరుడ నావిషయము తెలిసినంతనే తనమంత్రిపదవిని వీడి బిజ్జలుని విడనాడి, తోడి మానవులంత క్రూరముగా చూడబడు యారాజ్యమునందుండుట కిచ్ఛపుట్టక వెడలిపోయెను. అట్టి బసవేశ్వరుని బోధల నీనాటివీరశైవు లెంత తారుమారుచేసిరో తలంచుటయే సిగ్గుచేటు.

శిక్కుమతస్థాపకుడగు గురునానక్, పిమ్మట గురుపీఠమలంకరించిన గురు గోవిందసింగ్ మున్నగువారలు, మహాభక్తుడగు కబీర్‌దాస్ అస్పృశ్యతాపిశాచమును నశింపజేయుటకు తమ శక్తివంచనలేకుండ పాటుపడిరి. శిక్కుల పవిత్రగ్రంథమగు 'గ్రంథసాహేబ్' (మహాగ్రంథము) నందు జన్మచేతనే యెక్కువతక్కువ లేర్పడుననుసిద్ధాంతమును ఖండించునట్టియు, మానవులందరు సమానులేయని చెప్పునట్టియుగీతములనేకములు గలవు.

ఔరంగజేబుచక్రవర్తికాలమున ప్రారంభమైన పాశ్చాత్యసంపర్కము మనదేశమున నానాటికి కెక్కువగుచు వచ్చి, కడకు బ్రిటీషువారలే మనకు ప్రభువులైరి. భిన్న ఆదర్శములు, భిన్నదృక్పథములు, భిన్నభావములు గల పాశ్చాత్యులు మనసాంఘిక, ధార్మికాచారములను సవిమర్శకదృష్టులతో చూడదొడగిరి. జన్మవల్లనే మానవులలో కొందరస్పృశ్యు లగుదురన్న మన సిద్ధాంతము వారల నాశ్చర్య చకితులజేసి వైచినది. మనపంచముల దుస్థితిగాంచినంతనే వారికి బాధ కలిగినదనుట కెంతమాత్రమును సందేహము లేదు. ఆబాధోపశమనము కొరకేమి లేక యన్యకారణములవల్ల నేమి మనదేశమునకు పాశ్చాత్యులలో కొందరు, ముఖ్యముగా క్రైస్తవమిషనరీలు పంచమాభ్యుదయము విషయమై సల్పినకృషి యే భారతీయుడు

బ్రిటీషుయుగము.

కాదనగలడు ? వారుఖర్చుబెట్టినధనము, నిర్మించిన ఆసుప
త్రిలు, చేసిన విద్యాప్రచారమును, పంచములలో మొల

క్రైస్తవ మిషనరీలు.

కెత్తించిన స్వాభిమాన, స్వాతంత్ర్యభావములకు
ను, ఉన్నతాశయములను, పెంపొందించిన పరి
శుభ్రతనుగాంచి ఏభారతీయుడు వినతులొనర్పడు ? స్వధర్మ
మందలిప్రేమయే సాధారణముగ నిట్టి మహాత్కార్యముల
నొనర్పజేయు కారణమగుననుట సత్యమే? మిషనరీలు చేసిన
పంచమజాతిసేవకుకూడ నాస్వధర్మప్రేమయే ప్రోద్బలకారణ
మనుటకూడసత్యమే. అయినప్పటికి నామిషనరీలు చేసినసే
వను భారతీయులు విస్మరింపకుందురుగాక! మనవార లన్యధ
ర్మస్వీకరణమొనర్చుటకు కారణము వారియందు మనము
చూపిన నిర్లక్ష్యభావమును, నిరాదరణదృష్టియు ముఖ్యహే
తువులని గ్రహింతుముగాక !

నేడు మనదేశములో నెల్లెడల నపూర్వనృత్యము సల్పు
చున్న, సర్వతోముఖమైన జాతీయోద్యమమునకు బీజముల

రామమోహన రాయలు- బ్రహ్మ సమాజము.

నాటిన శ్రీరాజారామమోహన రాయలవారు
హరిజనోద్ధరణకొరకు పరోక్షముగ చాలకష్ట
పడిరి. పరిశుద్ధాస్తికమతమును బోధించుచు,
ఉపనిషత్తులకును వాటినిమించినదగు మాన
వునివివేచనాశక్తికిని ప్రాధాన్యమొసంగి, కుల
మత భేదములను వేరుపురుగులను, సహగమనమాదిగాగల

క్రూరాచారములను, నాశనముచేయుటకై యీమహాను భావులు పాటుపడిరి. 1831 సంవత్సరములో బ్రహ్మసమాజ మును స్థాపించిరి. దానికిచెందినవారిలో ననేకులు స్థాపకుని ముఖ్యోద్దేశమునుగ్రహించి మిగిలిన విషయములన్నింటితో పాటు హరిజనోద్ధరణకు కూడ తీవ్రప్రయత్నము లొనర్చిరి. అనేకకష్టముల నెదుర్కొనుచు నేటికికూడ వారట్టి ప్రయత్నములు సల్పుచునే యున్నారనుట యెల్లరకు తెలిసినవిషయమే.

దయానంద స్వామి- ఆర్య సమాజము, శ్రద్ధానంద స్వామి

బ్రహ్మసమాజము వేదప్రామాణ్యము నంగీకరింపని కారణమున నది యొక్కవంగరాష్ట్రమున తక్క యన్యరాష్ట్రములందంతగా వేళ్ళుపారలేదు. కాని శ్రీదయానందస్వామి వేదప్రామాణ్యము నంగీకరించి, స్మృతిపురాణేతిహాసములు ప్రమాణములుగ నంగీకరింపక, వేదకాలమునాడు ప్రబలియున్న ఆచారములప్రకారము, అభిప్రాయముల ననుసరించి, నేటి యాచారముల నెల్ల సంస్కరించగోరెను. బ్రాహ్మణక్షత్రియులాదిగా గల నాలుగు వర్ణములును జన్మవల్ల గాక గుణకర్మలవల్ల నేర్పడునని సిద్ధాంతీకరించెను. అందుచే ఆర్యసమాజము ప్రజల మనముల నెక్కువ యాకర్షించినది. దానిలో యస్పృశ్యతకు స్థానమే లేదు. ఆర్యసమాజము ఉత్తరహిందూస్థానమునందునను, యందులోముఖ్యముగా పంజాబుదేశమునందునను, హరిజనోద్ధరణకొరకు వివిధమార్గ

ముల ప్రయత్నించెను. వారుపెట్టిన గురుకులములలోనను, ఆశ్రమములలోను, కళాశాలలలోనను, హరిజనులను చేర్చుకొనిరి. అస్పృశ్యతకు విరోధముగా ప్రచారముచేసిన కొందరు ఆర్యసమాజ ప్రచారకులను కాశ్మీరదేశమునందలి సవర్ణ హిందువులు కొందరు రాళ్ళచే కొట్టి చంపిరట. కీర్తిశేషులగు శ్రీశ్రద్ధానందస్వామి యీపతితజనాభ్యుదయమునకెటుల నహోరాత్రములు పాటుపడెనో అన్యమతస్వీకరణమొనర్చిన హరిజనులు మరల హిందూధర్మమును స్వీకరింప వారలశుద్ధి గావించెనో, కడకు తన విశ్వాసములకొరకు ప్రాణముల్నెట్లర్పించెనో మనకెల్లరకు జ్ఞప్తియుండియే యున్నది.

ఆర్యసమాజము తరువాత, హరిజనశ్రేయస్సుకొరకు పూనుకొని, అమానుషమగు నాకూ్రరాచారమును ఖండించుచు ప్రచారము గావించిన వారిలో భగవన్ శ్రీరామకృష్ణపరమహంస ప్రియశిష్యులగు వివేకానందస్వామి ముఖ్యుడు. ఆయన తన యనర్గళవాగ్ధాటిచే పాశ్చాత్యదేశములమోహింపజేయుటయేగాక, స్వదేశస్థులలోని యాకళంకమును వారికి జూపి, 'నన్ను ముట్టుకోకు నామాలకాకి" యన్న భావముల వారిలోనుండి పోదోలి, ప్రాచీనభారతీయ నాగరికతకు కీర్తి స్తంభములగు వేదవేదాంతములవైపున దృష్టిని మరల్ప ప్రయత్నించెను. దక్షిణహిందూదేశమున, నందులో ప్రత్యేకించి మలబారుదేశమునగలసవర్ణు లస్పృశ్యులనబడు

వారలయెడ ప్రవర్తించువిధమును గురించి యామహాను భావుడు "హిందూదేశభవిష్యత్తు"ను తన యుపన్యాసములో నిట్లు చెప్పెను.

"మీరు శ్రద్ధవహించకపోయినచో మీలో సగము మంది యేమీ లేక యేదవవంతో క్రైస్తవులైపోయెదరు. మలబారు దేశములో నేను చూచిన విషయముకంటె నర్థము లేనిది ప్రపంచములో నింకేదియైన మరెచ్చటనైన గలదా? విద్యాభ్యాసుడగు మాలవాడచ్చట యగ్రవర్ణముల వారితో పాటు వీథులలో నడువరాదు కాని యతడే యేదో యవకతవక యింగ్లీషుపేరు పెట్టుకొనిన చాలు నెట్టియభ్యంతరముండదు. అదికాక మహమ్మదుపేరు పెట్టుకొనినను సరిపోవును. దీని వారాంశమేమి? మలబారు దేశస్థులందరుపిచ్చివారని యేగదా? వారి యిండ్లు ఉన్మత్తశాలలేగదా? వారు తమయాచారములను మార్చుకొని సరిగా ప్రవర్తించిననేతప్ప భారతదేశము నందలి యితరులకు వారు హాస్యాస్పదులే యగుదురు. ఇట్టి రాక్షసాచారముల పాటించుట సిగ్గుచేటు. స్వధర్మనిరతులగు మాలవారు మాడిపోవుచున్నను యీమలబారువారు చూచుచు నూరకుందురు. ఆజనులే యన్యమతములలో చేరినజాలుచు వారికి కడుపునిండ తిండిదొరకుచున్నది."*

---

* వివేకానందస్వామి రచనలు ఉపన్యాసములు– సం. 3. పు. 294.

నేడు మనదేశమునందలి వివిధసంఘములతో పాటు వివేకానందస్వామిచే నెలకొల్పబడిన "రామకృష్ణమిషన్" వారుకూడ వివిధప్రాంతములగల తమ యుపసంఘముల ద్వారా హరిజనోద్ధరణకొరకు కృషిసల్పుచున్నారు.

పాశ్చాత్యవనితయైనప్పటికిని, భారతీయవిజ్ఞానముచే నాకర్షింపబడి, భారతదేశమునె తనమాతృదేశముగా నెంచుకొని, హిందూమతోత్కర్ష కొరకును, హిందూదేశస్వాతంత్ర్యముకొరకు నెంతయో కష్టించిన శ్రీమతి అనిబిసెంట్ గారును, దివ్యజ్ఞానసమాజకులగు వారిసహచరులు నీవిషయమై యపూర్వసేవ గావించిరి. దివ్యజ్ఞానసమాజమునందు కులమతభేదములతో నిమిత్తము లేకుండ నెల్లరను సభ్యులుగ చేర్చుకొనెదరు. సమాజమందిరములో నలుగురితోపాటు హరిజనులుకూడ ప్రార్థనలుసల్పుట కవకాశముగలదు.- కీర్తిశేషులగు శ్రీ గోఖ్లేగారిచే స్థాపింపబడిన "సర్వెంట్స్ ఆఫ్ యిండియా సొసైటీ" సభ్యులగు శ్రీ అమృతలాల్ ధక్కరు గారును, వెంకటసుబ్బయ్యగారును, హరిజనసేవకే తమసర్వశక్తుల వినియోగించుచున్నారు.

ఈశతాబ్దప్రారంభమునుండియు పైనచెప్పబడినవారలే కాక తదితరులుకూడ నస్పృశ్యతా నివారణకొరకు దుర్భరకష్టముల నెదుర్కొంచు యత్నించుచున్నారు 1906 సంవత్సరములో బొంబాయిలో "డిప్రెస్డ్ క్లాస్ మిషన్ సొసైటి"

యను పేరుతో నొక సంఘ మేర్పరుపబడినది. జ్యోతిబాపులే యను నాయన పూనాలో యస్పృశ్యులకొరకు పాఠశాల నొకదానిని పెట్టి ప్రజల హేళనలకును, నిందలకును లక్ష్యపెట్టక, సంఘబహిష్కారమునకు భయపడక, అయిదు సంవత్సరములకాలము దానిని కొనసాగించెను. శ్రీ రామ తీర్థస్వామి కూడ నీయస్పృశ్యత హిందూధర్మమున కొక మహాకళంకముగ నెంచెననియు, దానిని ఖండించుట విస్మరించలేదనియు వారిరచనల చదివినవారికి తెలియగలదు.

మహాత్ముడు భారతరాజకీయరంగమున ప్రవేశించిన తోడనే హరిజనసమస్య కంతకుపూర్వము లేని ప్రాముఖ్యత వచ్చినది. ఎవరో సంస్కర్తలు కొందరు చూచుకొనవలసినవిషయముగాక ఆసేతుశీతాచలపర్యంతముగల హిందువులెల్లరు శ్రద్ధవహించవలసిన విషయముగ నది మార్పు చెందినది.

కాంగ్రెస్-హరిజనులు.

లండనులో జరిగిన రెండవరౌండుటేబిలు సమావేశములో కాంగ్రెసు హరిజనులకు చేసినసేవను గురించి యాతడిటుల ముచ్చటించెను

"కాంగ్రెసు మొదటినుండియు అస్పృశ్యులని పిలువబడువారికొరకు పోరాడుచున్నది ఒకప్పుడు కాంగ్రెసు వార్షికసమావేశముతోపాటు అఖిలభారతసాంఘికసమావేశము కూడ జరుగుచుండెడిది. ఇతరకార్యము లనేకములతో

పాటు హానికిని శ్రీయుత రెనడేగారు తమశక్తిని ధారవోసిరి. ఆయన నాయకత్వమున ప్రతిసంవత్సరమును సాంఘికసమావేశ కార్యక్రమమున అస్పృశ్యతాసంస్కరణకు ప్రధానస్థానమొసంగబడుచుండెడిది. కాని 1920 వ వత్సరములో కాంగ్రెస్ గొప్పమార్పొకటి చేసెను. అస్పృశ్యతానివారణము రాజకీయరంగమున నొకభాగముగ చేయబడెను. రాజకీయ కార్యక్రమములో నొకప్రధానాంశమయ్యెను. స్వరాజ్యసంపాదనకు- సంపూర్ణస్వాతంత్ర్యము బడయుటకు హిందూ మునల్మానులమధ్య- ననగా- దేశములోని యన్నిమతముల మధ్య నైకమత్యత యుండుటెంతయావశ్యకమో అస్పృశ్యతానివారణకూడ నంతయవసరమని కాంగ్రెసు నిర్ణయించెను,"

కాంగ్రెసులో నట్టిమార్పు జరుగుటకు కారణభూతుడగు మహాత్ముడు సబర్మతీయాశ్రమములో హరిజనులను చేర్చుకొనెను. "లక్ష్మి" యను నొక హరిజనబాలిక నభిమానపుత్రికగా పెంచుకొనెను. దేశమునందలి వివిధరాష్ట్రములలో పర్యటనము సల్పునప్పుడు అస్పృశ్యతను ఖండించుచు తీవ్రోపన్యాసము లొసంగెను. ఆకళంకము పోగొట్టుకొనిననేగాని మనము స్వరాజ్యమును బడయుట కర్హులము కాజాలమని ఖండితముగ చెప్పివైచెను. తనపత్రికయగు "యంగ్ ఇండియా"లో అగ్నిహోత్రపుంజములపోలు వ్యాస

ముల నావిషయమై వ్రాసెను. వాటిలోనివి కొన్ని యీగ్రంథ
ములో ద్వితీయఖండమున నీయబడినవి.

మహాత్ముని ప్రచారఫలితముగ దేశములో ననేకా
శ్రమములు బయలుదేరినవి. మలినవృత్తియనబడు పాకీపనిని
విద్యార్థులగు బ్రాహ్మణులుకూడ కొన్నిస్థలములలో చేయ
గడంగిరి. అహమ్మదాబాదులో కాంగ్రెసు జరిగినప్పుడు
స్వచ్ఛందసేవకులే మరుగుదొడ్లను శుభ్రముచేయు భారము
వహించిరి. వారిలో యగ్రవర్ణములనబడువారికి చెందిన
వారనేకులు గలరు. మలబారులోని వైకంవీధులలోనుండి
హరిజనులను సవర్ణులు నడువనీయనందున నచ్చోట సత్యా
గ్రహము ప్రారంభింపబడి హరిజనులపైగల యా నిర్బంధము
పోవువరకును కొనసాగింపబడినది. ఆసందర్భములో సత్యా
గ్రహులుచూపిన త్యాగము, సాహసము, ధైర్యము, ఓర్పు
కడుప్రశంసనీయములు. దేశములో అట్టి నవీనమహోద్యమము
చే హరిజనులలోకూడ మార్పుకలిగినది. పూనామున్నగుచోట్ల
దేవాలయ ప్రవేశసత్యాగ్రహమును వారు నడపిరి. 1928
సం॥ లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసులో అస్పృశ్యతా నివా
రణకొరకు పాటుపడుట కొకప్రత్యేకసంఘమేర్పరుపబడినది.
దానికి శ్రీజమ్నాలాల్ బజాజ్ గారు కార్యదర్శిగ నియమింప
బడిరి. వారికృషివల్ల వార్ధాలోని లక్ష్మీనారాయణాలయము
మున్నగు దేవాలయములలోనికి హరిజనుం ప్రవేశింపగలి

గిరి. బీరారురాష్ట్రమునకు పూర్వము రాజధానిగానున్న "ఎలిచ్‌పూర్"లోని దత్తాత్రేయదేవాలయములోనికి కూడ వారిని రానియ్యదొడగిరి.

అస్పృశ్యతానివారణార్థము పాటుబడుటలో నాంధ్రదేశ మెంతమాత్ర మితరరాష్ట్రములకు వెనుకపడలేదు. సాంఘిక, సారస్వత, రాజకీయరంగములలో నేటియాంధ్రులకు మార్గదర్శియగు శ్రీవీరేశలింగముపంతులవారే దీనికి కూడ బీజముల నాటిరి. కుల మతభేదముల రూపుమాపవలెనని బోధించుటతోడను, ఎల్లరి యెడల సమభావముతో మెలంగవలెనని చెప్పుటతోడను ఆగక యీమహాపురుషు డవియెల్ల తననిత్యజీవితమందు నవలంబించెను. రాజమహేంద్రవరములో దానవాయిగుంట ప్రాంతమునగల హరిజనులు త్రాగుటకు నీరులేక నానాబాధలపడుచుండుట చూచి వారికొరకు విశేషధనవ్యయమునకును శ్రమకును లక్ష్యముచేయక బావులత్రవ్వించెను.

ఆంధ్రదేశము.

శ్రీవీరేశలింగముకవి వేసిన పునాదిపై నపూర్వసౌధమును గట్టుభాగ్యము వదాన్యులును బ్రాహ్మధర్మాభిమానులునగు శ్రీపిఠాపురము మహారాజావారికిని, వారికి గురుతుల్యులును, పూజ్యులునగు శ్రీరఘుపతి వెంకటరత్నము నాయుడుగారికే యబ్బినది. వారియుపకార హరిజనాభిమానమును తెలుపుటకు పిఠాపురములో నేడుకూడ నవిచ్ఛిన్నముగ సాగు

చున్న హరిజన బాలబాలికల వసతిగృహములను చుట్టుపట్ల గల గ్రామములలోకూడ గల పాఠశాలలను శ్రీ వెంకటరత్నము నాయుడుగారు పెంచి పెద్దవారిగ చేసిన, చేయుచున్న హరిజన బాలికలే చాలుదురు. మొన్న మొన్ననే మహాత్ముని ప్రాయోపవేశదీక్షానంతరమున శ్రీ రాజాగారు 'అఖిలభారతహరిజనసేవకసంఘము' నకు రు 5000 విరాళమొసంగిరి. బహుగ్రంధకర్తలు కవీశ్వరులునగు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు రాజమహేంద్రవరములో హరిజనులకొరకు పాఠశాలలు పెట్టి విశేషశ్రమకోర్చి చిరకాలమునుండియు పాటుపడుచుండిరి. ఏలూరునందు ఆదియాంధ్రమహాసభ చిరకాలముక్రిందటనే స్థాపింపబడి నేటికి కూడ పనిచేయుచున్నది. గుడివాడలో శ్రీ గూడూరి రామచంద్రుడుగారు, బందరులో దీనబంధుపత్రికా సంపాదకులగు శ్రీ రాంజీరావుగారు, చాగల్లు ఆశ్రమవాసులును బ్రహ్మసమాజకులునగు శ్రీయుతులు తల్లాప్రగడ ప్రకాశరాయుడు, నరసింహశర్మగారలును, గుంటూరు శ్రీకృష్ణాశ్రమస్థాపకులగు శ్రీ నల్లపాటి హనుమంతరావుగారును, ఏలూరునివాసులగు శ్రీ వెల్లంకి కృష్ణమూర్తిగారును, పల్లెపాడు ఆశ్రమస్థాపకులును కీర్తిశేషులునగు శ్రీ దిగుమర్తి హనుమంతరావుగారును, సకలకష్టముల సహించి, సంఘము బహిష్కార

మొనర్చినను జంకక అపూర్వత్యాగము సాహసము చూపి హరిజనసేవకులైరి. వీరిలో నధికసంఖ్యాకు లింకనాకృషి యందే యున్నారు. అస్పృశ్యతానివారణమన్న ప్రజలు కం టగించుకొను రోజులలోనే శ్రీ మంగిపూడి వెంకటశర్మగారు హరిజనసమస్యను పూర్తిగ చర్చించుచు రచించిన "నిరుద్ధ భారత"మను గ్రంథములోని పద్యము లేపాషండుని హృదయ మునైన కరగించివైచును. హరిజనులకు చెందిన శ్రీయుతులు నరాలసెట్టి దేవేంద్రుడు, చుంద్రు వెంకయ్య, రాయుడు, గం గయ్యగార్లు తదితరులు తమసంఘములో గలదురాచారముల రూపుమాపుట కొరకును తమవారిలో నాత్మగౌరవభావ ములపుట్టించుటకును ప్రయత్నించుచున్నారు. ప్రస్తుతము నిజా మురాజ్యమునందున్నను ఆంధ్రరాష్ట్రములో చేరినదేయగు హైద్రాబాదునగరమున శ్రీయుత భాగ్యరెడ్డివర్మగారను హరిజననాయకులు, ఆదిహిందూసేవాసంఘమును స్థాపించి, దానిపక్షమున నగరమునందలి వివిధభాగముల సుమారు ముప్పది పాఠశాలలను కొంగరసవర్ణుల సహాయముతో నెల కొల్పి హరిజనులలో విద్యాప్రచారము గావించుచున్నారు. వీరు ధనవంతులగుటకును, భోగములందుటకును, వారికిగల యవకాశముల నన్నిటిని తన్నివైచి హరిజనసేవకై నిరంతరము పాటుపడుచు యువకుల కాదర్శప్రాయులగుచున్నారు.

హరిజనసమస్యకు నేడు రాజకీయప్రాముఖ్యత విశేషముగా గలదనుట కేమాత్రము సందేహపడనక్కరలేదు.

రాజకీయ ప్రాముఖ్యత.

ఈసమస్యకింత రాజకీయ ప్రాముఖ్యత యెట్లు కలిగినదో తెలిసికొనుటకు చదువరులు కుతూహలముతోనుందురు. కావున కీర్తిశేషులగు లాలా లజపతిరాయిగారు సైమన్ సంఘమును బహిష్కరింపవలెనను తీర్మానమును భారతశాసనసభలో ప్రవేశపెట్టుచు 1928 సంవత్సరము ఫిబ్రివరి 16 వ తేదీ నొసంగిన యుపన్యాసములోనుండి తద్విషయమునకు సంబంధించిన భాగము యీక్రింద పొందుపరచుచున్నాము.

"భారతరాజ్యాంగ కార్యదర్శియగు బర్కెన్ హెడ్ ప్రభువుగారు నేడు నిమ్నజాతులయెడ నభిమానమును చూపుచున్నారు. కాని యీనిమ్నజాతులవారెప్పుడు జన్మమొందిరి? ఇట్టి జాతులవారున్నారని ప్రభుత్వమువారు తెలిసికొన్నదెప్పటినుండి? ఈనిమ్నజాతులు 1917 సంవత్సరమున జన్మించినట్లు కనబడుచున్నది. అంతకుపూర్వము వారు లేనేలేరు (సభ్యులలో ఒకరు; అదియెట్లు?) అదియెటులనో నేనిప్పుడే చెప్పబోవుచున్నాను. ఒకనిమిషమాగినచాలును. 1917 సంవత్సరము ఆగస్టునెలలో భారతదేశమును బ్రిటిషుసామ్రాజ్యములో నొకభాగముగనేయుంచి దానిలో బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్పుటయే బ్రిటిషురాజనీతియొక్క పర

మావధియని మహాప్రకటన మొకటి గావించబడినది. ఆప్రకటనయం దాంగ్లోయిండియనుల కేమాత్రమిష్టము లేకుండెను. తత్ఫలితముగా 1917—18 సంవత్సరముల భారతదేశమున విద్యాభివృద్ధిని తెల్పు నివేదికయందు మొట్టమొదటసారి "నిమ్నజాతులు" పేర్కొనబడిరి. అంతకుపూర్వము - ఇంగ్లీషు ప్రభుత్వమునకు సంబంధించినంతవరకు - ఆనిమ్నజాతుల వారు లేనేలేరు. ప్రభుత్వమప్పుడేమిచేసినది ? నిమ్నజాతుల లో విద్యఏమాత్రమున్నదో, వారివిద్యాభివృద్ధికి చేయవలసిన దేదియో తెలిసికొనుటకై వారిజనాభాలెక్కలు సేకరించబడినవి. పైకిచెప్పినకారణమది. జనాభాలెక్కలవల్ల నిమ్నజాతి ప్రజలు దాదాపుమూడుకోట్లున్నట్లు తేలినది. తరువాత 1921 సంవత్సరమున సేకరించబడిన జనాభాలెక్కలలో "సెన్సస్ కమీషనర్"గారు వారిజనాభాను 5 కోట్ల 20 లక్షలకుపెంచి, భారతదేశమందంతటను చూచిననిమ్నజాతులవారిజనసంఖ్య $5\frac{1}{2}$ -6 కోట్ల మధ్యగలదనివ్రాసిరి. "కొట్మెన్"గారు దానిని ఒక్కకలముపోటుతో నారుకోట్లు గావించిరి. మన బ్రిటిషుప్రభువులును లండనులోని "టైమ్సు" పత్రిక దొంగసానుభూతినిచూపు మితరులందరును ఈయారుకోట్ల ప్రజలను గురించియే మాట్లాడుచున్నారు. పైవారందరును నిమ్నజాతులవారి బాగుకొరకింతవరకేమిచేసిరో నేనడుగవచ్చునా ? తమనూటయాబదివత్సరముల పాలనలో బ్రిటిషు ప్రభుత్వమువారు వీరికొరకేమిచేసిరో నేనడుగవచ్చునా?"

## ప్రథమఖండము.

లాలా లజపతిరాయిగారన్ననో బ్రిటిషు ప్రభుత్వమా నిమ్నజాతుల పేరైన వినియుండనిరోజులలో నిమ్నజాతులకొరకు అమితవ్యయప్రయాసలకోర్చి కృషిజేసిరి. 1912 సంవత్సరమున "నిమ్నజాతుల విద్యాసంఘము"ను పేరుతో లాలా రామప్రసాద్ గారు కార్యదర్శిగ నొక సంఘమును స్థాపించి పంజాబురాష్ట్రమును సంయుక్తరాష్ట్రములలోని కొన్నిజిల్లాలను పాఠశాలలతో నింపివైచిరి. 1924 సంవత్సరమున 'అచూతోద్ధార్ సంఘము'ను(అస్పృశ్యతోద్ధార) నెలకొల్పి సర్వెంట్స్ ఆఫ్ పీపిల్సుసొసైటీ (Servants of Peoples Society) లోని సభ్యులగు నైదుగుర నాసంఘముతరఫున పనిచేయుటకు నియోగించిరి.

బ్రిటిషురాజకీయవేత్తల యెత్తులను గురించి మహాత్ముడు 1–3–1928 నాటి యంగ్ ఇండియా పత్రికలో నిట్లు వ్రాసెను.

'భారతదేశమును కొల్లగొట్టి తమవిధానము నక్లే యుంచుకొనుటకు లజ్జయైన లేక బ్రిటిషు రాజకీయవేత్తలు ఒకపక్షమువారిపై నింకొకపక్షమువారినెట్లు ప్రేరేపించుచున్నారో చూడుడు. ఆరాజకీయవేత్తలు అస్పృశ్యులొకరున్నారని యకస్మాత్తుగ కనుగొనిరి. బ్రిటిషుమకుటములోకెల్ల ప్రతిభావంతమగు నీమహారత్నమును (భారతదేశమును) నక్లే యుంచుకొనుటకు హిందూముసల్మానుల మధ్యగల వైషమ్యములు చాలవని వారికి భయముకలిగినట్లున్నది.'

క్రీ. శ. 1919 సంవత్సరములో భారతదేశీయులకు మాంటేగ్యూచెలమ్స్‌ఫర్డ్ సంస్కరణము లొసంగబడినవి. వాటివల్ల ప్రభుత్వశాఖలలో కొన్ని ప్రజాయత్తము చేయబడినవి. సైన్యము, శాంతిసంరక్షణము వారి చేతులలోనే యుంచుకొనబడినవి. ఇదివరకుకంటె నెక్కువమందిసభ్యులను ప్రజ లెన్నుకొని శాసనసభలకంపుట కవకాశముకలిగినది. నిమ్న జాతులవారికష్టముల వెలిబుచ్చుటకై యీ క్రిందిలెక్కల ప్రకారము ప్రతిరాష్ట్రగవర్నరు తనరాష్ట్రశాసనసభకు నిమ్నజాతి ప్రతినిధులనియమించుట కధికారమీయబడినది

సంస్కరణములు. 1919.

| | | |
|---|---|---|
| మదరాసు | ... | 10. |
| మధ్యరాష్ట్రములు | ... | 4 |
| బొంబాయి | ... | 2. |
| బీహారు ఒరిస్సాలు | ... | 2. |
| బెంగాలు | ... | 1. |
| సంయుక్తరాష్ట్రములు | ... | 1. |
| పంజాబు | ... | –. |
| అస్సాము | ... | –. |
| భారతశాసనసభకు గవర్నరుజనరలు నియోగింపవలసినవారు | ... | 1. |

నిమ్నజాతుల జనసంఖ్య.

1931 సంవత్సర జనాభా లెక్కల ననుసరించి రాష్ట్రముల ప్రకారము నిమ్నజాతుల జనసంఖ్య.

| | |
|---|---|
| అజ్మీరు మేర్వారు | 76,735. |
| అస్సాము | 1,830,430. |
| బెలూచిస్థానము | 6,889. |
| బెంగాలు | 7,099,343. |
| బీహారు, ఒరిస్సాలు | 5,760,071. |
| బొంబాయి | 1,750,424. |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 2,927,343. |
| కూర్గు | 25,343. |
| ఢిల్లీ | 72,683. |
| మదరాసు | 7,268,157. |
| పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రములు | 6,027. |
| పంజాబు | 1,228,180. |
| సంయుక్తరాష్ట్రములు | 11,531,145. |
| మొత్తము ... | 40,254,576. |
| స్వదేశసంస్థానములు | 11,399,341. |
| మొత్తము ... | 51,653,917. |

ప్రభుత్వమువారిచే నియోగింపబడుటచే నిమ్నజాతి సభ్యులు మరలశాసనసభలకు సభ్యులుగా తాము నియోగింపబడవలెనను ఆశపెట్టుకొనినచో ప్రభుత్వమువారి చెప్పుచేతలలోనుండి నడచుకొనవలసివచ్చుచున్నది. మదరాసుశాసనసభలో కొందరుసభ్యులీవిషయమును తేటతెల్లముచేసిరి.

మాంటేగ్యూ చెలమ్స్ఫర్డ్ సంస్కరణములలోనే అవి ప్రతిపాదింపబడిన పదిసంవత్సరముల తరువాత భారతీయులు మరికొన్ని రాజకీయాధికారములను బడయుట కర్హులోకారో విచారణసల్పి నిర్ణయించుటకొక విచారణసంఘమును బ్రిటిషుపార్లమెంటువారు నియోగింపవలెనని యున్నది దానిననుసరించి 1928 లో సైమనుసంఘమేర్పాటు చేయబడినది. కాని వారిని భారతదేశములోని సర్వపక్షములవారును బహిష్కరించిరి. బ్రాహ్మణేతరపక్షమువారును, నిమ్నజాతి ప్రతినిధులు కొందరును సైమనుసంఘము ముందర సాక్ష్యమొసంగిరి. డాక్టరు అంబేద్కరుగారు నిమ్నజాతులపక్షమున సాక్ష్యమొసంగుచు ప్రత్యేకనియోజకవర్గములు భారతదేశమునకే హానికరములనియు, నందులో నిమ్నజాతులకవి బొత్తిగా పనికిరావనియును వివరించిచెప్పిరి. సైమనుసంఘునివేదికలోకూడ ప్రత్యేకనియోజకవర్గము లొసంగినచో నిమ్నజాతులకు చెందినవారెవ్వరో నిర్ణయింపవలసివచ్చుననియు, అట్లునిర్ణయించి ఓటర్లజాబితాలో ఫలానివారు నిమ్నజాతుల

కు చెందినట్లు వ్రాసినచో నది యాపప్రజలకు శాశ్వతమగు మచ్చగ పరిణమించుననియు, నిమ్నజాత్యుద్ధరణకొరకు భారతదేశములో లేచిన మహోద్యమమునెల్ల వారు పోషింపవలెననియు నాసంఘసభ్యులు వ్రాసిరి. శాసనసభలలో నిమ్నజాతులకు ప్రాతినిధ్యముండుటకొరకు ప్రతిశాసనసభలోను వారికై కొన్ని స్థానముల ప్రత్యేకించవలెననియు- ఆస్థానములకు పోటీచేయుటకొరకు ప్రతిరాష్ట్రగవర్నరు నిమ్నజాతుల వారేర్పరచుకొనిన సంఘములతో సంప్రతించి యభ్యర్థుల నియోగింపవలెననియు వారు సలహానిచ్చిరి.

సైమనుసంఘము భారతీయులెల్లరచే బహిష్కరింపబడుటచే లండనులో భారతీయులును, బ్రిటిషువారును భారతభావిరాజ్యాంగవిధాన విషయమై చర్చించుటకొరకు రౌండు టేబిలు సమావేశమేర్పరుపబడినది దానికి నిమ్నజాతుల పక్షమున డాక్టరు అంబేద్కరుగారు ఆహ్వానింపబడిరి. అదివరకు వారు ప్రత్యేకనియోజకవర్గములు తమవారికి హానికరములన్నను రెండవ రౌండుటేబిలు సమావేశములో తదితర యల్పసంఖ్యాకులతోచేరి యవియేకావలెనని పట్టుపట్టుటయు, ప్రధానమంత్రి సాంఘికపరిష్కారమున నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకరవర్గము లొసంగుటయు- అవిలేకుండచేయుటకు మహాత్ముడు ప్రాయోపవేశదీక్ష బూనుట మున్నగునవి నిన్నమొన్నటి విషయములు, ఈగ్రంథములోని తృతీయఖండమునం దావిషయములు చర్చించబడినవి.

హరిజనసమస్యయొక్క స్వరూపమేమి ? అది సాంఘికమా, రాజకీయమా, ఆర్థికమా లేక ధార్మికమా ? మహాత్ముడు దీనినొక మహాధార్మికసమస్యగ పరిగణించుచున్నాడు కొందరు దీనిని ఆర్థికసమస్యగ భావించుచున్నారు. వారిప్రకారము హరిజనులార్థికముగ నభివృద్ధిచెందినచో యీసమస్య యడంగిపోవును. కాని హరిజనులకు గ్రామ వెలుపల నివాసమేర్పరచుటయు, తమగృహములందు జరుగు మహోత్సవములందునను, శుభాశుభ కార్యములందును వారలను సవర్ణులు పిలువక వెలివేసియుంచుట- హరిజనులకు ధనము లేదని కాదు. జన్మచేతనే తోడిమానవులలో కొందరస్పృశ్యులగుదురను సిద్ధాంతమే దానికి కారణము. ఏనాడు సవర్ణ హిందువులాసిద్ధాంతము భ్రమకల్పితమగు మూఢాచారమని గ్రహించి, హరిజనులకు తమకుగల సాంఘికమగు హక్కుల నొసంగెదరో యానాడే "హరిజనసమస్య" తృప్తికరముగ పరిష్కరింపబడగలదు. అప్పుడే శుభ్రముగ నుండుటకును, త్రాగుడుమున్నగు దురభ్యాసముల వీడుటకును, హరిజనుల కుత్సాహము కలుగును. అంతట దేశములో ధనవంతులు, ధనహీనులమధ్య జరుగబోవు పోరాటములో ధనహీనులగు హరిజనులుకూడ చేరవచ్చును. కాని యది వేరొకసమస్య.

హరిజనులు చాల దుస్థితిలోనున్నారనుట ఎల్లరంగీకరించెదరు. వారలనట్టిదశనుండి, ధార్మిక, సాంఘిక రాజకీ

యార్థికవిషయములందు సవర్ణహిందువులతో సమానమగు స్థితికి గొనివచ్చుటెట్లు? ఈప్రశ్నకు మహాత్ముడు తన ఉపవాసానంతరము చేసిన ప్రకటనలలో సమగ్రమగుజవాబునిచ్చెను. అందలి మైదవ, యారవ ప్రకటనలలో సంస్కర్తలకును, హరిజన ప్రచారములకును కార్యక్రమముల నొసంగెను. ఆప్రకటనలు ఈగ్రంథములోని చతుర్థఖండమునందు కూర్చబడినవి.

అయినను నాకుతోచిన యీక్రింది కార్యక్రమము హరిజన సేవకులకు నుపయోగకరముగ నుండుకేచ్చుట చేర్చుచున్నాను.

౧. సవర్ణులలోనిసంస్కర్తలు సవర్ణులలో గావింపవలసినకృషి.

(1). అస్పృశ్యతా నివారణానుకూలముగ సవర్ణులభావముల మార్పుచేయ ప్రయత్నింపవలెను. ఇందులకు కరపత్రములు ప్రకటించుట, ఉపన్యాసము లేర్పాటుచేయుట, ప్రతియింటికిపోయి వ్యక్తిగతప్రచారము సల్పుట ముఖ్యమగు మార్గములు.

(౨). హరిజనులలోని పాకీవాండ్రకు వారిపనిని శుభ్రముగ చేయుట కవకాశముల సవర్ణులొసంగునట్లు చేయవలెను. వారాపనిని చేయునప్పుడు వృత్తిచిహ్నముగ ధరించుటకు ప్రత్యేకదుస్తులకూడ నిచ్చునట్లు చేయవలెను.

(3). ఊరిబావులను, పాఠశాలలను, సత్రములను, రోడ్లను ఆస్పత్రిలను, దేవాలయములను హరిజనులు కూడ నుపయోగించుటకు సవర్ణుల నంగీకరింపచేయ వలెను.

(4). హరిజనులను తమగృహములందు నౌకరులుగాని, తమకుటుంబములోని వారిగగాని యుంచుకొని విద్యాభ్యాసము చేయునట్లుగా ప్రోత్సహింపవలెను.

(5). హరిజనుల నివాసములకు దగ్గర కల్లుసారాయి మున్నగు దుకాణములపెట్టి సవర్ణులెవ్వరు నమ్మకుండునట్లు చేయువలెను.

(6). చచ్చినజంతువుల మోసికొనిపోయి వాటిచర్మము నొలిచి బాగుచేసినందులకు సరియైనకూలిని హరిజనులకిచ్చునట్లు చేయువలెను.

(7). బలవంతముగ వెట్టిచాకిరి చేయించుకొనుట మాన్పించవలెను.

(8). దుర్భాషలాడక హరిజనులను మర్యాదగ చూచునట్లు చేయువలెను.

(9). తాము తినగామిగిలిన యెంగిలిపదార్థములను సవర్ణులు హరిజనుల కియ్యకుండునట్లు చేయువలెను.

## ౨. హరిజనులలో గావింపవలసిన మార్పులు.

(1) అస్పృశ్యతానివారణానుకూలమగు భావములను వారిలో వెదజల్లవలెను. దానిని కొనసాగించుటకు మార్గములు.

(క). గ్రామసంచారము.

(ఖ). ఉపన్యాసములు.

(గ). "మ్యాజిక్ లాంతెర్న్" ఉపన్యాసములు.

ఈక్రింది విషయముల గురించి.

(1). రామాయణము మున్నగు పురాణకథలు.

(2). హరిజనులలోనిమహాభక్తుల, మహావీరుల జీవితములు.

(3). సంఘసంస్కారము.

(4). ఆర్థికవిద్యావిషయములు.

(5). త్రాగుడుమున్నగు దురభ్యాసములు.

(6). శరీరారోగ్యముపరిశుభ్రత;గ్రామపారిశుద్ధ్యము.

(ఘ). కరపత్రముల నచ్చువేయించి పంచిపెట్టుట.

(చ). తాలూకారాష్ట్ర హరిజనసమావేశముల నేర్పరచుట.

(ఛ). సందులలోను, తీర్థములందు, ఉపన్యాసముల నొసంగుచు, కరపత్రముల పంచిపెట్టుచు ప్రచారముగావించుట

(ఛ). ఒకగ్రామములోని హరిజనులు యన్యగ్రామముల వారిని పిలచి భజనలు, విందులు ఏర్పాటుచేయునట్లు చేయించవలెను.

(జ). పాటలు, భజనలు, నాటకములు.

(ఝ). జనాభా లెక్కల గైకొనునప్పుడు, మాల, మాదిగ మున్నగు నామముల చెప్పక హరిజనులమని చెప్పుకొనునట్లు చేయవలెను.

(ఝ). పాకీపనిని శుభ్రితతో చేయునట్లు చేయవలెను.

(ట). చచ్చినగొడ్ల మాంసమును, గోమాంసమును తినుట మానిపించవలెను.

(ఠ). వారిలోవారికిగల యస్పృశ్యతను పోనాడునట్లు చేయవలెను.

## నిర్మాణకార్యక్రమము.

(౨). పైనచెప్పిన విషయములను గురించి హరిజనులలో ప్రచారము గావించుటవల్ల వారిలో పుట్టుభావములు నిలబడునట్లు చేయుటకును, హరిజనులకు తమయందు విశ్వాసము జనింపచేయుటకును ఈక్రిందినిర్మాణకార్యక్రమమును కొనసాగించుట చాల అవసరము.

(య). పాకీపనిని తాముచేసి, యాపనిని చేయుటెంతమాత్రము నీచముగాదని హరిజనులకు నమ్మకమును పుట్టించవలెను.

(ర). వారికి వలయునప్పుడెల్ల వైద్యసహాయము నొసంగవలెను. వారియోగక్షేమములను తరచు కనుగొనుచు వారిపిల్లలను, వనభోజనములకు చిన్నచిన్న యాత్రలకును కొనిపోవలెను.

(ల). హరిజనసంఘము లేర్పరచి వారిలో నైకమత్యతను చేకూర్చవలెను.

(వ). వారికిగల యిబ్బందుల తొలగించవలెను.

(శ). హరిజన బాలబాలికల విద్యాభివృద్ధికి తోడ్పడవలెను.

ఈక్రిందిమార్గములు ప్రయత్నింపవలెను.

(1). పాఠశాలలపెట్టుట విలగునంతవరకు ప్రత్యేకపాఠశాలలపెట్టక గ్రామపాఠశాలలో హరిజనబాలుర, బాలికల చేర్చుకొనునట్లు చూడవలెను, ప్రత్యేకపాఠశాలల పెట్టినచో వారికి నేడుగల వెలి యట్లేయుండిపోవచ్చును.

(2). హరిజనబాలురకు విద్యార్థివేతనముల నేర్పాటుచేయుట.

(3) హరిజనబాలుర చేర్చుకొను విద్యాసంస్థలకు ధనసహాయము చేయుట.

(4). హరిజనబాలురకు వసతిగృహముల నేర్పరచుట.

(5). జీతములు పుచ్చుకొనకుండను, పలకలు పుస్తకములుమున్నగువాటి నొసంగియు హరిజనబాలురకు ఉచితవిద్యాభివృద్ధికి అవకాశముల కల్పింపవలెను.

(ష). సహకారసంఘముల నెలకొల్పవలెను.

(స). హరిజనులలో పనిలేనివారలకు పని సంపాదించిపెట్టుటకొక సంఘము నేర్పాటుచేయవలెను.

(హ). ఆధునికపద్ధతులపై నాయావృత్తులలో నభివృద్ధిసు-నేర్పరితనమును సంపాదించవలెను.

(ళ). త్రాగుడుమున్నగు దురభ్యాసముల వీడునట్లును, పెండ్లిమున్నగు కార్యముల కమితధనవ్యయము గావించకుండునట్లును, బాల్యవివాహాది దురాచారములను వదులునట్లును చేయవలెను.

3. హరిజనులలోగల సంస్కర్తలు గావింపవలసినపని.

---

(1). చచ్చిన గొడ్డుమాంసమును, గోమాంసమును ఎంగిలికూడును తినకుండునట్లు తమవారిని చేయవలెను.

(2). ఆధునికపద్ధతులతో చర్మములను బాగుచేయుట, మున్నగు వారివృత్తులను తాము నేర్చుకొని తమవారలలో నా వృత్తుల నవలంబించువారలకు నేర్పవలెను.

(3) వారిలో వారికిగల నంతర్భేదములను రూపుమావవలెను.

(4). పరిశుభ్రతను, పారిశుద్ధ్యసూత్రములను పాటించునట్లు చేయవలెను.

(5) హరిజనసంఘములను, వార్షిక సమావేశముల నేర్పరుపవలెను.

(6) మహాత్ముడు కోరినట్లు శాంతిమార్గములనే తమకష్టముల తీర్చుకొనునట్లు వారలకు చెప్పవలెను.

---

# హరిజనసమస్య.

## ద్వితీయ ఖండము.

---

౧

నిమ్న జాతులు
**27-10-1920.**

వివేకానందస్వామి పంచములను "అణగద్రొక్కబడిన జాతుల" లని పేర్కొనెడివాడు. వారుపయోగించిన విశేషణము సరియైనదనుటకు సందేహము లేదు. మనము వారల నణగద్రొక్కితిమి. తత్ఫలితముగా మన మణగిపోతిమి. బ్రిటిషుసామ్రాజ్యమునం దితర దేశములలో మనలను పంచములగా చూచుచున్నారు గోఖ్లేగారు చెప్పినట్లుగా నిది మనపాపములకు పరమేశ్వరుడు విధించిన శిక్షయే. పంచముల బాగుకొరకై సేవచేయుచున్నావని నాకొక విలేఖరి విషాదకరమగు లేఖ వ్రాసెను. దానిని విలేఖరి యిచ్చిన మకుటముతోనే వేరొక పుటయందు ప్రకటించితిని. "తమనెత్తురుచేతుల కడుగుకొనమని మనము ఆంగ్లేయుల నడుగుటకుపూర్వము మనమీద యీ కళంకము లేకుండునట్లు చూచుకొనవలదా" యని ఆయన అడుగుచున్నాడు. ఈప్రశ్న చాలసమంజసమైనదే.

అడుగవలసిన సమయముకూడ నిదియే కాని తనబంధములనూడ్చుకొనకుండ, జానిసజాతిలోని యొకవ్యక్తికి యీపంచముల బంధవిముక్తుల చేయుటకు వీలున్నచో యీ యుత్తరక్షణమే నేనట్లుచేసెదను. అది అసాధ్యమగు పని. ధర్మకార్యము చేయుటకైనను జానిసకు స్వాతంత్ర్యము లేదు. విదేశవస్తువు లీదేశములోనికి దిగుమతికాకుండ నిషేధించుట నాకుధర్మమే? కానిఅట్లు నిషేధించుటకు నాకధికారము లేదు, శక్తిలేదు. టర్కీదేశమునకు వెడలి ధర్మయుద్ధము సల్పు నాదేశీయులయెడల భారతీయులకు సానుభూతి గలదని తెల్పుట మౌలనా మహమ్మదాలిగారికి ధర్మమే. కాని అట్లుచేయుట కాయనకు స్వాతంత్ర్యము లేదు. భారతదేశములో నిజమైన శాసనసభయే యున్నచో, హిందువుల దౌష్ట్యమునకు తగిన బుద్ధిచెప్పి యుండెడివాడను. అగ్రవర్ణములవారి, నూతులకంటె మంచినూతులు పంచములకొరకు త్రవ్వించియుందును. వారిలో ఒక్కరికైన తమపిల్లలు చదువుకొనుటకు పాఠశాల లేదను విచారము పుట్టకుండ, నెన్నియో ఉత్తమోత్తమములగు పాఠశాలల కట్టించి యుందును. కాని ఆసౌభాగ్యము నందుటకింకను నేవేచియుండవలెను.

అంతవరకు మీపాట్లు మీరు పడుడనిపంచములవదలి ఊరకుండవలసిలదేనా?- అట్లైన్నటికిని కాదు. నేనుమాత్రము చేయగలిగినదెల్ల నాశక్తివంచన లేకుండ చేయుచున్నాను.

అగ్రివర్ణములవార్లచే హింసింపబడు యీపంచములకు మూడు మార్గములు కలవు. వారు (ప్రజల బానిసలచేసి వారిపై నధికారమొనర్చు) ప్రభుత్వసహాయమడుగవచ్చును. ఆసహాయమడిగినంతనే వారికి దొరకును. కాని వారిస్థితి మరింత దుర్భరమై పోవును నేడో-వారు బానిసలకు బానిసలు మాత్రమే ప్రభుత్వసహాయ మపేక్షించినచో తమరక్త బిందువులగు అగ్రివర్ణములవారిని అణగద్రొక్కుటకు ప్రభుత్వముచే వారుపయోగింప బడుదురు. హింసింపబడుటకు మారుగా వారే హింసకులై పోవుదురు. ముసల్మానులీమార్గమునుపట్టిచూచిరి. భగ్నమనోరథులైరి. పూర్వముకంటె నెక్కువకష్టములలో చిక్కుకొనిరి. తరువాత శిక్కులు అనుకొనకుండగనే ఆమార్గమనుసరించి విఫలులైరి. నేడీదేశములో శిక్కులకంటె ప్రభుత్వమెడల అసంతృప్తి నొందిన సంఘమింకొకటిలేదు. ఇందువల్ల ప్రభుత్వసహాయ మడుగుటచే నాకష్టములు గట్టెక్కజాలవని తేలినది.

రెండవమార్గము హిందూధర్మమును వీడి వారందరు క్రైస్తవులుగనో, లేక ముసల్మానులుగనో మారిపోవుట. ప్రాపంచికసౌఖ్యముల కొరకు స్వధర్మమును వీడుట న్యాయమైనచో అట్లు చేయమని వారికిసలహానిచ్చుటకు, నేవెనుదీయను. కాని ధర్మము హృదయసంబంధమైనది. ప్రాపంచికకష్టము లెన్నివచ్చినను స్వధర్మమును వీడరాదు. నేను నిరాడం

బరజీవిని. ధర్మము పేరజరుగు దుర్మార్గముల నంగీకరింపజాల ను. అస్పృశ్యుల నిట్లు క్రూరముగా హింసించుట, హిందూ ధర్మములో నొకముఖ్యభాగమైనచో ఆహిందూధర్మమును వీడుట నాకును నావంటివారికిని తప్పనివిధియగును. కాని అస్పృశ్యత హిందూధర్మములో నొకభాగముకాదు. అది ఆధర్మము నంటిపెట్టుకొనిన కశ్మలము. సర్వవిధముల ప్రయ త్నించి దానిని రూపుమాపవలెను. నేడనేకమంది సంస్కర్త లు, హిందూధర్మమునుండి యీకళంకమును పోగొట్టుటకు నిశ్చయించుకొనియున్నారు. కావున పంచము లన్యమతముల లో చేరుట తగనిదని.

చివరకు వారికి మిగిలినమార్గ మొక్కటే కలదు. పంచమజాతికి చెందని యితరహిందువులు, దర్పము లేకుండ, తమవిధియని నమ్మి, తమంతట తామొసంగు సహాయము తీసికొనుచు—వారు తమస్వశక్తిపై నాధారపడియుండుటయే. సహాయనిరాకరణాయుధము కూడ నిందులకుపయోగించును. చెడుగని తేలిన దీనిని నిర్మూలనము చేయుటకొరకై, సహాయ నిరాకరణాయుధము నుపయోగించుటకు నేనంగీకరింతునని యీవిలేఖరికి శ్రీరాజాగోపాలాచార్యులు, దిగుమర్తి హను మంతరావుగార్లు చెప్పిరట. అదినాకుకూడ సమ్మతమైనదే. కాని సహాయనిరాకరణమనగా. యితరులసహాయమపేక్షింప కుండ తమబలముపై నాధారపడియుండుటే. నిషేధింపబడిన

స్థలములలోనికి చొరబడుట సహాయనిరాకరణమనిపించుకొనదు. శాంతముగా నడపినచో నది శాసనోల్లంఘనమనవచ్చును. శాసనోల్లంఘనమునకు చాల ఆత్మనిగ్రహము, శిక్షణ ఆవశ్యకములని పూర్వానుభవమువల్ల నేగ్రహించితిని. ఇతరులకు సహాయము నిరాకరించుట అందరికిని సాధ్యమగును. కాని కొందరే శాసనోల్లంఘనమొనర్ప జాలుదురు. అందువలన ఈదురాచారము యెడల, తమయసమ్మతిని తీవ్రముగా తెల్పుటకుగాను, పంచములు తామనుభవించు కష్టముల కొన్నిటిని పేర్కొని, అదినివారింపబడువరకు తదితరహిందువులతో నెట్టిసంబంధముంచుకొనక పోవచ్చును. అట్లుచేయుటకు తెలివితేటలు, సంఘటనాశక్తి కావలయును. నాకు తెలిసినంతవరకు, అసహాయోద్యమముద్వారా వారి మనోరథము పూర్తిగావింపగల నాయకుడెవ్వరు వారిలోలేరు.

ఇందువల్ల పంచములు కూడ ప్రభుత్వదాస్యము నుండి తప్పించుకొనుటకు బయల్వెడలిన సీజాతీయోద్యమములో చేరుటే ఉత్తమపద్ధతి యగును. ఈప్రభుత్వమునకు సహాయము నిరాకరింపవలెనన్న, భారతజాతిలోని వివిధసంఘములు, ఐక్యత కలిగియుండవలెను. ఈసంగతి పంచమసోదరులు గ్రహింపగలరనుకొందును. సహాయనిరాకరణమువల్ల జయమునొందవలెనన్నచో, హిందువులు ముసల్మానులతో నెట్లు చేతులు కలపిరో అట్లే పంచములతోకూడ, చేతులు

కలుపుటవసరమని వారు గ్రహింపవలెను. దౌర్జన్యసహాయ నిరాకరణోద్యమము ముఖ్యముగా ఆత్మశుద్ధికొరకేర్పడిన తీవ్రతరోద్యమము. ఈఆత్మశుద్ధిఉద్యమము ప్రారంభమైనది. పంచములు పాల్గొనినను లేకున్నను మిగతాహిందువులుమాత్రము వారిని అలక్ష్యము చేయరాదు. అలక్ష్యము చేసినచో వారికే ముప్పు కలుగును. తత్కారణమున పంచమజాత్యుద్ధరణ నాకు ప్రాణతుల్యమైనను సహాయనిరాకరణోద్యమాభివృద్ధికే నాసర్వశక్తుల వినియోగించెదను.

ఏలన యీమహోద్యమములో పంచములసమస్య కూడ నిమిడియున్నదనియే నాదృఢనమ్మకము.

౨

మన కీయస్పృశ్యతా పాపమునకు తగినప్రాయశ్చిత్తము కా లేదా ? మనము చేసికొనినదానికి తగిన ప్రతిఫలము ముట్టి నదికదా? డయ్యారు ఓడయ్యారులమించి, మన యాత్మబంధువు లనే మనము హింసించుట లేదా ? మనము అస్పృశ్యులను మనసంఘము నుండి వేరుచేసితిమి మనలను బ్రిటిషువలసరాజ్యములలో వెలిపెట్టిరి. పంచములు మనతోపాటు ఊరిబావులనుండి నీరు తోడుకొనరాదంటిమి. మనము తినగా మిగిలిన యెంగిలిమెతుకులు వారిమొగమున కొట్టుచుందుము. వారి నీడ తగిలినంతమాత్రమున మైలపడిపోదు మనుకొనుచున్నాము. సరిగా చూచినచో నింగ్లీషువారు మనకుచేసిన హాని కంటె మనము పంచములకు యెక్కువ హానిచేసితిమి.

అస్పృశ్యతా కళంకము
19-4-1921

హిందూధర్మమునుండి యీకళంకమును బాపుటెట్లు? ఇతరులు నిన్నెట్లు చూడగోరెదవో, నీ వితరుల నట్లె చూడవలెను. భారతీయులకు మీరే నిజమైన మిత్రులును, సేవకులునైనయెడల మీ యున్నతస్థానములనుండి కొంచెము క్రిందకు దిగవలసినదనియును, పోషకులవలెగాక తోడి ఆంగ్లేయుల నెట్లుచూచుదురో యట్లే భారతీయులనుకూడ చూడవలెననియును, సత్కార్యములను ప్రేమతోచేసి మీ భారతీయులకు స్నేహితులమని ఋజువుచేసుకొనవలసినదనియు నే

ననేకమారులు ఆంగ్లేయాధికారులకు చెప్పితిని. కిలాఫతు పంజాబుదురంతములు జరిగినప్పటినుండియు నింకొక అడుగు ముందుకువైచి తమ క్రూరచర్యలకు పశ్చాత్తాపపడవలసిన దనియు, హృదయముల మార్చుకొనవలసినదనియు వారిని అడుగుచుంటిని. అట్లే హిందువులమందరము, మన తప్పులకు పశ్చాత్తాపపడి మన నడవడిని మార్చుకొనవలెను. మనము వారికొరకు నాలుగుపాఠశాలల లేవఁబెట్టినచాలదు. వారికడ మనము గొప్పవారిపోకడలను చూపరాదు. మానవమునకు వారు మనరక్తబంధువులు. రక్తబంధువుల చూచినట్లే వారలను మనము చూడవలెను మనజాతిలో పరంపరానుగతముగా వచ్చుచున్న జ్ఞానసంపత్తినుండి వారిని వంచించితిమి. ఇక నట్లుచేయరాదు. ఇంగ్లీషుచదివిన సంస్కర్తలెవ్వరో నలుగురీపనిని చేసిన సరిపోదు. సాధారణప్రజలందరు, తమతమ హృదయములు ప్రేరేపింప స్వయముగా నీపనికి పూనుకొనవలెను. ఈసంస్కరణ మేనాడో జరిగియుండవలసినది. ఇక నైన ఆలస్యము కానీయరాదు. పవిత్రమగు నీసంవత్సరములోనే ప్రయత్నించి, తపించి దీనిని నిర్వహింపవలెను. ఇది స్వరాజ్యము వచ్చినపిమ్మట సాధింపవలసిన సంస్కరణకాదు. అంతకుముందే సాధింపవలసినది.

అస్పృశ్యత ధర్మవిహితమైనదికాదు. అధర్మమూలకమగు రాక్షసస్పృష్టి. స్వలాభముకొరకు సైతానుకూడ ధర్మశాస్త్రముల పేరెత్తుచుండును. కాని శాస్త్రములు, సత్య

మును- మానవబుద్ధిని మించినవికావు. అవి బుద్ధిని పవిత్రి మొనర్చుటకును, సత్యమును స్పష్టముగ వ్యక్తీకరించుటకును నిర్దేశింపబడినవి. అశ్వమేధముచేయుటకు వేదము లంగీకరించినవనిగాని, చేయసలహానొసంగినవనిగాని, తుదకావిషయమున మూకీభావము వహించినవనిగాని చెప్పినంతనే నిర్దోషమగు గుఱ్ఱము నొకదానిని కాల్చివేయుటకు నేనంగీకరింపజాలను. వేదములు భగవత్ప్రసాదములనియే నానమ్మకము. వాటియందు నాకు చాలభక్తికలదు. శ్రద్ధగలదు. శ్లోకముయొక్క భావమునే గ్రహింపవలెనుకాని ప్రతియక్షరమును పట్టుకొని మథించరాదు. అందువలన లాభములేదు వేదములేమి బోధించుచున్నవి? పవిత్రతను, సత్యమును, అమాయికత్వమును, నైర్మల్యమును, వినయమును, నిరాడంబరత్వమును, క్షమను, యీశ్వరప్రేమను, మానవజీవితమును ఉదారముగను, ధైర్యోపేతముగను చేయు నితరములన్నిటిని బోధించుచున్నవి. నీచాతినీచముగ భావించు పాకీపనిని, పల్లెత్తుమాటయైన బడకుండ చేయుచున్న సాధులగు నీజాతీయసేవకులను కుక్కలకంటె అధములుగా చూచుచు వారి మొగములమీద నుమియుటలో నుదారతలేదు. ధైర్యము గన్పడదు. నిర్బంధమువల్ల నిమ్నజాతులు చేయు నీపాకీపనిని చేయుటకు, మాయంతట మేమే పూనుకొనుటకు తగిన ధైర్యవివేకముల పరమేశ్వరా! మాకొసంగుము. మురికితో నిండి శుభ్రపరచవలసినస్థలము లనేకములు పవిత్రమగు నీ భారతభూమిపై కలవు.

---

3

ఈసంస్కరణ కభ్యంతరపెట్టువారిని ఒప్పించుటెట్లో నాకు తెలియుటలేదు. పంచములను ముట్టుకొనినచో మైల పడిపోవుదుమనియు, ప్రాయశ్చిత్తము చేసికొనిననేగాని ఆమైల పోదనియు, అట్లు ప్రాయశ్చిత్తము చేసుకొనకుండుట మహాపాపమనియు భావించువారితో వాదించుటెట్లు? నే చేయగలిగినది వారికి నాదృఢనమ్మకముల నింకొకమారు మనవిచేయుటయే.

అస్పృశ్యులు.
27-1-1921

అస్పృశ్యత హిందూధర్మమున కొక మహాకళంకమని నేను భావింతును. ఈభావము పుట్టుటకు దక్షిణాఫ్రికాలో నాకుకలిగిన కష్టానుభవములు కారణము కాదు. ఒకప్పుడు నేను నాస్తికుడనుగానుండుటవల్ల నాకీభావములు కలుగలేదు. కొందరు తలచునట్లు నేను క్రైస్తవమతగ్రంథములు చదువుటవల్ల నాకీభావములు పుట్టలేదు. అవి బైబిలుతో గాని, బైబిలు ననుసరించు వారితో గాని, నాకు పరిచయము కలుగకపూర్వము నుండియే యున్నవి.

ఈ అభిప్రాయములు నాకు కలుగునప్పటికి, నాకు పన్నెండుసంవత్సరములు కూడ నిండలేదు. పాకీదొడ్డి తుడుచుటకు "ఊకా"యను అస్పృశ్యుడు మాయింటికి వచ్చెడివాడు. ఆతని నెందులకు ముట్టుకొనగూడదనియు ముట్టుకొనిన తప్పేమనియు మాఅమ్మను తరుచు అడుగుచుండెడి

వాడను. పొరపాటున నేను "ఊకా"ను ముట్టుకొనినచో నన్ను స్నానము చేయుమనెడివారు. తత్క్షణమే వారుచెప్పి నట్లు చేసినను, అస్పృశ్యతను హిందూధర్మము ఒప్పుకొనదని ఒప్పుకొనజాలదని స్నానము చేయుచు చెప్పుచుండెడివాడను. నేను వినయవిధేయతలతో మెలగెడివాడను. అందువల్ల తల్లిదండ్రుల యెడల నాకుగల భక్తికి కొరతరాకుండ నంత వరకు యీవిషయమై వారితో పోరాడెడివాడను. "ఊకా"ను ముట్టుకొనుట పాపమని మా అమ్మ అనినప్పుడెల్ల ఆమె అభిప్రాయము పూర్తిగా తప్పని నే చెప్పియుంటిని.

నేను పాఠశాలలో చదువునప్పుడు, అస్పృశ్యులన బడువారిని ముట్టుకొనుట తటస్థించెడిది. ఇది మాఅమ్మకు చెప్పినప్పుడు ఆమె అస్పృశ్యుని తగిలిన తత్క్షణమే, పాపపరి హారార్థము దారిపోవు నే ముసల్మానునైన ముట్టుకొనవల సినదని చెప్పుచుండెడిది. మా అమ్మయందు నాకున్న ప్రేమ వల్లను గౌరవమువల్లను నట్లు చేసెడివాడను. కాని అది ఒక మతధర్మమని నన్ను చేయలేదు కొంతకాలమైనతరువాత "పోరుబందరు" చేరితిమి. నా కక్కడనే మొట్టమొదటిసారి సంస్కృతభాషతో పరిచయము గల్గినది నన్నప్పటికింకను యింగ్లీషుబడికి పంపుట లేదు. నన్ను నాసోదరుని ఒకబ్రా హ్మణున కప్పజెప్పిరి. ఆయన మాకు "రామరక్ష" విష్ణు పూజల నేర్పెడివాడు. అందులో వచ్చు - జలేవిష్ణు - స్థలే

విఘ్న - అను మాటల నేనింకను మరచిపోలేదు. అప్పుడు ఒక ముసలమ్మ మాయింటికి సమీపమున నుండెడిది. నే నప్పుడు చాలభయస్థుఁడుగానుండెడివాడను. చీకటిపడినప్పుడు దీపములారిపోయినప్పుడు భూతప్రేతములు మీఁదపడుచుండెడివి. ఆముసలమ్మ నాభయమును పోగొట్టుటకు "రామరక్షా" శ్లోకములం చదివినంతనే, దయ్యములు పారిపోవునని యు, వాటిని పఠింపుమనియు చెప్పినది. నేనట్లే చేసితిని. చాలలాభముకూడ కలిగినది ఈ "రామరక్షా" శ్లోకములలో అస్పృశ్యుల నంటుకొనుట పాపమని చెప్పుమాటలున్నవని నేనమ్మజాలకుండెడివాడను. ఆ "రామరక్షకు" నాకప్పుడర్థము తెలియదు- లేక సగముసగము తెలిసియుండెడిదేమో! కాని భూతప్రేతములవలని భయము లేకుండ చేయగలిగిన ఆ "రామరక్ష" యీ అంటుభయము నెదుర్కొనగలదని నాకు ధైర్యమున్నది.

నిత్యము మాయింట శ్రీమద్రామాయణపఠనము జరుగుచుండెడిది. "లాధా" యను ఒకబ్రాహ్మణుడు చదువుచుండెడివాడు. ఆయనకుష్ఠురోగి. రామాయణపఠనమువల్ల తనరోగము పోవునని ఆయననమ్మకము. అట్లే అదిపోయినది కూడ. నేడుమనచే నస్పృశ్యుడని పిలువబడువాడొకడు శ్రీరాముని తనపడవలో గంగానదిని దాటించినట్లు ఆరామాయణములో చెప్పబడినది. అట్టిరామాయణము పాపాత్ములగుట

వల్ల, కొందరిని అంటుకొనరాదని ఎట్లునిషేధించు ననియును కొనుచుండెడివాడను. పరమేశ్వరుని మనము 'పతితపావనా' యనియో, లేక ఆయర్థమేవచ్చు యితరనామములతోనో, పేర్కొందుమన్న సంగతి హిందూధర్మములో పుట్టిన ఏప్రాణినైన పాపియనిగాని, అస్పృశ్యుడనిగాని చూచుటపాపమనియూ, రాక్షసకృత్యమనియూ, చెప్పుటకుచాలును. అప్పటినుండియు యిదియొక మహాపాపమని, నేఘోషించుట మాన లేదు. పన్నెండవ ఏటనే నాలోనీభావము పాదుకొనిపోయినదని నేచెప్పజాలను. కాని అప్పటినుండియు అస్పృశ్యత పాపమని నేనెంచితినని మాత్రము చెప్పగలను. ఈనాకథను నిష్ఠాపరు లకొరకును, వైష్ణవులకొరకును చెప్పుచున్నాను.

నన్నెల్లప్పుడును నేను సనాతనహిందువుగనే యెంచు కొనుచున్నాను. నాకు శాస్త్రపురాణములు కొలదిగనో గొప్పగనో తెలియును. అయినను నేనుగొప్ప సంస్కృతపండితుడనుమాత్రము కాను. వేదములను, ఉపనిషత్తులను, అనువాదములలోనేచదివితిని. అందుచే నాశాస్త్రపరనము విద్వాంసులశాస్త్రపరనము వంటిదికాదు. నాకు వాటియందు పరిపూర్ణ పాండిత్యమెంతమాత్రమును లేదు. కాని వాటిని చదువుట ప్రతిహిందువుని ధర్మమగుటచే నేచదివితిని. వాటినిజ తత్వమునె గ్రహింపగలిగితిని. అప్పటికినాకు యిరువదియొక్క సంవత్సరముల వయస్సు. అటుపిమ్మట నితరధర్మగ్రంథములకూడ పరిశీలించితిని.

హిందూక్రైస్తవ ధర్మములమధ్య నేను ఊగులాడు చుండిన రోజులుకూడ ఒకప్పుడుగలవు. కొంచెముస్థాయి చిక్కినతరువాత నాకుమోక్షము హిందూధర్మము ననుసరించుటచేతనే లభించు ననువిశ్వాసము కలిగినది. అప్పటినుండియు దానియందు నానమ్మకము దృఢతరమైనది. కాని అప్పుడుకూడ హిందూధర్మము. అస్పృశ్యత నంగీకరింపలేదనియే నానమ్మకము. ఒకవేళ ఆధర్మమంగీకరించినచో నదినాకు పనికి రాదనియే నేననుకొనుచుండెడివాడను.

నిజమే. హిందూధర్మము అస్పృశ్యతను పాపముగా పరిగణించదు. శాస్త్రార్థవిషయమై చర్చకుదిగుటకు నాకుకోరికలేదు. భాగవతమునుండి గాని, మనుస్మృతినుండిగాని శ్లోకముల నుదహరించి నేను నామాటను నెగ్గించుకొనలేకపోవచ్చును. కాని హిందూధర్మతత్వమును నేనుగ్రహించితిననియే నాఉద్దేశము. అస్పృశ్యత నంగీకరించి, హిందూధర్మము మహాపాప మొనర్చినది. మనల నధఃపతితుల చేసినది. బ్రిటిషుసామ్రాజ్యములో మనలపంచముల గావించినది ముసల్మానులకుకూడ నీజాడ్యముసోకినది. దక్షిణాఫ్రికాలోను, కెనడాదేశములోను, ముసల్మానులు, హిందువులుకూడ అస్పృశ్యులుగా చూడబడుచున్నారు. ఇదిఅంతయు అస్పృశ్యతా పాపఫలితమేగదా ?

అస్పృశ్యత హిందూధర్మములోని భాగమని హిందువు లెంతవరకు చూచుచుందురో, తమసోదరులలో కొందరిని

తాకుటయే మహాపాపమని హిందువులలో చాలమంది యం
తకాలము ఎంచుచుందురో, అంతకాలము స్వరాజ్యమబ్బుట
అసంభవము. యుధిష్ఠిరుడు వెంటనంటిన కుక్కనువదలి స్వర్గ
మునకైన పోనిచ్చగింపలేదు. ఆయుధిష్ఠిరుని సంతతివారలు
అస్పృశ్యులనువదలి స్వరాజ్యమొంద నెట్లాశించెదరు ?

ఏనేరములు చేసినందులకు మన మీప్రభుత్వమును
రాక్షసప్రభుత్వమనుచున్నామో ఆనేరములనే మనము మన
పంచమసోదరులయెడల నొనర్పలేదా ? మనము మన సోద
రుల నణగద్రొక్కితిమి. తమ ముక్కుల నేలబెట్టి రాసుకొను
నట్లు వారల చేసితిమి. కోపదృష్టులతో రైలుపెట్టెలనుండి
వారల ద్రోసివేయుచుందుము. బ్రిటిషుప్రభుత్వముమాత్ర
మింతకంటె ఘోరకృత్యముల నేమొనర్చినది ? మనము
డయ్యరు, ఓడయరులపై మోపు యపరాధములనే మనసో
దరులు మనపై మోపలేదా ? మన మీపాపవిముక్తులము
కావలయును నిస్సహాయులను, దుర్బలులను మనమెంతకాల
ము రక్షింపజాలమో—స్వరాజ్యవాదులలో నొక్కనికైన
తోడిసోదరుల మనస్సుల నొవ్వజేయుట కెంతకాలము వీల
గునో అంతకాలము మనము స్వరాజ్యముపేరెత్తుట వ్యర్థము.
స్వరాజ్య మననేమి ? దుర్బలులగు హిందువులనుగాని, ముస
ల్మానులనుగాని కిరుభయములేకుండ తాను బాధింపగల్గుదు
నన్న అహంకార మేవ్యక్తిని క్షణకాలమైన నుండుట కవకా

శము లేకుండుటయే. ఇట్లుగాకున్న, మనకు స్వారాజ్యమబ్బినను తత్క్షణమే దానిని పోగొట్టుకొందుము. దుర్బలులగు మన సోదరులయెడల చేసినపాపకృత్యములనుండి, మనము విముక్తులము కానంతకాలము మనబ్రతుకు పశువులబ్రతుకుకంటె, హీనమైనదేయగును.

నాకింకను ఆశగలదు, విశ్వాసముగలదు. మహాకవి, 'తులసీదాస్'చే కీర్తింపబడి, జైనవైష్ణవధర్మములకు మూలాధారమై, భాగవతధర్మములకు సారాంశమై, భగవద్గీతలోని ప్రతిశ్లోకమునందు నిండియుండిన దాన, దయా, ప్రేమ, భావములు, భారతీయప్రజలలో నానాటికి వ్రేళ్లుపాతుకొనిపోవుచున్నవి. ఈసంగతి నేనీదేశములోని భిన్నభిన్నప్రాంతములలో సంచారముచేయునప్పుడు తెలుసుకొంటిని.

హిందుమహమ్మదీయ కలహములింకను జరుగుచునేయున్నవి. ఒండొరుల హింసింప జంకనివారింకను చాలమంది గలరు. అంతయు పరిశీలించి చూచినచో, దయాదాక్షిణ్యములు దేశములో వృద్ధినందినవనియే నేననుకొనెదను. హిందూముసల్మాను లిరువురకు దైవభీతికలిగినది. న్యాయస్థానములయొక్క, ప్రభుత్వపాఠశాలలయొక్క, వ్యామోహమునుండియు, ఇతరభ్రమలనుండియు బయటఁబడగల్గితిమి. నిరక్షరకుక్షులనియు, అజ్ఞానులనియు మనమెవ్వరిని పిలచుచుంటిమో వారలే జ్ఞానులనతగినవారనికూడ తెలుసుకొంటిమి. వారే

మనకంటె సదాచారులనియు, వారిజీవితములే మనజీవితము లకంటె, ధన్యతమములనియుకూడ తెలిసినది. ప్రజలమానస ముల కొంచెము పరిశీలించినచో, స్వరాజ్యమనగా రామరా జ్యమనియే వారు భావించుచున్నారని తేలును. రామరాజ్య స్థాపన యనగా వారికి ధర్మరాజ్యస్థాపనయే.

పంచమ సోదరులారా! మీకుత్సాహము కలిగించుట కొక్కమాట చెప్పెదను. అస్పృశ్యతానివారణమన్న, నేను పూర్వమున్నంత అలజడిలేదు. అందువల్ల మీరు హిందువు ల ననుమానింపవలదని నాయభిప్రాయముకాదు. ఇంతకాల ముచుండియు మాకింతహాని చేసినవారు విశ్వాసమునకు పాత్రులెట్లగుదురు? అస్పృశ్యులు పతితులుగారనియు, తక్కిన హిందువులచే నణగద్రొక్కబడిన వారనియు, అట్లణగద్రొ క్కిన హిందువులు తమగోతిని తామే త్రవ్వకొనిరనియు, వివే కానందస్వామి చెప్పుచుండెడివాడు.

ఏప్రిల్ 6 వ తేదీని నెల్లూరులో నుంటినుకొందును. అక్కడి అస్పృశ్యులను కలసికొని మాట్లాడితిని. నేటివలె ఆ నాడుకూడ ప్రార్థనలచేసితిని. మోక్షమునొందవలెనని నే నేకోరెదను. కాని ఒకవేళ నేను తిరిగి పుట్టవలసివచ్చినచో అస్పృశ్యుడుగనే పుట్టకోరెదను. ఏలన వారితోపాటు వారిక ష్టములందు, దుఃఖములందు, పరాభవములందు పాల్గొని నా తోపాటు వారినికూడ నాదుర్గతినుండి ఉద్ధరించవలెనని నేకో

లేదను. అందుచే నేను మరల జన్మింపవలసివచ్చిన బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యశూద్రకులములలో పుట్టక, అస్పృశ్యుడగనే జన్మించవలెనని ప్రార్థించితిని.

ఆనాటికంటె నేడు చాలపవిత్రమైన దినము. అనేకమంది నిరపరాధులీనాడే జలియన్వాలాబాగ్ నందు హత్యచేయబడిరి. అందులకని నాకోరికలన్నియు ఫలించక నేచనిపోయినచో, అస్పృశ్యతానివారణకొరకు నేచేయవలసిన పని యింకను మిగిలిపోయినచో, నాహైందవత్వము పూర్ణము గాక నేనుతిరిగి జన్మించవలసివచ్చినచో, అస్పృశ్యులలోనే జన్మించి, నాహిందూత్వమునకు సంపూర్ణసిద్ధి కలుగునట్లు చేసుకొన ప్రార్థనలసల్పితిని.

పాకీపనియనిన నాకు ప్రేమమెండు. మాఆశ్రమము లో పదునెనిమిదేండ్ల బ్రాహ్మణబాలకుడొకడు మరుగుదొడ్డి శుభ్రముగ తుడుచుటయెట్లో పాకీవానికి నేర్పుటకై, తానే పాకీపనిచేయుచున్నాడు. అతడు సంఘసంస్కర్త కాడు. నిష్ఠాపరుల కుటుంబములో పుట్టిపెరిగినవాడు. గీతాపఠన మనుదినము చేయును. తూ, చా, తప్పనీయక సంధ్యచార్చును. అతని సంస్కృతోచ్చారణ నాఉచ్చారణముకంటె చాలబాగుండును. అతడు ప్రార్థనచేసినప్పుడాతని మధురకంఠనాదము వినినవారు ప్రేమార్ద్రహృదయులైపోవుదురు. అయినను ఆతడు పాకీపనిచేయుటకూడ నేర్చుకొననిచో, తనవిద్య పూర్తి

కాదని నిశ్చయించుకొనెను. ఆశ్రమములో పాకీపనిచేయు వాతడు తనపనిని చక్కగాచేయవలెనన్నచో ఆపనినెట్లుచే యవలెనో తానుచేసి చూపించవలెనని కూడ ఆబ్రాహ్మణ బాలకుడు తలంచెను.

మీరు హిందూసంఘమును శుభ్రపరచువారలమని మీ రెరుంగవలెను. మీజీవితములకూడ పవిత్రములగావించు కొనవలెను. శుభ్రమగు అలవాటుల నలవరచుకొనవలెను. మీలోపములని యితరులు వెలెట్టిచూపుట కవకాశమీయ కూడదు. సబ్బుకొనుటకు డబ్బులేకపోయినచో చవుడునుగా ని, రేవడిమట్టినిగాని ఉపయోగించి శుభ్రముగానుండుడు. మీలోకొందరు జూదరులుందురు. కొందరు త్రాగుదురు. వా రీచెడుఅలవాటుల వీడవలెను. బ్రాహ్మణులలోకూడ త్రాగుమోతులు, జూదరులు ఉండినప్పటికిని వారినిపతితులగా చూచుటలేదుగదా ? అనియు, మే మీదురలవాటుల వీడు మని అడుగక జాలితో మమ్ముల రక్షింపుడని మీరు మిగ తా హిందువుల నడుగరాదు. తమబాగుకొరకే వారట్లుచేయ వలెను. మీసత్ప్రవర్తనవల్ల పరిశుభ్రమగు మీఅలవాటుల వల్ల సవర్ణహిందువులకే సిగ్గువచ్చునట్లు చేయవలెను. మిగిలిన అయిదునెలలో మనము పరిశుద్ధులముకాగలమను కుందును. ఒకవేళ నేననుకొనినట్లు జరుగకపోయినచో, నాయభిప్రాయ ములును, నాజీవితాదర్శములును, సరియైనవయినప్పటికిని,

దేశపరిస్థితుల గ్రహించుటలో పొరబడితిననుకొందును. నా తప్పుల బహిరంగముగా ఒప్పుకొందును.

మీరు హిందువులమని చెప్పుకొందురు. భాగవతపఠన చేయుచుందురు. మిమ్ముల సవర్ణహిందువులు అణగద్రొక్కినచో నది హిందూధర్మముయొక్క తప్పుకాదు. అదియా ధర్మముప్రకారము నడచుకొనువారమని చెప్పుకొనువారల తప్పని మీరుగ్రహింపవలెను. మీరున్నతిగాంచవలెనన్నచో పరిశుద్ధులుగావలయును. త్రాగుడుమున్నగు దురభ్యాసముల ను వదలవలెను.

మీస్థితిగతుల బాగుపరచుకొనగోరుచో స్వరాజ్యము పొందవలెనన్నచో మీఆత్మశక్తిపైననే మీరాధారపడి యుండవలెను. మీలోకొందరు సహాయనిరాకరణోద్యమము నకు వ్యతిరేకులుగా నున్నారనియు, బ్రిటిషుప్రభుత్వమువల ననే మోక్షమబ్బుననుకొనుచున్నారనియు నాకు బొంబాయి లో తెలిసినది. హిందూధర్మమును వీడి యితరుల సహాయమపేక్షించిన మీ రెన్నటికిని మీకష్టముల దాటజాలరని నేను మీమ్మాటికిని చెప్పుచున్నాను. మిమ్ములనుద్ధరించుకొను శక్తి మీచేతులలోనే ఉన్నది.

భారతదేశములో అన్నిప్రాంతములలోగల అస్పృశ్యులను నేనుకలసికొంటిని. వారిలో నంతర్గతమైయున్న శక్తిసంగతి సవర్ణ హిందువు లెరుంగరు. ఆపంచములకసలే తెలియదు.

వారిబుద్ధి చెడుమార్గములఁబట్టక, యింకను పవిత్రముగనే యున్నది. నూలువడుకుట, బట్టలునేయుట మీావృత్తిగా చేసుకొనుడు. అందుచే ఆకలిబాధ మీాదరికి రానేరదు. మీాలో గల భేదముల రూపుమాపుకొనవలెనని పూర్వము చెప్పియుంటిని అదియే మరల చెప్పెదను. "ధేడ్"లని "భంగీ"లని మీాలోమీారు భేదముల పెట్టుకొనుట, నాకర్థమగుటలేదు. "ధేడ్"లకును "భంగీ"లకును భేదమేమియు లేదు. వారిరువురవృత్తులుకూడ వకీళ్ల, ప్రభుత్వోద్యోగుల వృత్తులంత గౌరవప్రదమయినవనుటకు సందేహము లేదు.

ఇతరులు తినగామిగిలిన యెంగిలి అన్నమును మీారు పుచ్చుకొనుట మానవలెను అది మొతశుద్ధిమైనదని వారు చెప్పినను సరే దానినిపుచ్చుకొనకుడు ముక్కని, చెడిపోవని మంచిధాన్యము పుచ్చుకొనుడు. అదికూడ యిచ్చువారు మర్యాదగ నిచ్చిననే! నేను చేయమనినదెల్ల మీారు చేయగలిగినచో నాలుగు నెలలలో కాదు నాలుగురోజులలోనే మీారు బాగుపడుదురు.

సహజముగ హిందువులు పాపాత్ములుకారు వారు అజ్ఞానములో పడిపోయిరి. అస్పృశ్యత యీాసంవత్సరములోనే, యంతమొందవలెను. పంచమజాతి ఉద్ధరణ గోసంరక్షణములకొరకే నేను జీవించుచున్నాను. ఆకోరికలు రెండును తీరినవెంటనే స్వరాజ్యమబ్బును. అదియే నామోక్షము. మిమ్ములనుద్ధరించుకొనుటకు తగినశక్తి భగవంతుడు మీాకనుగ్రహించునుగాక!

---

౪

పంచములను, మద్రాసురాజధానిలో చూచునంత క్రూరముగా నింకే ప్రాంతమునందు జూడరు వారిసీడపడిన బ్రాహ్మణులు మైలపడిపోదురట! బ్రాహ్మణవీథులలోనుండి వారు నడువనేకూడదు. బ్రాహ్మణేతరులు కూడ వారి నింత కంటె బాగుగచూడరు. ఈయిద్దరమధ్యనుపడి పంచములు నలిమైపోవుచున్నారు. మద్రాసు రాజధానియన్ననో గొప్పదేవాలయములకును దైవభక్తికిని ప్రసిద్ధికెక్కినదే! జనులన్ననో పెద్దనామములతోను, జుట్టుముడులతోను, బిళ్ళగోచీలతోను ఋషులవలె నుందురు. వేషభాషలతోనే వారిధర్మమంతయు పూర్తి అయినదేమో యని తోచును. పంచములన్ననో చాల కష్టపడిపని చేయుదురు. సంఘమునకును, దేశమునకును చాల నుపయోగపడుచుందురు. వారు, రామానుజులును, ఆదిశంకరులు జన్మించిన దేశములో నింతక్రూరముగా చూడబడుట నాకర్థమగుట లేదు. దేశీయసోదరుల నింతక్రూరముగా చూచుచున్న ను దక్షిణభారతీయులయందు నాకుగల విశ్వాసముపోలేదు. ఈకళంకమును రూపుమాపుకొనినగాని, స్వరాజ్యమువచ్చుట అసంభవమని వా రేర్పరచిన మహాసభలందన్నిచోట్ల స్పష్టముగా తెలియజేసితిని.

పంచములు.
29-9-1921

ప్రపంచములో నితరదేశములవారు మనల కుష్ఠురో గులవలె చూచుటకు కారణము, మనలో నైదవవంతు ప్రజలను మన మట్లుచూచుచుండుటవలననే యని చెప్పితిని. సహాయనిరాకరణోద్యమము బ్రిటిషువారల హృదయముల మార్చుటకే కాదు. మన హృదయపరివర్తనకుకూడ నుద్దేశింపబడినది. ఒకసంవత్సరములో—అనేకశతాబ్దములనుండి వచ్చుచున్న అస్పృశ్యతాకళంకమును ఏజాతితూపుమాపగలదో, త్రాగుడు దురభ్యాసమును మాసినబట్టలు శరీరమునుండి తీసివేసినట్లు ఏజాతివదలిపెట్టగలదో, రాట్నమును చేపట్టి, పనిలేనికాలమంతయును పనిచేసి, అరువదికోట్లరూప్యముల ఖద్దరుబట్ట ఏజాతి తయారుచేసుకొనగలదో, ఆజాతి పూర్తిగమారిపోయినదనియే చెప్పవచ్చును. ఆజాతిలో కలిగిన మార్పువల్ల ప్రపంచముకూడ మార్పుచెందును. దయామయుడగు పరమేశ్వరుడు ఒకడున్నాడని ఎట్టినాస్తికునకైనను విశ్వాసము గలుగజేయుట కాజాతియే ఒకనిదర్శనము కాగలదు. భారతజాతి పైరీతిగ మార్పునొందినచో ప్రపంచములోగల ఏశక్తియును, స్వరాజ్యము మన జన్మహక్కు కాదనజాలదు. నిరాకరింపజాలదు. నేడు దేశమును విషమ పరిస్థితు లావరించుచున్నవి. అయినను మనము అస్పృశ్యతాపాపమునకు పశ్చాత్తాపపడి.....................(స్వదేశీదీక్ష) చూపినమరుక్షణముననే తమహృదయముల రాయిచేసికొనిన ట్లగపడు యూ

ఆంగ్లేయోద్యోగులే భారతీయులు ధైర్యవంతులనియు, స్వాతంత్ర్యప్రియులనియు వినతు లొనర్తురని జోస్యము చెప్ప సాహసింతును. హిందువులు తలచినచో యీపంచమజాతి నుద్ధరింపగలరనియు, వారికి తామనుభవించుచున్న సర్వహక్కుల నొసంగగలరనియు, భారతీయులు పూనుకొనినచో యింట్లో వంటచేసుకొనునట్లే తమకు కావలసిన బట్టనంతయు తయారు చేసుకొనగలరనియు నాకు పూర్ణవిశ్వాసము కలదు. ఆవిశ్వాసమే మన యీసంవత్సరములోనే స్వరాజ్యము సంపాదింపగలమని నేను చెప్పుటకు కారణము. ఈపరివర్తన మేదియో వ్యూహములన్ని సాధింపజాలము. ఈశ్వరకృపవల్లనే మనకది సాధ్యమగును. ప్రస్తుతము పరమేశ్వరుడు మనహృదయములందు ప్రవేశించి చిత్రవిచిత్రగతుల వానిని మార్చివేయుచున్నాడని చెప్పినచో కాదనజాలువా రెవ్వరుందురు ? ఏదియెట్లున్నను, పంచమసోదరులకు తోడ్పడుట ప్రతికాంగ్రెసువాదికిని విధ్యుక్తధర్మము వేదోపనిషత్తులును, భగవద్గీతయును, శంకరరామానుజులును ప్రతిపాదించు హిందూధర్మము, ఎంతపతితునైనను అస్పృశ్యునిగ చూడమనలేదని కాంగ్రెసు సేవకులందరు హైందవేతరులతో వాదించి నచ్చచెప్పవలెను. అస్పృశ్యత, అహింసాసిద్ధాంతమునకు విరుద్ధమని పూర్వాచారపరాయణులతో ప్రతికాంగ్రెసుసేవకుడును వినయముతో వాదించి వారలను ఒప్పించవలెను.

---

౫

హిందూముసల్మానులమధ్య నైకమత్యము లేనిదే స్వరాజ్యము వచ్చుట అసంభవమైనచో హిందూధర్మమునకు మహాకళంకమగు అస్పృశ్యత నిర్మూలింపబడనిదే స్వరాజ్యము వచ్చుట అంతకంటెనసంభవమనుటలో శ్రీ వాదకర్ణిగారితో నేను పూర్తిగ నేకీభవింతును.

మనకళంకము
30-6-1927.

ముందు నిర్మింపబోవు రాజ్యాంగవిధానమునందు అస్పృశ్యుల కెట్టిస్థానముండవలయునన్న విషయముతో నాకు పనిలేదు. సవర్ణహిందువులు విరోధముబూని లక్ష్యపెట్టనిచో రాజ్యాంగవిధానమునందు వారి రక్షణకొరకు చేసిన ఏర్పాటు లన్నియు వ్యర్థము లేయగును.

ఇతరు లెవ్వరికిని రాబోవు రాజ్యాంగవిధానమునందు ప్రత్యేకనియోజకవర్గములు కాని, ప్రత్యేకపుహక్కు లుగాని ఉండగూడదనుటకు నే చెప్పినకారణములు అస్పృశ్యులకు కూడ వర్తించును. అస్పృశ్యతానివారణము శాసనముల జేసిన మాత్రముననే జరుగవలసిన పనికాదు. సవర్ణహిందువుల యంతరాత్మలకు బాధకలిగి వారు మేల్కొని తమంతటతా మీకళంకమును బాపుకొనవలయును. అది వారికర్తవ్యము. వా రిందులకు బాధ్యులు.

అస్పృశ్యతానివారణము త్వరలో జరుగవలసిన పని. మనతో పోరాడుటకు అస్పృశ్యులు సమితు లేర్పరచుకొను

వరకును వారికిని తదితరహిందువులకును కొట్లాటలు జరిగి తమకన్నులు తెరచునంతవరకును సవర్ణులూరక కనిపెట్టుకొని ఉండవలదని తెల్పుచు శ్రీనాదకర్ణిగారు నాకు వ్రాసిన లేఖను ముగించిరి. ఇది చాల భయంకరమైనసంగతి. కాని ఆయన వ్రాసినదానిని కాదనుటకు వీలులేదు. ఈమాట గోఖ్లేగారు చనిపోవుటకుపూర్వము నాకును, కీర్తిశేషులగు శ్రీహరినారాయణఆప్టేగారికిని జరిగిన సంభాషణను జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఆసంభాషణ పూనాలోని 'భారతనికేతనసంఘు'భవనములో జరిగినది. క్రైస్తవమతప్రచారకులు కొందరు చేయునట్లు అస్పృశ్యులలో నాందోళన ప్రారంభించి వారిలో నసంతృప్తిని పుట్టించుటకుబదులు అగ్రవర్ణములవారిలో ప్రచారముచేయవలెనని నే నాయనతో చెప్పుచుంటిని. నే సీవనికి క్రొత్తవాడను. అప్పటి కింకను అస్పృశ్యులు అనుభవించుచున్న కష్టములపూర్తిగా నెరుంగను. నావెర్రివేదాంతములో పడియుంటిని. కాని అగ్రవర్ణములవార లీనిమ్నజాతులను పెట్టుబాధలు చూచి ఆప్టేగారి హృదయము దహించుకొనిపోయినది. అట్టి ఆసంఘసంస్కర్తను, నిమ్నజాతులవారిని సవర్ణులపై తిరుగబడునట్లోధింతురా యని ప్రశ్నించితిని. నిస్సందేహముగా నని జవాబువచ్చెను. తనచేతనైనచో ఆనాడే వారలను మనపై తిరుగబడునట్లుచేసెదననియు,మనంతటమనము వారలకియ్య

హక్కులనన్నిటిని వారు బలవంతముగా లాగుకొనునట్లు చేసె దననియు ఆయన తడవుకొనకుండ జవాబు విచ్చెను

ఈ సంస్కరణము చాలవరకు కొనసాగినది. కాని జరుగవలసిన పనియంతయు ముందునకే మిగిలియున్నది. ఇంత వరకు ప్రపంచములో సాధింపబడిన సంస్కరణములలో చాల భాగము రక్తపాతములవలననే సాధింపబడినవి. అధఃపతితులుగా భావింపబడి పీడింపబడుచున్నప్రజల ఓపిక కొంతకాలమునకు నశించును. వారంతట తామింతకాలమునుండి అనుభవించిన దుఃఖమువల్లను, బాధలవల్లను, ఆగ్రహావివశులై పిచ్చివార లగుదురు. అంతట దుష్టశిక్షణాధికారము తామే వహించి యింతకాలమునుండి తమ నెత్తిపై నెక్కిత్రొక్కిన క్రూరుల తుదముట్టింతురు. పిమ్మట తమ కవకాశము దొరికినంతనే తామే క్రూరులై పోవుదురు. తాము చంపినక్రూరులు చేసిన తప్పులనే తిరిగి తాముకూడ నొనర్తురు. ఇది లోకసహజమగు విషయమే. ఆనాడు హరినారాయణఆప్టేగారి హృదయమంతట నిండియుండిన రోషజ్వాల లిప్పుడు నా హృదయమును కూడ దహించుచున్నవి. కాని అగ్రవర్ణహిందువులు తమ తప్పుల దిద్దుకొందురనియును, దీపముండగనే యిల్లుచక్క పెట్టుకొందురనియును,యికనైన అస్పృశ్యులకు నన్యాయము నర్చుట మానుకొందురనియును నే నాశించుచున్నాను. సవర్ణులొకవేళ పశ్చాత్తాపపడకుండ నుండినచో అస్పృశ్యులు

వారిపై తిరుగబడక అంతకంటె నుత్తమమార్గము ద్రొక్కెద రని నే నాశపెట్టుకొనియున్నాను. నేడు వారుతమయందున్న లోపముల సర్దుకొని దురభ్యాసములను వీడి, పరిశుద్ధులై తమ ప్రతిష్టను, హిందూధర్మప్రతిష్టను నిలిపి నేడు హిందూధర్మమునకు కళంకప్రాయులుగనున్న అగ్రవర్ణముల వారికంటె ఉత్తమహిందువులయ్యెదరను ఆశతో నే నాపనిని సాగించుచుండెదను. ఈలోపున శ్రీనాదకర్ణిగారివలె అస్పృశ్యుల బాగుకై చింతించు ప్రతిహిందువుడును వారి కష్టములలోను దుఃఖములలోను పాల్గొనుచు తానుకూడ నొకయస్పృశ్యుడై అస్పృశ్యతా నిర్మూలనకొరకు పాటుపడుచుండవలెను.

---

౬

దక్షిణ హిందూస్థానమునందలి దేశభాషాపత్రికలో నొక పండితుడు వ్రాసిన వ్యాససారాంశమును నాకొక మిత్రుడు పంపెను. ఆపండితుడు అస్పృశ్యతను నాశనముచేయకూడదని యిచ్చిన హేతువుల నీక్రిందివిధమున నాస్నేహితుడు సంగ్రహపరచెను.

యంగ్ ఇండియా. 29-7-1926.

(1). ఆది శంకరుడు చండాలుని దూరముగా నుండుమనిన సంగతిని బట్టియు, చండాలుడవు కమ్మని త్రిశంకుచక్రవర్తికి శాపము వచ్చినతరువాత నాతనిని జనులందరు వెలివేసిరన్నవిషయమును బట్టియు చూచినచో, అస్పృశ్యత నిన్నమొన్నటిది కాక, బహుపురాతనమైనదని తెలియును.

(2). చండాలురు ఒకప్పుడార్యులచే సంఘమునుండి వెలివేయబడినవారు.

(3). మనకు అస్పృశ్యులైనవారే తమలోతా మస్పృశ్యతను పాటించుకొనుచున్నారు.

(4). జంతువుల చంపుచుండుటచేతను, రక్తమాంసములతోను, అశుద్ధముతోను వారికి నిత్యసంబంధముండుటవల్లను వారలు అస్పృశ్యులైరి.

(5). కసాయిదుకాణములను, కల్లంగడులను, వేశ్యాగృహ
ములను, దూరముగానుంచునట్లే అస్పృశ్యులనుకూడ
దూరముగా నుంచవలెను.

(6). పరలోకసౌఖ్యములుకూడ వారికి నిషేధింపకుండు
టకే అస్పృశ్యులు సంతోషింపవలెను.

(7). 'ఏవడో గాంధీ' యీపంచముల నంటుకొనవచ్చును.
అంటు పోవుట కాయన యుపవాసముండగలడు. మన
మన్ననో గాంధివలె ఉపవాసముచేయజాలము-వారిని
ముట్టుకొనజాలము.

(8). మానవాభివృద్ధికి అస్పృశ్యతయుండు టత్యంతావశ్య
కము.

(9). మానవునిలో ఆకర్షణశక్తి గలదు. ఆశక్తి క్షీరము
వంటిది. అంటుతగిలినచో విరిగిపోవును. ఉల్లిపాయ
లను కస్తూరిని కలిపి యుంచుటకు వీలైనచో పంచ
ములనప్పుడు బ్రాహ్మణులతో కలుపవచ్చును.

నాకు సంగ్రహపరచి విలేఖరి పంపినవానిలో నివి
ముఖ్యాంశములు.

అస్పృశ్యత యనునదొక బ్రహ్మరాక్షసి. ఆరాక్షసి
తలనెత్తినప్పుడెల్ల దానిని చిదుకపొడువవలయును. పురాణ
ములలో చాలకథలు కలవు. ప్రస్తుతపరిస్థితులకును వాటిలో
కొన్నిటికిని గల సంబంధమును మనము సరిగా నర్థముచేసు

శౌనక, వాటిననుసరింపగోరినచో అధోగతి పాలగుదుము. శాస్త్రములలో చెప్పిన ప్రతిమాటప్రకారము మన జీవితముల దిద్దుకొన ప్రయత్నించినగాని, లేక నాశాస్త్రములలో వర్ణింపబడిన పాత్రలజీవితముల ననుసరించి నడువ ప్రయత్నించినగాని, ఆశాస్త్రములు మనకు మరణ కారకము లగును. అందులకు సందేహము లేదు. ముఖ్యసిద్ధాంతముల నెరుంగుటకును, వాటిని వివరించి చెప్పుటకును శాస్త్రములు మనకు సహాయపడును. ధర్మగ్రంథములలోని ప్రఖ్యాతపురుషు డెవరో ఒకరు, భగవంతునియెడల గాని, తోడి మానవులయెడల గాని పాప మొనర్చిన, మనము కూడ నట్లుచేయుట కదియొక ఉదాహరణగ తీసుకొనవలసినదేనా? లోకములో నన్నిటికంటె 'సత్యమే' ముఖ్యమైనదనియు, 'సత్యమే' పరమేశ్వరుడనియు, నొక్కసారిచెప్పిన చాలును. యుధిష్ఠిరుడంతవాడు పొరపాటున అసత్యము పల్కినాడని చెప్పు టనవసర విషయము. కాని ఆయుధిష్ఠిరుడు అసత్యము చెప్పినందులకు తత్షణమే శిక్ష ననుభవించి నాడనియును, ఆతని విశాలకీర్తి యాతనికాశిక్ష తప్పింప లేక పోయినదనియు, తెలియచెప్పుటవసరవిషయము. అటులనే ఆదిశంకరుడు చండాలురనుండి తప్పించుకొని తిరుగుటకు ప్రయత్నించినాడని చెప్పుటనవసర విషయము. సర్వభూతములను తనవలెనే చూడవలయునని చెప్పుట మహాధర్మము. ఒక్కప్రాణినైన చండాలునిగ చూ

చుట కంగీకరింపజాలదనినచో, నిరపరాధులగు నొకజాతివారి నందర నస్పృశ్యులుగ చూడ నంగీకరింపదని తెలిసినచాలును. అదికాక, ఆదిశంకరుడు చండాలుని దూరముగ పొమ్మనెనో, లేదో, నిర్ణయించుటకు తగిన ఆధారము లేవియు లేవు. ఆసందర్భమున 'చండాలు'డను పదమున కర్థమేమో మనకు తెలియదు. ఆపదమున కనేక అర్థములు గలవని యందరు ఒప్పుకొనిన విషయమే! అందులో నొక యర్థము పాపియని. కావున పాపాత్ముల నందరను చండాలురుగ చూడగోరినచో యీపండితునితో సహా మనమందరమును అస్పృశ్యులమగుదు మనియే నాభయము. అస్పృశ్యత చాల పురాతనము కాదని యెవ్వరునుయనుటలేదు? కాని అస్పృశ్యత చెడ్డయనుటదైన చో-పురాతనమైనదను కారణముచే దానిని సమర్థింపరాదు.

ఆర్యులీయస్పృశ్యులను వెలివేసినచో దానివల్ల నా యార్యుల సంఘమునకే నష్టముకలిగినది. ఒకానొకప్పుడు శిక్షించు నుద్దేశ్యముతో నార్యులు కొన్నిజాతులవారిని వెలి వేసినచో- అట్లు వారు వెలివేయుటకు గల కారణము లేనైె ననునరే- ఆజాతులవారి సంతానమునకు కూడ నాశిక్ష విధిం పవలసిన అవసరము లేదు.

అస్పృశ్యులే తమలో కొందరిని అస్పృశ్యులుగ చూచుచున్నారను దానివల్ల తెలియునదేమి? మన పాపకార్య ముల ఫలితము మనతోనే నిలచిపోలేదనియును, వాని దుష్ఫ

లితములు సర్వత్రి వ్యాపించి పోయెననియును తెలియును. నిమ్నజాతులవారు తమలో కొందరిని అస్పృశ్యులుగ చూచుచున్నారనుసంగతి, అస్పృశ్యతాకళంకమును హిందూధర్మమునుండి త్వరలో తుడిచివేయుటెంత యవసరమో తెలియజేయును.

పశువుల చంపుట చేతను, రక్తమాంసములతోను, ఎముకలతోను, అశుద్ధముతోను, వారికి నిత్యసంబంధముండుటచేతను పంచములు అస్పృశ్యులైనచో, ప్రతిదాదియు, ప్రతి డాక్టరును అస్పృశ్యులే యగుదురు. క్రైస్తవులును, మహమ్మదీయులును బలిగాగాని, తినుటకుగాని, జంతువుల చంపునట్టి మాంసాహారులగు సవర్ణహిందువులెల్లరు నస్పృశ్యులు కావలసినదే!

కసాయిదుకాణములును, కల్లంగడులును, వేశ్యాగృహములును, ఎట్లు వెలివేయబడినవో-లేక వెలివేయబడవలెనో-అట్లే యస్పృశ్యులను కూడ వెలివేయవలెనన్న వాదము దురభిప్రాయమును తెలియజేయును. సంఘక్షేమమున కరిష్టదాయకమగుట వల్లను, కసాయి దుకాణములను కల్లంగడులను వేరుగానుంచవలెను. ఏహ్యమైన వృత్తిని అవలంబించుట వల్లను వేశ్యలను కూడ సంఘమునుండి వేరుచేయవలెను. కాని అస్పృశ్యులు చేయుపని మంచిదేకాక, సంఘక్షేమమునకు చాల అవసరము.

అస్పృశ్యులకు పరలోకసౌఖ్యముల నిరాకరించ లేద నుట వట్టి పొగరుబోతుతనము. ఈయస్పృశ్యతాపిశాచమిట్లే స్వేచ్ఛావిహారము సల్పవలెనని చెప్పువారికి పరలోకసౌఖ్యముల నిరాకరించునధికారమే యున్నచో- పరలోకములో కూడ పంచములను వేరుగా నుంచుదురనుటకు సందేహము లేదు.

గాంధివంటివాడు మాలవారిని ముట్టుకొనవచ్చునని యును, యితరులట్లు చేయరాదనియును చెప్పుట ప్రజల కన్నుల దుమ్ముకొట్టుటయే. అస్పృశ్యులకు సేవచేయుటకును, వారిని ముట్టుకొనుటకును, అస్పృశ్యతాక్రియలకు లొంగనివారు కావలెననుటలో నర్థమేమి? అస్పృశ్యత యంతటి అపాయకరమైన జాడ్యమా? ఈ యస్పృశ్యతను పాటించని మహామ్మదీయులకును, క్రైస్తవులకును ముందేమిగతి పట్టనున్నదో పరమేశ్వరునకే ఎరుకగాబోలు!

ఆకర్షణశక్తివాదమున కర్థములేదు. చాతుర్వర్ణ్యముల వారందరు కస్తూరివలె సుగంధులుకారు. అస్పృశ్యులనబడు వారందరును ఉల్లిపాయలవలె వాసనకొట్టరు. అగ్రవర్ణస్థులని చెప్పబడువారికంటె నెన్నియోరెట్లు మంచివారలు వేల కొలదిగ నస్పృశ్యులలో గలరు.

సుమారు అయిదుసంవత్సరములనుండి యస్పృశ్యతకు విరుద్ధముగా తీవ్రప్రచారము జరిగినప్పటికిని, ఆదురా

చారమును సమర్థించువా రింకనుండుట నాకు బాధకరముగ నున్నది. అది మంచిదను పండితు లున్నంత మాత్రమున నా కళంకము గౌరవ ప్రదమైనది కాజాలదు. కాని మనుష్యులు బుద్ధిమంతులును, సచ్ఛీలురును వట్టిపాండిత్యము సంపాదించి నంత నే కాజాలరని నిరాశ కలుగుచునది.



౭

క్రిందటి వారములో కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గ సమావేశము జరుగుచుండగనే, దేవాలయప్రవేశ సత్యాగ్రహసమస్య నుండి బయల్వెడలు అనేక ప్రశ్నలగురించి, కేరళరాష్ట్రప్రతినిధులతోను, యితరులతోను చాలసారులు సంభాషించితిని.

దేవాలయ ప్రవేశ సత్యాగ్రహము.

నాతో ప్రస్తావించినవారు ప్రశ్నోత్తరముల రూపమున తయారుచేసిన రిపోర్టును దిద్దుటకు బదులు, వారి ప్రశ్నలకు నాయుద్దేశముప్రకారము తగినవని యిచ్చిన జవాబుల నీక్రింద నిచ్చుచున్నాను. ప్రశ్నలను తిరిగి వ్రాయుట కవసరము లేకుండునట్లుగనే జవాబులు పొందుపరుప బడినవి.

(1). అస్పృశ్యతానివారణకు గొప్పరాజకీయప్రాముఖ్యతయున్నను- వాస్తవమున కది హిందువులచే పరిష్కరింపబడవలసిన ధార్మికసమస్య, యనుమాట తప్పక జ్ఞాపకముంచుకొనవలెను. దానికిగల ధార్మికప్రాముఖ్యత రాజకీయప్రాముఖ్యతను మరుగు పరచును. అనగా అస్పృశ్యతానివారణము సవర్ణులు చేయవలసిన ప్రయత్నములు ఎట్టి రాజకీయ పరిస్థితులకును లోబడి యుండరాదు. అందువల్ల నేడు దేశము నావరించిన విషమ పరిస్థితులను, అస్పృశ్యతానిర్మూలన ప్రయత్నముల కడ్డుపడనీయరాదు.

(2). న్యాయమును, ధర్మమునగు పనికొఱకు పోరాడునప్పుడు, సంస్కర్తలు కష్టములన్నిటికిని సిద్ధపడియుండవలెను. వారు తాత్కాలికముగా, అగ్రివర్ణములవారి సానుభూతిని గోల్పోవుటకు కూడ సిద్ధముగా నుండవలెను. ఈయస్పృశ్యత తక్షణమే నిర్మూలింపవలసిన మహాపాపమని నమ్మువారు, తాము కొలదిమందిగ నున్నను వెనుకంజ వేయరాదు.

(3). ప్రస్తుత మున్న పూజారులు, కట్టగట్టి దేవతార్చన చేయనిరాకరించిన తక్షణమే వారిస్థానే యితరులను నియోగింపవలెను. పూజారివంశములలోనుండి తీసివేసిన వారికి బదులు క్రొత్తవారు రాకపోయినచో, యితరకులములలోనుండి అర్హులైనవారి నాస్థానమున నియోగింపవలెను. కాని నాకు తెలిసినంతవరకు ప్రస్తుతమున్న పూజారులలో చాలభాగము దేవాలయముల నాశ్రియించుకొని బ్రతుకువారే. అందుచేత వారు చాలకాలము సమ్మెకట్టియుండలేరు. పూజారులుగా నుండుట వంశపారంపర్యావచ్చు వారైనను, నేచెప్పిన దానికడ్డము రాదు. ఆ హక్కుదారుడు తనపనిని వదలిపెట్టుకొనిపోయినచో, తన్ను తానే నిందించుకొనవలసి యుండును.

(4). దేవాలయాధికారులు, దేవాలయములలో నొక భాగమును అస్పృశ్యుల కొఱకు వేరుగావించెదమనినంతనే

అంగీకరింపరాదు. బ్రాహ్మణేతరహిందువుల కందరకు వర్తిం చని నిషేధములను అస్పృశ్యులవిషయమై సహింప వీలు లేదు. కాని అస్పృశ్యులతో కలియుట కంగీకరించని సవర్ణుల కొరకు దేవాలయములోని యొకమూలను ప్రత్యేకింప వచ్చును. అప్పుడా సవర్ణులు తమంతట తామే యస్పృశ్యుల గుచున్నారు.

(5). దేవాలయములోనికి అస్పృశ్యులు పోకుండుట కొరకు, కట్టిన అడ్డకట్లను మనము తోసివేయరాదు. అట్లు త్రోయుట యొకవిధమైన దౌర్జన్యమే యగును. అడ్డుకట్లు అచేతనము లనినంతమాత్రమున సరిపోదు. అవి యచేత ములైనను వాటిని కట్టిన చేతులు సచేతనములేకదా ?

(6). దేవాలయప్రవేశమునకై సత్యాగ్రహమొనర్చు వారి కాదేవాలయములందు భక్తి యుండవలెను. దేవా లయ ప్రవేశ మొక ధర్మవిధి. దేవాలయములందు నమ్మ కము లేనివారెవ్వరైనను యీ ఉద్యమములో పాల్గొనినచో అది సత్యాగ్రహమనిపించుకొనదు. "వైకం" సత్యాగ్ర హపురోజులలో శ్రీ జార్జి జోసఫ్‌గారు సత్యాగ్రహమొనర్చి, జైలునకు వెళ్ళినప్పుడు తప్పుపనిని చేసితిరని నే నాయనకు కబురు పంపితిని. ఆయన యది యంగీకరించి, తక్షణమే క్షమార్పణగోరి జైలునుండి బయటకు వచ్చెను. దేవాలయ ప్రవేశ సత్యాగ్రహము సవర్ణుడగు హిందువుడు కావించు

కొనవలసిన యొక ప్రాయశ్చిత్తవిధి. అతను పాపి. తోడి మతస్థులగు అస్పృశ్యులను తనతోపాటు దేవాలయములలోనికి తీసుకొనిపోవుటకు యత్నించినందువల్ల కలుగు శిక్ష ననుభవించుటయే యతడు గావించుకొనవలసిన ప్రాయశ్చిత్తము. కావున హిందువులు కానివారు సత్యాగ్రహమొనర్చు వారలకు నితరవిధముల సహాయమొనర్పవలెను. ఇందులకు నుదాహరణము—పంజాబులోని గురుద్వార్ సంస్కరణోద్యమసందర్భమున యితరసంఘము లన్నియు శిక్కుల కనేక రీతుల తోడ్పడెను. కాని అఖండపదమునందు నమ్మకముగల శిక్కులే సత్యాగ్రహమొనర్చిరి. సత్యాగ్రహ మొనర్పవలసినవారలు కూడ వారే.

నా ఉద్దేశములో నస్పృశ్యులొక్కరే దేవాలయ ప్రవేశసత్యాగ్రహ మొనర్పరాదు. సవర్ణులగు సంస్కర్తలు వారికి నాయకత్వము వహింపవలెను. అస్పృశ్యులు తమంత తామే సత్యాగ్రహమొనర్చు రోజులు ముందు ముందు రావచ్చును కాని యిప్పుడు మాత్రము నేను చెప్పినట్లే జరుగవలెను. సత్యాగ్రహము ప్రారంభించుటకు ముందు అస్పృశ్యతా నివారణవిషయమై సవర్ణులలో బాగుగా ప్రచారము జరిగియుండవలెను. సత్యాగ్రహము-జయమునందుటకు ప్రజాభిప్రాయముమీదనే ఆధారపడియుండునట్టి ఆయుధము. అందుచేత దీనిని యుపయోగించుటకు ముందు- మామూలు పద్ధతులతో యభీష్టసిద్ధినొందుటకు ప్రయత్నించి యుండవలెను.

(7). ప్రైవేటు దేవాలయములలోనికి ప్రవేశముకలుగుటకై సత్యాగ్రహమొనర్పరాదు. కాని యట్టి దేవాలయ

ములలోనికి అస్పృశ్యులను దక్క తదితరుల నందర రానిచ్చి నచో నవి "ప్రైవేటు" దేవాలయములనిపించుకొనవు. "పబ్లిక్ దేవాలయములే" యగును.

(8). దేవాలయప్రవేశమునకు సత్యాగ్రహమొనర్చుట మానుకొని శాసనముల ద్వారా కార్యసాధన గావించుకొనవలసినదని కొందరు సూచించిరి. దానిని నేనంగీకరింప జాలను. ఏలనన ప్రజాస్వామిక ప్రభుత్వములో, శాసననిర్మాణము ప్రజాభిప్రాయముమీదనే ఆధారపడియుండును. ప్రజాప్రబోధమును సత్వరముగ కలుగచేయుటకు సత్యాగ్రహమును మించిన సాధన మింకొకటిలేదు సత్యాగ్రహ మొనర్చుటకు తగిన సమయమెప్పుడో స్థానిక కాంగ్రెసు సంఘములే నిర్ణయించుకొనవలయును.

(9). అస్పృశ్యతాసంబంధమైన విషయములలో హిందువులు కానివారుకూడ ఓటుజేయవచ్చునని కొందరు వాదించుచున్నారు వారిని 1920 సంవత్సరములో నాగపురమున నిర్మించిన నూతనకాంగ్రెసు విధానములోని మొదటితీర్మానమును చూడగోరెదను. అందులో అస్పృశ్యతానివారణ విషయము హిందువుల కొక్కరికే సంబంధించినదని స్పష్టముగా వివరింపబడినది. కావున హిందువులుకానివారు యీ సమస్యావిషయమై ఓటుచేసిగాని, మరి యితరవిధముల గాని జోక్యము కలిగించుకొనరాదను ఆచారము ఏర్పడినది.

---

# హరిజనసమస్య.

## తృతీయ ఖండము.

---

౧

"ఇంకొక్క మాట చెప్పిముగించెదను. అస్పృశ్యులనబడు వారినిగుఱించి, తక్కిన అల్పసంఖ్యాకసంఘములవారు కోరు కోరికలను నే నర్థముచేసికొనగలను.

శపథము.

కాని అస్పృశ్యులపక్షమున కోరబడిన హక్కులు నాకమితబాధను కలుగజేసినవి. నాహృదయమున కొక దారుణాఘాతము తగిలినట్లైనది. ఆకోరికలు అంగీకరింపబడినచో, అస్పృశ్యులకును తదితర హిందువులకును మధ్యదుష్టమును, అరిష్టదాయకము నగుశాశ్వతవిభేద మేర్పడిపోవును.

భారతీయ స్వాతంత్ర్య సంపాదనార్థమైనను సరే-అత్యంతావశ్యకములగు వారిహక్కుల నమ్మివేయుటకు నేనంగీకరింపజాలను. అస్పృశ్యులలోని యధికసంఖ్యాకులకు వ్యక్తిగతముగా నేను ప్రతినిధినని చెప్పగలను. ఇప్పుడు నేను కాంగ్రెసుప్రతినిధిగ నే మాట్లాడుటలేదు. నాపక్షమున కూడ మాట్లాడుచున్నాను. ఈవిషయమై ఓట్లు పుచ్చుకొని

నచో అస్పృశ్యులకు నాయందు నమ్మకమున్నదని తేలునని యును, మిగతవారందరికంటెను నాకే యెక్కువ ఓట్లు వచ్చుననియును ఘంటాపథముగ చెప్పగలను. దుష్టమగు నీ భేదభావమును నశింపజేయుటకు ప్రత్యేకనియోజక వర్గము లుగాని, వారికి శాసనసభలో కొన్నిస్థానముల ప్రత్యేకించుటగాని సరియగు ప్రతిక్రియకాదని ఆసేతుహిమాచల పర్యంతము తిరిగి ప్రచారముజేసి, అస్పృశ్యులకు నచ్చ చెప్పెదను.

ఈ యస్పృశ్యత అస్పృశ్యులకుగాక సవర్ణులకు తలవంపులు కలుగజేయు మహాకళంకమని నమ్ముచు, దానిని రూపుమాపుటకు బద్ధకంకణులగు సంఘసంస్కర్తలు భారతదేశములో నేడనేకులు గలరు. ఆవిషయ మీయల్పసంఖ్యాకసంఘమును, యితరప్రపంచమంతయును గుర్తింతురుగాక. అస్పృశ్యులొక ప్రత్యేకతెగగా జనాభాలెక్కలలోను మరియితర చోట్లను వ్రాయబడుట మాకెంతమాత్రమును యిష్టము లేదు. శిక్కుల నొక్కప్రత్యేకతెగగా శాశ్వతముగా నుండనిండు. ముసల్మానులు, యూరోపియనులు కూడనుండిన నుండనిండు. కాని అస్పృశ్యులు శాశ్వతముగా నస్పృశ్యులవలెనే యుండగోరెదరా? ఈ యస్పృశ్యతాకళంక మిట్లుండుటకంటె హిందూధర్మము నశించిన మేలు!

డాక్టరు అంబేద్కరుగారనిన నాకమితగౌరవము కలదు. అస్పృశ్యులున్నతస్థితికి రావలెనని ఆయన కోరుచున్నారని నాకు తెలియును. ఆయనసామర్థ్యమునందు కూడ నెంతయో గౌరవముకలదు. అయినను యీవిషయమునందాయన చాలపొరబడుచున్నారని నే చెప్పకతప్పదు. వారికి కలిగిన కష్టానుభవములు బహుశః వారివివేచనాశక్తిని తాత్కాలికముగ కప్పివైచినవేమో! ఇట్లు చెప్పుట నాకు చాలకష్టముగనే యున్నదిగాని చెప్పకున్నచో నాకు ప్రాణతుల్యులగు అస్పృశ్యులయెడల మహాద్రోహ మొనర్చినవాడనగుదును. ప్రపంచాధిపత్యముకొరకైనను సరే వారిహక్కులను వదలజాలను. డాక్టరు అంబేద్కరుగారు తాము భారతదేశములోని యస్పృశ్యుల యావన్మందిపక్షమున మాట్లాడుచున్నామని చెప్పిరి. కాని వారుచెప్పినది సరికాదు. ఇట్లుచెప్పుటలో నా బాధ్యతను గుర్తెరింగియే చెప్పుచున్నాను. దీనివల్ల హిందూధర్మములో శాశ్వతములగు విభేదములు పుట్టగలవు. అట్లుపుట్టుట నాకెంతమాత్రమును యిష్టము లేదు.

అస్పృశ్యులు యిస్లాము, క్రైస్తవమతధర్మముల స్వీకరించినను నాకభ్యంతరము లేదు. నే నదిసహింపగలను. కాని స్పృశ్యులు, అస్పృశ్యులును రెండువిభాగములుగూడ ప్రతిగ్రామమునందును శాశ్వతములైనచో హిందూధర్మమునకు కలుగబోవు దుర్గతిని నేను సహింపజాలను. అస్పృశ్యుల రాజ

కీయహక్కులనుగురించి మాటలాడువారు, భారతదేశము నెరుంగరు. భారతదేశపు సంఘవ్యవస్థను గురించి యెరుగరు. కావున నేనొక్కడనే యైనను సరే- అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గము లొసంగబడకుండ, ప్రాణార్పణమొనర్చియైనను నిరోధించెదనని ముమ్మాటికిని త్రికరణశుద్ధిగా నొక్కి చెప్పుచున్నాను."

ఇది అల్పసంఖ్యాకోపసంఘతుదిసమావేశమున మహాత్ముడొసంగిన యుపన్యాసములోని కడపటిభాగము

భారతదేశమునకు స్వరాజ్యము వచ్చుటకు దేశమునందలి వివిధసంఘముల నడుమనుగల భేదభావము లొకముఖ్యాటంకముగ పరిణమించినవి. మహాత్ముడు రెండవరౌండు టేబిలు సమావేశమున కింగ్లండునకు పోవుటకుముందే వివిధసంఘముల మధ్య సమాధానము కుదిర్చి సాంఘికసమస్యను పరిష్కరింపవలెనని ప్రయత్నించెను. అప్పుడు హిందూ, ముసల్మాను, శిక్కులకే రాజీకుదుర్చుట ప్రధానసమస్యగనుండెను. ముసల్మానులలోకూడ రెండుపక్షము లేర్పడెను. ఒకపక్షము- ప్రత్యేకనియోజకవర్గములు నామోదించుచు, ముసల్మానులు తమ హక్కులను సంరక్షించుకొనజాలరని వాదించునది. రెండవపక్షము- సంయుక్తనియోజకవర్గముల నామోదించుచు, ప్రత్యేకనియోజకవర్గములు భారతజాతీయతను సడల్చివైచుననియు, మతకక్షలకు తావిచ్చుననియును భావించునది.

మహాత్ము డీరెండుపక్షములవారిని కలిసికొని ఆ రెండుపక్ష ములవారు నేదోయొకసమాధానమునకువచ్చి తమకోరికలను చెప్పినచో వానిని కాంగ్రెసు యంగీకరించగలదని వారికి వాగ్దానమొసంగెను. కాని యట్టిదేదియును జరుగలేదు.

రెండవరౌండుటేబిలు సమావేశమునందు సాంఘిక సమస్య కత్యధికప్రాముఖ్యత యొసగబడెను. ఈసమస్య పరి ష్కరింపబడిననేగాని భారతీయ రాజ్యాంగవిధాననిర్మాణ మసంభవమని ప్రభుత్వమువారు చెప్పిరి. కొందరుముసల్మా నులుకూడ భేదోపాయమునకు లోబడినవారై యదియే ము ఖ్యావసరమని తేల్చిరి. రౌండుటేబిలు సభ్యులలో చాలమం ది వలదనుచున్నను యీారంగమంతట అల్పసంఖ్యాకోపసంఘ మునకు మార్చబడెను. బ్రిటిషుప్రధానమంత్రియగు మాక్డ నాల్డుగారు దానికధ్యక్షులు. ఆయన యీాఉపసంఘసమా వేశప్రారంభముననే- భారతీయులు సహాకారబుద్ధితో వ్యవ హారించుకొని సాంఘికసమస్యను పరిష్కరించుకొనవలసినదని యును వారట్లు గావించుకొనజాలకపోయినచో బ్రిటిషుప్ర భుత్వమువారలే పరిష్కరింపవలసివచ్చుననియును చెప్పివై చెను. ప్రత్యేకసంఘాభిమానమే యొకయర్హతగా పరిగణిం చి ప్రభుత్వమువారిచే రౌండుటేబిలుప్రతినిధులుగా నియ మింపబడిన సాంఘికపక్షపాతులందరును బహిరంగముగ ను పసంఘసమావేశములో చర్చలకుగడంగి ప్రపంచముముందు

-ర నగు బాట్లపాలగుట సహింపజాలక మహాత్ముడంతట వివిధ సంఘముల సభ్యులను కలిసికొని యొండొరులతో సంప్రతిం చుకొని యొక యొడంబడికకు వచ్చుటకు వీలగునట్లు ఉపసం ఘసమావేశమును కొన్నిదినములు నిలుపవలసినదని కోరుచు ప్రతిపాదన మొనర్చెను. అదియందరచే నంగీకరింపబడెను.

సాంఘికసమస్యా పరిష్కారమునకు వివిధసంఘముల ప్రతినిధులందరు కలిసికొని రహస్యముగ చర్చించుట మొద -లిడిరి. ఈసమావేశములకు మహాత్ముని యాధ్యక్షునిగానుండ వలెనని యితరప్రతినిధులడిగిరి. ఆయనయందులకంగీకరించి ఓపికతోడను చాకచక్యముతోడను సమావేశములను నడ పించెను. కాని సమస్య తీవ్రతరరూపము దాల్చినది. ఇదివర కువలె ముసల్మానులు శిక్కుసంఘము లేకాక మిలిగిన యల్పసం ఖ్యాకసంఘములవారందరును ప్రత్యేకనియోజకవర్గములను, కమతము జనాభానుసరించి శాసనసభలలో వచ్చుస్థానము లకంటె నెక్కువస్థానములను కోరదొడగిరి. మహాత్ముడు వివిధసంఘనాయకులతో సంప్రతించి సమాధానమును కుదు ర్చుటకై శక్తివంచనలేక ప్రయత్నించెను. కాని లాభములేక పోయినది. అల్పసంఖ్యాకసంఘములలో నెవ్వరును పట్టినపట్టు వీడకుండిరి. ఇంతకును బ్రిటిషుప్రభుత్వమువారు భారతీయు లకు ప్రసాదింపబోవునది యేదియో తెలియచేయనే లేదు.

అట్టిసందర్భములలో నిమ్నజాతులకుకూడ శాసనసభలలో కొన్ని స్థానములు ప్రత్యేకింపబడవలెనని మహాత్మునకు వారిపక్షమువారు తెలియజేసిరి. ఇతరసంఘములవారంగీకరించినచో తనకభ్యంతరములేదని ఆయనచెప్పెను. కాని హిందూమహామ్మదీయ శిక్కు-సంఘములవారు "మాకధికస్థానములు కావలెను- మాకధికస్థానములుకావలెను" అనియనుచుండగా నిమ్నజాతులవారికొరకు ప్రత్యేకించుటకు స్థానములెక్కడనుండి రాగలవు?

అంతట నిమ్నజాతులసభ్యులుకూడ తదితర యల్పసంఖ్యాకసంఘములలో చేరిరి. ప్రత్యేకనియోజకవర్గములుండవలెననియును, శాసనసభలలో నాయాసంఘములవారికి స్థానములు ప్రత్యేకింపబడవలెనను మూలసిద్ధాంతములపై నాధారపరచి, వారందరును కలసి యొకయొడంబడికను చేసికొనిరి. దానిని "అల్పసంఖ్యాకుల యొడంబడిక" యందురు. అల్పసంఖ్యాకసమస్యాపరిష్కారమున కేర్పడిన యుపసంఘము బ్రిటిషు ప్రధానమంత్రి యధ్యక్షతక్రింద క్రీ. శ. 1931 సంవత్సరము నవంబరు 13 వ తేదీని సమావేశమైనప్పుడు మాగ్డనాల్డుగారాయొడంబడిక నంగీకారసూచకముగ నుపన్యసించినంతనే మహాత్ముడు హిందూసంఘమును చీల్చి రెండుభాగములచేసి తమప్రభుత్వమును శాశ్వతమొనర్చుకొనుటకై నిమ్నజాతులకుకూడ ప్రత్యేకనియోజకవర్గము లొసంగుట కంగీకరించిన

బ్రిటిషురాజకీయతంత్రజ్ఞుల యెత్తులు గ్రహించి అల్పసంఖ్యాకుల యొడంబడికను తీవ్రముగా విమర్శించుచు మహోపన్యాసము గావించెను. అందులో నస్పృశ్యులకు సంబంధించిన కడపటిభాగ మీప్రకరణప్రారంభమున నుదహరింపబడెను.

తుదకు వివిధసంఘములవారందరును సాంఘిక సమస్యను పరిష్కరించమని కోరుచు మాగ్డనాల్డుగారికి విజ్ఞాపనలంపిరి. తన కిష్టములేనప్పటికిని భారతదేశశ్రేయస్సును కాంక్షించు వాడగుటచే యాభారమును తనమీదవైచుకొనుచున్నానని చెప్పుచు మాగ్డనాల్డుగా రందులకు సమ్మతించిరి. కాంగ్రెసు ప్రతినిధియగు మహాత్ముడు మాత్ర మావిజ్ఞాపనలలో చేరలేదు.

---

౨

భారతీయుల యాదర్శములను, ఆశయములను, ప్రపంచమంతకును వెల్లడించిన "రొమెయిన్ రోలెండ్" మున్నగు మహాపురుషుల దర్శనము గావించుకొని, మహాత్ముడు క్రీ. శ. 1931 డింశంబరు 28 వ తేదీని బొంబాయి పట్టణమును చేరెను. భారతకాంగ్రెసు కార్యనిర్వాహక వర్గ సమావేశమా నెల 31 వ తేదీని బొంబాయిలోనే జరుగుటకు నిశ్చయింపబడెను. ఆసమావేశములోనే సంస్థానాధీశులకును, వాణిజ్యరక్షణలకును సంబంధించిన విషయములను త్వరలో తేల్చుకొని గాని, లేక వాటిని పరిశోధించి నివేదించుటకు తగినవారల నేర్పాటుచేసి కాని, తన లండను యుపన్యాసములో చెప్పిన దానికనుగుణ్యముగ, తక్షణమే, ప్రత్యేకనియోజకవర్గములకు విరుద్ధముగా -అందున ముఖ్యముగా-నస్పృశ్యులకవి యుద్దిష్టదాయకములని మహాత్ముడు ప్రచారముసేయ సంకల్పించుకొనెను. కాని విధి యన్యథా యొనరించెను. మహాత్మునికి వెల్లింగ్డనుప్రభువు బెంగాలు ఆర్డినెన్సు మున్నగు వాటి నన్నిటిని గూర్చి చర్చించుటకు దర్శనమీయ నిరాకరించెను. తత్ఫలితముగా, కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము, ఆత్మరక్షణార్థము, శాసనోల్లంఘనోద్యమమును తిరిగి ప్రారంభింపవలసినదని భారతీయుల నందరను హెచ్చరించుచు తీర్మానమును గావించెను. ఆతీర్మా

ఉత్తరప్రత్యుత్తరములు.

నమును మహాత్ముడు రాజప్రతినిధికంపుచు, ప్రభుత్వమువారు తమపద్ధతులను మార్చుకొనినచో ఆతీర్మాన మమలులోనికి రాకుండపోవునని తంతిబంపెను. కాని ఫలితము లేక పోయినది. 1932 సం॥ జనవరి 4 వ తేదీ అర్ధరాత్రమున మహాత్ముని నిర్బంధించి ప్రభుత్వమువారాయనను యరవాడజైలులో రాజకీయ ఖైదీగా నుంచిరి.

అక్కడ జైలుకొట్టులో కూడ మహాత్ముడు అస్పృశ్యుల సమస్యను, ప్రత్యేకనియోజకవర్గముల విషయమును మరచిపోలేదు. ఇంతలో 'లోథియన్' సంఘము భారతీయులకు ఓటుహక్కు నొసంగుటకు నియమము లేవియుండవలెనో ప్రజలలో నెందరకు ఓటుహక్కు నొసంగవలెనో యను విషయములపై నివేదికను తయారుచేయుటకు భారతదేశసంచారము చేయమొదలిడెను. 1932 సం. మార్చి నెల ప్రారంభమునాటికా సంఘము తనపనిని చాలవరకు పూర్తిచేసెను. ఆసంఘ నివేదికయందిన వెంటనే మాక్డొనాల్డుగారు సాంఘికసమస్య విషయమై ప్రభుత్వనిర్ణయమును ప్రకటింతురని గ్రహించి తన సహచరులమాటలనుకూడ పెడచెవినిబెట్టి అంతర్వాణి ప్రబోధించుటచే మహాత్ముడు 1931 సం. మార్చి 11 వ తారీఖున సర్ శామ్యూల్ హోరుగారికి క్రిందివిధమున లేఖవ్రాసెను.

ప్రియమైన సర్ శామ్యూల్ హోర్ గారికి.

రౌండుటేబిలు సమావేశములో అల్పసంఖ్యాక సంఘములవారలు తమకు కావలసిన దిదియని నిరూపించి చెప్పి, నప్పుడు నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గము లొసంగబడకుండ నాప్రాణములర్పించియైన నిరోధించెదనని నాయుపన్యాసాంతమున చెప్పినసంగతి మీకు జ్ఞాపకమున్నదనుకొందును. అది తాత్కాలికోద్రేకము వల్లగాని ఉపన్యాసధోరణిలోపడి కాని చెప్పినది కాదు. అట్లుచేయనిశ్చయించుకొని చెప్పినమాటయే

దానిప్రకారము భారతదేశమునకు వచ్చిన పిమ్మట, ప్రత్యేక నియోజక వర్గములకు విరుద్ధముగా—కనీసము నిమ్నజాతులకైనను అవియుండకూడదని ప్రజలలో ప్రబోధము గావింపనెంచితిని. కాని విధి యన్యథా తలంచెను.

బ్రిటిషుప్రభుత్వమువారు తమ సాంఘికసమస్యాపరిష్కారము నేక్షణమునందైన ప్రకటింపవచ్చునని నాకు చదువుటకు యిచ్చుచున్న పత్రికలవలన తెలియుచున్నది. ఆపరిష్కారమునందు నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గములియ్యబడినచో నాప్రతిజ్ఞ నెరవేర్చుకొనుటకు తగిన చర్య నప్పుడు తీసికొనవలెనని తలంచితిని. కాని బ్రిటిషుప్రభుత్వమునకు ముందు తెలుపకుండ నేనట్లుచేయుట న్యాయముకాదనుకొనెదను. నేనిచ్చునంతవిలువ నామాటకు ప్రభుత్వమువారిచ్చియుండక పోవచ్చును. అదిసహజమేయగును.

నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గము లిచ్చుటకు నాకుగల యభ్యంతరములనన్నిటి నిక్కడ చెప్పబోను. వారిలోనొకనిగనే నన్ను నేను భావించుకొనుచున్నాను. వారిసంగతికిని యితరులవిషయమునకును చాలభేదము కలదు. శాసనసభలలో వారికి ప్రాతినిధ్యముండకూడదని నే ననుట లేదు. అంతియగాక చదువుతోగాని ఆస్తితోగాని, నిమిత్తము లేకుండగనే వారిలో యుక్తవయస్సువచ్చిన ప్రతిస్త్రీయును ప్రతిపురుషుడును ఓటరులజాబితాలో చేర్చబడుటకు నేనంగీకరింతును. ఇతరులు ఓటునిచ్చు నర్హతపొందుట కెట్టికఠినతర నియమములున్ననునరే! కేవలము రాజకీయదృష్టితో చూచిననెట్లు కనుపించినను, నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గములిచ్చినచో నది హిందూధర్మమునకును వారికినికూడ నపాయకరమనియే నానమ్మకము. ప్రత్యేకనియోజకవర్గములవల్ల నిమ్నజాతులకెంత హానికలుగునో తెలిసికొనవలెనన్నచో వారు తదితర హిందువులపై నెంతయాధారపడియున్నారో, వారిలో నెట్లు కలిసిపోయి యున్నారో గ్రహించినచాలును. హిందూ ధర్మముమాట విచారించినచో ప్రత్యేకనియోజకవర్గములు దానిని ఛిన్నాభిన్నముచేసివేయును. నాకు సంబంధించినంతవరకు మాత్రము నిమ్నజాతుల సమస్య ధార్మిక, నైతిక సమస్యయే. ఈసమస్యకుగల రాజకీయప్రాముఖ్యత గొప్పదైనను ధార్మిక నైతిక ప్రాముఖ్య

ములమందర నది మరుగుపడిపోవును. నా బాల్యమునుండి యును నేను వీరి బాగోగుల విషయమెంతయో శ్రద్ధవహించి అనేక సమయములయందు వీరికై నాసర్వస్వమును ఫణముగా నొడ్డితినన్నమాట తెలిసినచో యీసందర్భమున నాయభిప్రాయముల బాగుగా నర్థముచేసికొనగలరనుకొందును. ఇది నేను గొప్పకొరకు చెప్పుచుండుటలేదు. అనేకశతాబ్దములనుండి నిమ్నజాతుల నిట్టినీచదశలో త్రోసియుంచినందులకు సవర్ణ హిందువు లెట్టి ప్రాయశ్చిత్తము గావించుకొనినను సరిపోదు. కాని నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గము లొసంగినచో నవి సవర్ణుల పాపములకు తగిన ప్రాయశ్చిత్తము కాజాలదు నిమ్నజాతులు పడుచున్న దుర్భరకష్టపరంపరలనుండి వారిని గట్టెక్కింప జాలవు.

కావున నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గముల నొసంగ ప్రభుత్వమువారు నిశ్చయించినచో నే నామరణాంతముపవాసమొనర్చెదనని సగౌరవముగ తెలియజేయుచున్నాను.

రాజకీయఖైదీగా నున్నప్పుడు నే నిట్టిచర్యకు గడంగినచో నది ప్రభుత్వమును చాలచిక్కుల పాల్చేయునని నాకు తెలియును. అది నాకు కష్టముగనే యున్నది. వెర్రిగనో లేక యంతకంటె నధమముగనో కన్పడు నట్టి పద్ధతులను నావంటివాడు రాజకీయములందు ప్రవేశపెట్టుట అనుచితమని కొం

దరు భావింతురనికూడ నేనెరుంగుదును. వారికి జవాబుగ నాపక్షమున నేను చెప్పునదొక్కటే. అది నేచేయబోవు పని. విడరాని సంబంధముగల ధర్మకార్యమేకాని యేదోయొక వెత్తు కాదనియే! అందులకు నాయంతరాత్మ ప్రేరేపించుచున్నది. దాని నుల్లంఘింపజాలను. దీనివల్ల బుద్ధిమంతుడనని నాకున్న కొంచెము పేరుకూడ పోయినను సరే!

నేను చూడగలిగినంతవరకు, నన్ను జైలునుండి విడిచినను ఉపవాసమొనర్పవలసిన నావిధి యణుమాత్రము తగ్గజాలదు. అయినప్పటికిని నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గము లేర్పరుప బ్రిటిషుప్రభుత్వమున కుద్దేశమే లేదనియును నేననవసరముగా భయపడుచున్నాననియును తేలునని నేను ఆశించుచున్నాను.

నన్నిన్నిరోజులనుండి కలతపెట్టుచున్న మరియొక విషయమును గురించికూడ బహుశః చెప్పుటవసర మనుకొందును. అదికూడ నన్నిట్టి వ్రతదీక్షకు పురిగొల్పునేమో! అది ప్రస్తుతము దేశములో చెలరేగుచున్న నిర్బంధవిధానవిషయమే. నాకదెప్పుడు సహింపజాలనిదై పోవునో, అది నన్నెప్పుడీ త్యాగమునకు ప్రేరేపించునో చెప్పజాలను. నిర్బంధవిధానము శ్రుతిమించిపోవుచున్నది. ప్రభుత్వదౌర్జన్యము దేశమునావరించుకొనిపోయినది. బ్రిటిషుయుద్యోగస్థులు భారతీయోద్యోగస్థులును పశుతుల్యులైపోయిరి. ప్రజాద్రోహులై రక్తబంధు

వులగు దేశీయుల యెడల సమానుమమునగ ప్రవర్తించిన భారతీ యోద్యోగులను ప్రభుత్వము వారు ఘనకార్యములొనర్చిరని మెచ్చుకొనుచున్నారు. తత్కారణమున చిన్నపెద్దలను తారతమ్యము లేకుండ నాయుద్యోగులెల్లరు అవినీతిపరులైపోవుచున్నారు. ప్రజలన్నను భయోద్భ్రాంతులగుచున్నారు. వాక్స్వాతంత్ర్య మరికట్టబడినది. న్యాయము పేరను, శాసనముల పేరను 'గుండా' రాజ్యము కొనసాగింపబడుచున్నది. దేశసేవకు పూనుకొనిన స్త్రీలకు మానభంగమగు నన్నభయము కలుగుచున్నది.

ఇదంతయును దేశమునందు బయల్వెడలినట్టియును కాంగ్రెసునందు మూర్తీభవించినట్టియును స్వాతంత్ర్యము నణచివేయుటకే ప్రయోగింపబడినదని నాకు తోచుచున్నది. సామాన్యముగా నమలులోనున్న శాసనముల నుల్లంఘించిన వారిని శిక్షించుటతో నిర్బంధవిధానమాగుట లేదు. చాలవరకు తమ్మవమాన పరచుటకొరకే యుద్దేశింపబడినట్టియు, నిరంకుశాధికారులు చేసినట్టియు నూతనశాసనములను భంగమొనర్చుటకు ప్రజలనీవిధానమే ప్రేరేపించుచున్నది.

బ్రిటిషువారి యీకృత్యములలో నాకు ప్రజాస్వామిక చిహ్నము లేవియును గోచరించుట లేదు. నిజమునకు మీప్రజాస్వామికము పట్టిపేరునకుమాత్రమే యనియును, అదియైనను మీకు సంబంధించినంతవరకే యనియును నాకుపూర్వ

మున్న యభిప్రాయము మొన్నటి నాయింగ్లాండు యాత్రవల్ల ధృవపడినది. 'పార్లమెంటు' ప్రమేయము లేకుండగనే కొందరు వ్యక్తులలోను ప్రత్యేకసంఘములలోను ఎంతో ప్రాముఖ్య విషయములనైన నిర్ణయింతురు. తామేమిచేయుచుంటిరో సరిగా నెరుంగకయే పార్లమెంటుసభ్యులు ఆనిర్ణయముల నామోదింతురు. ఈజిప్టువ్యవహారమిట్లే జరిగినది. 1914 సం. నాటియుద్ధవిషయముకూడ నింతే. ఇప్పుడు భారతదేశ విషయముకూడ నట్లే జరుగుచున్నది. ప్రజాస్వామికమని చెప్పబడుదానిక్రింద ఒకప్రాచీనజాతికి చెందిన ముప్పదికోట్లకు మించిన ప్రజలయందరిభవిష్యత్తు నిర్ణయించి, మహామారణ శక్తుల వినియోగించి ఆనిర్ణయమును కొనసాగించుకొనుట కొకవ్యక్తికి నిరంకుశాధికారమున్నదనుమాట తలంచుటకే నాయంతరాత్మ కంటగించుకొనుచున్నది. నాకుమాత్రమిది ప్రజాస్వామికమునకు పూర్తిగా విరుద్ధమనియే తోచుచున్నది.

భారతీయులకును యాంగ్లేయులకును నడుమ నిదివరకే ద్వేషభావములు పుట్టినవి. ఈనిర్బంధవిధానమింకను కొనసాగింపబడినచో నాద్వేషభావములు పెచ్చుపెరిగి పోవును. నాకుశక్తియున్నంతవరకును, నాకు సంబంధించినంతవరకును వీనినరిగట్టుటెట్లు? శాసనోల్లంఘన మాపుట వల్ల కాదు. అదినాజీవిత సూత్రములలో నొకటి. స్వభావమువల్లనే నేను ప్రజాస్వామికవాదినని నావిశ్వాసము. నాభావన

లో నున్న ప్రజాస్వామికమునకును తమనిర్ణయముల కొనసాగించుకొనుట కెవ్వరైన పశుబల ప్రయోగమొనర్చు పద్ధతికిని చుక్కెదురు. పశుబలము పయోగించుట యొట్టిసందర్భములయందైనను న్యాయమును అవసరమునగునో ఆసందర్భములయందు దానికి మారుగా నుపయోగింపబడుటకే సత్యాగ్రహము కల్పింపబడినది. సత్యాగ్రహమన్ననో కష్టములను కోరి తెచ్చుకొనుటయే! ఒక్కొక వేళ సత్యాగ్రహి ఆమరణాంత ముపవాస మొనర్పవలసివచ్చును. నాకింక నట్లొనర్పవలసినకాలము రాలేదు. అట్టిచర్యకు కడంగుమని నాయంతరాత్మ నన్నింకను త్వరపెట్టుటలేదు. కాని దేశములో జరుగుచున్న సంగతులు నన్నును, నాయాత్మను కలంచివైచుచున్నవి. కాబట్టి నిమ్నజాతుల విషయములో నుపవాస మొనర్తునని మీకు వ్రాయునప్పుడు యీవిషయమైకూడ త్వరలో నింకొకయుపవాస మొనర్ప నవసరమగునేమోయని మీకు చెప్పకున్నచో మీ కన్యాయము చేసినవాడనగుదునని నేభావించితిని.

మీతో జరుపుచున్న యుత్తరప్రత్యుత్తరముల సంగతి పూర్తిగా రహస్యముగనుంచితినని వేరుగ చెప్పనక్కరలేదనుకొందును. మొన్నమొన్న నాకడకువచ్చిన సర్దారువల్లభాయ్ పటేలు, మహాదేవదేశాయిగా ర్లిదియెల్ల నెరుంగుదురు.

ఈయుత్తరమును మీయిష్టమువచ్చినరీతి నుపయోగించుకొనవచ్చును.

మీవిశ్వాసపాత్రుడు,
మో. క. గాంధి.

సర్ శామ్యూల్ హోరుగారికి.
వైట్ హాల్, లండను.

*  *  *  *  *  *

ఇందులకు హోరుగారు 1932 సం॥ ఏప్రియల్ 13 వ తారీఖున నీక్రిందిప్రత్యుత్తర మొసంగిరి.

ప్రియమైనగాంధిగారికి,

మార్చి 11 వ తేదీనాటి మీయుత్తరమున కిదిజవాబుగ వ్రాయుచున్నాను. నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గము లొసంగుటనుగూర్చి మీయభిప్రాయతీవ్రతను సరిగా నర్థముచేసికొంటినని ముందే చెప్పనిందు. ఈవిషయములో నెట్టిపరిష్కారము గావింపబడినను, అది యా విషయము యొక్క మంచిచెడుగులను బట్టియే యుండునని మాత్రము చెప్పగలను. లోధియనుసంఘమువారి సంచార మింకను పూర్తి కాలేదనియును, ఆసంఘనిర్ణయములు మాకు తెలియుట కింకను కొంతకాలముపట్టుననియును మీకే తెలియును. ఆసంఘనివేదిక మా కందినపిమ్మట వా రొసంగెడుసలహాలను గురించి జాగ్రత్తగా నాలోచింపవలెను. దానితోపాటు మీ

రియొక్కయు మీతో నేకీభవించువారియొక్కయు నభిప్రాయములను జాగ్రత్తగా చూచియేగాని మాపరిష్కారమును తెల్పము. మీరు మేమున్నస్థితిలో నున్నచో సరిగా మేము నడచుకొనుచున్నట్లుగనే నడచుకొందురనియే నా నమ్మకము. మీరు ఆసంఘనివేదిక వచ్చువరకును వేచియుండి దానిని విమర్శనబుద్ధితో చదివి యీవివాదమునకుండు యిరుపక్షముల వారి యభిప్రాయములను గుర్తించుకొనియే ఒకనిర్ణయమునకు రాగోరెదను. ఇంతకంటె నధికమేమియును చెప్పజాలను, చెప్పవలెనని కూడ మీ రనుకొన రనుకుందును.

ఇక యార్డినెన్సులు విషయమునుగురించి నే నిదివరకు బహిరంగముగాగాని, ప్రైవేటుగాగాని చెప్పినదానినే మరల చెప్పెదను. శాసనబద్ధమగు ప్రభుత్వముయొక్క పునాదులనే త్రవ్వివేయుప్రయత్నములు జరుగుచున్నందున ఆర్డినెన్సులను ప్రయోగించుటవసరమనియే నానమ్మకము. భారతప్రభుత్వమువారుగాని, రాష్ట్రీయప్రభుత్వములవారుగాని తమకున్న యపరిమితాధికారములను దుర్వినియోగము చేయుటలేదని నానిశ్చితాభిప్రాయము. మీదుమిక్కిలి వారట్టిదురాగతములు జరుగకుండ సర్వవిధముల ప్రయత్నించుచున్నారు. ధర్మమును న్యాయమును, శాంతిని, భయోత్పాతవాదులబారినుండి మా యుద్యోగులను, సంఘములోని యితర తరగతులవారిని రక్షిం

చుట కెంతకాల మీప్రత్యేకాధికారము లవసరముండునో, అంతకంటె నొక్కక్షణమైనను వాటి నమలులోనుంచము.

ఇట్లు,
మీవిశ్వాసపాత్రుడు,
శామ్యూల్ హోర్.

మో. క. గాంధిగారికి.

* * * * *

క్రీ. శ. 1932 సం॥ ఆగస్టు 17 వ తేదీని, బ్రిటిషుప్రధానమంత్రి యగు మాగ్డనాల్డుగారి సాంఘికపరిష్కారము ప్రకటింపబడెను. ఆపరిష్కారములో నిమ్నజాతులవారికి 20 సంవత్సరములవరకు ప్రత్యేకనియోజకవర్గము లొసంగుటతోపాటు రాష్ట్రీయశాసనసభలలో 71 స్థానముల ప్రత్యేకించి తదితరహిందువులతో కలసి సామాన్యనియోజకవర్గములకు కూడ పోటీచేయుటకు హక్కుయొసంగబడినది. ఆపరిష్కారమును భారతదేశమెల్ల గర్హించినదని వేరుగచెప్పనక్కర లేదు. మహాత్ముడు తక్షణమే తన కర్తవ్యమును నిర్ణయించుకొని మాగ్డనాల్డుగారికి ఈక్రింది లేఖను వ్రాసెను.

ప్రియమిత్రమా!

నిమ్నజాతుల ప్రాతినిధ్యమును గురించి నేను మార్చి 11 వ తేదీని వ్రాసినలేఖను, సర్ శామ్యూల్ హోరుగారు మీకును, మంత్రివర్గమునకును చూపించియుందు రనుటకు సందేహములేదు. దానినికూడ నీయుత్తరములోని భాగముగనే దలంచి దీనితో కలిపి చదువగోరెదను.

అల్పసంఖ్యాకసంఘములకు శాసనసభలలో నుండవలసిన ప్రాతినిధ్యమును గురించి, బ్రిటిషుప్రభుత్వమువా రొసంగిన తీర్పును చదివి బాగుగ నాలోచించితిని. ఇదివరకు సర్ శామ్యూల్ హోరుగారికి వ్రాసిన నా లేఖ ననుసరించియు, సెంటు జేమ్సు భవనములో 1931 నవంబరు 13 వ తేదీని రౌండు టేబిలుసమావేశ సందర్భమున నల్పసంఖ్యాకోపసంఘసమావేశములో నే నొనర్చిన ప్రతిజ్ఞప్రకారము మీనిర్ణయమును నేను ప్రాణము లొసంగియైన నిరోధింపవలసియున్నది. అట్లు నిరోధించుటకు నా కొక్కటేమార్గము గలదు. అది సోడా, ఉప్పులను కలిపినట్టి జలమునుగాని, వట్టిజలమునుగాని పుచ్చుకొనుచు ఆమరణాంతము నిరశనదీక్షబూనుటే. ఈలోపున బ్రిటిషుప్రభుత్వము స్వబుద్ధివలనగాని, లేక ప్రజాభిప్రాయముయొక్క ఒ త్తిడిచేగాని తమ పరిష్కారమును మార్చుకొని నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గములను తీసివైచి తమ ప్రతినిధులనువారు కూడ సామాన్యనియోజకవర్గముల ద్వారా నెన్నుకొనునట్లు యేర్పరచినచో నే నుపవాసదీక్షను విరమించెదను. కాని ఓట్ల నిచ్చుట కర్హతను నిర్ణయించు నియమములు అందరకును సమానముగనే యుండవలెను. ఆ నియమము లెంతవిశాలవంతములైనను సరియే.

పైన చెప్పబడినట్లు మీపరిష్కారము సవరింపబడిననే తప్ప సెప్టెంబరు 20 వ తేదీ మధ్యాహ్నమునుండి నే నుపవాసమును ప్రారంభించెదను.

తగిన వ్యవధియుండగనే మీ కీసంగతి తెలియవలెనని యీయుత్తరమునుగాని, దీనిసారాంశమునుగాని మీకు తంతి మూలమున పంపమని యిక్కడి యధికారులను కోరుచున్నాను. ఒకవేళ వారట్లుచేయక మామూలుటపాలో పంపినను యీయుత్తరము మీకు వేళ కందునట్లుగనే చూచి వ్రాసితిని.

ఈయుత్తరమును, సర్ శామ్యూల్ హోర్ గారికి నేనింతకుపూర్వము వ్రాసిన ఉత్తరమును వీలైనంతత్వరలో ప్రకటింపకోరుచున్నాను. నేనుమాత్రము జైలునియమములను పూర్తిగా ననుసరించితిని. నా సహచరులగు సర్దార్ వల్లభాయిపటేలు, మహాదేవదేశాయిగార్లకు తక్క యీయుత్తరములోని విషయము లింకెవరికిని తెలియవు. ఈయుత్తరములవల్ల ప్రజాభిప్రాయములు మార్పునొందవలెనని నాకోరిక. అందువలన వీటిని త్వరలో ప్రచురింపగోరెదను.

ఇట్టి నిశ్చయమునకు రావలసివచ్చెగదాయని నాకును విచారముగనేయున్నది కాని ధర్మోపాసనయే నాజీవితమగుటచే నాకు వేరుతెరవు లేదు. సర్ శామ్యూల్ హోర్ గారికి వ్రాసినట్లు తమకు కష్టములు లేకుండుటకొరకు ప్రభుత్వమువారు నన్ను విడిచిబుచ్చినను నాయుపవాసదీక్షమాత్రమాగదు. ఎందువలననిన సాంఘికపరిష్కారమును నింకొకవిధ

ముగా నిరోధించగలనని నాకు ఆశ లేదు. గౌరవప్రదముగాని మార్గములవల్ల జైలునుండి బయటపడవలె ననుకోరికకూడ నాకు లేదు.

నా విచక్షణాశక్తి యీవిషయములో పెడత్రోవను పట్టిన పట్టియుండవచ్చును. ప్రత్యేకనియోజకవర్గములు హిందూధర్మమునకు గాని, నిమ్నజాతులకుగాని హానికరములని నే నెంచుట పొరపాటేకావచ్చును. కాని యదియట్లైనచో నా జీవిత తత్వమందలి యితరయభిప్రాయములుకూడ సరిగా లేవనినమాటే. కావున యీయుపవాసదీక్షవల్ల నే మరణించినచో నది నాపొరపాటులకు తగిన ప్రాయశ్చిత్తమే యగును. దానితోపాటు నావివేకమునందు నమితవిశ్వాసముగల్గిన యసంఖ్యాకులగు స్త్రీపురుషుల శిరస్సులనుండి పెద్ద బరువు తగ్గిపోవును. కాని నానిర్ణయము సరిగనేయున్నదని నానమ్మకము. అది యట్లయినచో గత పాతికవత్సరములనుండి నేనములులో పెట్టిన ఫలవంతమగు నాజీవిత విధానమునకు పూర్ణత్వము సిద్ధించును.

ఇట్లు,

యరవాడాజైలు, 18-8-1932. } మీవిశ్వాసపాత్రుడగుమిత్రుడు, మో॥ క॥ గాంధి.

దానికి ప్రత్యుత్తరముగా ప్రధానమంత్రి సెప్టెంబరు 8 వ తారీఖున నీదిగువ నీయబడిన లేఖను వ్రాసెను.

10. డేనింగువీధి.
8-9-1932.

ప్రియమైనగాంధిగారికి,

మీ ఉత్తరమును చదువగానే నాకు విషాదము, ఆశ్చర్యముకూడ కలిగినది. నిమ్నజాతుల ప్రాతినిధ్యమును గురించి ప్రభుత్వమువారొసంగిన తీర్పును మీ రపార్థముచేసికొనుట వల్ల నిట్టిలేఖ వ్రాసిరని తలంపకుండనుండజాలకపోతిని.

హిందూసంఘమునుండి నిమ్నజాతులను వేరుజేయుట మీ కేమాత్ర మిష్టములేదని మేము తెలిసికొంటిమి. రౌండు టేబిలుసమావేశమునకు సంబంధించిన యల్పసంఖ్యాకుల ఉపసంఘములో మీ రావిషయమును స్పష్టపరచిరి. పిమ్మట మార్చి 11 వ తేదీని సర్ శామ్యూల్ హోరుగారికి వ్రాసిన లేఖయందు మరల నావిషయమును తేటతెల్లము గావించిరి. మీ యభిప్రాయమే చాలమంది హిందువులకుకూడ గలదని మే మెరుంగుదుము. అందుచేత నిమ్నజాతుల ప్రాతినిధ్యమును గురించి మే మాలోచించినప్పుడు మీ యభిప్రాయములను బాగుగా పరిశీలించితిమి.

నిమ్నజాతులవారి సంఘములనుండి మాకనేక విజ్ఞప్తులు వచ్చినవి. హిందూసంఘములో వారనేక కష్టములు

పడుచున్నట్లు మీరుకూడ నొప్పుకొనిరి. అందువల్ల శాసన సభలో నిమ్నజాతులకు తగిన ప్రాతినిధ్యముండునట్లు చూచుట మాకు ధర్మమని తోచినది. అట్లు చేయునప్పుడు హిందూసంఘమునుండి వారు వేరుగాకుండునట్లు చాల జాగ్రత్త తీసికొంటిమి. మార్చి 11 వ తేదీనాటి మీ యుత్తరములో మీరే వారికి శాసనసభలలో ప్రాతినిధ్యముండవలెనని వ్రాసిరి. ప్రభుత్వ విధానముప్రకారము నిమ్నజాతులవారు హిందూసంఘములో నిమిడియే యుండి, హిందూ యెన్నిక వర్గములతోపాటు ఓటు చేయుచుందురు. కాని మొదటి 20 సంవత్సరములు హిందూ యెన్నికవర్గములలో నొక భాగముగనే యుండి ప్రత్యేక నియోజకవర్గములద్వారా కొన్ని స్థానముల శాసనసభలలో పొందుదురు. వారి హక్కులను కాపాడుకొనుటకిది ప్రస్తుతదేశ పరిస్థితులలో వారికి అవసరమని మా నమ్మకము. నిమ్నజాతుల, కీప్రత్యేకనియోజకవర్గములుండుచోట్ల వారికి హిందూసంఘమునుండి విడిపోకుండ తదితర హిందువులతోపాటు నోసంగుట కొకటియు, తమ హక్కులను రక్షించుకొనుటకై ప్రత్యేక నియోజకవర్గముల ద్వారా తమవారిని యెన్నుకొనుటకొకటియు కలసి రెండు ఓట్లు వారిలో ప్రతి వోటరునకు నుండును. మేము బుద్ధిపూర్వకముగనే వారికి సంఘనియోజకవర్గములు లేకుండునట్లు చేసితిమి. వారినందరను సామాన్యనియోజకవర్గములలో

చేర్చితిమి. అందువలన యెన్నికలలో సవర్ణ అభ్యర్థులు నిమ్న జాతులవారి ఓట్లకొరకును, నిమ్నజాతుల యభ్యర్థి సవర్ణుల ఓట్లకొరకును తిరుగాడవలసి వచ్చును. పైవిధమగు నేర్పాటుల చే హిందూసంఘమునుండి వారు చీలిపోకుండ సర్వవిధముల చూచితిమి.

కాని బాధ్యతాయుత ప్రభుత్వము లభించిన మొదట రోజులలో రాష్ట్రములయం దధికారము, శాసనసభలయం దధికసంఖ్యలుగ నున్నవారి చేతులలో నుండును నిమ్న జాతులు సవర్ణులచే ననేక శతాబ్దములకొలదిగ నధోగతి పాల్చేయబడినట్లు సర్ శామ్యూల్ హోరుగారికి వ్రాసిన లేఖలో మీరే వర్ణించిరి. తత్కారణమున వారి కష్టనష్టముల వెల్లడించుకొనుటకును, వారి యాదర్శములను ప్రపంచము నకు వెల్లడించుటకును, రాష్ట్రీయప్రభుత్వములు వారికి నష్ట మువచ్చు నిర్ణయములు గావించుటకు వీలులేకుండ నుండుట కును; ఒక్కమాటలో చెప్పవలెనన్న వారిపక్షమున వారు మాట్లాడుట కవకాశమును నిమ్నజాతులవారి కొసంగుట మాకు ధర్మమని తోచినది. అట్లు మేమొసంగుట ధర్మమని న్యాయబుద్ధిగల ప్రతిమానవుడు నంగీకరింపవలసినదే. శాసనసభలలో వారికి కొన్నిస్థానముల ప్రత్యేకించి సంయుక్త నియోజకవర్గములద్వారా యెన్నికలుజరుగు పద్ధతినవలంబిం చుట ప్రస్తుత స్థితిగతులలో క్షేమముకాదని మాకు దోచి

నది. ఏలన అట్లెన్నుకొనబడిన ప్రతినిధి నిమ్న జాతికి చెందిన వాడైనను, ఆచరణకు అనుకూలమగు దృష్టితో బాటు నిచ్చు నర్హత కెట్టి నియమముల పెట్టినను, సవర్ణుల ఓట్లసహాయము వల్లనే యాతడు యెన్నుకొనబడవచ్చును. అందువలన నాతడు నిమ్నజాతులకు నిజమైన ప్రతినిధి కాజాలడు. వారికి పూర్తిగా సాధ్యుడై యుండజాలడు.

మామూలుగా తదితర హిందువులతో కలసి ఓటు నిచ్చుటకును, అభ్యర్థిగా నిలబడుటకును వారికి గల హక్కులతోపాటు నిమ్నజాతులకు శాసనసభలయందు కొన్నిస్థానముల ప్రత్యేకించి మా విధానమునందు వారికి సదుపాయము చేసితిమి. దానికిని ముసల్మానులబోలు అల్పసంఖ్యాక సంఘములకు, సాంఘిక నియోజకవర్గములద్వారా తమ ప్రతినిధుల నెన్నుకొనుటకు చేసిన యేర్పాటునకును చాల భేదము గలదు. ఉదాహరణకు- ఒక ముసల్మాను సామాన్యనియోజకవర్గములలో ఓటు చేయజాలడు. కాని ఓటర్లజాబితాలో చేర్చబడిన నిమ్నజాతులకు చెందిన ప్రతివారును సామాన్య నియోజకవర్గములలో తానొక యభ్యర్థిగా నిలువవచ్చును. నిలచినవారికి తన ఓటునీయవచ్చును. ముసల్మానులకే రాష్ట్రశాసనసభలయందెన్నిస్థానములుండవలెనో నిర్ణయింపబడినవో అంతకంటె వారికెక్కువస్థానములు లభించు టసంభవము. ఏలన కొన్ని రాష్ట్రములయందు వారికి వారి జనాభా ప్రకా

రము వచ్చు స్థానములకంటె నెక్కువ యొసంగబడినవి. ప్రత్యేక నియోజకవర్గములమూలమున నిమ్నజాతులువారెన్నుకొను సభ్యుల సంఖ్య చాల తక్కువ. ఆ సంఖ్య వారి జనాభానుపట్టి ప్రతిరాష్ట్రమునందున వారికి రావలసిన స్థానములప్రకారము నిర్ణయింపబడినదికాదు. కాని, నిమ్నజాతులవారిచేతనే యెన్నుకొనబడి, వారి కష్టనష్టముల వెలిబుచ్చుటకు ప్రతి రాష్ట్రశాసనసభలోను వారి సభ్యులుండవలెనన్న యుద్దేశముతోనే యీ మార్గమనుసరింపబడినది. వారికిచ్చిన ప్రత్యేకస్థానములు వారికి వారి జనాభాప్రకారము వచ్చు వాటికంటె తక్కువగానే యున్నవి.

మీరామరణాంత ముపవాసదీక్ష బూను టెందులకు? నిమ్నజాతులకును సవర్ణహిందువులకును సంయుక్తనియోజక వర్గములుండవలయుననియా? కాదు. అవి వారి కిదివరకే గలవు. వారు హిందూసంఘమునుండి చీలిపోకుండజేయుటకా? కాజాలదు. దానికి మేమిదివరకే యేర్పాటుచేసితిమి. మీ రీదారుణదీక్షబూనుట నేటికికూడ యష్టకష్టముల పడుచున్న నిమ్నజాతులవారు తమతరఫున మాట్లాడుటకు తమచే ప్రత్యేకముగా నెన్నుకొనబడిన ఏ కొలదిమంది ప్రతినిధుల నైన శాసనసభలలోనికి పంపుటకు వారికి వీలులేకుండ చేయుటకేనని తెలుచున్నది. అట్లు తమవారిని పంపుటకు వారికిగల హక్కుపైననే వారి భవిష్యత్తు ఆధారపడియున్నది.

ఇంతటిన్యాయమైన యేర్పాటులను మే మింతజాగ్రత్తతో గావించినను, మీ రిట్టివారునాదీక్షకు కడంగుటకు కారణమును తెలిసికొనజాలకున్నాను. యథార్థవిషయముల సరిగా నెరుంగక యే మీరిట్లు గావించిరని తలంచుచున్నాను.

అల్పసంఖ్యాకసమస్యను తమంతటతాము పరిష్కరించుకొనజాలక భారతీయులు ప్రభుత్వమును తీర్పుజెప్పమని కోరిరి. ఆకోరికననుసరించి యే ప్రభుత్వమున కెంతమాత్రమిష్టము లేకపోయినను సమస్యాపరిష్కారమునకు పూనుకొనినది. ఇప్పుడు తీర్పు చెప్పినది. అందులో చెప్పిన షరతులమీదనేగాని యాతీర్పు మార్చుటకు వీలు లేదు. అందువలన నానామాసంఘములవారు తమలో తా మొడంబడిక చేసికొనిననేతప్ప, ప్రభుత్వమువా రమితశ్రమపడి, మంచిచెడ్డలపై నాధారపడి యిచ్చిన తీర్పు యట్లే యుండుననియును, మార్చబడదనియును చెప్పవలసివచ్చునని భయపడుచున్నాను.

మార్చి 4 వ తేదీని మీరు సర్ శామ్యూల్ హోరుగారికి వ్రాసిన లేఖతోపాటు మనకిరువురకు జరిగిన యుత్తరప్రత్యుత్తరములన్నియు ప్రచురింపమని మీరడిగిరి. మీరువవాసము పూనుటకు నిశ్చయించుకొనిన దినములకో యితరులకు తెలియచేయుటకు మీప్రస్తుతనిర్బంధమడ్డము వచ్చుట న్యాయముకాదు. కాబట్టి, పునరాలోచనానంతరముకూడ వాటినిప్రకటించుటే మంచిదని మీకుతోచినచో నట్లే చేయ

వచ్చును. కాని ప్రభుత్వమువారి సాంఘికపరిష్కారము యొక్క వివరముల నన్నిటిని పూర్తిగా పరిశీలించి, మీరు కడంగబోవు చర్య సమంజసమగునా కాదాయని తీవ్రముగా నాలోచింపవలసినదని యింకొకసారి గట్టిగా మిమ్ములను కోరుచున్నాను.

ఇట్లు
మీవిశ్వాసపాత్రుడు,
జె. రాంసే మాక్డనాల్డు.

... ... ... ... ...

బ్రిటిషు ప్రధానమంత్రియుత్తరమును గాంచినంతనే మహాత్ముడు దిగ్భ్రమనొందెను కాని వాదప్రవాదములకు నెడ మీయక తనయభిప్రాయములను స్పష్టీకరించుచు ప్రధాన మంత్రి కీజవాబునొసంగెను.

యరవాడ సెంట్రలుజెలు.
9-9-1932.

ప్రియమిత్రమా!

దాపరికములేకుండ వ్రాసిన మీయుత్తరము పూర్తిగా నేడే తంతిద్వారా నాకందినది. దాని కనేకవందనములు. నే చేయబోవుపనికి, నేకలలోనైన తలంపని యర్థమును మీ రాపాదించుట చాలసంతాపకరమగు విషయము. ఎవరిశ్రే యస్సు నరికట్టుటకొరకు నేను నిరాహారదీక్ష బూని చావ

నిశ్చయించుకొంటినని మీరనుచున్నారో, వారిప్రతినిధినని యే నే నిన్ననాళ్ళనుండి చెప్పుకొనుచున్నాను. నేను స్వార్థపరత్వముతో నీపని చేయుచున్నానను టకు యీ దారుణమైన నాదీక్ష యవకాశమీయదని తలంచియుంటిని. మీనమ్మకమెట్లున్నను నాకుమాత్రి మిది ధర్మసంబంధమగు విధియని నొక్కి చెప్పుచున్నాను

నిమ్నజాతి ఓటరు ప్రతివానికిని రెండేసి ఓట్లున్నంత మాత్రమున నవి వారిని రక్షింపజాలవు. హిందూసంఘవిచ్ఛేదము నరికట్టజాలను. ప్రత్యేకనియోజకవర్గము లేర్పరచుటన్న నాకొక విషప్రయోగముగా దోచుచున్నది. ఆవిషప్రయోగమువల్ల హిందూసంఘము నాశనమైపోవును. నిమ్నజాతులకు కూడ నేమాత్రములాభము కలుగబోదు.

మీ రెంతసానుభూతితో ప్రయత్నించినను, ఉభయపక్షములవారికిని ప్రాణతుల్యమును, ధార్మికమునగు నీవిషయములో సరియైన నిర్ణయమూనకు రాజాలరని చెప్పుటకు నను మతింపుడు. నిమ్నజాతులకు వారి జనాభానుమించిన ప్రాతినిధ్యమిచ్చినను నాకభ్యంతరము లేదు. కాని వారు హిందువులమేమని చెప్పుకొనినంతకాలము వారిని హిందూసంఘమునుండి యేమాత్రిమును వేరుచేయుటకు నేను సమ్మతింపను.

మీపరిష్కారముమీదనే యీ ధారపడి నూతన రాజ్యాంగవిధాన మసలులోనికి వచ్చినచో, ఇంతకాలమునుండి నిమ్నజాత్యుద్ధరణముకొరకు తమసర్వస్వము ధారపోసి ప్రయత్నించుచున్న సంస్కర్తల కష్టమంతయును గంగపాలగునని మీకు తెలియునా ?

కావున నాకిష్టము లేకున్నప్పటికిని మీకింతకుపూర్వము తెలిపిన నాప్రతిజ్ఞనే నేను నిలుపుకొనవలసివచ్చినది.

మీయుత్తర మపార్థముల కెడమీయవచ్చును. మీసాంఘిక పరిష్కారమునుండి, నిమ్నజాతులవిషయ మొక్కటియే వేరుజేసి మార్పుయత్నించుట దానిలో మిగిలినభాగముల నన్నిటిని నేనంగీకరించుటవల్లకాదు. నామనస్సు నాయీవిషయములలో నేదోవిధముగా సమాధానపరచుకొనుటవలన కూడ కాదు. వాటిలో చాలభాగములందనేక దోషములున్నవని నాయుద్దేశము. కాని, నిమ్నజాతుల విషయములో నాయంతరాత్మ ప్రేరేపించినట్లు మిగతావిషయములలో నన్ను ప్రేరేపించుట లేదు.

ఇట్లు
మీవిశ్వాసపాత్రుడగుస్నేహితుడు,
మో॥ క॥ గాంధి.

## 3

మహాత్ముని కును, హోరుమాగ్డనాల్డుగార్లకును మధ్య నడచిన యుత్తర ప్రత్యుత్తరములను, బ్రిటిషుప్రభుత్వము సెప్టెంబరు 12 వ తేదీని బయటపెట్టినది. మరు నాటి దినపత్రికలలో నవి ప్రకటింపబడినవి.

దేశములో నలజడి.

మహాత్ముని యీ దారుణనిశ్చయమును గాంచినంతనే యావద్భారతదేశము నిర్ఘాంతపడిపోయినది. ఆ బాలగోపాలమును తమ ప్రాణాధికుల కేదో మహాపద తటస్థించినట్లు తెలతెలబోవుచు, కంఠముల గద్గదికయొదవ, తొట్రుపడు పాదములతో సంచరింపదొడంగిరి. భారతీయాభ్యుదయమున కహోరాత్రములు పాటుపడు నీమహాపురుషుడు, స్వరాజ్యములభింపక పూర్వమే యవతారసమాప్తి దల పెట్టెనేయని స్వపక్షవిపక్ష భేదము లేకుండ నెల్లవారు చింత పడసాగిరి. కాని కాలగర్భమునం దేమిగలదో యెరుంగ నెవరి వశము ?

కలనైన తలంపని పిడుగుబోలు యీవార్త చెవిని పడినపిమ్మట నిశ్చేష్టమైన దేశము కొంతవడికి తెప్పరిల్లినది. మహాత్ముడీదీక్ష నెందులకు పూనెనో విమర్శింపసాగినది. బ్రిటిషుప్రధానమంత్రి సాంఘికపరిష్కారములో నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గము లిచ్చుటే దీనికి కారణమని గ్రహించినది. తత్క్షణమే దేశమంతయు సభలు చేసి, పరిష్కా

రములో నస్పృశ్యులకు సంబంధించిన భాగమును మార్చివే యవలసినదని తీర్మానముల చేసి ప్రధానమంత్రికి పంపినది. కాని ప్రధానమంత్రిమాత్రము తనంతటతానే యస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గము లొసంగెనాయని యోచించినది. అస్పృశ్యులలో కొందరడుగుటవల్ల నా ప్రధానమంత్రి యట్లు చేయగలిగెనని వెంటనే తట్టినది అంతట యస్పృశ్యులలో కొందరైనను సరే ప్రత్యేకనియోజకవర్గముల నేల నడుగవలసివచ్చెనని ప్రశ్న వేసికొనినది. ఈప్రశ్న దోచినవెంటనే దేశమునకు తనతప్పు తెలిసినది. ఇంతకాలమునుండి, మహాత్ముని బోధనల పెడచెవినిపెట్టి, తోడి మానవుల నీచాతినీచముగా తాముచూచుటయే వారట్లు యడుగుటకు కారణమని హృదయముల నాటుకొనిపోయినది. నాటుకొనిపోయిన మరుక్షణముననే యస్పృశ్యతానివారణకొక మహోద్యమము దేశములో బయలుదేరినది.

ఈమహోద్యమము ఝంఝామారుతమువలె వీవసాగెను. అనేకప్రదేశములలో నతిపురాతన దేవాలయములలోనికి కూడ నస్పృశ్యుల రానియ్యదొడగిరి. ఇంతకాలమునుండి వారిని దరిచేరనీయని నూతులను, సత్రములను, పాఠశాలలను అస్పృశ్యు లుపయోగించుట కనేకచోటుల ప్రజలంగీకరించిరి. కలకత్తాలోని కాళికాలయములోనికి, కాశీలోని రామమందిరములోనికి అస్పృశ్యులను స్వేచ్ఛగా రానియ్య

సాగిరి. విద్యార్థులు, స్త్రీలు, పురుషులు గ్రామగ్రామముల దిరిగి యస్పృశ్యతా నిర్మూలమునకై ప్రచారము చేయమొదలుపెట్టిరి. సనాతన ధర్మావలంబకులకు ముఖ్యపీఠమగు కాశీలో జరిగిన యనేక మహాసభలలో నస్పృశ్యతానివారణ తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడినది. ఒక్కమాటలో-నస్పృశ్యులను తోడిమానవులవలె, స్వమతస్థులవలె చూచుటకును, వారొకప్పుడు హిందూసంఘములో పతితులుగా చూడబడితిమన్న భావము వారికి లేకుండునట్లు చేయుటకును తీవ్రప్రయత్నము లారంభమైనవి.

మహాత్ముని దీక్షసంగతి తెలియవచ్చినంతనే, దేశదేశములనుండి, మహాత్ముని తనయుపవాసదీక్షను కొంతకాల మాపుచేయవలసినదనియును, అస్పృశ్యులనాయకులతో సవర్ణహిందూనాయకులు సంప్రతించి సమాధానపడుట కవకాశ మొసంగవలసినదనియును తంతివార్తలు వర్షింపమొదలిడినవి. కరాచీపురపాలక సంఘాధ్యక్షులగు శ్రీ జమ్షెడ్ మెహతాగారికి, మహాత్ముడు తానాచరించునది పరమేశ్వరాజ్ఞానుసారముగ పూనినదీక్షయనియును అది మానుమని కోరవలదనియును, అవసరమగుచో నాపరమేశ్వరుడే సవర్ణులకునస్పృశ్యులకునొడంబడికకుదురునంతవరకు ప్రాణములతో తన్నుంచగలడనియును మహాత్ముడు జవాబిచ్చెను. తనసహచరుడగు శ్రీ రాజగోపాలాచార్యులవారిని 'చింతింపవలసిన

సమయముకాదు. నీ సహచరునకు దీనజనోద్ధరణకై ప్రాణ మూ లర్పించు నవకాశము దొరకినందులకు సంతోషింపుము' అని యనెను. 'అవసరమగుచో యితర సోదరీమణులతో కలసి నన్ను చూచుటకు రావచ్చును. కాని నాకడకు వచ్చుటకంటె యస్పృశ్యతానివారణప్రచారము సేయుట యుత్తమ' మని బొంబాయిలోని దేశారాధకురాలగు నొక సోదరీమణికి వ్రాసెను. సర్ తేజ్‌బహదూరు సప్రూగారికి 'భవత్ప్రేరణ వల్లనైకొనిన యీదీక్షను వదలిపెట్టుమని మీరడుగరను కొందును. హిందూసంఘమును రెండుగ ప్రభుత్వమువారు విభజించుచున్న యీ సమయమున నా నిస్సహాయతయే నన్నీ దీక్షకు పురికొల్పినది. మీరును, యితరస్నేహితులును మాత్రమే యస్పృశ్యులకును సవర్ణులకును ఒడంబడిక కుదుర్చుటకై ప్రయత్నింపగలరు. భగవత్కటాక్షమున్నచో నేనుపవాసము బూనియున్నను, యంతవరకు జీవించియుండగల'నని ప్రత్యుత్తరమిచ్చెను.

ఈ మహాత్యాగముముందర నాయకులలోగల భేదము లన్నియును తాత్కాలికముగ నెగిరిపోయినవి. ప్రతివారును మహాత్ముని యుపవాసదీక్ష దుష్పరిణామము గాంచకపూర్వమే దానినాపుటెటులనాయని ఆలోచింప మొదలిడిరి. నిమ్న జాతి నాయకులగు రావుబహదూర్ యం. సి. రాజాగారు నిమ్నజాతులను హిందూసంఘమునుండి విడదీయు బ్రిటీషు

ప్రధానమంత్రి సాంఘికపరిష్కారమును ఖండించుచు, మహాత్ముని ప్రాణరక్షణకొరకన్ని సంఘములవారు కలసి పనిచేయవలెనని ప్రకటనగావించెను. నిమ్నజాతుల సమస్యపై ప్రపంచ దృష్టిని కేంద్రీకరించినందులకు మహాత్మునికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతుల నర్పించెను. మహాత్ముని యుపవాసదీక్షా విషయము చర్చించుటకొరకు మామూలు కార్యక్రమము నాపుచేయవలసినదని శ్రీ సి. యస్. రంగయ్యరుగారు భారతశాసనసభలో తీర్మానమును ప్రవేశపెట్టిరి. ఆసందర్భమున కూడ యం. సి రాజా మున్నగువారలు, అస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గముల నేర్పరచినందులకు ప్రభుత్వమును ఖండించుచు తక్షణమే మహాత్ముని విడుదల చేయవలసినదని కోరిరి. సప్రూగారుకూడ తక్షణమే గాంధిగారిని విడువవలెనని ప్రభుత్వమువారి నడిగిరి. మహాత్మునితప్ప సాంఘికసమస్యను పరిష్కరింపగలిగిన వారింకొకరు లేరని స్పష్టముగా బలికిరి. మదరాసు మహమ్మదీయనాయకులగు యాకూబ్ హాస్సేన్ గారు మహాత్ముని గోల్పోవకుండుటకై ప్రత్యేక నియోజకవర్గముల వదలిపెట్టుడని నిమ్నజాతుల కోరిరి. మహాత్మునియీ మహాత్యాగము నెడల నగౌరవముగాని, యలసభావమునుగాని చూపింపకూడదని తోడి మహమ్మదీయుల హెచ్చరించిరి. శ్రీయుతులు జి. డి. బిర్లా, రాజేంద్రప్రసాద్ గార్లు, సవర్ణులు అస్పృశ్యులయందు సుహృద్భావముతో మెలంగవలెననియును

అప్పుడే యీ రాజకీయసమస్య యుభయపక్షనాయకులచేత చులకనగా శిరిష్కరింపబడగలదనియును పరిబోధముగావించిరి. పండిత మదనమోహన మాలవ్యాగారు, ఢిల్లీలో సెప్టెంబరు 17 18 తేదీలలో నాయకులసభ జరుపగోరి యెల్లరకును శతివార్తల నంపిరి. కాని మహాత్మునితో సంప్రతించు నుకు వీలుగ నుండుటకొరకు జయకర్ గారి సలహామీదట సభ 18, 19 తేదీలకు బొంబాయిలో జరుగునట్లుగ మార్చబడినది. మహాత్ముని దీర్ఘాయుష్మంతుగా చేయు పరమేశ్వరుని ప్రార్థించుటకును, ప్రత్యేకనియోజకవర్గముల నిమ్నజాతులకు తీసివేయమని బ్రిటిషు ప్రధానమంత్రి నడుగుచు తీర్మానముల చేయుటకును 19 వ తేదీ నాడు మంత్రము సభలు చేసి, మరువాడు 20 వ తేదీని మహాత్ము డుపవాసము ప్రారంభించు దినమును, యెల్ల రుపవాసదినముగ నెంచవలసినదని శ్రీరాజగోపాలాచార్యులుగారు ప్రజలను హెచ్చరించుచు ప్రకటన గావించిరి.

మహాత్ముడు ప్రాయోపవేశదీక్ష బూనినందులకు సంతాపపడినది భారతదేశ మొక్కటియే కాదు. ప్రాయోపవేశ వార్త యింగ్లాండును చేరినంతనే దీనబంధు సి. యఫ్. ఆండ్రూస్, పోలక్ గార్లు భారతదేశ శ్రేయోభిలాషులగు యితర ఆంగ్లేయుల సహాయముతో, భారతదేశములో నేర్పడిన క్లిష్ట పరిస్థితులను గురించి యాంగ్లేయప్రజలలో ప్రచారముచేయ

మొదలిడిరి. కార్మికపక్షనాయకులగు లాన్సు బరీగారు, మహాత్ముని యాత్మార్పణ మొకమహాశక్తియై విజృంభించుననియు, జగడముల కాకరమైన సాంఘికపరిష్కారమును నెత్తిని బ్రిటిషువారు పెట్టుకొనరాదనియు నొక బహిరంగ సభలోనుపన్యసించిరి. రౌండుటేబిలు సభా వేశమునకు వెళ్లి నప్పుడు మహాత్ముడు నివసించిన 'కింగ్సుహాలు' నివాసులు మహాత్ముని చిరంజీవిగా చేయుమని ప్రార్థించుచు జాగరము సల్పిరి. క్రైస్తవదేవాలయములలో, ఆదివారమునాడు చేయు ప్రార్థనాసమయములో, మహాత్ముని విషయమునను, భారత దేశ శ్రేయస్సుకొరకును, ఆనాటినుండి యొక వారమురోజులు ప్రార్థనలు సల్పవలసినదని క్రైస్తవ మతాధికారులు ప్రజలకొక విజ్ఞప్తిని ప్రకటించిరి. ఈజిప్టునుండి ముస్తాఫా నాహాస్ పాషా, శ్రీమతి సఫియా జగులుల్ పాషాగార్లు మహాత్ముని త్యాగము నభినందించుచు సందేశము లంపిరి లండనులోని 'భారతదేశ మిత్రబృందము వారు మహాత్ముని జన్మదినమగు, అక్టోబరు 2 వ తేదీని ఉపవాసముసల్పి యందువల్ల మిగిలిన ధనమును మహాత్ముని కందచేయుటకు సంకల్పించుకొనిరి.

ఇక నిమ్నజాతులవారు, దేశవిదేశము లిట్లు గగ్గోలు పడుచుండ నిద్రబోవుచుండిరా? లేదు. కలకత్తా, అలహాబాద్, అహమ్మదాబాద్, ఏలూరు మున్నగు ననేక పట్టణములయందు సభలుచేసి, తమకు ప్రత్యేక నియోజకవర్గము

లవసరము లేదనియును, సంయుక్త నియోజకవర్గము లే కావలెననియును తీర్మానించిరి.

అంతట ప్రభుత్వమువా రేమిచేయుదురో యని ప్రజ లెల్ల నాతురత పడసాగిరి. నాయకులయొక్కయు, ప్రజల యొక్కయు కోరికలప్రకారము తక్షణమే మహాత్ముని విడుద లచేసి, సవర్ణులకును నిమ్న జాతులకును త్వరలో నొడంబడిక కుదురుటకు సహాయపడుదురా? లేక మహాత్మునకును హోరు, మాగ్డనాల్డుగారికిని జరిగిన యుత్తరముల నింతకా లము దాచియుంచినట్లే, మహాత్ము డుపవాసదీక్ష బూనుట కును, దానివల్ల కలుగబోవు దుష్పరిణామములకును భారతీ యప్రజలే బాధ్యులని చెప్పి యూరకుందురాయని యెదురు చూడ దొడంగిరి. ఈ యొక్కవిషయమునందు తక్క యన్య విషయములం దేమాత్ర మేకీభవింపని, శ్రీఘనశ్యామదాస్ బిర్లా, బ్రాహ్మణేతరపక్షమునకు చెందినట్టియు, ఒకప్పుడు బొంబాయిరాష్ట్రమునకు మంత్రిగానుండినట్టియు బి వి.జాదవ్ మితవాదియగు సి. వై. చింతామణివంటి వారలందరును మహాత్ముని యాలస్యము చేయకుండ విడుదలచేయవలసిన దని ప్రభుత్వమును కోరిరి. బొంబాయి రాజధానిసంఘము, భారతదేశ పరిస్థితుల కండార చూచిపోవుటకు వచ్చిన ఇండి యా లీగ్ డెలిగేషన్, తుదకు గాంధియభిప్రాయముల కల నైన యంగీకరింపని లండన్ టైమ్సుపత్రికకూడ నదే కోరికను కోరెను. కానియందరకోర్కెలను ప్రభుత్వము పెడచెవినిపెట్టెను.

సెప్టెంబరు 15 వ తేదీని భారతశాసనసభలో ప్రభుత్వ సభ్యుడగు హేగుగారు, మహాత్ము డుపవాసము ప్రారంభించి నంతనే జైలునుండి విడుదల చేయబడుననియును, విడుదల చేయబడినపిమ్మట ఆయనకు గృహమునుదాటి బయటకెట్టి సందర్భములయందును పోరాదను నిషేధమొక్కటిమాత్రి ముండుననియును, తెలిపెను. కాని యది మహాత్ముని సంప్ర తించి చేసిన యేర్పాటుకాదు. మహాత్ము డుపవాసము ప్రారంభించిన రోజుననే, రాజప్రతినిధిగారి యాంతరంగిక కార్యదర్శి కొకతంతివంపెను. అందులో ప్రభుత్వముయొక్క నిషేధాజ్ఞలను తాను మన్నింపజాలననియును, జైలునుండి విడుదలచేసి బయట నింకొకగృహమునకు తన్నుతీసికొని పోవు టనవసరవ్యయప్రయాసలకు పాల్పడుట తక్క యింకొక లాభములేదనియు నందుచేత తన్ననవసరముగ బాధింపవలదనియును వ్రాసెను. దానిని ప్రభుత్వసభ్యులగు హేగుగారు, భారతశాసనసభలో చదివి, మహాత్ముని యిష్ట ముప్రకారమే ఆయనను జైలులోనుంచి,యస్పృశ్యతా నివా రణవిషయమై, యితరులతో సంభాషించుటకు తగిన సౌకర్య ములొసంగబడునని చెప్పిరి.

మహాత్ము నంతటివాడు ప్రాయోపవేశ దీక్ష బూనిన ప్పటికిని జైలునుండి విడుదలచేయుట అవస్యమని ప్రభు త్వమునకు తోపలేదు.

---

౪

ఒకవంక బ్రిటిషు ప్రభుత్వమువారు నిమ్నజాతులకొసంగిన ప్రత్యేక నియోజకవర్గములను స్వయముగాగాని, ప్రజాభిప్రాయానుసారముగాని ఉపసంహారించుకొనిననేగాని తానుపవాసదీక్ష మాననని మహాత్ముడు స్పష్టము చేసెను. వేరొకవంక సవర్ణులును, నిమ్నజాతులవారును కలసి, ఒడంబడిక చేసుకొని మాకవసరము లేదని చెప్పినగాని, తను సాంఘిక పరిష్కారములో నిమ్నజాతులకు సంబంధించిన భాగమును మార్పజాలమని ప్రభుత్వమువారు స్పష్టపరచిరి. మహాత్ముడా- పట్టినపట్టు వీడువాడుకాడు. ప్రభుత్వమా- ప్రతిష్ఠనే జీవముగా నెంచుకొనునది. పరిష్కారమును మార్చునాశ లేదు. పెపెచ్చు మహాత్ముడు ఢిల్లీలో యుపవాసము చేసినప్పటికంటె ముదుసలి. ఎంతకాలము ప్రాణములు నిల్చునో? అట్టియెడల భారతదేశమందలి యొకమూలనుండి, యింకొక మూలవరకు తీవ్ర ప్రచారముచేసి, ప్రజలలో నపూర్వ ప్రబోధముకలిగించి, ప్రజాభిప్రాయమును సంయుక్త నియోజకవర్గముల కనుకూలముగా నున్నట్లు ప్రభుత్వమునకు నచ్చచేయునంతవరకు మహాత్ముడు జీవించియుండునా? మహాత్ముని ప్రాణములు పోకుండ చూచుట యన్నిటికంటె ముఖ్యమైనది. కావున సమాధానప్రయత్నములకు పూనుకొనిన నాయకులకొక్కచే

సమాధాన ప్రయత్నములు.

మార్గము మిగిలినది నిమ్నజాతులవారి నాయకులతో సంప్రతించి, సంయుక్త నియోజకవర్గములకు వారిని సుముఖులగావించుటయే. అది జరుగకపోయినచో మిగులుమార్గము ప్రజాభిప్రాయమునుకూడ కట్టుకొనుటయే.

నిమ్నజాతులలో రెండుపక్షములు కలవు. ఒకదానికి మదరాసు వాస్తవ్యులగు రావుబహాదూర్ యం. సి. రాజాగారు నాయకులు. ఈ పక్షమువారు సంయుక్తనియోజకవర్గముల కనుకూలురు. రెండవ పక్షమునకు నాయకులుడాక్టరు అంబేద్కరుగారు. వీరుబొంబాయి వాస్తవ్యులు. వీరునిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గములుండుట వారికిని దేశమునకును కూడ హానికరములని సైమనుకమిషనుముందర సాక్ష్యమొసంగిరి కాని తరువాతప్రస్తుతపరిస్థితులలో నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గము లుండుటవసరమని వీరు చెప్ప మొదలిడిరి మహాత్ముడు ప్రాయోపవేశదీక్ష బూననున్నాడను వార్త తెలియవచ్చినంతనే శ్రీరాజాగారుహిందువులెల్లరెంతటి మహాత్యాగమొనర్చియైనను సరే భారతదేశమునకు మహాత్ముడు దక్కునట్లు చూడవలెనని ప్రకటించిరి. డాక్టరు అంబేద్కరుగారట్లుగాక, మహాత్ముని ప్రాయోపవేశదీక్షను బెదరింపుగా పరిగణించి, తానట్టి బెదరింపుల లక్ష్యముసేయువాడను గానని యు, నిమ్నజాతులవారు తమ హక్కులకొరకు పోరాడుటలో ప్రాణార్పణకైన జంకరనియును, ప్రకటించెను.

ఇట్టి వీరు సంయుక్తనియోజకవర్గము లనుమాటనైన తన ముందర నెత్తనీయుదురాయని హిందూనాయకులలో కొంద రకు సందేహములు కలుగదొడగినవి.

పండిత మదనమోహన మాలవ్యాగారు, డాక్టరు అంబేద్కరుగారితో సంప్రతించుటకు మొదలుపెట్టిరి కాని గాంధిగారు లండనులో ప్రత్యేకనియోజకవర్గముల కేగాక, శాసనసభలలో కొన్నిస్థానములకొక సంఘమువారికి ప్రత్యే కించుటకుకూడ విరుద్ధముగానుండిరి. ఇప్పు డాయనయభిప్రా యము లెట్లున్నవో తెలిసికొనుటకు బొంబాయినుండి సేట్ మధురదాస్ వాసంజి, సర్ చూనిలాల్ మెహతా, సర్ పురు షోత్తమదాస్ ఠాకూర్ దాస్, ఘనశ్యామదాస్ బిర్లాగార్లు యరవాడజైలునకు వెళ్ళి, మహాత్మునితో మాట్లాడిరి. మహా త్ముడు హిందూసంఘమంతయును కలసి శాసనసభలకు నిమ్న జాతి యభ్యర్థుల నెన్నుకొను పద్ధతి యేదైనసరే బాగుండు ననెను. కాని నిమ్నజాతులకు శాసనసభలలో కొన్నిస్థానముల ప్రత్యేకించి సంయుక్తనియోజకవర్గముద్వారా యాస్థానములు పూర్తిచేయబడుటకు తానభ్యంతరపెట్టజాలననియును, తన యుపవాసము ప్రత్యేకనియోజకవర్గములు లేకుండ చేయుట కేననియు నవి పోయినయంతనే యుపవాసదీక్ష వదలిపెట్టెద ననియును చెప్పెను. ఈ విషయము బొంబాయి ప్రభుత్వము వారికి 15 వ తేదీని మహాత్ముడు పంపిన ప్రకటనలో విశదీక

రింపబడి యుండెను. కాని దానిని ప్రభుత్వము వారెందువలన నోగాని తక్షణమే ప్రకటింపక 21 వ తేదీని ప్రకటించిరి. అది యీాక్రిందనియబడినది.

“భగవంతునిద్దేశించి, భగవంతుని సేవకొరకే, అల్పజ్ఞుడనగు నా నమ్మకముననుసరించి భగవదాదేశానుసారమే నేను ప్రారంభింపబోవు నీయుపవాసదీక్ష బూనితిని. చిక్కులసర్దుకొని సమాధానపడుటకు ప్రజలకు కొంచెమవకాశమబ్బునట్లు దీనిని కొంతకాల మాపుచేయవలసినదని పలువురు మిత్రులు నాకు గట్టిగా వ్రాసిరి. కాని బ్రిటిషుప్రధాన మంత్రికి నేవ్రాసిన యుత్తరములో చెప్పబడిన సందర్భములు జతపడిననేతక్క నేనుపవాసము చేయబోవు గడియనైన మార్చజాలనని చెప్పుటకు విచారించుచున్నాను.

నేను మొదలుపెట్టబోవునట్టి యుపవాసదీక్ష నాయందు విశ్వాసముగల భారతీయుల నుద్దేశించియు, విదేశీయుల నుద్దేశించియేగాని, యన్యులకొరకు కాదు. కావున నిది యాంగ్లేయాధికారవర్గము నుద్దేశించికాదు సరిగదా ఆ యుద్యోగవర్గము నాకు వ్యతిరేకముగా నెంతప్రచారము చేసినను నాయందు విశ్వాసముగల్గి నే పూనుకొనిన యుద్యమము న్యాయమైనదని భావించు ఆయాంగ్లేయ స్త్రీపురుషుల నుద్దేశించియే. నాయందు విశ్వాసములేని స్వధర్ములగు హిందువులనుగాని, యితరులనుగాని యుద్దేశించికూడ కాదు. కాని

యేధర్మమునకు చెందినప్పటికిని నాయందు విశ్వాసముగల్గి నే పూనినకార్యము ధర్మమైనదని నమ్ము యసంఖ్యాకులగు నాదేశీయుల నుద్దేశించియే. నే నీవ్రతముసల్పుట ముఖ్యముగా హిందువుల యంతరాత్మలకు యొత్తిడి కలిగించి వారిని ధర్మప్రవర్తకుల గాఁ జేయుటకొరకే. ఈయుపవాసము ప్రజలను వట్టి యుద్రేకపూరితుల గావించుటకుకూడ కాదు. ఈయుపవాసరూపమున ధర్మాధర్మములలో అకళంకము, స్వచ్ఛము నగు ధర్మపక్షమున నే నాశక్తినంతయు వినియోగింపకోరెదను. అందువల్ల నాప్రాణములు రక్షింపవలెనని యనుచితమగు యావేగముగాని, అనవసరమగు యాతురతగాని యుండనక్కరలేదు 'శివునియాజ్ఞలేనిదే చీమయైన కుట్ట'దన్న సామెతయందు నాకు సంపూర్ణవిశ్వాసమున్నది.

తనసేవకు నా యీశరీర మవసరమున్నచో పరమేశ్వరుడే దీనిని కాపాడుకొనగలడు. ఆయన కాదన్న దీని నెవ్వరు రక్షింపజాలరు. సామాన్యదృష్టిచే చూచినను కొన్నిరోజులవర కీశరీర ముపవాసశ్రమను భరించగలదు. నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గములను ప్రభుత్వ మిచ్చినన్నవిషయము నిండుకుండలో కొంచెము నీరుచేర్చినట్లైనది. సవర్ణనాయకులును, నిమ్నజాతినాయకులును కలసి యేదో యతుకులమారి యొడంబడికను చేసికొనినచో సరిపోదు. ఏదైన యొడంబడిక అమలులోనికి రావలెనన్నచో అది రెండుపక్షము

ల వారును హృదయపూర్వకముగ చేసికొనినది కావలయును. హిందూసంఘములోని ప్రజాసామాన్య మీయస్పృశ్యతను సమూలముగ నాశనముచేసివైచుట కింకను సిద్ధముగాకున్న చో నన్నుగోల్పోవుటకు సంసిద్ధపడవలసినదే ఏమాత్రమును వెనుకాడరాదు.

సంయుక్తనియోజకవర్గములకు తీవ్రవిరోధులుగానున్న వారిని బలవంతపెట్టరాదు. నా రెండుల కంతతీవ్రవిరోధులు గానున్నారో నే నర్థముచేసికొనగలను. వారికి నన్నపనమ్మకముతో చూచుటకు కూడ నధికారముగలదు. నేనుకూడ నస్పృశ్యులనబడు యీప్రజలను పాతాళమున కణగద్రొక్కి పిప్పిచేయుచున్న సవర్ణులనబడువారిలోనివాడనేకదా? వింత విషయమేమన పంచములింకను హిందూసంఘమునుండి వీడి పోకుండనుండుటయే.

కాని వారి వైరుధ్యభావమును నేను సమర్థింపగలిగినను యీవిషయములో వారు పొరపడిరనియే నానమ్మకము. హిందూసంఘమునకు శాశ్వతకళంకముగా నుండునట్లు, చేతనైనచో యస్పృశ్యులను వేరుచేసి వారిని వేరొకసంఘముగా నేర్పాటు చేయువలెనని వారికోరిక. అది యస్పృశ్యులకు శ్రేయస్కరమైనచో నేనభ్యంతరపెట్టువాడనుకాను. కాని యస్పృశ్యతయొక్క వివిధరూపములు నాకవగతమగుటచే వారిజీవితములు తదితర హిందువుల జీవితములతో పూర్తిగా

నల్లుకొనిపోయినవని గుర్తించితిని. వారాహిందువులమధ్యనే, ఆహిందువుల ప్రయోజనములను సాధించుటకొరకే బ్రతుకుచున్నారు. అందుచేతనే యాహిందువులనుండి వారిని విడదీయుట అసంభవము. హిందూసంఘ మొకపెద్దకుటుంబము. అస్పృశ్యులుకూడ నాకుటుంబమునకు చెందినవారే.

ఇంతకాలమునుండి తామకలసియుండిన హిందువులపై యస్పృశ్యులు తిరుగుబాటొనర్చినను, లేక వారాహిందూసంఘమునుండి విడిపోయి అన్యమతస్వీకరణ మొనర్చినను, నాకర్థమగును. కాని నాకు తెలిసినంతవరకు వారి కట్టిసంకల్పము లేదు వారలకిష్టము లేకపోయినప్పటికిని, ఇన్నిరోజులనుండి హిందూసంఘములో వారినుంచిన సూక్ష్మమును, అనిర్వచనీయమునగు యేదో విశేషము హిందూధర్మమునందు కలదు. అట్టి విశేషముండునట్లెరింగి, దానిని నిత్యజీవితములో ననుభవించిన నేను హిందూసంఘమునుండి నిమ్నజాతులను విడదీయు ప్రయత్నముల ప్రాణార్పణమొనర్చియైన నిరోధింపవలసియున్నది.

పరిష్కరింపవలసిన సమస్య.

ఈనిరోధ విధానమునకుగల యంతరార్థము చాలగంభీరమైనది. హిందూసంఘములో నస్పృశ్యులకు పూర్తియైన స్వాతంత్ర్యమియ్యని యేయొడంబడికయును, హిందూసంఘమునుండి వారు విడిపోకుండ నుండుటకు తగిన పరిహారము కాజాలదు. ఇందులో మనవిధిని సరిగా నెరవేర్చకపోయినచో

నేనును, నావలె యభిప్రాయపడువారును ప్రాణార్పణ మొనర్చుట కొంతకాలమాగుటకంటె మరేమియు జరుగదు. రాజకీయముగను, సాంఘికముగను, నిత్యజీవితమునందును హిందువులస్పృశ్యుల ననేకవిధముగా బాధించుచున్నచో, నిరశనదీక్షయను సాధనను చేపట్టి, సత్యాగ్రహమునకు బూనువారలు నాతోపాటనేకమంది భారతదేశములో గలరు. వారిసంఖ్యదినదినాభివృద్ధి నందుచున్నది. నిమ్నజాతుల నుద్ధరించుటకును, హిందూధర్మమునుండి యస్పృశ్యతాకళంకమును తుడిచివేయుటకును వారు తమప్రాణముల తృణప్రాయముగ నర్పించెదరు. అటుల వారందరును సత్యాగ్రహ మొనర్పకడంగినచో తాముచూచి సహింపగలరాయను విషయమును బాధ్యులగు హిందూసంఘ నాయకు లాలోచించుకొనవలసియున్నది.

నా సహచరులగు సంస్కర్తలందరీయుపవాసదీక్షయొక్క యంతరార్థము లవగాహము చేసికొందురుగాక! ఈ యుపవాసదీక్ష భ్రాంతిమూలకమైనది యైన కావచ్చును. లేక జ్ఞానఫలితమైన కావచ్చును. భ్రాంతిమూలకమైనచో నన్నీ ప్రాయశ్చిత్తమును శాంతముగ చేసికొననిండు. దానివల్ల హిందూధర్మమును దిగలాగుచున్న మహాఘోరమొకటి వదలిపోవును. కాని జ్ఞానమూలకమైనచో నాయార్తివల్ల హిందూధర్మము పరిశుద్ధమగునుగాక! ఇప్పుడు నాయందవిశ్వాసము గలవారిహృదయములు కరగిపోవునుగాక!

ఈనానిరశనదీక్షాప్రయోగవిషయము కొందరు పొర పాటుగా నర్థముచేసికొనిరి. అందుచేత నిమ్నజాతులకు శాసనబద్ధమగు నేరూపముననైన ప్రత్యేకనియోజక వర్గము లుండకుండుటకొరకే నేను దీనిని ప్రారంభించబోవుచున్నా నని మరల చెప్పుచున్నాను. ప్రత్యేకనియోజకవర్గములను బెదరింపు మాయమైపోయిన తక్షణమే నాయుపవాసము కూడ నాగిపోవును. ఈసమస్యను పరిష్కరించుటకు తగిన మార్గమునుగురించియును, నిమ్నజాతులకు శాసనసభలలో కొన్నిస్థానముల ప్రత్యేకించుటనుగూర్చియు నాకు కొన్ని తీవ్రాభిప్రాయములు గలవు. కాని నేను ఖైదీగానుండుటవల్ల నాయభిప్రాయములను ప్రకటించుట తగదు. కాని సవర్ణులగు హిందూనాయకులును, నిమ్నజాతుల నాయకులును సంయుక్తనియోజకవర్గముల నాధారముగా గొని, ఏదైన యొడంబడికకు వచ్చినయెడలను, ఆ యొడంబడికకు హిందువులందరు బహిరంగసభలుచేసి తమ యంగీకారము తెల్పినయెడలను దానికి నంగీకరించుటకు సిద్ధముగానున్నాను.

ఒక్కసంగతిమాత్రము స్పష్టముగావించకోరెదను. నిమ్నజాతుల సమస్య తృప్తికరముగా పరిష్కరింపబడినంత మాత్రమున, బ్రిటిషు ప్రభుత్వము వారొసంగిన సాంఘికపరి ష్కారమునం దితరభాగములకు నేనంగీకరించిన ట్లర్థము కాదు. అందులోని కొన్ని భాగములకు నేను తీవ్రముగా (పతి

కూలుడను. నాయభిప్రాయము ప్రకార మీభాగములు, ప్రజాస్వామిక సూత్రముపై నాధారపడిన యెట్టి రాజ్యాంగ విధానమునైన సరిగా నడువనీయవు. ఈసమస్య తృప్తికరముగా పరిష్కరింపబడినంత మాత్రమున నికముందు నిర్మింపబడబోవు రాజ్యాంగవిధానమును నేనంగీకరించుట కొప్పుకొనినటులర్థముకాదు. అవి రాజకీయసమస్యలు భారతజాతీయ మహాసభయే వాటినన్నిటిని చర్చించి నిర్ణయింపవలెను. వాటిపై నెట్టియభిప్రాయములను చెప్పుటకును నాకువీలు లేదు. ఖైదీగానున్న నేను నాయభిప్రాయములను వెల్లడించుట సమంజసముకూడ కాదు.

నిమ్నజాతుల సమస్య ముఖ్యముగ ధార్మికవిషయము. దానికొరకు నే నేకాగ్రబుద్ధితో నాయావజ్జీవము పనిచేయుటవల్ల దానిని నాస్వంతవిషయముగా చూచుకొనుచున్నాను. అది నాకొక పవిత్రమును స్వకీయము నైన ధర్మము. ఆధర్మ నిర్వహణమునకు నేజంకరాదు. జ్ఞానసిద్ధికిని, పాపపరిహారమునకును, ఉపవాసదీక్షబూనుట అనాదిసిద్ధమగు నాచారము. క్రైస్తవధర్మమునందును, ఇస్లామునందును కూడ నీయాచారము కలదు. పాపపరిహారమునకును, ఆత్మసిద్ధికిని యుపవాసదీక్షపట్టిన వారియుదాహరణలతో హిందూధర్మచరిత్ర నిండియున్నది. ఇట్లుపవాసదీక్షబూనుటొక మహాభాగ్యమే కాని

యది యొకకఠోరవిధికూడనైయున్నది. అదిగాక, నాచేత నగునంతవరకు దీనిని నేనొక శాస్త్రముక్రింద తయారుచేసితిని.

ఉపవాసదీక్షా శాస్త్రమునందు ప్రవీణుడనగు నేను, నాయందు సానుభూతి చూపించుచున్నామని భ్రాంతిపడి, గుడ్డివారివలె నన్ననుకరింపవలదని మిత్రులను, అభిమానులను, హెచ్చరించుచున్నాను. అట్టివారందరును, కష్టించిపనిచేసి, అస్పృశ్యులకు స్వార్థరహితమగు సేవచేసి ఉపవాస మొనర్చుటకు తగినయర్హతను సంపాదించుకొనెదరుగాక! అంతట వారుపవాసమును జేయవలసిన, అవశ్యకత కలిగినచో వారి యంతరాత్మ వారల ప్రబోధించును.

నన్ను గురించి నాకు తెలిసినంతవర కీయుపవాసమును నిష్కల్మషమును, పవిత్రము నగు భావములతో ప్రారంభించు చున్నాను. నాకెవ్వరియందును ద్వేషముగాని, ఆగ్రహము గాని లేదు. నాకుమాత్రమీవ్రతము నా యహింసాసిద్ధాంతఫలితమే. ఈదీక్షవల్ల నాసిద్ధాంతమునకు పూర్ణత్వము సిద్ధించును. కావున, నాకుగాని, నాయుద్యమమునకుగాని, విరోధులని తోచువారలపై వాదోపవాదములయం దెవ్వరైనను దౌర్జన్యముపయోగించినచో నట్టివారలు నే శీఘ్రముగ మృతినొందుటకు కారకులగుదురు. మనయుద్యమము జయమొందవలెనన్నచో ప్రతికక్షులయందమితగౌరవముతోను మర్యాదతోను మనము మెలగుట యత్యంతావసరము."

* * * * * *

బొంబాయిలో హిందూనాయకుల సమావేశము మొదటిసారి 19 తారీఖున జరిగినది. డాక్టర్ అంబేద్కరు గారుకూడ హాజరైరి. మహాత్ముని ప్రాణములనైనను రక్షింపవలెను. హిందూధర్మమునుండి యస్పృశ్యతాకళంకము నచిరకాలములోనే తుడిచివేయవలెనను రెండువిషయము లేకగ్రీవముగా నంగీకరింపబడినవి. సంయుక్తనియోజకవర్గములా లేక ప్రత్యేకనియోజకవర్గములా యన్నవిషయము, అంబేద్కర్‌గారు మహాత్ముని యభిప్రాయములు తెలియకుండ తానేమియు చెప్పజాలననిరి. మరునాడు 20 వ తేదీని, పూనానుండివచ్చిన బిర్లామున్నగు వారలను కలసికొనుటకు నాయకులసమావేశము జరిగినది. అందులో మహాత్ముని యభిప్రాయములను సర్ చునిలాల్ మెహతాగారు తెలియపరచిరి. డాక్టర్ అంబేద్కరుగారు సంధిమరతుల నాలోచింతునని చెప్పిరి. సమావేశము మరునాటివరకు వాయిదా చేయబడినది.

నాయకులసమావేశ మానాటికాగిపోయినను, సంప్రతింపులాగలేదు. బిర్లాగారిగృహము రంగస్థలమైనది. అక్కడ డాక్టరు అంబేద్కరు, డాక్టరు సోలంకిగార్లతో, పండితమాలవ్యా, సప్రూ, రాజగోపాలాచార్యులు, సర్ చునిలాల్ మెహతా, సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్, సేట్ మథురదాస్ వాసంజి, జి. డి. బిర్లా, జయకర్, డాక్టరు మూంజి, టి. ప్రకాశం, బాబూ రాజేంద్రప్రసాద్ మున్నగు

వారలు సంయుక్తనియోజకవర్గములను, నిమ్నజాతులకు శాసనసభలలో కొన్నిస్థానముల ప్రత్యేకింపబడుటకు నొప్పుకొనవలసినదని వాదించసాగిరి. కాని అంబేద్కరుగారు అంగీకరింపలేదు. "సంయుక్తనియోజకవర్గములు నెలకొల్పినచో సవర్ణహిందువులు, తమకిష్టమగు నిమ్నజాతినాయకులను, నిమ్నజాతులకు ప్రత్యేకింపబడిన స్థానములలో నిలబెట్టి వారికి తమ ఓట్లనీయవచ్చును. పైగా నిమ్నజాతులకుగల ఓట్లుకంటె సవర్ణహిందువులకు ఓట్లు ఎక్కువగానుండును. అందుచేత నట్లు నిలబెట్టబడినయభ్యర్థులు, నిమ్నజాతుల ఓటరులపై నాధారపడక, వారిమాటల లక్ష్యముసేయక సవర్ణహిందువులు చెప్పినట్లు ప్రవర్తింపవచ్చును. అందువల్ల పేరునకే నిమ్నజాతులకు శాసనసభలలో ప్రాతినిధ్యముండును వారల కిప్పటికష్టములు పోవుసరికదా, వారిమాటలను సరకుచేయక, వారిబాగోగుల విచారింపక, శాసనసభలలో వారిప్రతినిధులమని యాసభ్యులు చెప్పకొనుచుండ నిస్సహాయులై చూడవలసినస్థితి యేర్పడు"నని వారి వాదన. సవర్ణనాయకులు దేశములో బయలుదేరిన మహోద్యమమును జూపి అంబేద్కరుగారిని తృప్తిపరచగోరిరి. కాని లాభము లేకపోయినది. వాద ప్రతివాదములు దీర్ఘకాలము తీవ్రముగ జరిగినవి. కాని ఫలితము శూన్యమేయగుచు వచ్చినది.

చివరకు సర్ తేజ్ బహాదూర్ సప్రూగారు నిమ్నజాతులకు ప్రత్యేకింపబడినస్థానములలో కొన్నిటికి 'ప్రాథమిక

యెన్నికవిధానము' నవలంబించి, మిగిలిన స్థానములకు సంయుక్తనియోజకవర్గములను పెట్టినచో అంబేద్కరుగారి భయమునకు తావుండదని సూచించిరి. ప్రాథమిక యెన్నికవిధానమనగా నిది:-నిమ్నజాతులకు శాసనసభలలో 100 స్థానములు ప్రత్యేకింపబడినవనుకొనుడు. ఈస్థానములకు నిమ్నజాతులవారు తమలోనుండి ప్రతినిధుల నెన్నుకొందురు. వీరు తరువాత నాస్థానముల కసలు యెన్నికలలో పోటీచేయుదురు. దీనివల్ల సవర్ణహిందువులచే నిలబెట్టబడిన నిమ్నజాతులవారెవ్వరో గాక, నిమ్నజాతుల ఓటరులు తమంతతా మెన్నుకొనిన ప్రతినిధులే యెన్నికలలో పోటీచేయుదురు. తమకు ప్రత్యేకింపబడిన 100 స్థానములకు పోటీచేయుటకు గాను సరిగా నూరుప్రతినిధులనే తమలోనుండి ఎన్నుకొనినచో సరియైనవారు రాకపోవచ్చును. అందుచేత ప్రత్యేకింపబడిన స్థానమున కొక్కొకదానికి పోటీచేయుటకుగాను ముగ్గురనో నలుగురనో యెన్నుకొందురు. అనగా 'నభ్యర్థివర్గము' నొకదానినేర్పరచుకొందురన్నమాట. అట్లు ప్రత్యేకింపబడిన ప్రతిస్థానమున కొక్కొకయభ్యర్థివర్గ మేర్పడును. ఈయభ్యర్థివర్గములో నెవరు సభ్యుడుగానుండుట యిష్టమో వానికి నిమ్నజాతిఓటరు తన ఓటునిచ్చును. నిలచినవారిలో మొదటి నలుగురో లేక ముగ్గురో- నిర్ణయించుకొనిన ప్రకారము- అభ్యర్థివర్గముగా నియమింపబడుదురు.

## హరిజనసమస్య.

సప్రూగారి సూచనను డాక్టరు అంబేద్కరుగా రంగీకరించిరి. కాని బ్రిటిషుప్రధానమంత్రి శాసనసభలలో నిమ్న జాతులకు ప్రత్యేకింపబడిన స్థానములకంటె నెక్కువస్థానములు ప్రత్యేకింపబడవలెనని మాత్రముకోరిరి. విశేషచర్చానంతరము, నిమ్నజాతులకు ప్రధానమంత్రి యిచ్చిన 71 స్థానములకును ప్రాథమికయెన్నిక విధానము వర్తించుటకును, వాటిలో నొక్కొక్క స్థానమునకు ముగ్గురకు తక్కువగాని యభ్యర్థి వర్గము నేర్పరచుకొనుటకును, అట్టి యభ్యర్థి వర్గములలోనివారు నిమ్నజాతులచే నేరుకొనబడిన ప్రతినిధుల క్రింద సామాన్యనియోజకవర్గములలో నాస్థానమునకు నిలబడుటకును హెచ్చుగా ప్రత్యేకింపబడిన మిగతాస్థానములకు సంయుక్తనియోజకవర్గములు వర్తించునట్లు నేర్పాటుచేసుకొనిరి.

అంతయును బాగుగనే యున్నది. కాని దీనికి మహాత్ము డంగీకరించునాయని ప్రశ్న బయలుదేరినది. తక్షణమే శ్రీరాజగోపాలాచార్యులు, బిర్లా, రాజేంద్రప్రసాద్, దేవదాస్‌గాంధి గార్లు మహాత్మునియొప్పించుటకు తాము ప్రయత్నింతుమని చెప్పిరి. అరాత్రియే సప్రూజయకరుమున్నగువారలందరు పూనాకు బయలువెడలిరి.

౫

దీక్షా ప్రారంభము.

బొంబాయిలో సమావేశమైన హిందూనాయకులు చీలగునంత త్వరలో సమాధానమును కుదుర్చుకొన నిద్రాహారములను మాని ప్రయత్నించుచుండ, దేశసేవకు లస్పృశ్యతను కూకటి వ్రేళ్లతో పెల్లగించ శక్తివంచన లేకుండ పాటుబడుచుండ, ఉపవాసదినము సమీపించినకొలది తమపాపములకై ప్రాణార్పణ చేయబోవుచున్నాడేయని సవర్ణులును, తమ కత్యంత శ్రేయోభిలాషియగు మహాపురుషుడు తమకై జీవితసర్వస్వమును ధారబోయనున్నాడేయని అస్పృశ్యులును కలతనొందుచు బొంబాయిపట్టణము వైపు ఆశాదృష్టుల నిగుడ్చుచుండ, దీనికంతకును కారణభూతుడగు నామహాత్ముడు తనకాలము నెట్లు గడపుచుండెను? ఆశ్రమవాసులకును, యితరులకును, తనదీక్షాతత్వము నుపదేశించుచు ధైర్యముగొల్పు లేఖలను స్వంతముగ వ్రాయుచు ఉపవాసమునకు సిద్ధపడుచుండెను. క్రమక్రమముగా నాహారమును, పనిని తగ్గించుకొనివచ్చుచు ప్రశాంతుడైయుండెను.

సెప్టెంబరు 20 వ తారీఖు వచ్చినది. నిద్రాముద్రితమైన భారతభూమిని నూతనచైతన్యకళలచే వెలార్చిన మాంత్రికుడు, సర్వప్రపంచమును సంభ్రాంతమై, విస్ఫారితనేత్రముల పరికించుచుండ శత్రుని ప్రేమచే జయింప మహోద్య

మమును లేవదీసిననాయకుడు, భారతీయజనమనోహరుడగు నామహాత్ముడు, ప్రాతఃకాలముననే నిద్రలేచెను. ప్రార్థనల సల్పెను. తన కత్యంతప్రియమగు 'వైష్ణవజనతో' (వైష్ణవు డెవ్వడను) యనుగీతము నాలకించి, యధాప్రకారము గీతా పఠనము గావించెను. పగలు గం 11-30 నిమిషములకు కడసారి, వేడినీటితో నిమ్మరసమును, తేనెను గ్రోలి తన భోజ నమును ముగించెను. అంతట చుట్టునున్నవారు శ్రీయుత అబ్బాస్ త్యాబ్జిగారి కుమార్తెయగు రైహాన్ ఖేక్ గారిచే పంప బడిన "పాంథా నిద్రలెమ్మను" మధురగీతము నాలాపించుచుం డిరి. జైలుగడియార మింతలో 12 గంటలు, 'టంగటంగు' కొట్టెను. అప్పటినుంచి భగవంతునితో మహాత్మునికి సంరంభ మారంభ మయ్యెను. ఆరోజుసాయంత్రమే జైలులో కాలుపెట్టిన యెనిమిదినెలల తరువాత తన యుపవాసదీక్షనుగురించి పత్రి కా ప్రతినిధులతో మహాత్ముడీక్రిందివిధమున జైలు సూప రెంటెండెంటుగారి ఆఫీసుగదిలో కూర్చొని ముచ్చటించెను.

"నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గములు లేకుండ తీసివేసినచో నా శపథమును మాన్పుట కడసరిపోవును. కాని దానిపూర్తియుద్దేశముమాత్రము నెరవేరదు. నేను పుట్టుకవల్లవైశ్యుడనైనను, అస్పృశ్యులలో నొకనిగనే నన్ను భావించుకొనుచున్నాను. కావున సవర్ణహిందువులకును నిమ్నజాతులకు నేదేనియొడంబడిక కుదిరినంతనే నేను తృప్తి

పడువాడనుగాను అస్పృశ్యతామహాపాపము కూకటివేళ్ళతోసహా నాశనమై పోవలయును. అదియే నాకోరిక. దానికొరకే నే జీవించుచున్నాను. అవసరమైనచో దానికొరకే సంతోషముతో నాప్రాణమునుకూడ నర్పించెదను.

నిజమైనయొడంబడిక కుదురవలయుననియే నేనుపాటు పడుచున్నాను. అది కుదురకపోయినచో, నేను జీవించినను నాది వ్యర్థజీవనమేయగును. నాశపథముయొక్క ముఖ్యోద్దేశము పూర్తిగా నెరవేరకపోయినచో నే నియుపవాసమును మానివేసినమరునాడే యింకొకయుపవాసమునకు దిగవలసి వచ్చును. పైవారికిది వెర్రిగా తోచవచ్చును నాకుమాత్ర మట్లు తోచుటలేదు. ఈకళంకమును రూపుమాపుటకు నాకడ నింకేదియైన నున్నచో దానినికూడ నర్పించెదను. కాని నాప్రాణముకంటె నాకడ నింకేదియును లేదు. అస్పృశ్యతకు ప్రతికూలముగా నే జరుపుపోరాటము మానవజాతిలో గల మాలిన్యముతో పోరుసల్పుటయే. నేనుసాధింపబోవుకార్యము న్యాయమైన దనుభావనయందును, మానవస్వభావము నందును,హిందూధర్మమునందును కడకు ప్రభుత్వోద్యోగి వర్గమునందుననుకూడ నాకుగల విశ్వాసముపైననే యీయుపవాస మాధారపడియున్నది.

నాయుపవాసముయొక్క ధర్మస్వరూపమును, ఆధ్యాత్మిక తత్వమును, బాగుగా గమనింపగోరెదను. క్రైస్తు మహా

మ్మెదుతే నాకిందుకు ప్రమాణపురుషులు. కాని నే నామహా పురుషులకంటె తక్కువవాడను. అయినప్పటికిని నాతాహతు ననుసరించి యాజగన్నాథునితో నొకపట్టు పట్టవలెనని యే యీ యుపవాసదీక్షను ప్రారంభించితిని.

నాయభిప్రాయములన్నిటి నిదివరకే స్పష్టము గావించి యుంటిని. నే నింతకాలమునుండి ఖైదులో నుండుటచే ప్రస్తుత విషయమును గురించి నే నేమియును చెప్పజాలకపోతిని. ఇప్పుడు నాకీయవకాశమబ్బి కొన్నిగంటలేయైనది. ప్రథమమున పత్రికా ప్రతినిధులగు మీతోడనే మాట్లాడుచుంటిని. ఈ నెల 15 వ తేదీని నేను ప్రభుత్వమున కంపిన ప్రకటనను పత్రికలలో ప్రకటింపబడుటకు ప్రభుత్వముహా రిచ్చియున్న చో, నే నీనిశ్చయమున కేలవచ్చితినో ప్రజల కర్థమై యుండెడిది.

నే నీయుపవాసమును బూనునది- అస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గము లుండకూడదనిమాత్రమే. వారికి శాసనముల మూలమున కొన్నిస్థానములు ప్రత్యేకింపరాదని కాదు. నిమ్నజాతులకు శాసనసభలలో కొన్ని స్థానములను శాసనముల మూలమున ప్రత్యేకింపరాదని పట్టుపట్టి కార్యభంగ మొనర్చితి నన్నది కొంతవఱకే సత్యము. ఇప్పుడు నప్పుడునుకూడ, శాసనములమూలమున కొన్నిస్థానములను శాసనసభలలో నస్పృశ్యులకు ప్రత్యేకించి యుంచుటకు

నేను వ్యతిరేకుడనే కాని యుక్తివిధానము నొకదానిని యెవ్వరు నాయుం దిడియుండవచ్చును దానిని నే నంగీకరించుటకుగాని, నిరాకరించుటకుగాని యవకాశ మెక్కడిది ?

శాసనములమూలమున స్థానముల ప్రత్యేకించుటను గూర్చి నే నాలోచించినపిమ్మట నది కూడదని విస్పష్టముగా తెలిపియుంటిని. అట్లు స్థానములను ప్రత్యేకించుటవల్ల నిమ్న జాతులకు లాభమునకు బదులు హానియే చేకూరును. అది వారిసహజాభివృద్ధి నాటంకపరచును. స్థానముల ప్రత్యేకించుట యొక్క యూతకర్రవంటిది. నడచుటకూడ కర్రమీద నాధారపడువా డదివదలునంతవరకు దుర్బలుడే కదా !

ప్రజలు నన్నుచూచి నవ్వకపోయినచో నొక్క మాట చెప్పెదను. అది నే మొదటినుండియు నొక్కి చెప్పుచునే యుంటిని. నేను పుట్టుకవల్ల వైశ్యుడను. కోరికవల్ల నస్పృశ్యుడ నైతిని. నాకు తోచినవిధమున యస్పృశ్యులలోని యే కొలదిమందికో గాక, వారందరకును ప్రతినిధినగుటకు ప్రయత్నించితిని. మనదౌర్భాగ్యవశమున నస్పృశ్యులలో కూడ నెన్నియో కులములును శాఖలును ఉన్నవి. కావున మొదటినుండియు నస్పృశ్యులలో నధమాధమస్థితియందున్న వారలతో- నందులోను చూడరానివారనియును, చేరరానివారనియును పిలువబడువారిప్రతినిధినై వారితో నేకీభవించుటయే నాయాశయముగ పెట్టుకొంటిని. నే నెక్కడతిరుగు

చున్నను నాకండ్లముందరనే వారిల్లప్పుడు కానవచ్చుచుందురు. నేనెక్కడకుపోయినను యీవిషమయంబగు కంటకముతే నా హృదయమున నాటిపోయినవి. మలబారుదేశములోవారిని చూచితిని. కొంతమందిని ఒరిస్సాలో చూచితిని. అట్టివారేనాటికైన యుచ్ఛదశకు రావలెనన్నచో శాసనసభలలో వారికి స్థానములను ప్రత్యేకించుటవల్ల లాభములేదని నా దృఢవిశ్వాసము. హిందూసంఘసంస్కర్తలు వారిమధ్యను చేరి, యెడతెగని పనిచేయుటవల్లనే యది సాధ్యమగును. నిమ్నజాతులను తదితర హిందువులనుండి విడతీసినచో నీసంస్కరణావకాశము లన్నియును పూర్తిగ నశించిపోవును. అందువల్లనే నే దీనికి వ్యతిరేకముగా నెదురుతిరిగితిని. నా యంతరాత్మ పూర్తిగా తిరుగబడినది.

నేను వాంఛించునది, నేను జీవించుచున్నది, నేను మరణించుటకు సంతోషించునది, యీయస్పృశ్యతను సమూలముగ పెల్లగించివేయుటకే. అందువల్లనే నేను సజీవమైన యొడంబడిక కావలె ననుచున్నాను. ప్రాణమునొసంగు నా యొడంబడిక ముందెన్నడోగాక, నేడే యమలులోనికి వచ్చి సద్యః ఫలితము లొసంగవలెను. ఆసేతుశీతాచలపర్యంతమున్న సవర్ణులును పంచములును కలసి, కేవల నాటకప్రదర్శనమువలెగాక, వాస్తవమైన సోదరప్రేమతో, హృదయములు పల్లవింప సభలుచేసి, ఆయొడంబడిక నామోదింపవలెను.

గత యాబదిసంవత్సరములనుండి నే నీ స్వప్నమునే గాంచు చుంటిని. ఈస్వప్నమును నాజీవితములో ప్రత్యక్షముచేసి కొనుటకే నే డీజ్వాలాముఖమున ప్రవేశించితిని.

బ్రిటిషుప్రభుత్వము వారి సాంఘిక పరిష్కారము కాక తాళీయముగ నున్నది. అదియే తుదిచెడులక్షణము ఇట్టివిష యములను గనిపెట్టుటలో ఘనవైద్యుడనైన నేను, యీ రోగలక్షణములను తక్షణమే గుర్తించితిని కావున నీప్ర త్యేకనియోజకవర్గముల నుపసంహరించుకొనుట నాయభి ప్రాయములో నా దోషనిర్మూలనకు ప్రారంభించుటయే యగును. స్వస్తిచెప్పుట కాజాలదు.

బొంబాయిలో కూడిన నాయకులును, మరియితరు లును, తొందరపడి యేదో తీర్మానమును చేయకుందురు గాక! నాప్రాణమును నే నంతముఖ్యమైనదిగా పరిగణింపను. ఈధర్మకార్యమును సాధించుటకు నావంటి ప్రాణముల నూ రింటిని బలియిచ్చినను సవర్ణు లింతకాలమునుండి తమతోడి మానవులును స్వధర్ములును నిస్సహాయులునగు స్త్రీపురుషు లకు గావించిన ఘోరాన్యాయములకు తగినప్రాయశ్చిత్తము కాజాలదు. కావున, సరియగు ధర్మమార్గమునుండి యణు మాత్రమైన తొలగవలదని వారి ననురోధించెదను.

నాయుపవాసమునకు రాజకీయములతో నేవిధమైన సంబంధమును లేదు. దానికి రాజకీయఫలితము లుండబో

వనికాదు. గొప్ప రాజకీయఫలితము లుండునని కూడ నెరుం గుదును. కాని, అవి యంతముఖ్యమైనవి కావు. దానికి గల నైతిక, ధార్మికస్వరూపమే ముఖ్యమైనది. ఇక్కడ ధర్మమను పదమును దానికిగల విశాలార్థమునందే గ్రహించితిని. ఏల నన, అస్పృశ్యతను ఖండించుటవల్ల నే నాధర్మమూలమునకే చొచ్చుకొనిపోతినని నావిశ్వాసము. అందుచేత నిది యతీత ధర్మము. రాజ్యాంగవిధానరూపకమైన స్వరాజ్యముకంటె నెన్నియోమడుంగులు మహత్తరమైనది. తమ్ము దిగలాగు చున్న మహాభారము తమనెత్తిమీదనుండి పోవునను ఆశతో నాపతితమానవకోటిహృదయములు పల్లవింపచేసి, వారి యందరచే నంగీకృతమైనదన్నునైతికబలము లేనిచో నా రా జ్యాంగవిధానము ప్రజాక్షేమమునకు శత్రువే యగును. ఆం గ్లేయోద్యోగివర్గ మీనిజపరిస్థితుల నెరుంగదు. కోట్లకొలది ప్రజలయొక్క జీవనాధారమునకు సంబంధించినసమస్యలను వా రజ్ఞానమువల్లను, తామే తగుదుమన్న, ఆత్మసంతృప్తి వల్ల ను, పరిష్కరింప సాహసింపుచున్నారు. ఈ యుద్యోగివర్గ మునుకూడ నజ్ఞానాంధకారములోనుండి బయటకు లాగుటకే ప్రాణము లొడ్డియైన విరోధింపవలసినదని నాయంతరాత్మ ప్రబోధించినది.

పరమేశ్వరాజ్ఞచేతనే, నే నీయుపవాసమును బూనితి నని నాదృఢనమ్మకము. కావున, అంతరాత్మచే ప్రబోధింప

బడినవారే తప్ప యితరు లీదీక్ష బూనకూడదు. ఆత్మశుద్ధి కొరకును, అస్పృశ్యతానివారణోద్యమమం దభిమానము చూపుటకును, ఒకరో జుపవాసము చేయుటెన్నడైన మంచి దేయగును. చేయదగినదే. కాని, బ్రిటిషుప్రభుత్వమువారు తమసాంఘికపరిష్కారములో యస్పృశ్యులకు సంబంధించిన భాగము నుపసంహరించుకొనువరకు నుపవాస మొనర్చెదమని నా కనేకులదగ్గరనుండి యుత్తరములు వచ్చినవి. అట్లెవరైన చేసినచో వారు తప్పుత్రోవ తీసినవారగుదురు. అందువలన వారికిగాని, యితరులకుగాని యావంతైన లాభముండదు సరికదా బహుశః చేసినవాని కాధ్యాత్మికముగా హానికలుగునని నాయుద్దేశము.”

* * * * *

మహాత్ము డుపవాసదీక్షను ప్రారంభించెను. దేశమెల్లెడల నశాంతియే తాండవించుచుండెను. మహాత్ముని పేరు తెలిసినంతవర కెల్లవా రానా డుపవాసము సల్పిరి. మహాత్ముని దీర్ఘాయుష్మంతుని చేయుమని ప్రార్థనలసల్పిరి.



౬

పురాణములలో చదివినది ప్రత్యక్షమైనది. ఋషుల న్నను, తపోమహిమలన్నను, సంశయదృష్టులతో జూచు యీనాటిప్రజల నావరించిన, అజ్ఞానాంధ కారము తొలగిపోవురోజులువచ్చినవి. సర్వ భూతములను సమభావముతో జూచిన మహ ర్షులు జన్మించిన యీప్రాచీనార్య భూమిలో, ఏప్రజలనీడతగి లిననే మహాపాపమని సనాతన ధర్మావలంబకులమని చెప్పు కొనువారు భావించుచున్నారో, ఆయస్పృశ్యులపైగల యన్యాయములగు నిర్బంధముల నూడ్చివేయుటకు మహాత్ముడు తపస్సుప్రారంభించి యొకరోజు గడచిపోయినది.

ఉపవాసదీక్ష.

రెండవదినమున- అనగా సెప్టెంబరు 21 వ తేదీ బుధ వారమునాటి యుదయముననే మహాత్ముడు లేచి యథావిధి కాలకృత్యముల నిర్వర్తించుకొని ప్రార్థనగావించెను. పూర్వ పు ఏర్పాటుప్రకారము సరిగా 7 గంటలకు సప్రూ జయకర్ మున్నగు వారలందరును జైలునకు వచ్చిరి. సంభాషణలు జైలాఫీసుగదిలో జరిగినవి. మహాత్ముడు తన కొట్టునుండి, అక్కడకునడచి వెళ్ళి రాయబారులకు మందహాసముతో హృదయపూర్వకస్వాగతము నొసంగెను. అనంతరము, 'ఈసభకు నేనే నధ్యక్షుడనని నవ్వుచు పలుకుచు నొకకుర్చీపై కూర్చొ

రెండవరోజు
21-9-32
బుధవారము.

నెను. శ్రీమతి సరోజనీదేవి రాజుబాబులను 'ఏమిచేసికొని వచ్చినా'రని పదేపదే యడుగుచుండెను. సర్ తేజ్ బహాదూర్ సప్రూగారు సంభాషణను ప్రారంభించి, తన విధానమునంతను వివరించిరి. మహాత్ముడు శాంతముగ వినుచు, రెండుమూడుసారులుమాత్ర మడ్డువచ్చి, తనకు గలిగిన సందేహములను దీర్చుకొనెను. కడకు, 'మీవిధానమునుగూర్చి నేనాలోచించెదను. నాకదివ్రాసియిం'డని సప్రూగారి నడిగెను. దానితో సప్రూగారి కెక్కడలేని సంతోషోత్సాహములు వచ్చినవి. పిమ్మట మహాత్ముడు తానావిధానము విషయమై యిదమిత్థమని నిర్ణయించుకొనుటకు పూర్వము డాక్టరు అంబేద్కరుగారితోను, యం. సి. రాజాగారితోను మాట్లాడగోరెదననెను. అంతట వారందరును మహాత్ము నారోగ్యమువిషయమై ముచ్చటింపసాగిరి. జైలుకొట్టునుండి, ఆఫీసుగదివరకు నడచి వచ్చుచుండుటవల్ల మహాత్మునికి ప్రయాసమధికమగుచుండుటచే చాల బలహీనుడై పోవుచుండెను. ఉపవాసదినములలో గాంధీజీ నెట్లు చూడవలెనో ప్రభుత్వముకడనుండి తనకింక నుత్తరువు లేవియు రాలేదనియును మహాత్మునితో సంభాషించుటకు వచ్చువారల నాయనదగ్గరకు తీసికొనిపోవుటకు తగిన యేర్పాటుల తక్షణమే కావించెదననియును, జైలుసూపరింటెండెంటు రాజుబాబులతో చెప్పెను.

ఇది జరిగిన యొక గంటకు, మహాత్ముడు, సర్దారు పటేలు, మహాదేవదేశాయిగార్లు, జైలుసింహాద్వారమునకు దగ్గరగానున్న యొకఖాళీవార్డులో ప్రవేశించిరి. అక్కడగల యొక గున్నమామిడిచెట్టు నీడలో, జైలుజముఖాణమును, దుప్పటియును పరచబడిన యినుపమంచముపై మహాత్ముడు పండుకొనియుండెను. మంచముచుట్టును చూడవచ్చినవారు కూర్చొనుటకు కుర్చీలు వేయబడియుండెను. ఒకప్రక్క నొక చిన్నమెత్తుబల్లపై, పుస్తకములును, కాగితములును, వ్రాత పరికరములును, నీటి సీసాలును, సోడా, యుప్పుమున్నగు చిల్లరవస్తువులును గలవు. మహాత్ముడు మాటిమాటికి గ్లాసు లో నీరు పోసుకొని, ఉప్పును గలుపుకొని, గుక్కెడు గుక్కెడు నీరు త్రాగుచుండెను. శ్రీమతి సరోజినీదేవి, స్త్రీల జైలునుండి మహాత్మునికడకు తీసుకు రాబడెను. వచ్చినవెం టనే యాచిన్నసంసారమున కామె యాజమాన్యము వహిం చి, అందరపై నధికారము చలాయింపసాగెను. ఈక్రొత్త వార్డునకు వచ్చిన పిమ్మట మహాత్ముడు మొట్టమొదట సంభా షించినది పూనా హరిజననాయకులగు శ్రీరాజభోజగారి తోనే. శ్రీరాజభోజగారు మహాత్మునిపక్షము వహించు టకు మాటయిచ్చిరి. మహాత్ముడో! యింతకాలమునుండి వారనుభవించుచున్న బాధలకు పరిహారముగా సవర్ణులకడ నుండి హరిజను లెట్టి షరతులను గోరినను తాను వారలను నిందింపజాలనని చెప్పెను.

అక్కడ బొంబాయిలో నాయకులసమావేశము పగలు మూడుగంటలకు మరల జరిగినది. కాని పూనా నుండి వార్త లేమియు రానందున మరునాటివరకు కాపుచేయబడినది. అధ్యక్షులగు పండిత మదనమోహాన మాలవ్యా గారు రావుబహదూరు యం. సి. రాజాగారిని వెంటబెట్టుకొని మోటారుమీద పూనాకు బయలుదేరివచ్చిరి. సప్రూగారు మహాత్ముని కోరికను డాక్టరు అంబేద్కరుగారికి తెలియపరచిరి. వారుకూడ మహాత్మునితో కలసిమాట్లాడుటకు పూనావచ్చుట కంగీకరించిరి. ఈవార్త తెలియుటతోడనే దేశములో కొంత సంతృప్తికిని, ఆశకును తావుదొరకెను. మహాత్ముడును డాక్టరు అంబేద్కరుగారును నొండొరులతో సంభాషించినచో సర్వమును చక్కబడుననియే అందరు భావించుచుండిరి.

బుధవారము రాత్రి సుఖముగా గడచినది. నాడెల్ల మహాత్ము డవసరమగునప్పుడెల్ల, ప్రక్కదిగి మరుగుదొడ్డికి నడచిపోవుచునే యుండెను. మరునాటియుదయము నాలుగుగంటలకే శ్రీ రాజేంద్రప్రసాద్, రాజగోపాలాచార్యులగార్లను తక్షణమే జైలునకు రమ్మని మహాత్ముడు టెలిఫోను వార్తనంపెను. వారువచ్చినపిమ్మట వారితో నిట్లనెను. "సప్రూగారి విధానమును పరిశీలించితిని. కాని తృప్తి కలుగ

మూడవరోజు
22-9-32
గురువారము.

లేదు. ఆవిధానము నిమ్నజాతులవారికి ప్రత్యేకింపబడిన స్థానములలో కొన్నిటికిమాత్రమే వర్తించునట్లును మిగిలిన వాటికి సంయుక్తనియోజకవర్గములద్వారా నెన్నికలు జరుగునటియును వారు చెప్పిరి. దీనివల్ల నిమ్నజాతులలో రెండు పక్షము లేర్పడును. ప్రాథమిక యెన్నిక విధానముద్వారా నెన్నుకొనబడినవారు తామే నిమ్నజాతులకు సరియైన ప్రతినిధులమని చెప్ప మొదలిడుదురు. దానితో మామూలుగా సంయుక్తనియోజకవర్గములద్వారా నెన్నుకొనబడిన ప్రతినిధులు సరియైనవారు కారను భావము ప్రబలవచ్చును. దీనికి నే నంగీకరింపజాలను. పైగా అంబేద్కరుగారు, వారి జనాభానుసరించి నిమ్నజాతులకు పురపాలకసంఘములందునను, లోకలుబోర్డులందునను స్థానములుండవలయుననియును, ప్రభుత్వోద్యోగములు మున్నగునవికూడ నట్లే యొసంగబడవలెనను చున్నారు. వారి కోరిక సరియైనదే. కాని, దీనినంతను రాజ్యాంగవిధానమునందు చేర్చుటకు వీలు లేదు. ఇంతకును, ప్రాథమిక యెన్నికవిధానము మంచిదో చెడ్డదో మీ రిద్దరు నాకు చెప్పవలెను మంచిదైనచో నావిధానము నిమ్నజాతులకు ప్రత్యేకింపబడిన స్థానములన్నింటికి నేల వర్తింపరాదు? చెడ్డదైన దానిమాటయే వలదు. దీనికి మీ రితరులతో నాలోచించి ప్రత్యుత్తర మిండు." సంభాషణము ముగిసినవెంటనే యిరువురు పండిత మదనమోహన మాలవ్యా

గారి మకామునకు నావిషయమై చర్చించుటకు వెడలి పోయిరి.

అక్కడ జయకర్ సప్రూగార్లు బొంబాయినుండి వచ్చిన అంబేద్కరుగారిని వారిబసలో చూచివచ్చిరి. అంబేద్కరుగారు సమాధానమునకు వచ్చునట్లుగపడుట లేదని కలత చెందుచుండిరి. కాని తక్షణమే వారందరు పూర్వమునిర్ణయించుకొనిన ప్రకారము మహాత్మునికడకు పోవలసియుండుటచే శ్రీరాజగోపాలాచార్యులు రాజేంద్రప్రసాదుగార్లు మహాత్ముడు చెప్పినది వారికి చెప్పుటకవకాశము లేకపోయినది. వారందరు జైలునకు వెళ్ళినప్పుడు మహాత్ముడు తన సందేహములను, చిక్కులను వారిముందర వెల్లడించినంతనే వారాశ్చర్యచకితులై పోయిరి. సప్రూజయకర్ గార్లు నిరాశపడసాగిరి. సంభాషణలు త్వరలోనే ముగిసినవి. పగలు 12 గంటలకు బరువెక్కిన హృదయములతో వారందరు మకాము చేరిరి. కర్తవ్యమును గురించి భోజనములు చేయునప్పుడు చర్చించిరి. చివరకు తామెవ్వరును డాక్టరు అంబేద్కరుగారికి మహాత్ముడు చెప్పినది తెలియజేయకుండుటకు నిశ్చయించుకొనిరి. అంబేద్కరు మహాత్మునినోటినుండియే వినుట లాభదాయకమని యభిప్రాయపడిరి. “మహాత్ముని చూచినంతనే అంబేద్కరుగారి బింకము వదలిపోవు”నని జయకరు గారు జోస్యము జెప్పిరి.

ఈలోపున మహాత్ముడు రావుబహదూర్ యం. సి. రాజాగారితోను బొంబాయినివాసులును నిమ్నజాతినాయకులగు శ్రీ బాలూగారితోను సంభాషించెను. శ్రీ రాజాగారు నిమ్నజాతులతరఫున ప్రతినిధిగ భారతశాసనసభకు ప్రభుత్వమువారిచే నియమింపబడినవారు. రెండవరౌండుటేబిలు సమావేశానంతరము హిందూమహాసభానాయకులగు డాక్టరు మూంజీగారితో నొకయొడంబడిక గావించుకొనిరి. దానిని 'రాజామూంజీ ఒడంబడిక' అందురు. దానివల్ల నిమ్నజాతులకొరకు స్థానములు కొన్ని శాసనసభలలో ప్రత్యేకింపబడును. వాటికి సంయుక్తనియోజకవర్గములద్వారా యెన్నికలుజరుగును. ఆయొడంబడికను అంబేద్కరు పక్షమువారు తక్క మిగిలినవారందరు ఒప్పుకొనిరి. కావున మహాత్ముడు సప్రూగారిప్రాథమిక యెన్నికవిధానవిషయమై రాజాగారి అభిప్రాయము నెరుంగకుండ ముందడుగిడ నిష్టపడకుండెను. రాజాగారును వెంటనే రాజీకుదిరిన చాలునని ఆవిధానమునకు తనయంగీకారము నొసంగిరి కాని, నిమ్నజాతులవారిని తదితరహిందువులతో సమానమగు దశకు తీసికొనివచ్చుటకు తీవ్రచర్య గైకొనవలసియుండుననిమాత్రము మహాత్ముని హెచ్చరించిరి. మహాత్ముడందులకు తనసర్వశక్తుల వినియోగించెదనని నమ్మబలికెను. "మీరు జీవించియున్న చాలు. మీజీవితమే లక్షరాజ్యాంగవిధానములకంటెను నిమ్నజాతు

లకు మహారక్ష కాగలదు" అని శ్రీబాపూగారు వెడలిపో వుచు బలికిరి.

మధ్యాహ్నము దాటినతరువాత డాక్టరు అంబేద్కరు డాక్టరు సోలంకిగార్లతో సహా, పూనాలోగల నాయకులెల్ల రు యరవాడమందిరములో ప్రవేశించిరి. డాక్టరు అంబేద్క రుగారు 'గాంధీజీ మీరు మాకు చాలనన్యాయము గావించి' రని పలుకుచు సంభాషణ ప్రారంభించిరి. నీరసముగ నుండు టచే మహాత్ముడు పరుండియుండి, అంబేద్కరుగారు చెప్పిన దెల్ల శాంతముగ వినుచుండెను మాటిమాటికిని, మాకు తగిన పరిహారము కావలెనని అంబేద్కరుగారు పలుకుచుం డిరి. మహాత్ముడదియెల్లవిని, అంబేద్కరుగారు చెప్పిన దాని నెల్ల నంగీకరింతుననియును, నిమ్నజాతులవారు పడుచున్న బా ధలు దుర్భరములేననియును, పలికి, 'నేబ్రతికియుండవలెనని యే మీరుకోరుదురుకదా?' యని ప్రశ్నించెను. 'మహాత్మా టికి' నని అంబేద్కరుగారు జవాబునిచ్చి 'మీరు నిమ్న జాతుల పురోభివృద్ధికే మీజీవితమును వినియోగించినచో మాకు దేవతలగుదు'రనిరి. అంతట మహాత్ముడు "నేనుబ్ర తికి యుండవలెనన్న మీ రేమిచేయవలెనో మీ రెరుగుదురు, నాకు తెలిసినంతవరకును, మీరు ప్రధానమంత్రి సాంఘికపరి ష్కారమువల్ల మీకులభించినదానిని వదలుటకు తగిన ప్ర తిఫలము కావలెననుచున్నారు. సరే బాగుగనేయున్నది.

సప్రూగారి ప్రాథమిక యెన్నికవిధానము కొన్ని స్థానముల
కు వర్తించినచో నది మాపక్షమువారిని తృప్తిపరచుననియు
ను, మిగిలిన స్థానములకు సంయుక్త నియోజకవర్గములు
వర్తిల్లిన నిమ్నజాతులలోని రెండవపక్షమువారికి సరిపోవు
ననియును చెప్పుచున్నారు. కాని ప్రాథమిక యెన్నిక
విధానము నిమ్నజాతులకు ప్రత్యేకింపబడిన స్థానము లన్ని
టికిని కాక కొన్నిటి కేల వర్తింపవలెను? అన్నిటి కేల
వర్తించరాదు? అభ్యర్థివర్గమును నిమ్నజాతు లేర్పరచు
కొనుపద్ధతి అన్నిస్థానములకు వర్తింపక ప్రత్యేకింపబడినస్థాన
ములలో కొన్నిటి కేల వర్తింపవలెను? నిమ్నజాతులలో నొక
పక్షమువారికి మంచిదైనది రెండవపక్షమువారి కేల శ్రేయో
దాయకము కాజాలదు? మీరు పుట్టుకవల్ల నస్పృశ్యులు.
నేను కోరికవల్ల నస్పృశ్యుడనైతిని. మీరుచెప్పిన దొప్పుకొ
నినచో నిమ్నజాతులలో రెండు కక్ష లేర్పడును. హిందూ
సంఘ విచ్ఛేదము నరికట్టుటకొరకు ప్రాణములర్పింపబోవు నే
నందుల కంగీకరింపజాలను. ప్రాథమిక యెన్నికవిధానమువల్ల
నభ్యర్థివర్గము నేర్పరచుకొనుపద్ధతి నిమ్నజాతులకు ప్రత్యే
కింపబడినస్థానములన్నిటికినికూడ వర్తించుటకు నేనొప్పు
కొందును"అని వాక్రుచ్చెను.

డాక్టరు అంబేద్కరు సోలంకీగార్లు మహాత్ముని
ప్రేమపాశములలో చిక్కుకొనిపోయిరి. నిమ్నజాతుల బాగో

గులయందు తమకంటె మహాత్మునకే అధికశ్రద్ధకలదని వారికి నమ్మకము కుదిరిపోయినది. తక్షణమే "మహాత్మాజీ! నేను తగ్గుచున్నాను;సంయుక్త నియోజవర్గముల కంగీకరించెదను. మాకు ప్రత్యేకింపబడిన స్థానములన్నింటికిని ప్రాథమిక యెన్నిక విధానము వర్తించుటకు మీరు సమ్మతించినందుల కెంతయో కృతజ్ఞుడ"నని డాక్టరు అంబేద్కరుగారనిరి. పిమ్మట మహాత్ముడు 'అభ్యర్థివర్గములో నైదుగురు ప్రతినిధులుండుట కంగీకరింపుడు మిగిలిన విషయములనెల్ల నీనాయకులతో నాలోచించి పరిష్కరించుకొన గోరెద'నని చెప్పి ముగించెను.

నాటి సంభాషణలు ముగియునప్పటికి చీకటిపడినది.

ఎల్లెడలను సభలుగావించి, మహాత్ము నుపవాసదీక్ష గురించి తమయభిప్రాయమును బ్రిటిషుప్రధానమంత్రికి తంతివార్తలద్వారా తెలియపరచవలెనని, తమ్మెదుర్కొనిన కష్టపరిస్థితులును గ్రహించి పండిత మదనమోహనమాలవ్యాగారు దేశీయులకొక విజ్ఞాపనగావించిరి. ఆవిజ్ఞాపన ప్రకటింపబడినంతనే రాజీయాశలు నశించిపోయినవని ప్రజలభిప్రాయపడిరి. బొంబాయిలో నాయకులసమావేశము సర్ పురుషోత్తమదాసు ఠాకూరుదాసుగారి యధ్యక్షతక్రింద జరిగినది. సర్ చునీలాలు మెహతాగారు నిమ్నజాతులవారు ప్రత్యేకనియోజకవర్గములనుకోరుదురో లేక సంయుక్తనియోజకవర్గములను కోరుచున్నారోఓట్లద్వారానిర్ణయింపవలెననియునుఅంతవరకు

ప్రభుత్వమువారొసంగిన సాంఘికపరిష్కారములో నిమ్న జాతులకు సంబంధించిన భాగము నాపుచేయవలెననియును బ్రిటిషుప్రధానమంత్రికి నాయకుల సమావేశపక్షమున తంతి నంపవలెనని పట్టుపట్టిరి. అట్లు చేసినచో పూనాలో జరుగుచున్న రాజీప్రయత్నములు భగ్నమైపోవునని సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ గారు దానికడ్డుపెట్టిరి. చివరకు సర్ చునీలాన్ మెహతాగారు పూనావెళ్ళి, అక్కడి పరిస్థితులను గ్రహించి, అవసరమగునెడల ప్రధానమంత్రికి తంతినపుట మంచిదని నిర్ణయింపబడెను.

జైలులోనున్నను, ప్రాయోపవేశదీక్షబూనినను మహాత్ముని నిత్యకార్యక్రమ మట్లే జరుగుచుండెను. మహాత్ముడు ప్రతిరోజు నుదయమున నాలుగుగంటలకు లేచుచుండెను. అంతట ప్రార్థనలు చేయుటకు పక్కమీద లేచి కూర్చొనెడివాడు. పిమ్మట జైలుమంగలిచే గడ్డము చేయించుకొనెడివాడు. తరువాత నొకగ్లాసునీరు త్రాగెడివాడు. అప్పటినుంచి జైలుతలుపులు తెరచిన క్షణము మొదలుగొని పత్రికాప్రతినిధులతో సంభాషణలు, స్నేహితులను చూడవచ్చినవారిని కలసుకొనుట రాయబారులతో రాచకార్యములు, ప్రారంభమై రాత్రి చాల ప్రొద్దుపోవువరకు జరుగుచుండెడివి. మధ్యాహ్నము మాత్రము కొంతవిరామముదొరకుచుండెడిది. ఆకాలము, స్నానముచేయుటకును, ఎనీమా చేసుకొనుటకు నాల్గు

నిమిషములు హరించుటకును వినియోగించెడివాడు. దీనికి తోడు రోజురోజునకు హెచ్చుచున్న యుత్తరములపని యొక టుండెడిది వచ్చుచుత్తరములకును, తంతివార్తలకును, సంతు లేకుండెడిది అవి వేదాంతచర్చలతోను, ప్రార్థనలతోను, సర్వవిధములగు సలహాలతోను నిండియుండెడివి. జవాబు లీయవలసిన వాటికెల్ల మహాత్ముడు తాను చెప్పుచుండెడివాడు. ఒక విలేఖరికి తన యుపవాసదీక్షయొక్క ముఖ్యోద్దేశమును గురించి "పూర్వాచారపరాయణు లీసంస్కరణ నెమ్మదిగ జరిగినచో యెట్లోదాని కొడబడియుందురని నేనెరుంగుదును. ప్రధానమంత్రి సాంఘికపరిష్కార మట్లునెమ్మదిగా జరుగు చున్న పనిని భగ్నమొనర్ప నెంచెను. అందుచేత నే దానిని మార్చుటకు నేనుఉపవాసదీక్షబూనితిని. సవర్ణులకు నస్పృశ్యు లకును సజీవమైన యొడంబడికజరిగి పంచమ కులమనునది భారతభూమిలో లేకుండపోవు మహాభాగ్యసూర్యోదయమున కిది వేగుచుక్కయే యగును". అనివ్రాసెను. విలియంషీడను అమెరికాదేశపువత్రికావిలేఖరిమహాత్ముడనేకపర్యాయములు కాంగ్రెసు దేశములోని యన్నిజాతుల వారికిని,ధర్మములవారి కిని సంబంధించినదనియును, దాని ప్రతినిధియగుటవల్లతాను, హిందూముసల్మాను, క్రైస్తవ, పార్శీమున్నగువారలందరప్రతి నిధిననియును చెప్పియుండి నేడు హిందువులకు సంబంధించిన యొకసమస్యాపరిష్కారమునకైప్రాణము లర్పించుటకు తయా

రగుటవల్ల నాయన తన రాజకీయనాయకత్వమునువదలిపెట్టి, భారతదేశములో మొలకెత్తిన జాతీయభావముల నశించిపో వుటకెడమీయుటలేదాయని మహాత్మునకు దీర్ఘమగుతంతి నంపెను. అమెరికావారు మహాత్ముని యర్థముచేసికొనలేకు న్నారనియును, స్వరాజ్యము కులమతజాతులకుమించినదికా దు అనియు కూడ వ్రాసెను. దానికి మహాత్ముఁడు తనరాజ కీయములు తన మతధర్మములనుండియే జనించినవనియును, మానవజాతి నస్పృశ్యతాకళంకమునుండి రక్షించుటకే తన యుపవాస ముద్దేశింపబడినదనియును, అందువల్లనది సర్వమత ధర్మముల కంగీకృతమైన కార్యమేయనియును, కావున నీ యుపవాసముయొక్క యంతరార్థమును గ్రహించి, తనపుత్రి పుత్రికారత్నము లనేకులద్వారా నీకష్టసమయములో సాను భూతిని చూపుచున్న అమెరికాదేశము ప్రపంచములో నొక మూలను జరుగుచున్నను ప్రపంచముకొరకే చేయబడుచున్న నీత్యాగము నెడల ప్రపంచదృష్టిని కేంద్రీకరించగలదని తలం చుచున్నానని జవాబొసంగెను. హరిజనులు, అస్పృశ్యతా నివారణప్రచారకులు నాయన సలహాకొరకు వచ్చుచుండెడి వారు. అట్లువచ్చినవారి నెవ్వరును మహాత్ముడు చూడకుండ పంపెడివాడుకాడు. ఎంతటిసీరసస్థితిలోనున్నను సరే దేవా లయధర్మకర్తలు తమకష్టములచెప్పుకొని దారిజూపమనియడు గుటకు వచ్చెడువారు. కాలేజీవిద్యార్థులు, మహాత్ముని చెలి

కాండ్రను, ప్రాణస్నేహితులునగు చిన్నపిల్లలు, సోదరీమణులు నాయన దరిచేరుచుండెడివారు. ఇక జైలుబైటకూడెడి తీర్థ ప్రజకంతమే లేదు. మహాత్ముని చూచుటకు వచ్చినవారిని లోపలకురానిచ్చుటతోను, లోపలవారిని బైటకంపుటతోను జైలులోని యుద్యోగులకు తీరుబడియే లేకుండెడిది. జైలు మూయు వేళవరకు నిట్లే జరుగుచుండెడిది. పిమ్మట మహాత్ముడు పగటిపూటపనివల్ల నలసిపోయి, ఆకాశములోని నక్షత్రములు కొంతవడిపరీక్షించి నిద్రపోయెడివాడు. ఇంతపనితోం దగలోకూడ నామహాత్ముడు రాట్నమును చేపట్టని దినమే లేదు.

22 వ తేదీనాటి సంభాషణలచేకలిగిన శ్రమవల్లను పైనవర్ణింపబడిన దినచర్యవల్లను మహాత్ముడు పూర్తిగా నీరసించిపోయెను. మధ్యాహ్నమునుండియు నితరుల చేయూత నందికూడ మరుగుదొడ్డికి నడచివెళ్ళలేకుండెను. శరీరమంతటనొప్పులు మొదలుపెట్టెనవి. కాని రొయిడలుపట్టించుకొనుట కంగీకరింపడాయెను. శ్రమలేకుండ చేయుటకొరకు నొకచోటినుండి ఇంకొకచోటికి మోసితీసుకొనిపోవలసివచ్చెను. స్వరముతగ్గిపోయెను. వాదనావసరమున కన్నులు ప్రజ్వలించినప్పుడెల్ల నాకుమ్మ—శరీరములోగల దృఢనిశ్చయముచూపరులకు తెలియవచ్చుచుండెడిది. ప్రభుత్వమువారు మహాత్ముడు తనస్వంతడాక్టరుల రప్పించుకొనుట కనుమతినిచ్చిరి. కాని

మహాత్ముడు తనకు జైలు డాక్టరులే చాలునని ప్రత్యుత్తరమొసంగెను. శ్రీమతి కస్తూరిబాయిగారిని సబర్మతీజైలునుండి యరవాడకు తీసుకొనివచ్చి, ప్రభుత్వమువారామె తనభర్త సేవసేయుట కనుజ్ఞనిచ్చిరి. మహాత్ముని చేరబోవునప్పుడామె ప్రశాంతముఖముతో నుండెను. విచారమునుగాని, హృదయాందోళననుగాని పైకి కనుపడనీయలేదు. సరే. మరల పూర్వపునాటకమే నని ఆమె దరికేగుచుపలికెను. కాని, ఆసతీహృదయమును దహించుకొనిపోవుచున్న వేదనాగ్ని నెవ్వరు భావించుకొనజాలరు. వచ్చినక్షణమునుండి యామె మహాత్ముని పరిచర్యభారమును తననెత్తినిపెట్టుకొనెను.

నాలుగవరోజు 23-9-32. శుక్రవారము.

శుక్రవారమునాడు పండిత మాలవ్యాగారి బసలో పూనాలోగల నాయకులెల్లరు కూడిరి. మదరాసునుండియును, బెంగాలునుండియును డాక్టరు అంబేద్కరు పక్షమువారు కొందరు వచ్చిరి. వారును, సర్ చునీలాల్ మెహతాగారును కూడ చర్చలో పాల్గొనిరి. వారందరు నొక పాలరాతి మేజాబల్లచుట్టును కూర్చొనిరి.

౧. నిమ్నజాతులకు ప్రత్యేకింపబడవలసిన స్థానముల సంఖ్యయెంత ? ఆసంఖ్యనిర్ణయించుటకు నవలంబింపబడవలసిన సూత్రములెవ్వి ?

౨. అభ్యర్థివర్గములో నెందరుప్రతినిధులుండవలెను ?

౩. కేంద్రశాసనసభలో నిమ్నజాతులకు నెట్టిప్రాతినిధ్య
ముండవలెను ?

౪. ప్రాథమిక యెన్నికవిధాన మనులలో నుండవలసిన
కాలపరిమితి యెంత ?

౫. రాష్ట్రశాసనసభలలో నిమ్నజాతులకు ప్రత్యేకస్థాన
ము లెంతకాలముంచవలెను ?

౬. ప్రభుత్వోద్యోగములు మున్నగువాటిలో నిమ్నజాతు
ల కెట్టిభాగములుండవలెను ?

పైనచెప్పిన యారువిషయముల నొకటితరువాత నొక
టిగతీసికొని చర్చింపసాగిరి. సమావేశమైనవారు పాతికమం
దైనను, సప్రూ జయకరు, రాజగోపాలాచారి, బిర్లాగార్లు సవ
ర్ణులపక్షమునను, డాక్టరు అంబేద్కరుగారు నిమ్నజాతులపక్ష
మునను విశేషభాగము వాదించిరి. ప్రాథమిక యెన్నికవిధాన
ము నిమ్నజాతులకు శాసనసభలలో ప్రత్యేకింపబడిన స్థాన
ములన్నింటికిని వర్తింపవలెనను మహాత్మునిసలహా నందరేక
గ్రీవముగా ప్రథమమున నామోదించిరి. తరువాత తేల్చుకో
నవలసినది ప్రత్యేకింపబడవలసిన స్థానములసంఖ్య. అంబేద్క
రు పక్షమువారు 197 స్థానములడిగిరి. కాని ఆసంఖ్యచాలపెద్ద
దిగనున్నదని సవర్ణనాయకులు వాదించిరి. హిందూసంఘ
ములో నిమ్నజాతులజనసంఖ్య యెన్నవవంతో విచారించి
దానిప్రకారము స్థానములసంఖ్యను నిర్ణయించినను 197 స్థా

నములడుగుట న్యాయముకాదని తేలినది. ఈవిషయములం దత్యంత ప్రవీణులును, భారతసేవాసంఘసభ్యులునగు శ్రీ. వి. వి. ధక్కర్, బాబ్లేగార్లు డాక్టరు అంబేద్కరుగారితో కూడి యీసంఖ్య నిర్ణయించ దొరకొనిరి. రెండుగంటలపాటు చర్చించిన తరువాత స్థానములసంఖ్య 160 కి దిగినది. కాని దీనితో నాయకులకష్టములు గట్టెక్కలేదు.

అసలుయెన్నికలలో పాల్గొనుటకు నిమ్నజాతులవారు ప్రాథమికయెన్నికవిధానమువల్ల నేర్పరచుకొను నభ్యర్థివర్గములో నెందరు సభ్యులుండవలెనన్నది తేల్చుకొనవలసిన రెండవ విషయము. ప్రాథమికయెన్నికవిధానమును సూచించిన సప్రూగారు మొదట నభ్యర్థివర్గములో ముగ్గురు సభ్యులుండవలెననిరి. దానిని అంబేద్కరుగారు రెండునకు దించిరి. కాని మహాత్ముఁడయిదుగురుండవలెననెను. విశేష చర్చానంతరము డాక్టరు అంబేద్కరుగారు ముగ్గురుండుటకు నంగీకరించిరి. పిమ్మట నాసంఖ్య నాలుగుగ నందరసమ్మతి మీద మార్చబడెను.

తరువాత కేంద్రశాసనసభలో నిమ్నజాతిసభ్యుల సంఖ్య యెంతన్నవిషయము నెత్తుకొనిరి. ప్రభుత్వమువారు తమ సాంఘికపరిష్కార సభలో నీవిషయమును జేర్చలేదు. కాని దీనినికూడ నిప్పుడే తేల్చుకొనుట మంచిదని యందరొప్పుకొనిరి. బ్రిటిషు యిండియాకు కేంద్రశాసనసభలో

నుండు స్థానములలో నూటికి 18 వంతున నిమ్నజాతులకు ప్రత్యేకింపబడుటకు సమ్మతించిరి.

ఇంతవరకు వచ్చునప్పటికి పగలు నాలుగుగంటలు దాటినది. పరిష్కరింపబడవలసినట్టి ముఖ్యాంశము లింకను మిగిలియే యుండెను. ప్రాథమిక యెన్నికవిధానమునందుండవలసిన కాలపరిమితి విషయములో నభిప్రాయభేదములుప్పతిల్లెను. డాక్టరు అంబేద్కరుగారు విధానము పదిసంవత్సరములవరకుండవలెననిరి. నిమ్నజాతులకు ప్రత్యేకస్థానములుండవలెనా లేదా యను విషయమును పాతికసంవత్సరముల పిమ్మట నిమ్నజాతులవారి యభిప్రాయమును ఓట్లుద్వారా తెలిసికొని, ఆయభిప్రాయానుగుణ్యముగ నిర్ణయింపబడవలెనని కోరిరి. కాని బ్రిటిషుప్రధానమంత్రి పరిష్కారముప్రకారము చూచినను, 20 సంవత్సరములతరువాత, ప్రత్యేకనియోజకవర్గములును, ప్రత్యేకస్థానములును వాటంతటవియే పోవును. ఆవిషయమై నిమ్నజాతులవారియభిప్రాయమును కనుగొనుటనుమాటయే అందులో లేదు. కాని సవర్ణులు నిమ్నజాతులను తమతో సమానులుగ చూచునట్లు చేయుటకదిమిగుల నవసరమని అంబేద్కరుగారు పట్టుపట్టిరి. ఇంతలో మహాత్ముడు బలహీనుడై పోవుచున్నాడనియును, అపాయకరమగుదశలో నున్నాడనియును, వార్త వచ్చినది. అప్పటికి చీకటిపడినది. నాయకులుమాత్రము నిరాశకు చోటియ్య

కుండ సమాధానమును కుదుర్చుకొనుటకు తీవ్రప్రయత్నము లను సేయుచునేయుండిరి. దేవదాసుగాంధిగారు జైలునకు పోయి తండ్రిని చూచివచ్చెను. శాసనసభలలో స్థానములను ప్రత్యేకించు టవసరమా కాదా యనువిషయము పాతికసం వత్సరములతరువాత నిమ్నజాతుల అభిప్రాయమును కనుగొని నిర్ణయింపవలెనని పట్టుపట్టవలదనియును, అస్పృశ్యతను సవ ర్ణులు పూర్తిగ రూపుమాపకున్నచో సవర్ణుల నుద్దేశించి తాను మరల నుపవాసమొనర్పవలసివచ్చునని మహాత్ముడు చెప్పినసంగతి తలంచి ఒడంబడిక కుదురుట కడ్డురావలదని యును డాక్టరు అంబేద్కరుగారి నాయన ప్రార్థించెను. కాని అంబేద్కరుగారు మహాత్ము డొప్పుకొనువిషయమునే నాయ కు లంగీకరించుటలేదనిరి. గాంధిజీ నిమ్నజాతులవారి యభి ప్రాయములను ఓట్లద్వారా కనుగొనుటకు ననుకూలముగనే యున్నానని బహిరంగముగనే మొదటినుండి చాటుచున్నా డననిజవాబిచ్చిరి. దానితో వివాదముయొక్క రూపము పూ ర్తిగ మారిపోయినది. అంబేద్కరుగారు మహాత్మునికడకు వెళ్ళి స్వయముగా నీవిషయము చర్చించు టవసరమయ్యెను. తక్షణమే అంబేద్కరుగారు వారిసహచరు లొకనలుగురును, మిగతానాయకు లొకపదిమంది కలిసి జైలునకు వెళ్ళిరి.

మహాత్ముడు పూర్తిగా నలిసిపోయెను. మొట్టమొద టానాడు నాయకులు పగలు నాలుగుగంటలకు వచ్చి, ఆయ

నను చూచుట కేర్పాటుచేయబడినది. దానిని తరువాత 6 గంటలకు మార్చిరి. కాని వారందరు వచ్చునప్పటికి రాత్రి తొమ్మిదిగంటలు దాటినది. అప్పటికి నేదోయొకసమాధాన మును కుదుర్చుకొని వచ్చిరా? లేదు. తమ కడ్డువచ్చిన చిక్కుల నాయనముందర నిడుటకే! మహాత్ముడది గ్రహిం చెను. చాల బాధపడుచుండెను. ఓపికను గోల్పోయెను. జైలుసూపరింటెండెంటుగారగు మేజరుభండారి, జైలుడాక్టరు గారగు మేజరు మెహతాగార్లిరువురు నక్కడనే యుండిరి. వారి ముఖములందాతురతయు, విషాదచ్ఛాయ కనుపడుచుండెను. కాని వారుకూడ డాక్టరు అంబేద్కరుగారు మహాత్మునితో మాట్లాడు టత్యావసరమని గుర్తించిరి అంబేద్కరుగారు మహా త్మునితో "గాంధిజీ! కొంతకాలమైనపిమ్మట నిమ్నజాతులకు శాసనసభలలోస్థానముల ప్రత్యేకించు టవసరమో కాదో, నిమ్నజాతులవారి యభిప్రాయములను ఓట్లద్వారా తెలిసికొని తదనుగుణ్యముగ వర్తించవలెనని నేచెప్పినమాట నీ నాయ కులొప్పుకొనుట లేదు. అట్టిమరతున్నచో నస్పృశ్యతానివా రణ త్వరలో జరుగగలదన్న ఉద్దేశముతోనే మేము పట్టు పట్టు చున్నాము. మీ రీచిక్కునుండి మమ్ములను బయటకు తీయ గోరెద"నని పలికిరి. మహాత్ముడును ఓట్లద్వారా నిమ్నజాతు లవారి యభిప్రాయములను కనుగొనుట తన కిష్టమైనదే య నెను. కాని అటుల కనుగొనుట 25 సంవత్సరములపిమ్మట

గాక సంవత్సరముతరు వాతనో లేక అయిదుసంవత్సరములతరు వాతనో జరుగవలె ననెను. జైలుడాక్టరు లింతలో నడ్డము వచ్చి సంభాషణ లికజరుగరాదనియును, జరిగినచో మహాత్ము డపాయపరిస్థితులలోనికి మారుననియును చెప్పి నాటికాపి వైచిరి.

మరునాడు శనివారము. నాటియుదయముననే నాయకులు తిరిగి సమావేశమై చర్చ ప్రారంభించిరి. ప్రత్యేకింపవలసిన స్థానముల సంఖ్యావిషయమైమరల యోచించి కడకు శాసనసభలలో 147 స్థానములు నిమ్న జాతులకొరకు ప్రత్యేకింపబడవలెనని యెల్ల రంగీకరించిరి.

ఐదవరోజు, **24-9-32,** శనివారము.

అంతట అంబేద్కరుగారు ప్రత్యేకస్థానముల కాలపరిమితి 25 సంవత్సరములుగను, తదనంతరము నిమ్నజాతులవారి యభిప్రాయము లెట్లుండునో ఓట్లద్వారా కనుగొని వారికి శాసనసభలలో స్థానములు ప్రత్యేకింపబడుటో పడకుండుటో నిర్ణయించుటకు మహాత్ము డొప్పుకొనెననియును కావున దాని నంగీకరింపవలసినదనియును నాయకులను గోరిరి. కాని వారిలోనెవ్వరందుల కిష్టపడలేదు. తుదకు అంబేద్కరుగారు మహాత్ముని మరల సందర్శించి, ఆవివాదమును పరిష్కరించు కొనుటకు నిశ్చయించుకొనిరి. ఆనిశ్చయమునకు వచ్చునప్పటికి మధ్యాహ్నమైనది. శ్రీరాజగోపాలాచార్యులు, డాక్టరు

సోలంకిగార్లతో అంబేద్కరుగారు మహాత్మునికడకేగి నిమ్న జాతులకు శాసనసభలలో స్థానములు ప్రత్యేకింపబడుటో పడకుండుటో 10 సంవత్సరములతరువాత నిమ్నజాతులవారి యిష్టప్రకారము నిర్ణయింపబడుట కంగీకరింపమని మహాత్ముని కోరిరి.

మహాత్మునిశరీరస్థితి అప్పటికి కొంచెము బాగుపడెను. ఒడలు తిరుగుట, వాంతి వచ్చునట్లుండుట మున్నగు దుర్లక్షణములు కొంతవర కుపశమించినవి. దృఢమును స్పష్టమునగు స్వరములో నెమ్మదిగ 'మీరు చెప్పినదెల్ల సత్యము. కాని ప్రత్యేకస్థానములుండు టవసరమో కాదో నిర్ణయించుటకు కాలపరిమితి నైదుసంవత్సరములు కానిండు. సవర్ణు లస్పృశ్యులయెడల సరిగా ప్రవర్తించునది లేనిది తెలిసికొనుట కాకాలముచాలును. వారట్లు మర్యాదగ నడచుకొననిచో సరే; ప్రత్యేకస్థానములట్లె యుండును. కాని, అంతకంటె నెక్కువ కాల పరిమితిని మీరు కోరినచో నది మీరు సవర్ణులను పరీక్షించుటకు కాక ప్రత్యేకస్థానములుండవలయు ననుట కనుకూలముగ నిమ్నజాతులవారి యభిప్రాయముల నీలోపుగ మార్చుటకై వ్యవధదొరకుటకొరకు మీ రిట్లడుగుచున్నారనుకొనవలసివచ్చు'నని మహాత్ముడు చెప్పి, పిమ్మట పరస్పరవిశ్వాసముతో భారతీయులు నడచుకొను టవసరమనియును, తాను తన బాల్యమునుండియు నస్పృశ్యతానివారణకొరకు తన సర్వస్వ

మును పోగొట్టుకొనుటకుకూడ సిద్ధపడి యెట్లు పాటుపడెనో వర్ణించిచెప్పెను. రాజ్యాంగవిధానములోని రక్షణలన్నిటికంటె సద్భావముతో సవర్ణులు చేయు ప్రయత్నము లే విలువైనవని యు నచ్చచెప్పెను. తుదకు కాలపరిమితి 5 సంవత్సరములు దాటియుండుటకు తా నెన్నటికి నంగీకరింపజాలనని పలికెను. ఆఖరిమాటగా 'అయిదువత్సరముల కాలపరిమితియో లేక నాజీవితమో? ఏదో ఒకటి నెంచుకొనవలెను' అని చెప్పి వైచెను.

ఇది చెప్పునప్పటికి మహాత్ముడు కడుడస్సెను. ఆయన తనహృదయవేదనను అంబేద్కరుగారిముందర వెడలపో యునప్పటికాయనస్వరము చాలసన్నముగనుండి వినబడుట యే కష్టముగనుండెను. చుట్టునున్నవారి హృదయములు కరగి నీరైపోయినవి. ఆసమయమున మహాత్మునిమాటలను వినుట కేమోయనునట్లు ఆకుకూడ కదలక మిగుల ఉక్కగా నుండెను. అంబేద్కరుగారేదో మాట్లాడబోయిరి. కాని వారిహృదయముకూడ కరగి నీరగుటవల్ల వారినోటనుండి మాట వెడలలేదు. ఒడంబడిక కుదురుటకుగల పెద్దఅడ్డంకము తొలగిపోయినదని యెల్లరహృదయములకు తెలిసిపోయెను.

జైలునుంచివచ్చి డాక్టరు అంబేద్కరుగారు తన సహ చరులందరితో నొకగదిలోచేరి కాలపరిమతివిషయ మొక గంటకాలము చర్చించెను. ఏదైన ముఖ్యవిషయములో నిర్ణ

యమునకు రావలసివచ్చినప్పుడెల్ల వ్వారట్లే వేరొక గదిలో కూర్చొని చర్చించుకొనుట మొదటినుండియు నాచారమై పోయినది ఒకగంట గడచినతరువాత డాక్టరు అంబేద్కరు గారు బయటకువచ్చి కాలపరిమితి 10 సంవత్సరములకంటె తక్కువగా నుండుటకు తామెన్నటికిని నంగీకరింపజాలమని చెప్పివైచెను.

అక్కడ మహాత్ముడు మామిడిచెట్టునీడ మంచము మీదకదలకుండ పడియుండెను. శ్రీమతి కస్తూరిబాయిగారు నెమ్మదిగా నొడలుపట్టుచుండిరి. శ్రీసరోజనీదేవి వల్లభాయి పటేలు, మహాదేవదేశాయిగార్లు చుట్టును గూర్చొనియుండిరి. పగలు 3 గంటలకు శ్రీరాజగోపాలాచార్యులుగా రొక్కరే వచ్చిరి. ఒడంబడిక కుదిరినదనియును, ప్రత్యేకస్థానములకాల పరిమితివిషయము తరువాత హరిజనులు సవర్ణులు నొండొరుల కెట్లు సరిపడునో అట్లు నిర్ణయించుకొనవచ్చునని తన స్వంత బాధ్యతమీదను, మహాత్ము డంగీకరించునను ఆశతోను సల హా నిచ్చితిననియును, డాక్టరు అంబేద్కరుగారును వారిసహ చరులును సమ్మతించిరని క్లుప్తముగ తెలియజేసెను. మహా త్ముడు నీరసమువల్లను, ఆయాసముచేతను దానిని సరిగా వినలేకపోయినందున మరల చెప్పుమనికోరెను. మరల చెప్ప గావిని, 'శభాష్' అని ఒక్కమాటలో తనయభిప్రాయమును తెలియజేసెను. మహాత్ము డంగీకరించినట్లు తెలియుటతోడనే

డాక్టరు అంబేద్కరుగారానందపరవశులై రసటలో సతిశోయోక్తి యేమాత్రమును లేదు.

ఒడంబడికంతట కాగితముపై నెక్కినది. దానికి సమ్మతిని సూచించుచు సంతకముల పెట్టుట కంద రెంత సంతసించిరో చెప్పనక్కరలేదు. ఇట్లు మహాత్ము డుపవాసము ప్రారంభించిన అయిదవరోజున ఒడంబడిక కుదిరినది. నిమ్నజాతుల తరఫున డాక్టరు అంబేద్కరు, యం. సి రాజాగార్లు, సవర్ణుల పక్షమున పండిత మదనమోహనమాలవ్యాగారు దానిపై సంతకములుచేసిరి. అక్కడచేరిన మిగిలినవారందఱు నద్దానికి బలముకూర్చుటకు తమనామాక్షరముల నునిచిరి. అనంతరము రాత్రి 7 గంటల కుభయపక్షనాయకులును మహాత్ముని చూచుటకు జైలునకేగిరి.

ఆనాడు డాక్టరు గిల్డరుగారు మహాత్ముని పరీక్షించి చూచిరి కడచినరాత్రి మహాత్మునికి నిద్రబాగుగా పట్టినది. సంతోషముగనువ్నారు. వారి హృదయస్పందనము చక్కగ నున్నది. మొత్తముమీదశక్తి ఉడిగిపోవుచున్నది. అనవసర సంభాషణల తగ్గింపకపోయినచో నాపదవచ్చును. అని ప్రకటించిరి.

ఆదివారమునుండి యుదయముననే నాయకులందరు బొంబాయినగరమునకు వెడలిపోయిరి. అక్కడ పగలు రెం

ము గంటలకు సమావేశమై ఒడంబడిక నామోదించిరి.

ఆరవరోజు.
25-9-32
ఆదివారము.

ఒడంబడికను బ్రిటిషు మంత్రివర్గము వారంగీకరించిన మరుక్షణముననే తానుపవాసదీక్షను ముగించెదనని మహాత్ముడుకూడ నాటియుదయముననే లండనులోనున్న సి. యఫ్. ఆండ్రూస్ గారికి తంతినిచ్చెను. సప్రూ రాజా, అంబేద్కరు మాలవ్యా మున్నగువారలందరు నంతకుపూర్వమే ప్రధానమంత్రి నొడంబడికను తక్షణమే అంగీకరింపుమని కోరుచు వేర్వేరుతంతి వార్తలంపిరి.

కీర్తిశేషులగు మోతీలాలు నెహ్రూగారి భార్యయగు శ్రీమతి స్వరూపరాణిగారును, పండిత జవహర్‌లాల్ నెహ్రూగారి సతీమణి కమలానెహ్రూగారును మహాత్ముని చూచుటకు అలహాబాదునుండి వచ్చిరి. "పత్రికా విలేఖరులు మీయుపవాసదీక్షమాట వినినంతనే నేను మూర్ఛపోయితినని ప్రకటించిరి. అదిశుద్ధ అబద్ధము ప్రతివ్యక్తియు నడుము బిగించి, కార్యరంగములో దిగవలసిన యీసమయమున మూర్ఛపోవుట కవకాశమేది" అని స్వరూపరాణిగారు మహాత్మునితో ననిరి. ఆమె పూర్వాచారపరాయణురాలు. మోతీలాలు నెహ్రూగారు బ్రతికియున్నరోజులలో కూడ నామె తనకొరకు వేరొకగదిలో మడిగా వంటచేసుకొనుచుండెడిది. అట్టియామె అలహాబాదునుండి బయలుదేరుటకుముందు తానస్పృశ్యులచేతులనుండి ప్రసాదమును స్వీకరించితిననియును,

ప్రయాణసమయములో శ్రీమద్రామాయణమును, చదువు చుంటిననియును మహాత్మునితో స్వయముగా చెప్పెను. ఆమె మంచమునంటి పెట్టుకొనిపోయిన ఆమూర్తిని చూచుటతోడ దుఃఖ పరవశయై పోయెను. మహాత్ముడుకూడ నుద్రేకమును లోలో నడంచుకొని ఆమెచేతిని చేనందికొని మంచముపై కూర్చుండబెట్టుకొనెను.

ఉపవాసము మొదలుపెట్టిన తరువాత ఆనాడు రెండవమారు, మహాత్ముడు పత్రికావిలేఖరులతో ముచ్చటించెను. కాని, ఈమారు పూర్వపరిస్థితులు లేవు. ఆయనొక పేద చిరునవ్వుతో వారల కాహ్వానమొసగి, దగ్గరనున్న వారలకు కూడ వినబడరాని స్వరముతో, ఒకపత్రికర్త కొరిగి, మామిడిచెట్టువైపు చూచుచు 'మాయింటికప్పు మాకేమందు'రని ప్రశ్నించెను. పత్రికావిలేఖరులు, తమ కుర్చీలను వీలగునంత దాపుగా తెచ్చుకొని ప్రశ్నలను నెమ్మదిగా వేయుచుండిరి. గాంధీజీ యుస్సురనుచు, కొంచెముసేపు కన్నుల మూసికొని, పాలిపోయిననరములు బయటపడిన చేతితో నెమ్మదిగ ఫాలతలము నదుముకొనుచు, "ప్రధానమంత్రియరవాడ ఒడంబడిక నంగీకరించిన నే నుపవాసము మానెదను. దీనితో నావిధి పూర్తికాదు. కావలసిన దంతయును ముందే కలదు. ఒడంబడికలోని షరతుల నక్షరాలా సవర్ణులు చెల్లింపవలెను. ఈయుపవాసము సంగతి వారికెం

తమాత్రము ముందుగా తెలియను. కావున నస్పృశ్యతను వారు సమూలముగ వెంటనే నాశనము చేయలేదని నేను వారిని నిందింపను. వారల నాయుపవాసదీక్ష ముగిసిన పిమ్మ టనుకూడ నస్పృశ్యతానివారణ కొరకు తీవ్రప్రయత్నములు సల్పనియెడల నేను మరల నుపవాసదీక్షను బూనెదను. కాని దేశములో నీయైదురోజులలో గలిగిన ప్రబోధము సవస్థలు తప్ప కస్పృశ్యతను తుడిచి వేసెదరను ఆశ కెడమిచ్చుచున్నది" అని సమాధానము చెప్పెను.

ప్రభుత్వమువారు త్వరలో నొడంబడిక నామోదించి, మహాత్ముని ప్రాణములు పోకుండ కాపాడుదురా యన్న సందేహమెల్లరకు కలుగ దొడగినది. ఆంగ్లో యిండి యను పత్రికల వ్రాత లీసందేహమును మరింతబలపరచినవి. బ్రిటిషుమంత్రివర్గ మీవిషయమై బుధవారమువరకును చర్చింప జాలదని యొకమారు, భారతదేశములోని వివిధరాష్ట్రీయ ప్రభుత్వములును, వేర్వేరు సంఘములవారును తమయంగీ కారమును సూచించినకాని ప్రభుత్వ యొడంబడిక నంగీక రించినట్లు ప్రకటింప జాలదని యింకొకమారు వదంతులు బయలుదేర సాగినవి.

దానికితోడు, 26 వ తేదీ సోమవారమునాటి యుద యముననే గిల్డరు, దేశముఖు మున్నగు బొంబాయి డాక్టరులు

మహాత్ముని పరీక్షించి, ఆయన జవసత్వములు తగ్గిపోవుచున్నవనియును, అపాయకరమగు స్థితిలోనున్నాడనియును, ప్రకటించిరి. దానితో ప్రజలలో కలవరపాటు హెచ్చిపోయినది. దేశములగగ్గోలు పడసాగినది. కాని యింతలోనే బ్రిటిషుమంత్రి

ఏడవరోజు
26-9-32
సోమవారము

వర్గమువారు యరవాడఒడంబడిక నంగీకరించినట్లు వార్తలరుదెంచినవి. ఆవార్త బట్టుకొని, మహాత్మునిచూడ కలకత్తానుండి పూనాకువచ్చిన రవీంద్రనాధమహాకవి నాటిమధ్యాహ్నము జైలునకు నరిగెను. ఆయిరువుర సమాగమమును గాంచినవారి హృదయములు ద్రవించిపోయినవి. మాటరాక, మహాత్మునిదరిజేరి, తనతల నాయనహృదయముపై నిడి, రవీంద్రుడట్లే కొంతకాలముండిపోయెను. బ్రిటిషుమంత్రివర్గము పూనాయొడంబడిక నామోదించెనను వార్తవిని సంతోష తరంగములపై తేలుచు నీకడకువచ్చితిపని మహాత్మునితోనాయన పలికి, అస్పృశ్యతానివారణలో తనశక్తికొలదిగ మహాత్మునకు దోడ్పడుదునని వాగ్దానమొసంగెను. మహాత్మునికి సంభాషణశ్రమచే నలసటయెక్కువగుచుండుటవల్ల నంతట శ్రీరవీంద్రనాధమహాకవి వెడలిపోయెను.

ఆనాడే బొంబాయిశాసనసభలో డాక్టరు గిల్డరుగారు మహాత్ముని శరీరస్థితినిగురించి ప్రకటనగావించుచు, మహాపదప్రస్థితిలో నాయన యున్నాడని తెల్చిరి. మహాపదప్రవ

స్థితియనగా నేమని శాసనసభ్యులు గ్రుచ్చి గ్రుచ్చి యడుగగా మహాత్ముడు, అంత్యావస్థలో నున్నాడనియును, హఠాత్తుగ ప్రాణముపైనను పోవచ్చును లేక పక్షవాతమైన రావచ్చునని యును, ఇక నాలస్యమైనచో నాయన యుపవాసదీక్ష మాని నను లాభముండదని వివరించి చెప్పిరి.

ఇట్లుండగా, నాయాత్రిము 4 గం 15 నిమిషములకు జైళ్ళ ఇన్‌స్పెక్టరుజనరలుగారగు కల్నల్ డాయిల్ గారు, ప్రధానమంత్రి యరవాడఒడంబడిక నంగీకరించుచు చేసిన ప్రకటనను మహాత్మునిచేతికందించిరి. దానిలోని ముఖ్యాంశము లీక్రింద నీయబడినవి.

'బ్రిటిషు ప్రధానమంత్రి సాంఘికపరిష్కారములో నిమ్నజాతులకు సంబంధించిన భాగమునకు బదులుగా, సవర్ణులకును నిమ్నజాతులకును జరిగిన యరవాడ ఒడంబడికలోని యీక్రిందిభాగముల నామోదింపవలెనని బ్రిటిషుపార్లమెంటును కోరుటకు నిశ్చయింపబడినది.

(1). పూనాఒడంబడికలోగల, రాష్ట్రశాసనసభలలో నిమ్నజాతులవారికియ్యబడిన స్థానములసంఖ్య నంగీకరింపవలెను.

(2). దానిలో నిమ్నజాతుల పురోభివృద్ధికి సంబంధించిన యితరాంశముల నవి సవర్ణులు, నిమ్నజాతుల బాగు

కొరకై ప్రయత్నింతుమని చేసిన ప్రమాణములుగా భావించవలెను.

(3). కేంద్రశాసనసభకు నిమ్నజాతిప్రతినిధుల నెన్నుకొను విధానమును గురించి ప్రస్తుతము ప్రభుత్వము వారేమియును జెప్పజాలరు. వారింకను ఓటుహక్కు నిచ్చుట కెట్టి యర్హతల నెంచవలెనో యని ఆలోచించుచున్నారు. కాని దానికి ప్రతికూలురు మాత్రము కారు.

(4). కేంద్రశాసనసభలో బ్రిటిషు ఇండియాప్రజలకు గల స్థానములలో 100 కి 18 వంతున నిమ్నజాతులవారికి ప్రత్యేకించువిషయమై ప్రభుత్వము వారి కెట్టి సంబంధమును లేదు. అది హిందువులు తమలో తాము గావించుకొనవలసిన ఏర్పాటుగా భావించవలెను.

మహాత్ముని చేతికందించి, కల్నల్ డాయిల్ గారు, మీరు మీమిత్రులతో మాట్లాడగోరుదురనుకొందునని పలుకుచు వెడలిపోయిరి. మహాత్ముడు దానిని నెమ్మదిగను, జాగ్రత్తగను చదివి, "దీనిని నిమ్నజాతినాయకులకు చూపించవలెను. పూనాఒడంబడికలోని షరతులనన్నింటిని ప్రధానమంత్రి ఒప్పుకొనలేదు. నిమ్నజాతినాయకులన్ననో పూర్తియగు నాయొడంబడికపైననే సంతకము జేసిరి. ప్రధానమంత్రిప్రకటనను వారంగీకరింతురో లేదో చూడవలెను." అనిపల్కెను.

అప్పుడు దగ్గరనున్న పండితహృదయనాథ్ కుంజ్రూ, శ్రీరాజ గోపాలాచార్యులు, వల్లభాయిపటేలు మున్నగువారలహృద యములలో పెద్దరాయిపడినట్లైనది. అంతట కుంజ్రూగారు, ప్రధానమంత్రి తనసాంఘికపరిష్కారములో నిమ్నజాతులకు సంబంధించిన సమస్యలకు తానిచ్చినతీర్పులకు బదులుగా పూనాయొడంబడికలో నాకు సమస్యలకు సంబంధించిన భాగ ములనే ఒప్పుకొని, మిగతావిషయములమాట వదలిపెట్టక, అవి సవర్ణులును నిమ్నజాతులువారును తేల్చుకొనవలసిన విషయములని స్పష్టమొనర్చెననియును, ప్రభుత్వమువారంత కంటె నింకేమియును జేయజాలరనియును, తాను ప్రధానమం త్రిగనున్న నట్లేయొనర్తుననియును నచ్చచెప్పెను. శ్రీరాజగో పాలాచార్యులుగారుకూడ కుంజ్రూగారు చెప్పినదానిని బలపర చిరి. అంతటమహాత్ముడు కల్నల్ డాయిల్ గారినిపిలచి, "ప్రధా నమంత్రిప్రకటన నాకు పూర్తిగ తృప్తికరముగ లేదు. కాని మిత్రుల నిర్బంధమువల్ల దానిని నే నామోదించుచున్నాను. నాయుపవాసానంతరముకూడ నస్పృశ్యతానివారణవిషయమై నాతోమాట్లాడవచ్చువారల కెట్టియడ్డంకులు కలుగనీయరవ కొందును. ఇక నాయుపవాసమును ముగించుచున్నాను." అని పలికెను. డాయిల్ గారు తా నానివయములను ప్రభుత్వము వారికి తెలియజేసెదనని, చెప్పి "తక్షణమే మీయుప వాసదీక్షను ముగించకోరెదను. కాని యింకొక్కసంగతి.

మీకు నారింజపండ్లరసమును శ్రీమతి కస్తూరిబాయిగారే యియ్యవలెను" అనిచెప్పుచు మహాత్ముని కరస్పర్శగావించి వెడలిపోయిరి.

ఏజైలుచరిత్రిలోకూడ నింతవరకెన్నడును కనివిని యెరుగని మహోత్సవ మంతట సాయంత్రము 5 గం-15 నిమిష ములకు యెరవాడ సెంట్రిలుజైలులో జరిగినది. దొడ్డంతయు నూడ్చి నీళ్లుచల్లిరి. మహాకవీంద్రుడగు రవీంద్రినాథఠాకూరు, శ్రీమతి సరోజనీదేవి, కీర్తిశేషులగు చిత్తరంజనదాసుగారి సతీమణి వసంతాదేవి, ఆయనసోదరీమణి ఊర్మిళాదేవి, శ్రీయుత అంబాలాల్ సారభాయిగారు, వారికుటుంబము, శ్రీమతి స్వరూపరాణి నెహ్రూగారు, శ్రీయుతులు, వల్లభాయిపటేలు, మహాదేవదేశాయి మున్నగువారందరును చుట్టు పరివేష్టించియుండ, సిద్ధసంకల్పుడగు నామహాత్ముడా మామిడిచెట్టు క్రింద నాజైలుమంచముమీద పరుండియుండెను. ఆయనకెదురుగ సబర్మతీఆశ్రమవాసులు నితరులు దాదాపు రెండు వందలకుపైగా కూర్చొనియుండిరి. రవీంద్రుడంతట తనగీతాంజలిలోని దొకగీతమును పాడెను. దానితరువాత, కుష్టురోగియు, ఖైదీయు నగు పరచూరశాస్త్రిగారు ఉపనిషన్మంత్రపఠనము గావించిరి. అంతట నందరును కలసి మహాత్మున కత్యంతప్రియమగు 'వైష్ణవజనతో' అను పాటనుపాడిరి! ఆపాట పూర్తిచేయబడిన వెంటనే శ్రీకస్తూరిబాయిగారు మహాత్ము

ని చేతికి నారింజపండ్లరసము నందియ్యగా నాప్రేమైకమూర్తి పటేలు దేశాయిగార్ల నానుకొని ప్రక్కపైకూర్చొని, నెమ్మదిగ రెండుమూడులు చప్పరించి వ్రతపరిసమాప్తిగావించెను. అదేసమయమున నుదయమునుండి గంపలుకొలదిగ వచ్చిన పండ్లందరకును పంచిపెట్టబడినవి. అది మహదానందకరమగు రోజు. ఆజైలులో నక్కడకుజేరిన వారందరావారు వ్రతమట్లు శుభపరిసమాప్తి గాంచినందులకు పరమేశ్వరుని కొనియాడిరి.

ఆరాత్రియే మహాత్ము డీక్రిందిప్రకటనను పత్రికలకంపెను.

"భగవంతునిపేరిట గైకొనబడినఉపవాసదీక్ష గురుదేవుడగు రవీంద్రనాధమహాకవియు; మహాపండితుడును, కుష్టరోగియును, ఖయిదీయునగు పరచూరశాస్త్రిగారును, పరస్పరాభిముఖులై కూర్చొనియుండగను, ప్రేమపులకితహృదయులగు ప్రియతములెల్లరు చుట్టియున్నసమయమున ముగింపబడినది. ఉపవాసదీక్ష ముగియుటకుముందు రవీంద్రమహాకవీంద్రుడు తానువ్రాసిన బెంగాలీగీతము నొకదానినిపాడెను. పిమ్మట పరచూరశాస్త్రిగా రుపనిషన్మంత్రంబులపఠించి,అనంతరము నాకత్యంతప్రియమగు 'వైష్ణవజనతో' యను పాట పాడబడెను. గతయేడుదినములలో భారతదేశమం దెల్లెడల గన్పట్టిన మహాప్రబోధమును జూచిన నందులో భగవంతుని

మహిమ స్పష్టముగ గోచరించుచున్నది. ప్రపంచమునందనేక చోట్లనుండి నాయుపవాసదీక్షను మెచ్చుకొనుచు నాకువచ్చి నతంతివార్తలు, గతవారములో నే ననుభవించిన శరీరవేదనను, మనోవేదనను, ఆత్మవేదననుపశమింపజేసినవి.

నే చేబూనిన ఉద్యమము మహోత్కృష్టమైనదగుటవల్ల, దానియభివృద్ధికొరకాశాధపడుట తగినపనియే యగును. ఒక్కసారి రగుల్కొల్పబడిన యీమహాగ్ని హిందూధర్మములో నస్పృశ్యతాదోషమున్నంతకాల మారిపోదు. ఒక్కని జీవితములోనే, అస్పృశ్యతయంత మొందకపోవుటే పరమేశ్వరేచ్ఛయైనచో, నీకళంకమునుండి హిందూధర్మము నుద్ధరించుటకు జీవితములర్పింప సంసిద్ధులగు సంస్కర్తలు వేలకొలదిగలరని నాకు పూర్ణవిశ్వాసమున్నది.

ఈయొడంబడికను కుదుర్చుకొనుటలో నాయకులందరు చాల నుదారముగ ప్రవర్తించిరనియే నాయభిప్రాయము. ఈయొడంబడికహృదయముల కలయికవలననేయొనగూడినది. డాక్టరు అంబేద్కరు, రావుబహదూరు శ్రీనివాసనుగార్ల పక్షమునకును, యం.సి. రాజాగారి పక్షమునకును హిందూసంఘము కృతజ్ఞతాభినందనము లర్పింపవలెను. అనేకతరములనుండి సవర్ణులుచేసిన పాపకార్యములకు ప్రతిక్రియగా తలంచుకొన్నచో వారు సమాధానమునకు రాక నిర్లక్ష్యభావముతో మెలంగగలిగియుండెడివారు. వారటుల మెలంగియుండినచో

నేనైనను వారినడతను గర్హించియుండెడివాడనుగాను. నా మృతి యీపతితజనులు చిరకాలమునుండి పడుచున్నబాధల కతిస్వల్పపరిహారమే యయ్యెడిది. కాని, వారట్లుగాక ఉత్తమ మార్గమును ద్రొక్కిరి. సమస్తమతధర్మములు శాసించిన క్షమాధర్మము నవలంబించిరి. సవర్ణహిందువు లీయొడంబడిక షరతులను తూ,చా తప్పకుండ నిర్వహించి నిమ్నజాతినాయకులు చూపించిన క్షమాగుణమునకు తా మర్హులమని ఋజువుచేసికొందురుగాక.

ఈ యొడంబడిక అస్పృశ్యతానివారణప్రయత్నముల కంకురార్పణయే యగును దీనిలోని రాజకీయభాగము చాల ప్రాముఖ్యమైనదైనను సవర్ణులికముందు నిర్వహింపవలసిన సంస్కరణములనుందర నది చాల స్వల్పవిషయము. హిందూసంఘములో చాలమంది పడునట్టి పలుబాధలకు హేతుభూతములైన ధార్మిక, సాంఘికరాజకీయ దురాచారములను వారు పూర్తిగా రూపుమాపవలెను.

ఇప్పుడు నే నుపవాసదీక్ష వీడినను, మహాశ్రద్ధతో నీ సంస్కరణమును సాగించి, అనతికాలములోనే యస్పృశ్యతను నిర్మూలింపకపోయినచో నేను మరల నుపవాసదీక్ష ప్రారంభింపవలసివచ్చునని నాసహచరులగు సంస్కర్తలను, సవర్ణులను హెచ్చరింపకుండినచో వారియెడల నమ్మికద్రోహము చేసినవాడనగుదును. ఈదోషనిర్మూలనకొరకు కాలనిర్ణయ

మును జేయవలెననుకొంటిని. కాని, నాయంతర్వాణి ప్రబో ధింపనందున నట్లుచేయక విడిచిపెట్టితిని. ఈ స్వాతంత్ర్యసందే శము ప్రతియస్పృశ్యుని గృహమునకును జేరవలెను. సంస్క ర్తలు గ్రామగ్రామమును తిరిగి ప్రచారముచేసినగాని అట్లు జరుగనేరదు. ఉత్సాహపరవశతవల్లను, మరల నుపవాసదీక్ష బూనుబాధను నాకు లేకుండజేయవలెనను సదుద్దేశముతో డను, దౌర్జన్యపద్ధతుల కెవ్వరును దిగరాదు. ఓపికతో పా టుపడుచు, ఆత్మత్యాగమునుజూపి, అజ్ఞానులను, మూఢవిశ్వా సపరులను మనను మన మార్గమునకు తీసికొనిరావలెను. అంతియేకాని, దౌర్జన్యపద్ధతులవల్ల వారు మనమాట పాటిం చునట్లు చేయరాదు. సద్భావముతో జరిగిన ఆదర్శప్రాయ మగు యీరాయోడంబడికపద్ధతినే యితరసంఘములవారు కూడ ననుకరింపవలెనని నాకోరిక. ఇంతటనుండి పరస్పరవిశ్వాస ముతోను పరస్పరసహాకారముతోను అన్నిసంఘములవారును నిజమునకు మనమందర మొక్కటేయన్న జ్ఞానముతోను విల సిల్లు నూతనయుగ మొకటి ప్రారంభముకావలెనని నే కోరు చున్నాను. ఇప్పుడు హిందూ ముసల్మాను సిక్ఖుల సమస్యను గురించి యొక్కమాట చెప్పెదను. 1920-22 సంవత్సరము లలో ముసల్మానులయెడల నాకెట్టిసద్భావములు గలవో, యిప్పుడుకూడ నా కట్టిభావములే కలవు. హిందూముసల్మాను శిక్ఖుసంఘముల కైకమత్యత చేకూర్చి దేశములో శాంతి నెల

కొల్పుటకు వెనుక నే ఢిల్లీలో నుపవాసము సల్పినట్లే నేను కూడ నైక్యతను సాధించుటకొరకు ప్రాణములర్పింప సిద్ధముగా నున్నాను. దేశములో గలిగిన ప్రస్తుతప్రబోధమునకు ఫలితముగా నాయాసంఘములవా రొండొరుల కలిసికొని సమాధానపడుదురని నే నాశించుచున్నాను. దానికొరకు భగవంతుని ప్రార్థించుచుండెదను. ఈసమస్యాపరిష్కారమైనంతనే తక్కినసంఘముల వారుకూడ సమాధానప్రయత్నములకు దిగకుండనుండజాలరు.

ఇక తుదిమాట, ప్రభుత్వము వారికిని, జైలధికారులకును, నావిషయమై జాగ్రత్తతీసికొనుటకు ప్రభుత్వము వారిచే నియమింపబడిన డాక్టరులకును వందనములర్పించుచున్నాను. వారెల్లరు నన్నెంతో జాగ్రత్తతోను, శ్రద్ధతోను కనిపెట్టి చూచిరి. లోపమేమియును రానీయలేదు పని చాల అధికమైనను విసుగుదల కొంచెమైన లేకుండ జైలుద్యోగులు ప్రవర్తించిరి. వారికందరకును, చిన్నపెద్ద లనుతారతమ్యము లేకుండ నమస్కృతు లొనర్చుచున్నాను.

సవర్ణులగు హిందూనాయకులును, నిమ్నజాతినాయకులును జేసికొనిన పూనా ఒడంబడికవిషయమై తమ నిర్ణయమును త్వరలో ప్రకటించినందులకు బ్రిటిషుమంత్రివర్గము వారి నభినందించెదను. వారినిర్ణయములోని కొన్నిషరతులు నన్ను కొంచెముగ సంశయగ్రస్తుని జేసినవి. బ్రిటిషుప్రభుత్వము,

తమ సాంఘికపరిష్కారమునకు సంబంధించిన భాగములనే ఒడంబడికలోనుండి గ్రహించుట సహజమనుకొనెదను. పూనా ఒడంబడికనంతను అంగీకరించినట్లు ప్రకటించుటకు వారికి రాజ్యాంగవిధానసంబంధమగు చిక్కులు వచ్చిన వనుకొనెదను.

కాని నాహరిజనమిత్రుల (వారి నింతటినుండి నిర్లక్ష్యపెట్ట నెంచెదను) కొక్కమాటచెప్పెదను. నాకు సంబంధించినంతవరకు నే నాయొడంబడికను పూర్తిగ నామోదించితిని. దానిలోని షరతులను సవర్ణహిందువులు సరిగా నిర్వహించుటకు నిమ్నజాతులు నాప్రాణములను హామీగా నుంచుకొనగోరెదను. మనలోమనము సంప్రతించుకొని యింతకంటె మంచియొడంబడికను కుదుర్చుకొనువరకు వారల్లే యెంచవచ్చును.

---

౭

పూనా ఒడంబడిక జరిగినపిమ్మట మహాత్ముననభినందించుచు ననేకులు తంతివార్తనంపిరి, అందులో కొన్నిటి నీక్రింద పొందుపరచితిమి.

అభినందనములు.

౧. మీతంతిని ఒడంబడికజరిగినదనువార్తను గాంచి సంతోషపరవశుడనైతిని మీయుపవాసదీక్షసంగతి తెలియగనే నా కమితమనోవేదన కలిగినది. కంగారుపడితిని. కాని చివరకు ధైర్యమును పట్టగల్గితిని. మనోధైర్యముకలిగినది. పతితులును, బాధితులునగు ప్రజలయభ్యుదయమునకెట్టి త్యాగమొనర్చినను స్వల్పమేయగును. నిజమైన స్వాతంత్ర్యము వచ్చినదాయనుట కత్యంతాధమాధమస్థితియందున్నవారలు బడసినస్వాతంత్ర్యమే నిదర్శనమనును. కాని నాకొకభయమగుచున్నది. ఇతరవిషయములు మన ఏకైకగమ్యస్థానముచు మరుగుపరచునేమో ! కేవలము ధార్మిక దృష్టితో నేనీ నిమ్నజాతుల సమస్యను చూడలేకున్నాను. మీపద్ధతుల నితరులు స్వప్రయోజనములకొరకుపయోగింపవచ్చును. కాని ఓఐంద్రజాలికాగ్రణీ! మీకు నేనా సలహా నిచ్చువాడను ! ప్రేమతో,

జవహర్లాల్ నెహ్రూ
(డేహ్రాడూన్ జైలు)

* * * *

౨. మహోత్కృష్టమగు సాధనచేబూని మీరు చేసిన మహత్తరసేవకు కోట్లకొలది ప్రజ లానందముతో మిమ్మభినందించుచున్నారు. సంశయవివశుడనై మొదటభయపడితిని. కాని, అంటరానివారిలోకెల్ల మీరే అద్వితీయులగు 'అంటరాని' వారనియును దరిజేరరానివారిలోకెల్ల మీరే ప్రథములనియును ఫలితమువల్ల నిశ్చయముగ ఋజువైనదని నే నొప్పుకొనుచున్నాను.

శ్రీనివాసశాస్త్రి,
(కోయంబత్తూరు)

* * * * *

3. భగవత్కృపవల్ల, నిహపరలోకజీవితములలో నాత్మత్యాగమే విజయసాధనమను మీబోధనలను మీ యాచరణయందుంచి, జయమందినందులకెంతయో ముదమందుచున్నాను. "నాభక్తులు నశించర"ను గీతావాక్యము ఋజువైనది. ఈవిజయమునకు మహాఫలితములుండుననుకొనెదను. మీరు త్వరగా నారోగ్యమును బడయుచున్నారని తలంచెదను.

ప్రభాశంకర్ పట్టానీ.
(జెనీవా)

* * *

౪. ప్రభుత్వనిర్ణయమునకు ఫలితముగా మీరువాసమును ముగించుట విని చాల సంతసించితిని. మీయాహ్వానము

నంగీకరించి నేనుకూడ మీతో విందుగుడుచుటకుండిన నెంత యో బాగుండెడిది! భారతజాతీయైక్యతకు మీరు పునాది వేసిరి. ఇక నుపవాసములతో నిమిత్తము లేకుండగనే దానిని పూర్తిగ సాధించెదరని నే నాశించుచున్నాను.

సప్రూ.
(అలహాబాద్)

*　　　*　　　*

౫. మీ జీవితములోని కెల్ల మహోత్కృష్టమగు యీ విజయలాభమునకు మిమ్మభినందించుచున్నాను. మన దేశసేవకై పరమేశ్వరుడు మిమ్ములను చిరంజీవులుగా జేయునుగాక.

బొమన్జి.
(న్యూయార్కు)

*　　　*　　　*

౬. పూనా ఒడంబడిక కుదిరినట్లును, మీరుపవాస దీక్ష ముగించినట్లును నేడు తెలిసినది. మిక్కిలి ఆనందము కలిగినది. మిమ్ములను బలవంతులజేసి, చాలకాలము భారత మాతకు సేవసేయుటకై మనుచుగాతయని యరువదినాల్గవ జన్మదినోత్సమునాడు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

సంయుక్త హిందూసంఘము.
(కేప్‌టవున్)

*　　　*　　　*

౭. ఒడంబడిక కుదిరినందులకు చాల సంతసించుచున్నాను. ఇక్కడ వీలగునదెల్లను జేయుచున్నాను.

అమితప్రేమతో,

ఆండ్రూస్.

* * *

౮. మహత్తరమగు మీయాధ్యాత్మికవిజయమునకానంద మొందుచున్నాను.

రోమెయిన్ రోలండ్

మాడలీన్ రోలండ్.

* " *

౯. బ్రిటిషుప్రభుత్వముపై మీకుకలిగిన మహావిజయమునకు ఐరిషు ప్రజాస్వామ్యవాదు లానందించుచున్నారు. మిమ్ముల నభినందించుచున్నారు. పరులచే తస్కరింపబడిన మీస్వాతంత్ర్యస్వరాజ్యములు మరల వారిచే మీకీయబడునంతవరకును పోరుసాగింపుడు.

డెన్నిస్ మోలీ.

నేషనల్ ఐరిష్ రిపబ్లిక్.

(చికాగో)

* * *

౧౦. మీ పాపములను నిలిపినందులకు పరమేశ్వరునకు నమస్కృతులు. సత్యాగ్రహమునకొక వినశ్వరమగు మహా విజయము కలిగినది.

జాన్ హెయిన్సు హోమ్సు.
బ్రూక్లిన్.
(సంయుక్తరాష్ట్రములు అమెరికా.)

* * * *

---

౮

నిమ్నజాతులకు శాసనసభలో నుండవలసినప్రాతినిధ్యమును గురించియును, వారిపురోభివృద్ధికి సంబంధించిన యితరవిషయములను గురించియును సవర్ణనాయకులును, నిమ్నజాతినాయకులును ఇట్లొడంబడిక గావించుకొనిరి.

పూనా ఒడంబడిక.

(౧). సామాన్యనియోజకవర్గములద్వారా నెన్నికలు జరుగుపద్ధతిని, నిమ్నజాతులవారికొరకు శాసనసభలలో ని క్రిందివిధమున స్థానములు ప్రత్యేకింపబడును.

| | స్థానములు. |
|---|---|
| మదరాసు రాజధానిలో | 30 |
| సింధుదేశములోకలసిన బొంబాయిరాష్ట్రములో | 15 |
| పంజాబ్ లో | 8 |
| బీహార్ ఒరిస్సాలలో | 18 |
| మధ్యరాష్ట్రములలో | 20 |
| అస్సాములో | 7 |
| బంగాళరాష్ట్రములో | 30 |
| సంయుక్తరాష్ట్రములో | 20 |
| మొత్తము | 148 |

ఏరాష్ట్రముయొక్క శాసనసభలో నెందరు సభ్యులుండవలెనో బ్రిటీషుప్రధానమంత్రిగారు నిర్ణయించిరి. ఆనిర్ణయముపై నాధారపడియే పైనిచ్చిన సభ్యులసంఖ్యలీయఁబడినవి.

(౨). అట్లు ప్రత్యేకింపబడినస్థానములకు సభ్యుల నెన్నుకొనుట సంయుక్తనియోజకవర్గములద్వారా నీక్రిందివిధమున జరుగును. ఒకమండలమున ఒకచో నెన్నికకు చెందినట్టియు, ఓటరులజాబితాలో తమపేరులు గలట్టియు, నిమ్నజాతిఓటరులందరు కలసి, వారికొరకు ప్రత్యేకింపబడిన యొక్కొక్కస్థానమునకు నలుగురభ్యర్థుల నెన్నుకొనవలెను. అభ్యర్థులుగ నెన్నుకొనఁబడుటకు నిలబడినవారిలో నొక్కనికే ప్రతిఓటరును ఓటు నీయవలెను. అంతట నెక్కువఓట్లు వచ్చిన మొదటినలుగు రభ్యర్థులును ప్రత్యేకింపబడిన స్థానమునకు సామాన్యనియోజకవర్గములో నభ్యర్థులుగా నిలబడుదురు. (ఆయభ్యర్థులు నిమ్నజాతిప్రజల ఓట్లమీదనే ఆధారపడిన వరిపోదు. ఆయెన్నికజరుగు మండలమునకే చెందిన తదితరహిందువుల ఓట్లను సంపాదింపవలసియుండును అట్లు నిలబడినవారిలో నొకరు నిమ్నజాతివారలఓట్లమీదనే ఆధారపడిరనుకొనుడు. మిగిలిన యభ్యర్థులు తదితరహిందువుల ఓట్లనుకూడ సంపాదించి ఆయనను ఓడించవచ్చును. దీనివల్ల సవర్ణులకును, నిమ్నజాతులవారికిని సంబంధము హెచ్చును. ఈయభ్యర్థులనందరను మొట్టమొదట నిమ్నజాతిఓటరులే యెన్నుకొనవలసి

యుండుటచేత వారు తదితరహిందువులచేతులలో కీలుబొమ్మలుకాక నిమ్నజాతులకు సరియైన ప్రతినిధులై యుండగుదురు).

(3). కేంద్ర లేక భారతశాసన సభలోకూడ నిమ్నజాతులకు రాష్ట్రీయశాసనసభలందు వలెనే స్థానములు ప్రత్యేకింపబడును. వారికొరకు ప్రత్యేకింపబడిన యొకొక్క స్థానమునకు నలుగురిచొప్పున తమవారిని అసలు యెన్నికలలో పోటీచేయుట కెన్నుకొనవలెను. (అనగా కేంద్రశాసనసభలో వారికి ప్రత్యేకింపబడిన స్థానములకుకూడ ప్రాథమిక యెన్నికవిధానము వర్తించునన్నమాట).

(౪). బ్రిటిషుఇండియా ప్రజలచే సామాన్యనియోజకవర్గములద్వారా పూర్తిచేయబడుటకు కేంద్రశాసనసభలో వారికొర కేర్పరుపబడిన స్థానములలో 100 కి 18 చొప్పున నిమ్నజాతులవారికి ప్రత్యేకింపబడును.

(౫). పైనవర్ణింపబడిన ప్రాథమికయెన్నికవిధానపద్ధతి పదిసంవత్సరముల యనంతరము అంతకుపూర్వమే యీక్రింది నీయబడిన షరతులప్రకారము నంతము కాకున్నచో మానివేయబడును.

(౬). మొదటి నాలుగుషరతులలో వివరింపబడిన కేంద్ర, రాష్ట్రీయశాసనసభలలో నిమ్నజాతులవారికొరకు స్థానములు ప్రత్యేకించి యుంచుపద్ధతి, సవర్ణులకును వారికిని

ఒడంబడిక కుదిరి, వారు మాకవసరము లేదనువరకు నట్లే యుండును.

(౭). కేంద్రరాష్ట్రీయ శాసనసభలకు ఓటునిచ్చు స్వత్వమును బొందుటకు నిమ్నజాతిప్రజలకు లోదిధియన్ కమిటీ రిపోర్టులో నిర్ణయింపబడిన నియమములే వర్తించును.

(౮). నిమ్నజాతులకు చెందినవారైనంతమాత్రమున స్థానికసంస్థల యెన్నికలలో పాల్గొనుటకుగాని, ప్రజాసేవకోద్యోగములందు నియమింపబడుటకుగాని ఎట్టియభ్యంతరముండకూడదు. ప్రజాసేవకోద్యోగములందు నెవ్వారినైన నియమించుటకు అభ్యర్థికుండవలసిన విద్యావిషయికనిబంధనల ననుసరించుచు, నిమ్నజాతులకు వాటియందు సరియైన ప్రాతినిధ్యముండునట్లు చేయుటకు సర్వవిధముల ప్రయత్నింపబడును.

(౯). ప్రతిరాష్ట్రమునందును విద్యాశాఖకిచ్చు గ్రాంటునుండి, నిమ్నజాతుల విద్యాభివృద్ధికొరకు తగినంతధనము వేరుపరుపబడవలెను.

| | |
|---|---|
| మదనమోహన మాలవ్యా | తేజబహదూర్ సప్రూ |
| యమ్. ఆర్. జయకర్ | బి. ఆర్. అంబేద్కర్ |
| శ్రీనివాసన్ | బి. యస్. కామత్ |
| జి. కె. దేవధర్ | ఎ. వి. ఠక్కర్ |
| ఆర్. కె. బాక్లే | పి. జి. సోలంకి |

యం. సి. రాజా
సి. రాజగోపాలాచారి
జి. డి. బిర్లా
శంకరలాల్ బాంకర్
గోవింద మాలవ్యా
బిస్వాస్
గవాయ్
హన్సామెహతా
కామకోటి నటరాజన్

మథురదాస్ వాసంజి
హెచ్. యన్. కుంజ్రు
పి. కోదండరావు
మనూ సుబేదార్
కె. జె. చిత్తారియా
ఎ. ఆర్. భట్
ప్రధాన్.

సి. వి. మెహతా
రాజేంద్రప్రసాద్
రామేశ్వరదాస్ బిర్లా
పి. బాలూ
దేవదాస్ గాంధి
బి. యస్. రాజభోజ్
లల్లుబాయ్ శ్యామలదాసు
కె. నటరాజన్
పురుషోత్తమదాస్ ఠాకూర్ దాస్

వాల్చంద్ హీరాచంద్
కె జి. లిమాయ్
జి కె. గాడ్గిల్
అవంతికాబాయి గోఖ్లే
రాధాకాంత మాలవ్యా
కోలం

౬

ఉపవాసదీక్షను ముగించిన మరునాడే మహాత్ముని పుట్టినరోజు. అంతకు పూర్వదినముననే శ్రీయుతులు బాబూ రాజేంద్రప్రసాద్, రాజగోపాలాచార్యులు గార్లు, సెప్టెంబరు 27 వ తేదీ మొదలుకొని అక్టోబరు 2 వ తేదీవరకు నస్పృశ్యతానివృత్తి వారముగ పరిగణించి దేశీయులెల్లరుచు కృషిసల్పవలె నని యొకవిజ్ఞప్తిని, తగినకార్యక్రమముతోపాటు ప్రకటించిరి. ఆవారముదినములలో భారతదేశమునందపూర్వోత్సాహములు పొడగట్టినవి. రవీంద్రనాధమహాకవియే 27 వ తేదీని పూనాలోజరిగిన మహాసభలో నీక్రిందిమహోపన్యాసము నొసంగెను.

అనంతర వృత్తాంతము.

"మహాత్ముడిప్పుడే మృత్యువును జయించి బయట పడినాడు. అందుచేత ఆయనజన్మదినోత్సవ మొకబహిరంగమగు వైభవముతో విరాజిల్లుచున్నది. ఇట్టి మహాపురుషుడు మన మహద్భాగ్యమువల్లనే నేడు మనకు లభించెను. అన్నిటికంటె వింతయేమన — సత్యమార్గమును గన్పరుచుచు, స్వాతంత్ర్యసందేశము నొసంగిన మహాపురుషులలో చాలమంది మహాత్మ్యమును గుర్తింపలేక నిందించినట్లు, నేడు మనమీమహాపురుషునికూడ నిందింపక, పూజించుచున్నాము. ఆయన తపశ్శక్తి భారతదేశమునందెల్లడల నృత్యము

నల్వ్రేగాక- యితరదేశములకుకూడ ప్రాకిపోయినది. స్వార్థమును మించిన యొక మహాసత్యమువైపు మనదృష్టి నాకర్షించినది. ఆయన నిత్యజీవనమును జూడుడు! ఆత్మార్పణమొనర్చి, మానవసేవసేయుటవల్లనే ముక్తి సాధ్యమగునని ఘోషించుచుండుట లేదా?

నేడు మనజాతంతయు మహాత్ముని మనకందరియొక్కయగ్రసోదరునిగా నంగీకరించినది. ప్రస్తుతకాలమున మన మాతృదేశమునబెంపొందుచున్న సోదరభావమున కాయనయే మూలాధారము. ఈతరుణమున మనము వట్టిగర్వోద్రేకములతో బ్రొద్దుపుచ్చక, శ్రద్ధాభక్తులతో మనకర్తవ్యమును నిర్వర్తించెదముగాక.

సకలమానవహృదయాంతరాళముల వర్తించు నా పరమేశ్వరు డుపనిషత్తులలో మహాత్ముడను నామముతో పిలువబడెను. నేడు మనమందరమును చేరి గౌరవించుచున్న నీమహాపురుషునకు కూడ నా"మహాత్మ" బిరుదము సరిగ సరిపోయినది. ఏలన, ఆయనఅంగుష్టమాత్రమగు తనశరీరములో గాక, భారతభూమియందిప్పుడున్న కోటానుకోట్ల ప్రజలయొక్కయును, ముందు రాబోవు సంతతులవారియొక్కయు హృదయాంతరాళములయందే నివసించుచున్నాడు. ఇతరుల యాత్మలను కూడ తనలోనిముడ్చుకొనగల ఆమహాత్ముని ఆధ్యాత్మికశక్తి మనదేశచారిత్రయం దదివరకెన్నడు జరిగి

యుండని వింతను సాధించినది. నేడు మనదేశములో గల సాధారణజనులు కూడ - భారతదేశమనునదొక పేరే గాక, తమజీవితములతో నిత్యసంబంధముగల సజీవమును, ప్రత్యక్షము నగు నొక మహాసత్యమని గ్రహింపగలిగిరి.

ప్రతిమానవునికిని జన్మహక్కులగు సహాయ సానుభూతులను నిరాకరించి మనమనేకకోట్ల తోటిమానవులను జన్మవల్లనే యస్పృశ్యులుగ పరిగణించి నీచాతినీచముగ చూచుచున్నాము. ఆదీనుల జీవితములనే దుర్భముగావించుచు, వారినశుములను కాలగట్టుచున్న యీ యస్పృశ్యతాభారమును, అనేకతరములనుండి వచ్చుచున్న యీ ఘోరాన్యాయమును వారిమీదనుండి తొలగించుటలో మనముకూడ నడుముల బిగించుకొని, దృఢనిశ్చయములతో మహాత్మ ననుసరింతుముగాక! అట్లు చేయుటవల్ల మనము మనదేశమును బంధించిన నీతిబాహ్యములగు దుష్టాచారములను నాశనముచేయుటయేగాక, తదితర మానవకోటికికూడ సన్మార్గము చూపించినవార మగుదుము. ఎక్కడనైనుసరే, ఏరూపముదాల్చినను సరే హింసాత్మకములగు దురాచారములనెల్ల నంతరాత్మల పరీక్షల కాగవలెనని నేడు సవాలుచేయుచున్నాము. ఇదికూడ మహాత్ముని యుపవాసదీక్షాఫలితమే!

మహాత్ముడు నిరశనదీక్షను బూనినప్పుడు మనదేశములోను విదేశములోను గల సంశయాత్మకులు కొందరు ఆయ

నను పరిహసించిరి. నిరసించిరి. కాని మనకన్నులముందరనే దేశము బహువిచిత్రముగ మారిపోయినది. కఠినపాషాణస దృశములగు పూర్వాచారములు బ్రద్దలు కాజొచ్చినవి. మాన వాభివృద్ధికిని, జాతీయ జీవనమునకు నరిష్టదాయకములును, మూఢములు నగు దురాచారములను నిర్బంధములెల్ల కదలి కూలిపోవు చిన్నె లగపడుచున్నవి. మహాత్ముని తపస్సువల్ల మహాద్భుతమగు ఫలితములు కలిగినవి. కాని యీ యస్పృ శ్యతాదురాచారమును, దానిననుసరించు యితర చెడుగు లును, అసహనభావమును; విశ్వమానవసాభ్రాతృత్వమున కును, ధర్మ మోక్ష మార్గములకు నడ్డుపడు వాటన్నిటితో కూడ-కడవరకు పోరాడి మన మామహాత్ముని వ్రతసమాప్తికి తోడ్పడినచో నది యే మనకును, ఆయనకునుకూడ నత్యంత కీర్తివంతమగు విషయమగును.

మిత్రులారా! మనమహాత్ముని యెడల ద్రోహ మొనర్పకుఁడు మీమానవత్వము నెడల ద్రోహముగావించు కొనకుడు. అనేకతరములనుండి మహాబాధలనుభవించుచు తమయదృష్టమును, పరమేశ్వరుని ఎన్నడును నిందింపక తాము పొందుచున్న యవమానములనుకూడ నెరుఁగజాలక జీవితములను గడపు ఆనోరు లేనిదీనులకు- మీతోడిమాన వులక న్యాయ మొనర్పకుడు. సోదరప్రేమతో వారలనుగౌర వింపుడు.

ఈనాటికి భారతీయభాగ్యవిధాతయగు యీమహాత్ముని దివ్యవాణి బయలువెడలినది. ఎవ్వరు గర్వాంధులై, సంఘవిచ్ఛేదముగావించి, మానవులొండొరులతో కలసి ప్రేమపూర్వకముగ వర్తించుటకడ్డమువత్తురో, వారు స్వాతంత్ర్యదేవతనే శిరచ్ఛేదముగావించినవారలగుదురని ఆదివ్యవాణి ఎల్లరను హెచ్చరించుచున్నది.”

* * * * *

26 వ తేదీని యరవాడ జైలునావరించిన విషాదచ్ఛాయలదృశ్యములై పోయినవి. 27 వ తేదీ ఉదయమునొక్కసారిగ సంతోషోత్సాహము లెల్లరిహృదయములలోను తాండవించినవి వేకువనే రవీంద్రుడుమున్నగు మిత్రులును, తక్కిన బంధువర్గమును సమావేశమై మహాత్ముని జన్మదినోత్సవము జరపిరి. నాడు వివిధవర్ణములవారు, వివిధరాజకీయ పక్షములకు చెందినవారు, పిన్నలు పెద్దలు, ధనవంతులు పేదలు, స్త్రీలు పురుషులు, బాలురు బాలికలు మున్నగు వారందరామహాత్మునకు తమప్రణామములర్పించి ఆశీర్వాదము బడయుటకు సాయంత్రము జైలుద్వారము మూయబడు వరకును వచ్చుచునేయుండిరి. జైలునియమము లడ్డమువచ్చిన వేగాని లేనిచో పూనావాసులును, తత్పరిసరగ్రామములవారును, అపరబోధివృక్షమై తనరిన ఆగున్నమామిడిని, దాని నీడయందు శయనించిన యామహాతపస్విని దర్శించుటకు వచ్చియుందురు. రాత్రిసుఖనిద్రవల్ల మహాత్ముడు కొంచెము

తేరుకొనినను నీరసముగానే యుండెను. అయినప్పటికి చూడ వచ్చినవారందరిపైన చిరునవ్వువెన్నెలల గురియించుచునే యుండెను. తనకు ప్రజలర్పించినపూలదండల నన్నిటి నాగున్న మామిడికొమ్మలకు మహాత్ము డర్పించినందువల్ల నాకొమ్మలు క్రిందికి వంగిపోయినవి. ఆకొమ్మల కానా డెన్నిచిరుకొమ్మల వియోగము తటస్థించినదో లెక్కవేయగలవా రెవ్వరు?

ఆనాడే మహాత్ముడు పత్రికాప్రతినిధుల ప్రశ్నలకు జవాబుగా, ప్రభుత్వము తాను గౌరవప్రదమగు సమాధానము చేసికొనుట కెప్పుడును సిద్ధుడనే యనియును, "గౌరవప్రదమగు" అనుమాటను మాత్రము కొంచెము నొక్కిచెప్పెదననియును ప్రకటించెను. తత్ఫలితముగా సప్రూ జయకరులాదిగా గలవారలు మహాత్మునితో సంభాషించి, ప్రభుత్వమువారు సరియైనమార్గమున ప్రయత్నించినచో కాంగ్రెసుతో సంధికుదురుట సులభమని అభిప్రాయపడిరి. కాని 29 వ సాయంత్రమున సిమ్లానుండివచ్చిన ఉత్తరువులవల్ల మహాత్మునిపై పూర్వనిర్బంధములన్నియు తిరిగివిధింపబడినవి. పత్రికాప్రతినిధులతో సంభాషించుటకును, ఉత్తరప్రత్యుత్తరముల నిదివరకొసంగిన యవకాశములన్నియు తొలగింపబడినవి. దానితో ప్రజలహృదయములలో పొడగట్టిన ఆశారేఖలంతరించినవి. అస్పృశ్యతానివారణోద్యమమును సక్రమమార్గముల నెట్లు నడపింపవలెనో మహాత్ముననడిగి బయటి

వారు తెలిసికొనుటకు గల సదుపాయములు పోయినవి. జైలు డాక్టరులు వలదనుచున్నను, మహాత్ముడింకను పక్కమీదనుండి తనంతటతాను లేవజాలని స్థితిలోనుండినను ఆ యనకు పరిచర్య చేయుచున్నవారలు పంపివేయబడిరి. శ్రీమతి సరోజినీదేవి స్త్రీలజైలునకు మార్చివేయబడినది. పూనానగరమునుండి మహాత్మునియొకలు పట్టుటకువచ్చిన నిపుణుని అవసరములేదని వెడలననిచిరి. గాంధీజీని చూచుటకు వచ్చిన జయకరుగారికి వలనుపడదనిరి. మహాత్మునికట్ట కడపట పీడినది ఆయన సహధర్మచారిణి శ్రీ కస్తూరిబాయియే! కంటతడితో, కంపితహృదయముతో తనవస్తువుల నెల్ల ప్రోగుచేసికొని ఆమె మహాత్ముని వీడినదని వినినంతనే పూనాలో గల నాయకులహృదయములు దహించుకొని పోయినవి. పిమ్మట ప్రభుత్వము- ఆమెకు శిక్షాపూర్తికింక నైదుదినములున్నదనగనే విడిచిపెట్టి, పగటిపూటమాత్రము మహాత్మునికడనుండి పరిచర్యచేయుట కనుమతించినది. అస్పృశ్యతానివారణవిషయమున ప్రచురముచేయుటకుగాని, తద్విషయమై దేవాలయధర్మకర్తలు, మున్నగు వారలతోగాని సంభాషించుట కవకాశము లేకుండ చేసినందులకు తన మనోభావముల వెల్లడించుచు ప్రభుత్వమున కొక తీవ్రమగు లేఖను మహాత్ముడువ్రాసెను. కాని ఫలితము లేకపోయినది. ఈ సంగతి తెలిసినంతనే లండనులో కూడ సంచలనము కలిగినది.

ఉపవాసాంతమున మహాత్ముడిచ్చిన ప్రకటనా ఫలితముగ 'అఖిలభారత యస్పృశ్యతానివారణసంఘము'ను పేరుతో నొక సంఘము స్థాపింపబడినది. కాని ఆపేరుతోనే శ్రీ వి. ఎ. పిండే గారిచే స్థాపింపబడిన సంఘమొకటియుండుటచే దానినే "అఖిలభారతహరిజనసేవకసంఘము"గ మార్పుచేసిరి. దీనికి అన్నిరాష్ట్రములలోను ఉపసంఘము లేర్పరుపబడెను. మన ఆంధ్రదేశమున 'ఆంధ్రరాష్ట్రహిందూసేవాసంఘము' దానిలో నొకటి. దీనికి శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు అధ్యక్షులుగను, శ్రీ మాగంటి బాపినీడుగారు కార్యదర్శిగను పనిచేయుచున్నారు ఆంధ్రదేశములోని అన్నిజిల్లాలలోను దీనికుపసంఘము లేర్పరుపబడెను. సాంఘికసేవాతత్పరులగు ప్రముఖులనేకులు ఈయుద్యమము నందు పాల్గొనుచున్నారు.

ఈసంఘము పక్షమున రు 25 లక్షలను నిధిగా వసూలు చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. పలుకుబడిగల హిందూనాయకులలో చాలమంది దానికై పాటుపడుచున్నారు. తాను ముసల్మానుడైనప్పటికిని పైనిధికి శ్రీ భోపాల్ నవాబుగారు రు 5000 చందానిచ్చిరి. అఖిలభారతసంఘమునకు సంస్కర్తలలో నగ్రేసరుడును, మహాత్ముని ముఖ్యానుచరుడునగు జి. డి. బిర్లాగారధ్యక్షులు. హరిజనసేవాపరాయణులును, కీర్తిశేషులగు గోక్లేగారిచే స్థాపింపబడిన 'భారత

సేవాసంఘ' సభ్యులునగు శ్రీ. ఎ. వి. అమృతలాల్ ఠక్కర్ గారీసంఘమునకు కార్యదర్శిగ నియమింపబడిరి.

దేశములో నస్పృశ్యతానివారణకై తీవ్రప్రయత్నములు గావింపబడుచున్నవి. బరోడా, కాశ్మీర్, కొల్హాపూర్, భోర్ సంస్థానాధిపతులు తమ సంస్థానములలో గల దేవాలయములలోని కస్పృశ్యులుకూడ రావచ్చునని ప్రకటించిరి. నవంబరు ఒకటవ తేదీని మదరాసుశాసనసభలో డాక్టరు సుబ్బరాయనుగారిచే ప్రవేశపెట్టబడిన దేవాలయప్రవేశ విషయకమైనతీర్మాన మెల్లరచే నేకగ్రీవముగా నామోదింపబడినది. తదితరహిందువులతోపాటు హరిజనులుకూడ దేవాలయప్రవేశ మొనర్చుటకు వారికి గల అడ్డంకుల నెల్ల తొలగించి, దేవాలయములోనికి ప్రజాభిప్రాయానుసారముగ హరిజనులను రానిచ్చుటకు, దేవాలయధర్మకర్తలకుగల కష్టములు పోగొట్టుటకు తగినశాసనములను ప్రభుత్వమువారు శాసనసభలో ప్రవేశపెట్టవలెనని ఆతీర్మానమునందు కలదు.

గురువాయూరు దేవాలయధర్మకర్తగా రగుజామరిన్ గారిపై తంతివార్తలు వర్షింపసాగిరి. వారును కొన్ని నెలలవరకు నిరశనదీక్షను మానునట్లు కేళప్పన్ గారిని ఒప్పించి తద్విషయమై ఆలోచించుటకు తన కవకాశమొసంగవలెనని మహాత్మునకు సూచనగావించిరి. అది చేరినవెంటనే మహాత్ముడు ఇన్ని నెలలలోపుగ గురువాయూరు దేవాలయములోని కస్పృశ్యులనురానియ్యనియెడల తాను మరల నిరశనదీక్ష మొదలు పెట్టెదనని దేవాలయధర్మకర్తలకు నోటీసు నిచ్చి నిరాహార దీక్షను ముగించవలెననియును, ఆలోపుగ నస్పృశ్యులను దేవాలయములోనికి రానియ్యనియెడల కేళప్పన్ గారితో పాటు తానుకూడ నుపవాసదీక్ష బూనెదననియును, సమ్మతించినట్లు తంతిద్వారా తెలుపమనియును, కేళప్పన్ గారికి అక్టోబరు రెండవతేదీని తంతినిచ్చెను. శ్రీ కేళప్పన్ గారు మహాత్ముని కోరికప్రకారము ధర్మకర్తయగు జామరిన్ గారికి నోటీసునిచ్చి, మూడు నెలలవరకును తన యుపవాసదీక్షను విరమించినట్లు మహాత్మునకు తెలియజేసిరి. దానితో గురువాయూరు దేవాలయసమస్యకూడ నాసబర్మతీయోగి భుజస్కంధ మెక్కినది.

మహాత్ముడు మరల త్వరలోనే గురువాయూరు దేవాలయవిషయమై రెండవమా రుపవాసముచేయ నిశ్చయించుకొనినాడనువార్త దేశములోని నలుమూలలకును ప్రాకిపో

యెను. గురువాయూరుసమస్య యావద్భారతదేశసమస్యగ మారిపోయెను. మహాత్ముడు పట్టినపట్టు విడుచువాడు కాదని మొదటి యుపవాసమువల్ల నెల్లరకును స్పష్టమయ్యెను. అందువల్ల మహాత్ముడు రెండవమారు నిరశనదీక్ష బూనకుండ చేయవలెనన్నచో గురువాయూరుదేవాలయములోని కస్పృశ్యులకు ప్రవేశము కలిగించుటకు తక్షణమార్గముల నాయకులు సంకల్పించిరి. మహాత్ముడన్ననో గతోపవాసమువల్ల చాల నీరసముగనే యుండెను. మరల నిరాహారముగా నాయన యుపవాసము చేయవలసినగతియే పట్టినచో దేశమున కాయన దక్కునో దక్కడో యను భయము కూడ నెల్లర నావహించెను. అఖిల భారత హరిజనసేవక సంఘాధ్యక్షులగు శ్రీ జి. డి. బిర్లా గారు, వివిధరాష్ట్రీయసంఘముల వారును ప్రజలలో నీసమస్య విషయమై తీవ్రప్రచారముగావించి, హరిజనులు దేవాలయ ప్రవేశ మొనర్చుటకు ప్రజ లెంతవరకు సుముఖులుగానున్నారో తీర్మానముల రూపమున జామరిన్ గారికి తెలియజేయవలసిన దని విజ్ఞప్తిని ప్రకటించిరి. తత్ఫలితముగా దేశమునందలి వివిధప్రాంతములలోని స్త్రీలు, పురుషులు, విద్యార్థులు, యితర ప్రజాసంస్థలవారు హరిజనులను గురువాయూరుదేవాలయములోనికి రానీయవలసిన దని కోరుచు తీర్మానములను గావించి జామరిన్ గారి కంపిరి.

కేళప్పన్‌గారు మహాత్ముని ఆదేశానుసారముగ నుప వాసదీక్షను తాత్కాలికముగ నూనినపిమ్మట జామరిన్‌గారు, హరిజనులను దేవాలయప్రవేశ మొనర్పనీయు విషయమై వారి యభిప్రాయములను తెలుపుడని కేరళ రాష్ట్రములోని వివిధదేవాలయ ధర్మకర్తల కుత్తరములను వ్రాసిరి. వారిలో చాలమంది హరిజనుల దేవాలయప్రవేశ మొనర్ప నిచ్చుట సనాతనధర్మమునకు విరుద్ధమని వ్రాసిరి. కొందరు తటస్థులు గానుండిరి. ఒక రిద్దరుమాత్ర మనుకూలముగానుండిరి. దీనికి తోడు పూర్వాచారపరాయణులు సభలను చేసి, అస్పృశ్యత శాస్త్రసమ్మతమైన ఆచారమనియును, అది హిందూధర్మము లోనొకముఖ్యభాగమనియును, హరిజనులు దేవాలయప్రవేశ మొనర్చుట కర్హులు కారనియును, సంస్కర్తల తీర్మానములను గణింపక నార్షమతోద్ధరణగావించి పుణ్యముకట్టుకొనుమని యును తీర్మానములను గావించి జామరిన్‌గారి కందజేసిరి.

జామరిన్‌గారు మహాసంకటస్థితిలో చిక్కుకొనిరి. 1933 సంవత్సరము జనవరి రెండవతేదీలోపుగ దేవాలయము లోని కస్పృశ్యులను రానియ్యకపోయినచో కేళప్పన్‌గారితో పాటు తానుకూడ నిరశనదీక్ష బూనెదనని మహాత్ముడు ప్రక టించెను. ఇంకొకవంక, పూర్వాచారపరాయణు లస్పృశ్య తానివారణోద్యమమును, హరిజన దేవాలయ ప్రవేశములు ధర్మశాస్త్ర విరుద్ధములనుచుండిరి. జామరిన్‌గారి భావములు

కూడ వారైనే మొనగినని. శివిధన్నిటిని మించిన చిక్కింకొ
కలిగలదు అంటుచుట్టసంబంధమైనది. జామరిన్‌గారు దేవాలయ
ధర్మకర్తలు ప్రస్తుతములలో నున్న ఆచారములకు విరు
ద్ధముగా ధర్మకర్తృత్వం ప్రవర్తించుటకు వారికి దేవస్థానసంబం
ధములగుచట్టము లడ్డువచ్చును. జామరిన్‌గా రొకవేళ హరి
జనదేవాలయప్రవేశమున కంగీకరించినను, అది యిష్టములేని
సవర్ణహిందువు లెవ్వరైనను సరే వారిపై న్యాయస్థానములో
న్యాయ్యము తేవచ్చును. న్యాయాధిపతి ప్రస్తుతములులో
నున్న చట్టముల ప్రకారము జామరిన్‌గారిపై చర్యతీసుకొన
వలసివచ్చును. ఇక నేమియును చేయక యూరకొనినచో
విశ్వమానవకోటిచే పురుషోత్తముడుగ భావింపబడుచున్న
ఆమహాపురుషుని ప్రాణములు పోకుండ నుండునా ?

మహాత్ముడు జామరిన్ గారి చిక్కులను గ్రహించెను. హరిజనులు దేవాలయ ప్రవేశ మొనర్చుటకు జామరిన్ గా రంగీకరింపకపోయినచో నది ప్రజాభిప్రాయముయొక్క దుర్బలత్వమునే సూచించుననియును, అందులకు జామరిన్ గారిని నిందించుటకునూరు, సవర్ణహిందువులలో ప్రబోధము కలిగించి, ప్రజాభిప్రాయమును దేవాలయప్రవేశమున కనుకూలముగ బలవత్తరముగావించుటయే సంస్కర్తల కర్తవ్యమని వారికి తేటతెల్లముగావించెను. దేవాలయ ధర్మకర్తల విధుల నుగురించి ఒకపత్రికావిలేఖరితో నిట్లు చెప్పెను. "ఏదేని

యొక్కపూర్వాచారము నట్లే యుంచుటకు పాటుపడుటతో గాని, లేక కొన్నివర్ణముల వారిహక్కులను రక్షించుటతో గాని, ధర్మకర్తయొక్కపని పూర్తిగాజాలదు అతడు హిందూధర్మపవిత్రత చెడకుండ చూడవలెను. అంతియెగాక నాహిందూసంఘములో నడుచినపరివర్తనములగు చున్న ఆధ్యాత్మికాశయములనుకూడ గుర్తించి వాటినిపోషింపవలె ను” విలేఖరియే మదరాసు రాజధానిలోగల దేవాదాయ చట్టములో నధికసంఖ్యాకులగు ప్రజల కిష్టము లేకపోయినప్పటికిని దేవాలయధర్మకర్త అమలులోనున్న ఆచారముల ప్రకారమేనడచుకొనవలెనని యున్నదని చెప్పగా మహాత్ముడు ఆచట్టమునకు సవరణమును శాసనసభలో నుపపాదించి ధర్మకర్తలధిక సంఖ్యాకులగు ప్రజలకిష్టముప్రకారము వర్తించుటకుగల నిర్బంధములను తొలగించుట- 193౪ సం॥ జనవరి రెండవతారీఖులలోపుగ జరుగకున్నను, అందులకు జరుగవలసిన యితరప్రయత్నములన్నియు నంతకుపూర్వము జరిగి యుండినచో తా నుపవాసదీక్షను బూనకుండసాగెదనని జవాబిచ్చెను. ఎవరో కొలదిమంది నీసంస్కరణకు వ్యతిరేకముగ నున్నారని పూర్వాచారపరాయణులును, దేవాలయము లందు విశ్వాసముగల్గి, గురువాయూరుదేవాలయములోని కేగుట కధికారముగల వారిలో నధికసంఖ్యాకులీ సంస్కరణ నంగీకరించుచున్నారని సంస్కర్తలును, తగాదాపడుటకంటె;

గురువాయూరుదేవాలయమున్న పొన్నానితాలూకాలోగల సవర్ణహిందువుల యభిప్రాయములను ఓట్లద్వారా తెలిసికొనవలెననియును, దానివల్ల వారిలో నధికసంఖ్యాకులు హరిజనులు దేవాలయప్రవేశమొనర్చుటకు ప్రతికూలురుగ నున్నట్లు తెలిసినచో గురువాయూరు విషయమై తానుపవాస దీక్షబూనుటే మానివేసెదనని తరువాత మహాత్ముడు ప్రకటించెను. సవర్ణహిందువుల ఓట్లను సంస్కర్తలు తీసికొనునప్పుడు జామొరిన్ గారు తనకు విశ్వాసపాత్రులగు వారి నెవ్వరినైన పంపవచ్చుననికూడ నందులో సూచనగావించెను. కాని జామొరిన్‌గారు దీనికి లేశమాత్రము నిష్టపడలేదు. ప్రజాభిప్రాయ మీసంస్కరణ కనుకూలముగ నుండినట్లు తేలినను ధర్మకర్తల కాలుచేతుల కట్టివైచిన చట్టములమలులో నున్నంతకాలము లాభముండదని వారభిప్రాయపడిరి.

పొన్నానితాలూకాలో నస్పృశ్యతాపాపనిర్మూలనార్థము నందులో ముఖ్యముగా హరిజనదేవాలయప్రవేశవిషయమున మహాసంరంభ మారంభమైనది. శ్రీ కొండా వెంకటప్పయ్యపంతులుగారు, కీర్తిశేషులగు దేశబంధు చిత్తరంజనదాసుగారి సోదరీమణియగు శ్రీ ఊర్మిళాదేవి, శ్రీమతి కస్తూరిబాయి గాంధిగారలు కేరళ రాష్ట్రనాయకులతోడ్పాటుతో సంచారము గావించుచు, దేశారిష్టదాయకమును హిందూ

ధర్మమునకు కళంకప్రాయము నగు అస్పృశ్యతాపిశాచమును పారద్రోలి, స్వమతస్థులగు నా దీనులను తమతోపాటు చూచుకొనుచు వారు దేవాలయ ప్రవేశ మొనరించుట కంగీకరింపవలసినదని సంవర్ణహిందువులను ప్రబోధింప సాగిరి. ఈ లోపున, కే. మాధవ మీనన్‌గా రధ్యక్షులుగను తాను శ్రీగోపాలమీనన్‌గారును సభ్యులుగను, శ్రీరాజగోపాలాచార్యులు గారొక సంఘము నేర్పరచి సవర్ణ హిందువుల యభిప్రాయములు హరిజనదేవాలయ ప్రవేశమున కనుకూలముగనున్నవో, లేక ప్రతికూలముగ నున్నవో తెలిసికొనుటకు పూనుకొనిరి. స్త్రీ పురుష భేదము లేకుండ దేవాలయములయందు నమ్మకముండి అనుదినము దేవాలయమునకేగునట్టి సవర్ణహిందువులలో యుక్తవయస్సు వచ్చిన వారందరకడకును వారి యభిప్రాయమును వ్రాయుమని, ప్రత్యేకముగా నాయవసరమునకు తయారుచేయబడిన పుస్తకములను స్వచ్ఛందసేవకులు తీసుకొని వెళ్ళిరి. తత్ఫలితములు డిశంబరు 25 వ తారీఖున ప్రకటింపబడినవి. ఈ విషయమై ఓటుచేయుటకు నర్హతగల సవర్ణహిందువులలో, నూటికి 27 గురు తమయభిప్రాయములను దెల్పుటకే నిరాకరించి, నూటికి 56 గురు సంస్కరణకనుకూలముగ ఓటునిచ్చిరి; నూటికి 9 గురు తటస్థులుగానుండిరి; నూటికి 8 గురు సంస్కరణకు ప్రతికూలముగ ఓటు నిచ్చిరి. ఇందులో మిక్కిలి సంతోషజనకమగు విషయమేమన ; ఓట్లనిచ్చిన 20, 167 గురిలో

10,472 గురు స్త్రీ లుండుటయె. వీరిలో పాల్గొనిన సవర్ణ హిందువుల సంఖ్యప్రకారము చూచినచో నూటికి 77 గురు సంస్కరణ కనుకూలముగ నుండిరన్నమాట! సవర్ణహిందువులలో నధికసంఖ్యాకులు హరిజనులుకూడ తమ సోదరులని యంగీకరించిరనుట కింతకంటె దృష్టాంత మేమి కావలెను?

సవర్ణహిందువులలో నధికసంఖ్యాకు లీసంస్కరణ కొప్పుకొనినట్లు స్పష్టమైనది. మహాత్ముడు తన యుపవాస దీక్షను 1933 సం॥ జనవరి రెండవ తేదీనుండి ప్రారంభించకుండ నుండునా? ఎన్నటికి నుండదు. జనవరి రెండవ తేదీలోపున తొలగింపవీలులేని చట్టసంబంధములగు చిక్కులు వచ్చిననే తప్ప హరిజనులను గురువాయూరు దేవాలయములోనికి రానియ్యక పోయినచో నుపవాసదీక్షమాననని సందేహించుట కేమాత్రము తావులేకుండ నాయన చెప్పివైచెను. ఈచిక్కు నుండి బయటపడు టెట్లు?

సుబ్బరాయన్ గారి బిల్లు

నవంబరు ఒకటవ తేదీని మదరాసు శాసనసభలో అస్పృశ్యతా విరుద్ధముగా నానాటికి ప్రబలుచున్న ప్రజాభిప్రాయమును గణించి ఆప్రజాభిప్రాయానుసారము హరిజనులను దేవాలయములలోనికి రానిచ్చుటకు దేవాలయధర్మకర్తలకుగల యడ్డంకులను తొలగించుటకు తగిన శాసనమును ప్రవేశపెట్టవలెనని డాక్టరు సుబ్బరాయన్‌గా రొకతీర్మానమును ప్రవేశపెట్టినట్లును, అది ఏకగ్రీవముగా నంగీకరింపబడినట్లు నిదివరకు తెలుప

బడినది. అటుపిమ్మట మదరాసుప్రభుత్వమువారూరకుండు టచే డిశంబరు ఒకటవతారీఖున డాక్టరు సుబ్బరాయన్‌గారే 'దేవాలయప్రవేశవిషయమున నిమ్నజాతు లనబడువారికున్న యడ్డంకులను దొలగించుబిల్లు'ను పేరుతో నొకబిల్లును మదరాసుశాసనసభలో ప్రవేశపెట్ట గోరెదనని వ్రాయుచు ఆ బిల్లును ప్రభుత్వమున కంపిరి. సుమారదేసమయమున భారతశాసనసభలో శ్రీయుత సి యస్. రంగయ్యారుగారు నిమ్నజాతులకున్న చిక్కులనన్నిటిని తొలగించుట కొకబిల్లును ప్రవేశపెట్టగోరిరి. కాని యీరెండుబిల్లులపైనను ఆయా శాసనసభలలో చర్చజరిగి యవి శాసనములుగా మారుటకు పూర్వము వాటిని ప్రవేశపెట్టుటకే రాజప్రతినిధిగారనుమతి నీయవలసియుండెను. వారి అనుమతి బడయుటకై ఆరెండు బిల్లులును వారికడ కంపబడినవి. రాజప్రతినిధిగారందలి విషయమునుగూర్చి తమ నిర్ణయమును జనవరి రెండవతేదీ లోపుగ ప్రకటించుసూచనలు గనుపడలేదు. మరికొంతకాల మాలస్యమగుటతప్పదని తెలియవచ్చెను. మహాత్ము డీసందర్భము లన్నెల్ల గమనించి శ్రీరాజగోపాలాచార్యులు, కేళప్పన్‌గార్లతో కలిసి చర్చించి, ప్రజాభిప్రాయ మనుకూలముగనున్నను జనవరి రెండవతారీఖులోపుగ తొలగించుటకు వీలులేని చట్టసంబంధమగుచిక్కులు వచ్చినందువల్ల తానును కేళప్పన్‌గారును గురువాయూరు దేవాలయము లోనికి హరిజనుల ప్రవే

శింపనిచ్చువిషయ ముపవాసమొకర్వ ప్రస్తుత మాపివైచితి మని ప్రకటించెను.

పూర్వాచారపరాయణులింతకాలముమూరకుండిరా? లేదు. పౌన్నాసితాలుకాలో దేవాలయప్రవేశమునకు సవర్ణహిందువులలో ననుకూలు రెందరో ప్రతికూలు రెందరో స్పష్టపరచుటకై సేపకులు తెలిసికొనుట్కై తిరుగుచున్న రోజులలో నాప్రాంతములకేగి, సభలనుజేసి, అస్పృశ్యతానిర్మూలనోద్యమమునకు వ్యతిరేకముగా ప్రజలలో ప్రచారముచేసిరి. కాని లాభము లేకపోయినది.

పూర్వాచారపరాయణులు.

పిమ్మట శ్రీరంగయ్యారు డాక్టరు సుబ్బరాయన్ గార్ల బిల్లులను భారత, రాష్ట్రశాసనసభలలో ప్రవేశపెట్ట కనుమతింపవలదనియును, ప్రజల మతవిషయములందు జోక్యము కలిగించుకొనమని విక్టోరియామహారాజ్ఞిచేసిన వాగ్దానము చెల్లింపుమనియును కోరుచు, తీర్మానముల గావించి వాటిని రాజప్రతినిధికి పంపసాగిరి. దానికిబదులుగ శ్రీరాజగోపాలాచార్యులుగారు పూర్వాచారపరాయణులు చెప్పినట్లు బ్రిటిషుప్రభుత్వము ప్రజల మతవిషయములందు జోక్యము కలిగించుకొనకుండుట చాల మంచిదే. కాని, యిప్పుడట్లుజరుగుట లేదనిరి. పూర్వాచారముల నెవ్వ రతిక్రమించకుండ బ్రిటిషుకోర్టులు రక్షించుచున్నవనియును, అట్లుగాక ప్రజాభిప్రాయానుసారమాయాచారములు మారుట కవకాశమొసంగి, ప్రభుత్వ

ముషా రేపక్షమువారికిని సహాయపడకుండినచో నంతట ప్రభుత్వము ప్రజలమతవిషయములయందు జోక్యము కలిగించుకొనుట లేదనవచ్చుననియును ప్రకటించిరి.

1933 సంవత్సరము జనవరి 8 వ తేదీనాడు దేశమునందెల్లచోటుల సభలుచేసి డాక్టరు సుబ్బరాయన్ రంగయ్యరు గార్ల బిల్లులను శాసనసభలలో ప్రవేశపెట్టుట కనుమతించవలసినదని రాజప్రతినిధిని కోరుచు తీర్మానముల గావించి పంప ప్రజలను నాయకులు హెచ్చరించిరి. తదనుసారముగ దేశములో అసంఖ్యాకములగు సభలు జరిగినవి. రాజప్రతినిధికి వెళ్ళిన తంతివార్తలకు మితిలేదు.

ఆఖరకు- జనవరి 23 వ తేదీని రాజప్రతినిధి బిల్లుల విషయమై తన నిర్ణయమును ప్రకటించెను. అస్పృశ్యత యావద్భారతదేశమునకు సంబంధించిన విషయము కావున తత్సంబంధమగు బిల్లులను భారతశాసనసభలోనే ప్రవేశపెట్టవలెననియును, దేశమందలి వివిధభాగములనుండి గురువాయూరుమున్నగు మహాక్షేత్రములకు ప్రజలు పోవుచురుగాన నాదేవాలయములలోనికి హరిజనులను "రానిచ్చుటా మానుటా?" యన్న విషయము నా దేవాలయముననున్న ప్రజల యభిప్రాయానుసారముగ నిర్ణయించుట సవ్యముకాదనియును చెప్పుచు డాక్టరు సుబ్బరాయన్ గారి బిల్లును మదరాసుశాసనసభలో ప్రవేశపెట్టుట

రాజప్రతినిధి ప్రకటన.

కనుమతించుటకు నిరాకరించెను. కాని సి.యస్. రంగయ్యరు గారి బిల్లును భారతశాసనసభలో ప్రవేశపెట్టుట కనుమతించెను. అట్లు తా ననుమతించుటవల్ల ప్రభుత్వసభ్యులు శాసన సభలో నాబిల్లున కనుకూలముగ ఓటు నిత్తురని యెంచకూడదనియును, ముందుముందు కలుగు పరిస్థితుల ననుసరించి వారేమిచేయవలెనో నిర్ణయించుకొనెదరనియును కూడ ప్రకటించెను. రాజప్రతినిధినిర్ణయము ప్రకటింపబడినంతనే సి.యస్. రంగయ్యరుగారు తన బిల్లుతోపాటు మదరాసు శాసనసభలో సుబ్బరాయనుగారు ప్రవేశపెట్టదలచుకొనిన బిల్లు వలయుమార్పులతో భారతశాసనసభలో ప్రవేశపెట్టబోవుచున్నానని ప్రభుత్వమునకు తెలియజేసెను. దానికికూడ తన యనుమతి నిచ్చినట్లు రాజప్రతినిధి జనవరి 30 వ తేదీని ప్రకటించెను.

పై బిల్లులు భారతశాసనసభలో ప్రవేశపెట్టుటకు రాజప్రతినిధి అనుమతి నొసంగిననాటినుండి యొకనెల గడువవలెను. పిమ్మటనైన నాబిల్లులు శాసనసభలో చర్చింపబడి శాసనరూపము దాల్చినంతనే దేశములోగల హిందూదేవాలయములలోని కస్పృశ్యులు వెళ్లుటకుగల యడ్డంకులు తొలగిపోవును. ఏదైన దేవాలయముచుట్టునుండు సవర్ణహిందువులలో శాసనములో నిర్ణయింపబడిన సంఖ్యకు తక్కువకానంతమంది ఆదేవాలయములోనికి హరిజనులను రానియ్యవలసినదని ధర్మకర్తకు నోటీసునియ్యవలెను. అట్టినోటీ సందినపిమ్మట

నాధర్మకర్త దానికి సవర్ణహిందువులలో ననుకూలు రెందరో ప్రతికూలు రెందరో ఓటుద్వారా కనుగొనవలెను. వారిలో నధికసంఖ్యాకులు హరిజనులు దేవాలయప్రవేశ మొనర్చుట కనుకూలముగనున్నచో ధర్మకర్త అప్పటినుండి దేవాలయము లోనికి హరిజనులు రావచ్చునని ప్రకటింపవలెను. ధర్మకర్త కది వ్యక్తిగతముగా నిష్టములేకపోయినను సరే. అధికసంఖ్యాకులు ప్రతికూలురైనచో సంస్కర్తలు మరల మరు కాడే ప్రజాభిప్రాయమును ఓట్లుద్వారా కనుగొనుటకు ధర్మకర్తకు నోటీసు నిచ్చుటకు వీలుండదు వారు కొంతకాల మాగవలసివచ్చును. ఆ కాలపరిమితి కూడ శాసనములో చేర్చబడి యుండును.

---

# చతుర్థ భాగము

: మహాత్ముని :

ప్రకటనలు.

# హరిజనసమస్య

## చతుర్థఖండము.

---

౧

నాఉపవాసదీక్షానంతరము అస్పృశ్యతనుగూర్చి విపులముగా వ్రాయదలచుకొంటిని. కాని నాయధీనమున లేని కొన్నికారణములచే నట్లుచేయజాలక పోతిని.

ప్రథమ ప్రకటన.

నాకనేకమంది ఉత్తరములు వ్రాసిరి. అందులో కొందరు "యరవాడ" ఒడంబడికను విమర్శించిరి. కొందరు సలహా నడిగిరి. మరికొందరు అస్పృశ్యతానివారణోద్యమ ప్రచారసందర్భమున, తలచూపుననేక సమస్యలవిషయమై నాయభిప్రాయములనడిగిరి. ఈవిషయమై ప్రచారము చేయుటకు ప్రభుత్వమువారు నా కనుమతి నొసంగినందున, నేనా విలేఖరులకందరకు ప్రత్యుత్తరముల నిచ్చుటకు వీలుకలిగినది.

ఈప్రథమప్రకటనలో నతిముఖ్యాంశములను గురించియే ప్రస్తావించెదను. మిగిలినవాటి నింతత్వరలో నెత్తుకొనవలసిన యవసరము లేనందున ప్రస్తుతము వదలివైచెదను.

మొదటిప్రశ్న, నేను మరల నుపవాసదీక్షను గైకొన వలసివచ్చునేమోయన్న విషయమునకు సంబంధించినది. ఉపవాసదీక్షను బూనుటకూడ నొకవిధమగు బలప్రయోగమే యనియును, అందువల్ల నేనట్టిదీక్ష నిదివరకు పూనియుండ వలసినది కాదనియు, అందుమూలమున నికముందు నేనా దీక్షనుబూనరాదనియు, కొందరు విలేఖరులవాదన ఇట్టి ఉపవాసదీక్షలను గైకొనుమని, హిందూధర్మమునందుగాని, మరి యే యితరధర్మమునందుగాని లేదని మరి కొందరి వాదన. నాఉపవాసముయొక్క ధార్మికస్వరూపమునుగూర్చి నేను చర్చింపబోను. భగవదాజ్ఞప్రకారమే నేనట్టి యుపవాసదీక్ష బూనితిననియును, మరల నొకవేళ యుపవాసదీక్ష బూనవలసివచ్చినచో నది భగవదాజ్ఞయైనయెడలనే ప్రారంభింతునని యును మాత్రము చెప్పగను. అస్పృశ్యతను సమూలముగ నాశనమొనరించుటకే ప్రథమమున నేనుపవాసదీక్ష బూనితిని. కాని యది ప్రభుత్వమువా రిచ్చిన సాంఘికపరిష్కారమును నిరోధించుట కుద్దేశింప బడినట్లు పరిణమించినది. నాకోరికమాత్ర మదికాదు. బ్రిటిషుమంత్రివర్గమువారి నిర్ణయము నాజీవితమం దొకవిషమస్థితిని హఠాత్తుగ తెచ్చిపెట్టినది. కాని బ్రిటిషుప్రభుత్వమువారు తమతీర్పు నుపసంహరించుకొనినను‚ ఆఫలిత మీసమస్యాపరిష్కారమునకు ప్రారంభమే యగును. ఏదోయొక వట్టి రాజకీయ నిర్ణయమును

మూన్పు వేయుటకొరకే యొకమహాశక్తి పుట్టజాలదు. దాని నుద్భవింపజేసినవారికికూడ తెలియనిదేదో గభీరార్థము దాని కుండితీరవలయును. అది యెవ్వరికి సంబంధించినదో, యీప్రజ లాగూఢార్థమును తత్క్షణమే గ్రహించి, తమ ధర్మమును నిర్వ హించుటకై ముందునకు రాజొచ్చిరి.

భారతదేశమునంతయు యామూలాగ్రముగ నేను తిరిగి నన్నిచోటులు తిరిగినవారు కాని, నేను వెళ్ళినట్టి గ్రామము లలోనికి చొచ్చుకొనిపోయి చూచినవారు కాని, నేను కలిసి కొనినంతమంది ప్రజలను కలిసికొనినవారు కాని, నాకు జ్ఞాపక మున్నంతవరకు కింకెవ్వరును లేరు. అట్టి నేను కలిసికొనిన ప్ర జలందరు, నాజీవితచరిత్ర నెరుంగుదురు. కులమునకు కులము మధ్యను, స్పృశ్యాస్పృశ్యులమధ్యమునగల యీ అడ్డుగోడల నేను గుర్తింపనని వారు వినియుందురు. అస్పృశ్యత యొకమహా పాపమనియు, హిందూధర్మమునకొక మహాకళంకమనియు చెప్పుచు దేశభాషలలో తీవ్రముగా నేను దానిని విమర్శిం చుట వారు వినియుండవలెను. దేశములోని వివిధప్రాంత ములలో వందలకొలదిగ జరిగిన మహాసభలలోను, ప్రత్యేక వ్యక్తులతో సంభాషించునప్పుడును, అస్పృశ్యత పనికిరాదని నేను చెప్పినప్పుడు, దానికి వ్యతిరేకముగ మాట్లాడినవారు చాల అరుదుగ నుండిరి. అస్పృశ్యతను నిరసించుచును, దానిని తమలోనుండి పారద్రోలుటకును ప్రజలనేక మా

రులు తీర్మానముల చేసికొనిరి. అనేకమారులు భగవత్సా క్షిగనే ప్రమాణములను జేసి, ఆప్రమాణముల ప్రకారము నడచుకొనుటకు, తగిన శక్తిని తమకిమ్మని, భగవంతుని వారు ప్రార్థించిరి. అట్టి యాప్రజల నుద్దేశించియే నేనుపవాస మొనరించినది. అట్టి యాప్రజలసహజప్రేమ అయిదురోజు లలో సర్వమును మార్చివైచి "యరవాడ ఒడంబడిక"కు కారణభూతమైనది. ఆ ఒడంబడికను పూర్తిగా నమలులో పెట్టక పోయినచో, మరల నాప్రజలను సాధించుటకే నే నుపవాస దీక్ష గైకొందును.

ఇక దీనితో ప్రభుత్వమువారికి సంబంధము లేదు. తమ వంతుపనిని వారు వేళపట్టున చేసిరి. యరవాడ ఒడంబడికలో గల షరతులలోని అధికభాగ మాప్రజలకు సంబంధించినవే! వాని నాచరణములో పెట్టుబాధ్యత నేను పైని వర్ణించిన సభలకు మూగిన సవర్ణహిందువులపైననే యున్నది. వారే యింత కాలమునుండి తా మణగద్రొక్కిన సోదరీసోదరుల తమవారిని కౌగిలించుకొనునట్లు హృదయపూర్వకముగ కౌగిలించుకొని తమగృహములకును, పాఠశాలలకును, దేవాలయములకును, ఆహ్వానింపవలెను. గ్రామములలోగల పంచములకు వారి బంధములు విడిపోయినట్లును, ఇతరులు పూజించినట్టి పరమేశ్వరునే తాముకూడ పూజించువారమనియును, తదితరు

లందరికున్న సౌకర్యములును, హక్కులును, తమకుకూడ గలవని వారు భావించునట్లును చేయవలెను.

అట్టియొడంబడికలోని ముఖ్యమైన షరతుల ప్రకారము సవర్ణహిందువులు నడచుకొననిచో నాకు బ్రతుకే దుర్భరమైపోవును. తోడిమానవులయెదుట పరమేశ్వరుని సన్నిధిని నేనెట్లు తలయెత్తి మాట్లాడగలను? సవర్ణహిందువు లీయొడంబడికను సరిగా నిర్వహించుటకు నాప్రాణమును హామీగా నుంచుకొనవలసినదని, డాక్టరు. అంబేద్కరు, రావుబహాదూర్ యం. సి. రాజాగార్లతోను, యితర హిన్నజాతిస్నేహితులతోను చెప్ప సాహసించితిని. మరల నేను నిరశనదీక్ష బూనినచో నయ్యది సంఘసంస్కరణమునకు విరోధులుగా నున్నవారిని బలవంతపెట్టుటకు కాదు. అస్పృశ్యతానిర్మూలనమొనర్చుటకు ప్రమాణములను జేసిన నాసహచరుల కందరకును పెట్టగలుగజేసి పనిచేయించుటకే. వారు తాము చేసిన ప్రమాణముల నలక్ష్యముచేసినను, లేక నారా ప్రమాణముల మనస్ఫూర్తిగా చేయనట్లు తేలినను, లేక వారు చూపించిన హిందూధర్మాసక్తి వట్టిబూటకమని తేలినను, నాకు బ్రతుకుపై నాశలేకుండ పోవును. కావున నా నిరశనదీక్ష సంఘసంస్కరణమునకు విరోధులుగ నున్నవారి నేవిధముగను బాధింపను. అస్పృశ్యతానివారణోద్యమము లేవదీసిన నాపక్షముననను, కాంగ్రెసుపక్షముననను, ఉన్నామని

నమ్మకమును బుట్టించినట్టి నాసహచరులును, యితరప్రజలు
ను, అస్పృశ్యత విశేషమగు ఘోరపాపము గాదనియును,
దానినుంచుట భగవంతునియెడలను, తోడిమానవులయెడ
లను, అపరాధ మొనర్చుట కాదను నిశ్చయమునకు పునరా
లోచనవల్ల వచ్చినచో, నాదీక్ష వారిని కూడ బాధింపదు.
తనయొక్కయు, యితరులయొక్కయు, ఆత్మశుద్ధికొరకు ఉప
వాసదీక్ష బూనుట చాల పురాతనమైన ఆచారము. ఈశ్వ
రునియందు మానవుల కెంతకాలము నమ్మకముండునో, యం
తవరకీయాచారము నిలిచియేయుండును. నాహేతువాదము
సరియైన దైనను, కాకపోయినను, నే చేయుబోవుపని శుద్ధ
వెర్రిపనియని గాని, భ్రమజనితమైన దనిగాని నాకు తోచు
నంతవరకును, దానిని వదలజాలను. నా అంతర్వాణి ప్రేరే
పించిననే నేను మరల నుపవాసదీక్ష బూనెదను. సవర్ణహిం
దువులు ఒడంబడిక షరతులను సరిగా నిర్వర్తించక, నిర్లక్ష్య
ము చేయుటవల్ల "యరవాడ యొడంబడిక" భగ్నమైపోయి
నట్లు నాకు తట్టినను, లేక నాయంతర్వాణి ప్రేరేపించినను,
నే నుపవాసదీక్ష మరల ప్రారంభింతును. వారట్లు నిర్లక్ష్యము
చేయుట హిందూధర్మమునకు ద్రోహ మొనరించుటయే య
గును. ఆ ద్రోహకృత్యములను చూచుటకు నే జీవించ నిచ్ఛ
గింపను.

ఇంకొక యుపవాసదీక్ష గలదు. బహుశః దానిని త్వరలోనే ప్రారంభింపవలసి వచ్చునేమో! అది గురువాయూరు దేవాలయములోని కస్పృశ్యుల రానిచ్చు విషయమునకు సంబంధించినది. శ్రీ కేళప్పన్‌గారు నాయనురోధమువల్లనే తమ ఉపవాసదీక్షను మూడునెలలవరకు ప్రస్తుత మాపివైచిరి. ఆయుపవాసదీక్షవల్ల వారు దాదాపు మృత్యుగవ్వారమును ప్రవేశించిరి. 1933 సంవత్సరము జనవరి వకటవ తేదీని గాని, అంతకు పూర్వము గాని, యితర వర్ణములవారి కుండని నియమముల నేమియు పెట్టకయే ఆ దేవాలయములోని కస్పృశ్యుల రానియ్యకపోయినచో, శ్రీ కేళప్పన్‌గారు మరల నుపవాసదీక్ష నారంభించుదురు. వారితోపాటు నేనుకూడ నారంభింపవలసివచ్చును. విలేఖరులు కొందరీవిషయమై తీవ్రముగా వ్రాయుటచే ముందు నే చేయవలసివచ్చు యుపవాసమును గురించి యింతగా వ్రాయవలసివచ్చినది. అయినను నా సహచరు లీవిషయమై యంతగా కంగారుపడరాదు. ఎవరొక్కనాట కిష్టపడనివిషయ మేదైన సంభవించునేమో యని ముందరనే యధైర్యపడినచో సాధారణముగ నట్టిది సంభవించియే తీరును. దానిని సంభవింపకుండ చేయుట కొక్కటే మార్గముగలదు. ఏపనిచేసిన నట్టిది యసంభవమగునో, ఆపని

గురువాయూరు దేవాలయ ప్రవేశము.

యందే దానికి సంబంధించినవారు తమ యావచ్ఛక్తిని వినియోగింపవలెను.

వర్ణాంతరభోజనములును, వర్ణాంతరవివాహములును, అస్పృశ్యతానివారణోద్యమమందలి భాగములా యని విలేఖరులు కొందరడిగిరి. కాదనియే నాయభిప్రాయము, అవి సవర్ణులను, అవర్ణులను, కూడ సమానముగనే బాధించునవి. అందువల్ల యస్పృశ్యతకు విరోధముగా ప్రచారముసల్పు

వర్ణాంతర భోజనములు.

స్త్రీలుగాని, పురుషులుగాని, వివాహభోజన సంస్కరణములకై పాటుపడవలసిన బాధ్యత లేదు. ఈసంస్కరణము లిప్పుడే ప్రవేశపెట్ట వలసినవి, కావని నాఉద్దేశము. వర్ణాంతరభోజనములుగాని, వివాహములుగాని కూడవను నిషేధము హిందూధర్మములో నొకభాగము కాదు. అదియొక సాంఘికాచారము. బహుశః పతనోన్ముఖమైన హిందూసంఘమున కొకానొకప్పుడు తాత్కాలిక రక్షగా యీయాచారమేర్పడి యుండవచ్చును. ఈ నిషేధ మానాటికానాటికి బలహీనమగుచున్నది. వీటికనవసరప్రాముఖ్యత యిచ్చుటచే, ప్రజల మనోదృష్టులు జీవితమున కత్యంతావసరములగు ప్రాథమిక విషయములపై ప్రసరించుట లేదు.

అస్పృశ్యులును, సవర్ణహిందువులును, హైందవేతరులునుకూడ యాహ్వానింపబడిన మహోత్సవములందును,

విముఖులందును, ప్రజలు తమంతటతాము పాల్గొనినచో నదియొక శుభసూచకముగనే నేను భావింతును. కాని యీసంస్కరణమెంత వాంఛనీయమైనను, నవాఁడో దేశమంతట జరిగి యుండవలసిన అస్పృశ్యతానివారణకార్యక్రమములో దానిని జేర్చ కలనైన నేను తలంపజాలను. అస్పృశ్యత హిందూధర్మమునకొక వేరుపురుగు. వివాహభోజనసంబంధములగు నిషేధములన్ననో హిందూసంఘాభివృద్ధికి యాటంకములు. రెండింటికిని గలభేదము చాలప్రధానమైనది. ఈమహోద్యమమునందీవిషయముల నన్నిటిని చేర్చి ప్రధానాంశమునకే ముప్పుతెచ్చుట శుద్ధ అవివేకమైనపని. అస్పృశ్యతానివారణమన్న యింతకాలమునుండియు జనుల కొకవిధముగా నర్థముచెప్పితిమి. ఆయర్థమునకు వార లలవాటు పడిరి. హఠాత్తుగ వారికందరకును అస్పృశ్యతానివారణమన్న యిదియని వేరొకయర్థముచెప్పి, వారినంగీకరించుమనికోరుట నమ్మించి ద్రోహము చేసినట్లగును. కావున వర్ణాంతరభోజనములు జనులందరు సమ్మతించి, సిద్ధముగా నున్నచోట్ల జరుగవచ్చును. కాని యావద్భారతదేశసంబంధమగు, మహోద్యమకార్యక్రమములోమాత్ర మిదియొక భాగముగ జేర్చకూడదు.

సనాతన ధర్మావలంబకులమని, చెప్పుకొను వారిదగ్గర నుండి కూడ నాకుఉత్తరములువచ్చినవి. కొన్నిటిలోని భాష చాలతీవ్రముగనున్నది. వారికి అస్పృశ్యతయే హిందూధర్మ

సారము. వారిలో కొందరు నన్ను ధర్మభ్రష్టునిగ నెంతురు. అస్పృశ్యతకు విరుద్ధమగు నీభావములను, నేను క్రైస్తవయిస్లాము ధర్మములనుండి నేర్చుకొంటి నని వారిలో కొందరు తలంతురు. మరికొంద రు అస్పృశ్యత శాస్త్రసమ్మతమైనదని శ్లోకముల నుదహరింతురు. వీరికందరకు నీప్రకటన

వేదములుకూడ భగవంతునివలె అనిర్వచనీయములు.

ద్వారా జవాబిచ్చెదను. ఈ విలేఖరులందరకును, నేను కూడ సనాతనధర్మావలంబకుడననియే చెప్పసాహసింతును. కాని సనాతనధర్మావలంబకునకు ఉండవలసినవని నేచెప్పు లక్షణములు వేరు. వారు చెప్పునవి వేరు. సనాతనధర్మము నా ప్రకారము వేదములమీదను, వాటితరువాత ఒయల్వెడలిన శాస్త్రములమీద నాధారపడినట్టియును, అతిపురాతనకాలమునుండి వచ్చుచున్నట్టియును ఒక మహాధర్మము. భగవంతునివలెనే, హిందూధర్మమువలెనే నాప్రకారము వేదములుకూడ అనిర్వాచనీయములు. వేదములన్న ప్రస్తుతము చ్చుపడియున్న నాలుగు పుస్తకములేయని చెప్పిన నది కొంతవరకే సత్యమగును. ఆపుస్తకములు నాలుగుకూడ ఎవరోమహర్షుల బోధనలలోనుండి పోగామిగిలినవిమాత్రమే. తరువాతవచ్చిన తరములవారు, తమ జ్ఞానానుభవములను బట్టి, యా మూలనిధులకు కొంతచేర్చిరి. అంతట భగవద్గీతారచయితయైన ఆ మహానుభావుడు జన్మించెను. నిగూఢ వేదాంతార్థములను ప్రతి

పాదించునదై నను,సత్యాన్వేషణపరుడగు ప్రతివానికిని, సులభముగా నర్థమగునట్టి హిందూధర్మగ్రంథము నాతడు హిందువుల కొసంగెను చదువగోరు ప్రతిహిందువున కందుబాటులో నున్న గ్రంథమిది యొక్కటియే ఇతరశాస్త్రగ్రంథములన్నియు నశించిపోయినను హిందూధర్మమునకేమియు, దానిప్రకారము నడచుకొనుటకో, చెప్పుటకు నీదివ్యగ్రంథములోని యేడువందలశ్లోకములే చాలును. నేను నలుబదిసంవత్సరముల నుండి భగవద్గీతాబోధనల ప్రకారమే నడచుకొన ప్రయత్నించుచుంటిని అందువల్లనే, నేను సనాతనధర్మావలంబకుడనని యే చెప్పుకొనుచున్నాను. దానిమూలసిద్ధాంతములకు విరుద్ధమైన దానినెల్ల హిందూధర్మవిరుద్ధమని నిరాకరించెదను.

భగవద్గీతను నేనెంతభక్తిశ్రద్ధలతో చదువుదునో—బైబిలును, ఖురానును, జెండవెస్తాను, ప్రపంచములోని యితరమతగ్రంథములను అంత భక్తిశ్రద్ధలతో నేను చదివితినని చెప్పుటకు నా కమితానందమగుచున్నది. ఆగ్రంథములను భక్తిపూర్వకముగ చదువుటవల్ల నాకు భగవద్గీతయందు విశ్వాసమధికమైనది. ఆగ్రంథములు నాదృష్టిపథమును తన్మూలమున నాధర్మమును విశాలమొనర్చినవి. మహాప్రవక్తలగు జీసను, జొరాష్టరు, మహాత్ములజీవితములు, నాయర్థము ప్రకారము భగవద్గీతలోని యనేకముఖ్యఘట్టముల నుజ్వలతరముగ నొనర్చినవి. అందువల్ల సనాతనధర్మావలంబకులగు

నాస్నేహితులు నాలోపమని దేనిని చూపుచున్నారో అదియే నా కాత్మోపశాంతి నొడగూర్చు విషయమైనది. నేను హిందువుడనని చెప్పుకొనుటకు గర్వపడుచున్నాను. నాహిందూ ధర్మ మతివిశాలమైనది. వట్టిసహనమే దాని లక్షణముకాదు. ఈ విశాలప్రపంచములో జన్మించిన మహాప్రవక్తలబోధనల నన్నిటిని, తనలో నిముడ్చుకొనుటకూడ దాని లక్షణము. అస్పృశ్యత పాటించుటవసరమని నా కీమహాగ్రంథములలో నెక్కడ కానరాలేదు సరిగదా, ప్రాణిలోకమంతట నిండిన యాత్మ యొక్కటియేయనియు, పరమేశ్వరునిచే సృష్టింపబడిన యీప్రాణికోటియెల్ల ఆయననే జేరుననియు, నమ్మకము బుట్టునట్లు సహేతుకముగ ఆకర్షణీయమగుభాషలో నామనస్సునకు నచ్చినవిధమున, నాహృదయమునకు నాటునట్లుగ ప్రబోధింపబడి విశ్వాసనీయమై కాననగుచున్నది. భగవద్గీతా రచయిత చెప్పెడు సనాతన ధర్మప్రకారము చూచినచో జీవిత మనిన బాహ్యాచారములు, కర్మకాండయు కానేరవు. జీవితమనగా—అంతఃకరణము నత్యంతపరిశుద్ధము చేసికొని, ఆత్మ, మనస్సు, శరీరముల మూడింటిని పరమేశ్వరునందు విలీన మొనర్చుటయే. ఈ గీతాసందేశమును నాజీవితములో లీనమగునట్లు చేసికొని, నేనీకోటానుకోట్లగు ప్రజల కుపన్యసింపమొదలిడితిని. వారు శ్రద్ధతో నాలకించిరి. అట్లు వా రాలకించుట నాకుగల రాజకీయ పరిజ్ఞానమును చూచికాదు.

నావక్తృత్వశక్తిని చూచి కాదు. నేనును తమలో నొకడనే యని నన్ను చూచినంతనే వారు గుర్తించుటవల్లను, నేనుకూడ వారి ధర్మమునకు సంబంధించినవాఁడనని యే వారు మెరుంగుటచేతను, వా రట్లాలకించిరి. సనాతనధర్మావలంబకుడనని నేను చెప్పుకొనుట యుచితమైనదే యను నానమ్మకము, రోజులుగడచినకొలది దృఢతరమగుచున్నది. ఈశ్వరేచ్ఛ యున్నచో ప్రాణముల నర్పించి, నానమ్మకము సరియైనదని ఋజువుచేసెదను.

---

౨

విద్యావంతుడగు నొకవిలేఖరి, తదితర హిందువులతో సమానముగ చూడబడుటకు ముందు హరిజను లందుల కర్తవ్యములుకావలెననియును, అసహ్యాకరమగు వారి యలవాటులనువీడి, వారు చచ్చినగొడ్డుమాంసమును తినుట మానవలెననియు సూచనగావించెను. ఇంకొక విలేఖరి పాకీపాండ్రమును, తోటీపాండ్రమును చేయుపని చాల అసహ్యాకరమైనదనియును, సంఘముచే వారల లాపనులను వదలివేయవలెననియు వ్రాయునావహించెను. విమర్శకులందరు హరిజనులలోగల చెడు అలవాటుల కన్నిటికిని సవర్ణహిందువులచే బాధ్యులన్న సంగతిని మరచి పోవుచున్నారు. సవర్ణు లనబడువారు హరిజనులు శుభ్రముగా నుండుట కవకాశములుగాని, ప్రోద్బలకారణములుగాని లేకుండునట్లు చేసిరి. ఇక నాశ్రృత్తులవిషయము—పాకీపని యంతటియు, తోళ్ళను పదునుచేయుపని యంతటియు నసహ్యాకరములైన వృత్తు లనేకము చూపించగలను. కాని ఒక్కవిషయముమాత్ర మొప్పుకొనక తప్పదు. ఈవృత్తులు కూడ నితర యనేకవృత్తులవలెనే చాల నసహ్యాకరమగు పద్ధతిని కొనసాగింపబడుచున్నవి. దీనికికూడ సవర్ణు లనబడువారి నిర్లక్ష్యమును, అశ్రద్ధయునే కారణములు.

రెండవ ప్రకటనము.
5-11-32.

పాకీవాని, తోళ్ళను బాగుచేయువాని, ఆరోగ్యకరమును, పరిశుభ్రమును నగు వృత్తులలో కొనసాగింపవచ్చునని నా స్వానుభవమువల్ల చెప్పగలను. ప్రతివ్యక్తియు తనమలందనికి పాకీపనిచేయును. ఆధునిక వైద్యశాస్త్రము నభ్యసించు ప్రతివిద్యార్థియు తోళ్ళను బాగుచేయువాడే! అతడు శవములకోసి పరీక్షింపవలయును. కాని వారుచేయు పనిని మనము చాలపవిత్రమైనదిగ భావించుచున్నాము. పాకీవాండ్ర వృత్తియు తోళ్ళను బాగుచేయు పనియు వైద్యులును న్యాయవాదులును చేయుపనులకంటె ఉపాధ్యాయవృత్తికంటెను తక్కువకావనియు, అంతకంటె కూడ నుపయోగకరములనియు మనవి చేయుచున్నాను.

హరిజనుల కేదో మహాపాపమే చేయుచున్నట్లు సవర్ణులు తలచినచో వారు తప్పుదారి పట్టినట్లే. వారేమైన చేసినచో నది యెల్ల ననేకతరముల నుండి హరిజనులకు వారొనర్చిన యన్యాయముల కొకవిధమగు స్వల్పపరిహారమే యగును. అస్పృశ్యులను వారిప్పుడున్న స్థితిలోనే సవర్ణులు తమలో కలుపుకొనవలసివచ్చినచో నది వారి పూర్వపాపములకు శిక్షగనే వారు భావించవలెను. కాని వారట్లు హరిజనులను తమలో కలుపుకొనుటవల్ల చాల లాభము కలదు. పరిశుభ్రముగా నుండుటకు హరిజనుల కదియొక ప్రోద్బలకారణము కాగలదు. అంతట హరిజనులు శుభ్రముగానుండనిచో

తమ క్షేమమునకును, సౌఖ్యమునకును భంగముకలుగుననెడి భయమువల్లనైనను సవర్ణులు హరిజనులకు కావలసిన సదుపాయము లొనర్తురు.

దీనులగు హరిజనులకు మన మిదివరకు చేసిన హానిని యొకసారి జ్ఞప్తికి తెచ్చుకొనుట మంచిది. మనము సంఘములో వారిని కుష్టరోగులవలె చూచుచున్నాము. ఆర్థికవిషయమున నెంచిచూచిన వారు బానిసలకంటె నధమస్థితిలో నున్నారు. ధార్మికమగు విషయమునన్ననో మనము దేవాలయము లని చెప్పువానిలో వారు ప్రవేశింప వీలులేదు. సవర్ణులతోపాటు రోడ్లను, పాఠశాలలను, ఆస్పత్రులను, నూతులను, కొళాయలను, పురోద్యానవనములను, యితరప్రజాసంస్థలను యుపయోగింప వారికి వీలులేదు. కొన్నిచోట్ల వారు కొంతదూరము దాటి సవర్ణులకడకువచ్చుటయే మహానేరము. మరికొన్నిచోట్ల వారు కనబడుటయే మహాపరాధము. గ్రామములలోను పట్టణములలోను మురికితోనిండిన అసహ్యాకరములగు భాగములకు వారిని త్రోసివేసితిమి. అక్కడ వారికి యితరుల సహాయ మేమియు లభింపదు. వారిండ్లలోజరుగు ఉత్సవములకును, పెండ్లిండ్లకును, యితరశుభకార్యములకును బ్రాహ్మణులు పురోహితులుగా వెళ్ళరు. ఇతరకులములవారిని చూచునట్లు సవర్ణులగు వకీళ్లును, డాక్టరులును వారిని చూడరు. అయినప్పటికిని వారింకను జీవిం

చగలిగియుండుటయును, హిందూసంఘమును విడకుండు టయును చాలఆశ్చర్యకరముగ నున్నది. తమ్ముణగద్రొక్కి బాధించువారలపై తిరుగబడుటకు కూడ శక్తిలేనంత యధమాధమ స్థితియందు వారలున్నారు

లజ్జాకరములును, దుఃఖదాయకములునగు పైవిషయములను మరల చెప్పుటకు కారణము యరవాడఒడంబడిక యొక్క అంతరార్థమును దేశసేవకులు బాగుగా గ్రహించునట్లు చేయుటకే. సంతత ప్రయత్నములవల్లనే యణగిపోయిన యీతోడిమానవులను అధోగతినుండి లేవదీయుటకు వీలగును. హిందూధర్మమును పవిత్రమొనర్చి హిందూసంఘమును తద్వారా భారతభూమిని యుద్ధరింపనగును. మన యకార్యముల గాంచి మనము సిగ్గుపాలము కాకూడదు. నేనుపవసించినవారమురోజులలో నవష్టులుచూపినయుత్సాహము, ప్రదర్శించిన సౌహార్ద్రభావములు, నిజమైనవైనచో నర్వము చక్కబడును. ప్రతిహరిజనుడు త్వరలోనే స్వతంత్రుడై పోవును వాంఛనీయముగు నిమ్నజాత్యోద్ధారక ముఖ్యులకు పూర్వము స్వాతంత్ర్యసందేశమును మీరు మూలమూల గ్రామములకుకూడ గొనిపోవలెను. నిజమునకు పట్టణవాసుల యభిప్రాయముల నీపనికనుకూలముగ మార్చుటంత కష్టమైన పనికాదు. పట్టణములలోకంటె గ్రామములలో పనిచేయుట చాలకష్టమే! అఖిలభారత యస్పృశ్యతానివారణసంఘ

మొకటిప్పుడుండుటవల్ల దేశసేవకులు దానియాధిపత్యము క్రింద పనిచేయవలెను. ఇప్పుడు నాకు డాక్టరు అంబేద్కరు గారుచెప్పినది తలపునకు వచ్చుచున్నది వారిట్లు చెప్పిరి. "బాధల పడుచున్నవారి కేమికావలెనో వారికంటె సంఘ సంస్కర్త తనకే తెలియునని నెడి పూర్వపద్ధతిని మరల తలకెత్త నీయకుడు. హరిజనులకు మొట్టమొదట అవసరమేదియో దానిని వారెట్లు తీర్చుమందురో వారిప్రతినిధుల నడిగి, తెలిసి కొనుమని మీ దేశసేవకులతో చెప్పుడు. వర్ణాంతరభోజన ములు, ఫలాహారములు ప్రజలలో మొలకెత్తిన నూత్నభావ సంపదను ప్రదర్శించుటకు పనికిరావచ్చును. కాని యవి హద్దు మీరిపోవునేమో! వాటియందు కొంచెమాధిక్యత యొక్క ఛాయ కనుపించుచున్నది. నేనుమాత్రమట్టివాటికి పోవనిచ్చగింపను. ఇంతకంటె ఉత్తమపద్ధతి యేమన అనవ సరమగు హడావిడిమాని వారియిండ్లలో మామూలుగా జరుగుచుండు శుభకార్యములకును, విందులకును సవర్ణులు మమ్ము పిలువవచ్చును. దేవాలయప్రవేశవిషయ మవసరమై నప్పటికిని దానిని కొంతకాల మాపవచ్చును. హరిజనుల యార్థికపరిస్థితులను చక్కపెట్టుటయు, అనుదినవ్యవహారము లందు సవర్ణులు వారితో మర్యాదగ ప్రవర్తించుటయు ప్రథమమున, ముఖ్యముగా జరుగవలసిన పనులు" ఆయనంతట నాకు తన అనుభవములను కొన్నిటిని తెల్పెను. హృదయ

విదారకములగు నావిషయములను మరల నేనిక్కడ చెప్పబోను. ఆయన మాటలు మాత్రము నాహృదయమున నాటుకొనిపోయినవి. అవి చాలయవసరములనియే నాకుకూడ దోచినవి. పాఠకులుకూడ నట్లే గ్రహించెదరని ఆశించుచున్నాను.

సంఘసంస్కరణలు అవలంబించవలసినదని యనేకసూచనలను నాకు విశేషించిరి. అందులోనిదొకటి—పూర్వము శ్రద్ధానందస్వామి యనేకమారులు ఘోషించినట్టిదాని పునరుక్తియే. ప్రతిహిందువును హరిజను నొక్కని తనగృహమందు నుంచుకొని సర్వవిషయముల నాతనిని తన కుటుంబములోనివానిగనే చూడవలెనని శ్రీ శ్రద్ధానందస్వామి చెప్పుచుండెడివారు.

విద్యా ప్రచారము.

రెండవసూచన—భారతదేశపు క్షేమముగోరు హైందవేతరునికడనుండి వచ్చెను. భాగ్యవంతుడగు ప్రతిహిందువును ఒక హరిజనబాలికనుగాని, బాలకునిగాని తనసంరక్షణక్రింద తీసికొని యున్నతవిద్య చెప్పించవలెననియును, అట్లు చెప్పించినచో విద్యానంతరము వారలు హరిజనోన్నతికొరకు పాటుపడుటకు వీలగుననియును ఆయన సూచనగావించెను. ఈ రెండుసూచనలుకూడ నాలోచింపతగినవి. అవలంబింపదగినవి. ఉపయోగకరములగు సూచనలగలవారందరు వాటినన్నిటిని క్రొత్తగా నేర్పడిన అఖిలభారత యస్పృశ్యతానివారణసంఘమునకు పంపగోరెదను.

విలేఖరులు నాకష్టములనుగూడ గుర్తించవలెను. జై లులోనుండి నే చేయగలిగినది ప్రజలకును, అస్పృశ్యతానివారణసంఘమునకును సలహాల నిచ్చుటమాత్రమే. కార్యక్రమము నములులో పెట్టుటయందు పాల్గొనజాలను. మీకు మిక్కిలి నాయభిప్రాయములన్నియు అసంపూర్ణములగు యథార్థముల మీదను, యింకొకరు చెప్పిన వానిమీదను యాధారపడి యుండునని నావిలేఖరులు గుర్తింపవలెను. క్రొత్తవిషయములు తెలిసినప్పుడు నేను వాటిని మార్చుకొనవలసివచ్చును. అందువలన నే చెప్పునదెల్ల వారు మిగుల జాగ్రత్తతో చూడవలసియుండును.

పూర్వకథ యిప్పటికి పూర్తిఅయినది. ఇక విలేఖరులకుగల యభ్యంతరముల తీర్చుట కొకింత స్థలముపయోగించెదను. ఆయభ్యంతరములనే పత్రికలుకూడఅస్ఫుటమగు ధ్వనులలో వెల్లడించుచున్నవి. యరవాడ ఒడంబడికలోని రాజకీయభాగమును జూపి వారు—దీనివల్ల హరిజనులకు బ్రిటిషుప్రధానమంత్రి యిచ్చినవాటికంటె నెక్కువహక్కులొసంగబడినవికదా? దీనివల్ల నీకేమి లాభించెనని వారడుగుచున్నారు. నిజమే. హరిజనులకు ఎక్కువహక్కులు లభించుటే నాకు కలిగినలాభము. బ్రిటిషుప్రధానమంత్రి చేసిన పరిష్కారమునకు నే నభ్యంతరపెట్టిన దెందులకు? ఆ పరిష్కారమువల్ల అన్నమడిగినవారలకు రాళ్లను, రప్పలును

లభించుటవల్లనే ఈయెరవాడఒడంబడికయన్ననో వారికి అన్నపుమెతుకులను కొన్ని పడవేసినది. శాసనసభలలో హిందుదువులకున్న స్థానములన్నియు హరిజనులకు లభించియున్నచో డాక్టరు మూంజీగారితోపాటు నేనుకూడ సంతోషించియుందును. అట్లు జరిగియున్నచో దానివల్ల సవర్ణహిందువులకును హిందూధర్మమునకునుకూడ మహాలాభము కలిగియుండెడిది. నేను కోరునది—సవర్ణులతో హరిజనులును, హరిజనులతో సవర్ణులును, పూర్తిగా కలసిమెలసియుండుటయే. అదియే యెల్లరును కోరవలసినది. త్రొక్కివేయబడినవారికి ఎన్ని హక్కు లొసంగిన, వారిని అణగద్రొక్కినవారి కంతలాభకరమని నా నిశ్చితాభిప్రాయము. ఈయభిప్రాయమునకు ముందేమిజరిగినను తిరుగుడు ఉండజాలదు. అప్పులతో మునిగిపోవుచున్నవానికి, కొంత యప్పుతగ్గినచో నెట్లుండునో యిదియు సరిగా నట్లే! సవర్ణహిందువులు వినమ్రభావముతోను, పశ్చాత్తాపతప్త హృదయముతోను, ధర్మబుద్ధితోను యీసమస్య నెదుర్కొనినగాని నా యుపవాసదినములలో హిందూసంఘము నావహించినట్లు కాన్పించినమహాశక్తితో ఒడంబడికలోని మిగతాభాగముల నమలులో పెట్టజాలరు.

తమ సంస్థానములలోని దేవాలయములలోనికి హరిజనులు ప్రవేశించుట కంగీకరించుచుగాని, యితర విధములగాని అస్పృశ్యతకు తమ రాజ్యములలో స్థానము లేకుండ

నట్లు ప్రకటనల గావించిన సంస్థానాధీశుల నభినందించెదను. వారట్లుచేసి, తమయొక్కయు, తమప్రజలయొక్కయు, పురాకృతపాపమునకు కొంత ప్రాయశ్చిత్తమును గావించుకొనిరి. ఆయా స్థానములలో గల హిందువు లాప్రకటనలలోని విషయముల నమలులోపెట్టి, ఒకప్పుడు తాము హిందూసంఘము నుండి వెలివేయబడి, అసహ్యముగ చూడబడినట్టివారముకామను భావము హరిజనులకు పుట్టునట్లు సౌహార్ద్రభావముతో మెలంగెదరని యాశపడుచున్నాను.

ఈ యస్పృశ్యత శాస్త్రోదితములగు వాదములను దాటి ఒక వేరుపురుగై యావద్భారతజాతియొక్క పునాదులనే కూలద్రోసినది. ఈ మహారోగమువల్ల బాధపడువారమగుటచేతను, బాధపడువారి మధ్యనుండుటవల్లను, మన మీవిషయము గ్రహింపజాలకున్నాము. 'నన్ను ముట్టుకోకు—నా మాలకాకి' యన్నపాటయే దేశమెల్ల ధ్వనించిపోవుచున్నది. అందుచేత నీముండ్లచెట్టును సమూలముగపీకి కాల్చివైచి, కులము-కులముమధ్యను, ధర్మము-ధర్మముమధ్యను గల భేదములను మరచిపోయి హిందువులెల్లరొక్కటే యనియును; వారిని విభాగింప వీలులేదనియును; మన మెట్లనుకొనుచున్నామో యట్లే హిందువులు, ముసల్మానులు, శిక్కులు, పార్శీలు, యూదులు, క్రైస్తవులు మున్నగువారందరొక్కటే యనియును; వారందరొకమహావృక్షముయొక్క వివిధోప

శాఖలనియును నమ్మ మొదలిడుదుమని నా విశ్వాసము. ధర్మములు వివిధములుకావు. అన్నియు నొక్కటే. అస్పృశ్యతానివారణోద్యమమునుండి మన మీపాఠము నేర్చుకొనవలసి యుందుము. చలింపక—దృఢనిశ్చయముతోను, ధర్మబుద్ధితోను మన మీపనిని కొనసాగించినచో ఆ గుణపాఠమును నేర్చుకొనగలము.

---

3

అస్పృశ్యతా నివారణోద్యమమందు సానుభూతియున్న ప్పటికిని; దాని కార్యక్రమమునందలి యన్నివిషయముల సంగీకరింపని చిరకాల పరిచయస్థుడగు నొకవి

మూడవ పత్రిక టన 7-11-32

లేఖరి నాకు హిందీలో దీర్ఘమగు నొకలేఖ వ్రాసెను. దానిని సంగ్రహపరచి యీ క్రింద నిచ్చుచున్నాను.

"ఉద్యమము దేశమునం దన్నిప్రాంతములలోను సక్రమమగు హద్దులమధ్యనుండుటలేదని నాభయము. కొన్నిప్రాంతములలో, మీవ్యాసములను విమర్శింప సాహసించినవారి నెవరినైననుసరే పరిహసించుట, పూర్వాచారపరాయణులను తిట్టుట మున్నగు దుష్టపద్ధతులను యస్పృశ్యతానివారణోద్యమప్రచారకులమని చెప్పుకొనువారు కొందర వలంబించుచున్నారని తెలియుచున్నది. ఈ ఉద్యమము నానాటికి దాల్చుచున్న తీవ్రస్వరూపము నంగీకరింపనివారి నెవ్వరినైననుసరే ధర్మద్రోహులని పిలుచుచున్నారు. జాగ్రత్తగా నుండుమని భయపెట్టుచున్నారు. అస్పృశ్యులయొక్క సౌఖ్యోన్నతికిగాని, నైతికోన్నతికిగాని లక్ష్యముంచుచున్నట్లు లేదు. వర్ణాంతరభోజనముల చేయుటతోడను, ధర్మకర్తలు వ్యతిరేకముగానున్నప్పటికిని దేవాలయములలోనికి హరిజనులనుగుంపు

భావించుచున్నట్లున్నది. హరిజనుల కేమాత్రము లాభము లేక, పూర్వాచారపరాయణులకు బాధకలిగించునట్టి వట్టి ప్రదర్శనముల క్రింద నీయుద్యమము మారిపోవుటకు మీ రిచ్చగింపరనియే నా నిశ్చయము."

అస్పృశ్యతవిషయమై క్రిందటి నెలలో నాకు దాదాపు నూరు ఉత్తరములు వచ్చినవి. అందులో దేశసేవకుల నడత దార్జన్యపద్ధతుల సమీపించుచున్నదని ఫిర్యాదుచేయు ఉత్తర మిదియొక్కటియే విశేషమైయందు నాకున్న గౌరవముచేత నే నాతనిఫిర్యాదును ప్రకటించు టవసరమని భావించితిని ఆయన బుద్ధిపూర్వకముగ నతిశయోక్తుల వ్రాయడని నే నెరుంగుదును. ధర్మసంబంధమగు విషయములలో నెట్టి నిర్బంధ ముండరాదు అంతవరకేల నేను నిర్బంధ మేవిషయమునందును కూడ యుండరాదనెదను. జాతి, కుల, ధర్మము లేవైనను సరే ఎవ్వరిమెడలను ఎట్టి దార్జన్య ముపయోగించుటకును, నేను కేవలవిరోధి నన్న సంగతి ప్రజ లెరుంగుదురు. నేను మరల యుపవాసము ప్రారంభింపకుండ జేయువలెనను ఆత్రుతతో గూడ సందేహాస్పదములగు పద్ధతుల నవలంబించి యుద్యమమును బలవత్తర మొనర్చుటకు ప్రయత్నింపరాదని యుద్యమము నడపువారు గ్రహింపవలెను. వారట్లు గ్రహింపనిచో నామృత్యువును దరిజేర్చినవారలే యగుదురు.

అస్పృశ్యతానివారణోద్యమ మట్లు చెడుమార్గముల పట్టుట నాకు జీవన్మరణమే యగును. ఈయుద్యమముకొరకే భగవంతుఁడు నన్నీచిన్నియుపవాసమొనర్ప ప్రేరేపించెనని నానమ్మకము. ఈ అల్లరిచిల్లరపనులవల్ల హరిజనులకుగాని, హిందూసంఘమునకుగాని, యెట్టిలాభము నుండదు. భారత దేశములో నింతవరకు బయలుదేరిన వాటిలోకెల్ల నిదియే పెద్దదియగు ధర్మసంస్కరణోద్యమము. బహుశః ప్రపంచము లోనెల్ల నిదియేగొప్పది గావచ్చును. దానిసత్వములోనున్న యేడుకోట్ల జనుల బాగోగు లీయుద్యమముమీదనే యాధా రపడియున్నవి. దీనికి వ్యతిరేకముగనున్న పూర్వాచారపరా యణులయెడల మన మగౌరవముగను, అనాలోచితముగను ప్రవర్తింపరాదు. మనము ప్రేమవల్లను, త్యాగమువల్లను, పూర్తియగు ఆత్మనిగ్రహమువల్లను వారిని జయింపవలెను. మన నిత్యజీవితముయొక్క పవిత్రత వారిహృదయముల లోనాటునట్లు మనము నడచుకొనవలెను. మనము సత్యమని నమ్మినదానియందు మనకు పూర్ణవిశ్వాసముండవలెను. మన ప్రతికక్షులను మనవైపు త్రిప్పుకొనుటకు తగినంతప్రేమ వారి యందు మన కుండవలెను.

ఆరుకోట్లమానవులను చిరకాలదాస్యమునుండి విము క్తుల గావించుట వట్టిప్రదర్శనములవల్ల జరుగ నేరదనుట నిస్సందేహమైన విషయము. నలుముఖములనుండి యెదుర్కొని పనిచేయుటకు వీలగు బలమైన నిర్మాణకార్యక్రమ మొక్కటి

కాపలయును. ఈమహాత్కార్యమును సాధించుటకు ఉన్నత ధార్మికభావములచే ప్రేరేపింపబడి, తదేకదీక్షతో పనిచేయ గల వేలకొలది స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు, తమ శక్తిసామర్థ్యములనెల్ల నిందే వినియోగింపవలెను. ఈ యుద్యమముయొక్క శుద్ధధార్మికస్వరూపము నష్టము చేసి కొనలేనివారల నిందుండి తొలగిపొండని సగౌరవముగ కోరు చున్నాను. కొలదిమందియైనను లేక చాలమందియైననుసరే. అట్టి దృఢనమ్మకమును భక్తభావమును గలవారే యీ యు ద్యమమునందు పనిచేయుదురుగాక!

అస్పృశ్యతానివారణచే మహత్తరమైన రాజకీయ ఫలితములు కలుగవచ్చును. అంతమాత్రమున నది రాజకీయో ద్యమము కాజాలదు. అది కేవలము హిందూధర్మమును శుద్ధ మొనరించుటకే యుద్దేశింపబడినది. శుద్ధములును, పవిత్రము లునగు సాధనలవల్లనే జయము లభ్యమగును. పరమేశ్వరా నుగ్రహముచే నట్టి పవిత్రహృదయములు వందలకొలదియే కాదు వేలకొలది భారతదేశమునందలి వివిధభాగములలో పనిచే యుచున్నారు. ఓపికలేనివారు, సంశయాత్ములును నోరిమి తోకనిపెట్టుకొని చూచుచుండెదరుగాక! పరమదుద్దేశముతోనై నను సరే, త్వరపడి యసంబద్ధముగ వ్యవహరించి, యుద్యమ మునందు జోక్యము కలిగించుకొని, దానికి కళంకమాపాదింప కుందురుగాక!

---

## ४

ఒక విలేఖరి యీక్రిందివిధమున వ్రాసెను.

"మొన్నటి మీ నిరశనదీక్ష నిర్బంధపద్ధతులలోకెల్ల నధమమైనదని నేను తలచెదను. యరవాడఒడంబడికవిషయమైకూడ నాభావములను మీకు తెలుపగోరెదను. ప్రజానాయకు లనేకులు కూడ నాభావములనే కలిగియున్నారని కూడ నే నెరుగుదును. వారికి మీయందున్న గౌరవముచేతను, మీరు జైలులోనుండుటవల్లను, యీ యొడంబడికను కుదుర్చుటకై మీరవలంబించిన చర్యావిషయమై తమ భావములను బహిరంగముగ వారు తెలుపలేదు. ఈ యొడంబడిక జరుగుట ప్రజలదురదృష్టమనియే నే నెంచుచున్నాను. మీరు నిరశనవ్రతదీక్ష బూనియుండనిచో నిది జరిగియుండెడిదికాదు. ఒడంబడిక నంగీకరింపకపోయినచో మీరు మరణించుట నిశ్చయ మన్నభయమువల్లనే దానికి తమ సమ్మతినిచ్చితిమని, మీకు మిగుల గౌరవపాత్రులగు మీ మిత్రులొకరు నాతో చెప్పిరి. ఇప్పుడొప్పుకొనిన షరతులనే మీ రింగ్లాండులో నొప్పుకొనియుండినచో యీ యొడంబడికయే పుట్టియుండక పోవునని యెంచు బుద్ధిమంతులగు హిందువు లనేకులు గలరు.

నాల్గవ ప్రకటన. 9-11-1932.

మీ రొకపత్రికటనలో నీ ప్రజాకోటి నుద్దేశించియే తా ముపవాసదీక్ష బూనితిరని వ్రాసియున్నారు. అది మీ

యు ద్దేశమై యుండవచ్చును. కాని దానిఫలితము వేరైనది. ఆ ప్రజాకోటిగాక యితరులు వేరుమార్గము లేక తమవిచక్షణ శక్తిని, యభిప్రాయములను, యీ విషయమునందు దూరముగ నుంచవలసివచ్చినది. మీయమూల్యజీవితము గోల్పోవవలసివచ్చునన్న సంగతి తప్ప, ప్రపంచములో నింకేదియు వారినంగీకరించునట్లు చేయజాలని షరతులను వారంగీకరింపవలసివచ్చినది. వారినిర్మలప్రేమయే సర్వమును మార్చివైచి అయిదురోజులలో యీ యొడంబడిక కుదురునట్లు చేసినదని మీరు వ్రాసిరి. ఈ మాట సరియైనదేనా ? నిరశనదీక్షవల్ల మీరు మరణింతురన్న భయమే దీనికి మూలకారణమని చెప్పుట యింతకంటె సరియైనదగునుకాదా ? ఆ యొడంబడిక యెట్టిసందర్భములలో జరిగినదో జ్ఞాపకముంచుకొని దాని విషయమంతగా ప్రసంగించుట తగదని మీరు సమ్మతింతురనుకొందును. అది పూర్తిగా నమలులోనికి రాకపోయినచో మీరు మరల నింకొకయుపవాసదీక్ష బూనుటంతకంటె యర్థములేని పని. మీయట్టి ప్రజానాయకుని విమర్శించుట నాబోటివానికి అంత యానందదాయకమగు పని కాదు. కాని యీసమయ మట్టిది. మౌనముదాల్చుట న్యాయమైన పని గాదు. అస్పృశ్యతానివారణవిషయమై మీరు ప్రజలతో ప్రస్తావించినప్పుడు వారిలోనెవ్వరును బహిరంగముగ ప్రతికూలత చూపనందున వారంద రందులకు సమ్మతించిరను

కొనుట సరికాదు. మీయందున్న గౌరవమువల్లను, రాజకీయములందు మీరు నాయకత్వము వహించుటచేతను, మాట్లాడకుండ మీయుపన్యాసముల వినియుందురు మీయభిప్రాయముల కెంత ప్రతికూలురైనను (అట్టివారనేకులున్నారు కనీసము ఉత్తరహిందూస్థానమునందైన గలరు) మీరు చెప్పునది గౌరవముతో వినుట తమధర్మముగ వారెందరు భావింతురు. ఈప్రజలంత వాక్ఛక్తిగలవారుకారని కూడ మీరెరుంగుదురు. తమకు ప్రతికూలమైన యభిప్రాయములను విమర్శించుటకు వారంతగా ముందునకురారు. మీయట్టివారిముందు నోరెత్తరని చెప్పనక్కరలేదు."

అనవసరభాగములను, విలేఖరియిచ్చిన హరిజనాయకులపేర్లను ఉత్తరములోనుండి తీసివేసితిని విలేఖరి వ్రాసిన ట్లాహరిజనాయకులు, తమయభిప్రాయములను నిజముగా నణచివైచుకొని, నామరణభయమువల్లనేగాని యన్యథా తామంగీకరింపనొల్లని షరతులకు సమ్మతించియుండినచో నది చాలసంతాపకరమగు విషయము. విలేఖరి చెప్పినట్లు వారు నడచియుండినచో దేశమున కమితహానిని చేయుటయేగాక, నాయుపవాసముయొక్క శుద్ధధార్మికస్వరూపము నర్థము చేసికొనలేకపోయిరనికూడ తేలును.

ప్రజాహితజీవితమందు ప్రవేశించినవారు సత్యముకొరకును, ప్రజాక్షేమముకొరకును తమస్నేహితులను కూడ త్యజింపవలసివచ్చును. అది చాలబాధాకరమగు విధియే. ఈ నాస్నేహితులు తప్పని యెంచదగినంత నాయొడంబడికలో నేమున్నది?

సవర్ణులు హరిజనులు.

శాసనసభలందు హరిజనులకు కొన్ని స్థానముల ప్రత్యేకించుటగాని, సంయుక్త నియోజకవర్గములుగాని తప్పుకాజాలవు. హరిజనులకెన్నికవిధానము కూడ తప్పుకాజాలదు. అనేకతరములనుండి హరిజనులు క్రూరముగా వంచింపబడిన హక్కులను తిరిగి వారికిచ్చుట కభ్యంతరమెట్లుకాజాలదు ఇకమిగిలిన దేమి? శాసనసభలలో హరిజనులకివ్వబడిన స్థానములే? కాని 'రాజా-మూంజీ' యొడంబడికవలన నింతకంటె నెక్కువస్థానములే వారికివ్వబడినవి. అంతియగాక నేనిదివరకు ప్రకటనలో వ్రాసినట్లు తామింతకాలమునుండి కాలిక్రిందపెట్టి నలిపివైచిన హరిజనులను తమచుట్టములుగను పక్కములుగను భావించిన-చో సవర్ణులు వారికిచ్చు స్థానములెన్నియైనను యెక్కువ కాజాలవు. ఒడంబడికవల్ల వారికబ్బినది యిప్పుడు కిష్టములేని హిందువులనుండి నా యుపవాసదీక్ష బలవంతముగా లాగినచో హరిజనుల భవిష్యత్తు నిజముగా యంధకారబంధురమేయగును. కావున నాకీవిలేఖరి వ్రాసిన సంగతి నిజమైనట్లు తేలినయెడల నేనుపవాసదీక్ష బూనుట రెం

డింతలు న్యాయమగును. నిరపరాధుల వెలివేసి- నేడువారి కేమాత్రమైన న్యాయము కలుగచేయుటకు వెనుకాడుచున్న సంఘములో నొకనిగ నే బ్రతికియుండగోరను. ఇంతకాలము నుండి నే నెవ్వరినిగురించి వ్రాయుచున్నానో అట్టియాప్రజా కోటి యీ వి లేఖరి వ్రాసినట్లు వాస్తవమునకు అస్పృశ్య తను విమర్శించుచు నే తీవ్రముగ మాట్లాడిన దంతయు నెన్నటికిని యొప్పుకొనకయుండినను, లేక నాయందుగాని, నా రాజకీయనాయకత్వమునందుగాని యున్న గౌరవముచే మాత్రమే ఒప్పుకొనినట్లు నటించియున్నను, నేను తిరిగి యుపవాసమొనర్చుట మూడింతలు న్యాయమేయగును. ఇట్టి యసత్యములమధ్య జీవించుటయే నాకు భారమగును. ప్రజ లు, ప్రజానాయకులు నాయట్టివానినైనను సరే లక్ష్యపెట్టక తమయభిప్రాయముల ప్రకారము నడచుకొనుట అవసరమని యెంతత్వరలో గ్రహించిన దేశమునకును, వారికిని, నావంటి వారికినికూడనంత శ్రేయస్కరము. దేశము నావరించిన యీ దుష్టవాతావరణమును పరిశుద్ధ మొనరించుటకైనను సరే నేను సంతోషముతో యుపవాస మొనరించెదను.

ఈవి లేఖరీయుద్యమమునకు అదనునకుతగినసహాయ మొనరించెను. ఈ యుద్యమములో పనిచేయుచున్న వార లు దీనియర్థమును, ముందు నేచేయబోవు యుపవాసముయొక్క యంతరార్థమును బాగుగా గ్రహింపవలెను. నాశక్తికొలది నేను పూర్వము చెప్పినదానినే మరల నొక్క చెప్పెదను.

నేచేయబోవు యుపవాస మందలి అంతరార్థము.

దేశమునకును, సంఘమునకు శ్రేయస్కరముల నా భావించు నభిప్రాయములకు విరుద్ధముగా చేయునట్లు నే నెవ్వరిని బలవంతపెట్టుట కుపవాసము చేయుట లేను. ఏకొలదిమందినో యుద్దేశించి కూడ గాదు. అది నామనోదృష్టి కగపడు యీ కోటానుకోట్ల ప్రజలలో నాందోళనపుట్టించి వారికి తెలియకుండగను, వారికి కనుపడకుండగను, వారిలో మార్పు తీసికొనివచ్చుటకే యుద్దేశింపబడినది. త్రెంపుటకు అలవిగాని దృఢబంధములు మా యిరువురమధ్యను గలవని నా నమ్మకము

ఇప్పుడు నేనంగీకరించినదే ప్రారంభములో నంగీకరించి యుండినచో యీ యొడంబడిక శాంతిసూత్ర మనపర ముండి యుండెడిది కాదని యీ విలేఖరి సూచించుచున్నాడు. ప్రాత సంగతులను త్రవ్వకుండ నేచెప్పగలిగినది, యీ దేశములో నేచేయుటకు వీలగుదానిని లండనులో నే నెన్నటికి చేసి యుండజాలనని మాత్రమే. ఆరోజులలో లండనులో యీ విలేఖరి కూడ యున్నను నాకు తెలిసిన యన్నివిషయములును ఆయనకు పూర్తిగా తెలియవు.

ఒడంబడికకు విరుద్ధముగా నా కనేక లేఖలు వచ్చినట్లు ప్రజలు దురభిప్రాయపడవలదు. నాకు జ్ఞాపకమున్నంతవర కట్టిలేఖ యిదియొకటియే. దౌర్జన్యపద్ధతు లవలంబింపబడుచున్నవని ఫిర్యాదును జేయుచున్న యుత్తరములు రెండో

మూడో కలవు. కాని హరిజనులకియ్యవలసినదానికంటె యెక్కువ యిచ్చితిమని సూచించు యుత్తరమొక్కటియును లేదు. ఉత్సాహముతో నాయుపవాసమును, ఒడంబడికను కూడ నంగీకరించినట్లు తెలుపుతంతివార్తలును, ఉత్తరములును వందలకొలది నాకడ గలవు. ఈదేశములోను, పాశ్చాత్యదేశములలోను గల నాయాంతరంగికసహచరులలో యెవరో యొకరిద్దరు తక్క మిగిలినవారందరు నాయుపవాసమున కంగీకారము సూచించిరి. దాని యాధ్యాత్మికఫలితములను గూడ వారనుభవించిరి. నే చేయబూనిన పనికి హాని కలుగకుండుటకును, నే ధర్మమార్గమునందే యుంటినో లేదో సరి చూకొనుటకును, సద్భావముతో వ్రాయుదురని నాకు తెలిసిన విలేఖరుల ప్రతికూలవిమర్శనల ప్రకటించుచుండుట నాకలవాటు. ఈవిలేఖరికూడ నట్టివాడే యని చెప్పుట అనవసరవిషయము.

ఈ పైదానిని ప్రకటించుట కందిచ్చుచుండగనే అని మిషనేత్రుడగు అఖిలభారతయస్పృశ్యతానివారణసంఘకార్యదర్శి కడనుండి నాకొకతంతివార్తవచ్చినది. ఈ విశాలభారతభూమిలో నస్పృశ్యులసంఖ్య ఆరుకోట్లుగాక నాలుగుకోట్లకు లోబడియున్నదని ఆయనవ్రాయుచున్నారు. నాయుపవాసపు దినములలోనే శ్రీ థక్కర్ గారు నా తప్పుదిద్దినను సరియైనది కానిసంఖ్యనిచ్చినందులకు నేను చింతించుచున్నాను.

---

౫

ఇది నాయైదవ ప్రకటన. ఇందులో నాపత్రికటనలను, యుద్యమవార్తలను బాగుగా ప్రచురించుచున్నందులకు పత్రికాధిపతులకు కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించెదను.

అయిదవ పత్రికటన. 14-11-32

గతవారము నాతో నీయుద్యమవిషయముల న్నింటిని పూర్తిగాచర్చించుటకు వచ్చిన శ్రీ రాజభోజ్ గారికిని, వారిమిత్రులకును నేచెప్పిన దానిలోని వొకభాగము యొక్క సారాంశము నీపత్రికటనలో నిచ్చెదను.

ఈయుద్యమమునకు తోడ్పడుటకై హరిజనులేమి చేయగలరనునది వారువేసిన ప్రశ్నలలో నొకటి. తమతో సమానులగువారితో కలసిమెలసి తిరుగునట్లు హరిజనులతో కలసిమెలసి తిరుగకుండుటకు సవర్ణులు చెప్పుకారణములను హరిజను లూహించుకొనగల రనుకొందును. హరిజనుల స్థితి నిస్సంశయముగ దుర్భరముగనున్నదనియును, అట్లుండుటకు మధ్య కారకులు సవర్ణహిందువులేయనియును, అస్పృశ్యతాపిశాచము నశించిపోయి నంతనే వారిస్థితి సహజముగ బాగుపడునని

హరిజనుల కర్తవ్యము.

యును, నేనిదివరకే నొక్కిచెప్పియుంటిని. అందువలన హరిజనులు తమ దురభ్యాసములను వీడినగాని యస్పృశ్యత పోరాదని చెప్పరాదు. అయినప్పటికిని ప్రస్తుతపరిస్థితులలో

సాధ్యమగునంతవరకును తమ సంఘములోని లోపముల సం స్కరించుకొని పరిశుద్ధము గావించుకొనుటకు హరిజనప్రచారకులు ప్రయత్నింపవలెను.

(1) హరిజనులయందు పరిశుభ్రతను పెంపొందించుటకును, (2) అపరిశుభ్రములైన వృత్తులనబడు పాకీపనిని, తోళ్లను పదునుజేయుపనులను మేలైనపద్ధతులలో నెరవేర్చునట్లు చేయుటకును, (3) చచ్చిన గొడ్డుమాంసమును, గోమాంసమును లేక అసలు మాంసాహారమునే వారు వదలుపెట్టునట్లు చేయుటకును, (4) కల్లు, సారాయి మున్నగు మత్తుపదార్థములను విడిచిపెట్టునట్లు చేయుటకును, (5) పాఠశాలలున్నచోట్ల తమపిల్లలను పంపునట్లు వారిని ప్రోత్సహించుటకై రాత్రిపాఠశాలలున్నచోట్ల పెద్దలుకూడ చదువుకొనునట్లు చేయుటకును, (6) వారిలోవారికున్న యంటరానితనమును నశింపజేయుటకును హరిజనప్రచారకులు తమసర్వశక్తుల వినియోగించి ప్రయత్నింపవలెను.

పై వానియర్థమేమో సరిగా తెలియుట కాయంశముల నొకటొకటిగా వివరించిచెప్పెదను. మనదేశశీతోష్ణస్థితులలో ప్రతిదినమును స్నానముచేయుటవసరము. పరిశుభ్రవస్త్రముల దాల్చుటన్నివిధములగు శీతోష్ణస్థితులందుకూడ నవసరమే యగును. హరిజనులు కాపురముండు స్థలములందు నీరుదొరకుటంత చులకనగాదని నేనెరుంగుదును. సామాన్యముగా

మిగతా జనులందరు నుపయోగించు నూతులకును చెరువు లకును వారు పోరాదు. బట్టలను మార్చుకొనుటకు వారు కడు బీదలు. కాని చెంబెడు నీళ్లతోనైన పరిశుభ్రముగా స్నాన ము చేయవచ్చును. శుభ్రమైన "తువాలు" నొకదానినితడిపి దానితో తలతోసహా యొడలంతను గట్టిగా తోముకొనవల యును. పిమ్మట పొడి "తువ్వాలు"తో నొడలెల్ల తుడుచు కొనినచాలును. అనుదినమిట్లు స్నానముచేయవచ్చును. మన దేశశీతోష్ణస్థితులందు నాతడితువాలునే పిడుచుకొనినచో యొడలు తుడుచుకొనుటకదియే పనికివచ్చును. తరువాత లంగోటితోనుండి కట్టుగుడ్డలను తడపి, యుతుకుకొని, ఆర పెట్టుకొని యప్పుడే మరల వాటిని కట్టుకొనవచ్చును. నేను చెప్పుదానిలో నూతనాంశమేదియు లేదని నాకు తెలియును. కాని యీామామూలుసంగతులనే యనేకదేశ సేవకుల కనే కమారులు నేను చెప్పవలసివచ్చినది. పరిశుభ్రతగా నుండు టకుతోడ్పడు నీచిన్నివిషయముల నెరుంగనివారు బి. ఏ. ము న్నగు డిగ్రీలను బొందినవారిలో కూడ ననేకులు గలరు.

పాకీపనిని చేయ పెట్టునది రెండవవిషయము. అజ్ఞా నులును, స్వార్థపరులునగు సవర్ణులు పాకీదొడ్లను సులభముగా బాగుచేయు టసంభవము గావింతురు. పాకీదొడ్లను బాగు చేయువారు అస్పృశ్యులే గదాయని సవర్ణులు వాటిని వర్ణింప రానంత యసహ్యముగా నుంతురు. అవి చీకటికోణములై,

గాలి, వెలుతురులు దూరుటకు వీలులేకుండగ నుండును. మరియును వాటిలో కొంత భాగమునే బాగుచేయుటకు వీలుగ నుండును. అట్టి సర్వాసహ్యాకరములగు పరిస్థితులలోనే పాకీవారలు పనిని చేయవలసివచ్చును. ఈ దొడ్లనుపయోగించుట ప్రతిరోజును నరకలోకములోనికి పోయివచ్చుటయే యగును. తనమలమును తాను చూడగూడదనియును, దానిని తాను బాగుచేయరాదనియును మూఢనమ్మకము సవర్ణులలో పాతుకొనియున్నది. ఈదేశ శీతోష్ణస్థితులే యనుకూలముగ లేకపోయినచో దానివల్ల నిప్పటికంటె యెక్కువమంది ప్రజలు చిన్నవయస్సుననే మరణించియుండెడివారు అత్యవసరమైన యీసాంఘికసేవ చేయవలసియున్న హరిజనులీయననుకూలపరిస్థితులందుకూడ దొడ్లనూడ్చినంతనే స్నానము చేయవచ్చును. దొడ్లను బాగుచేయుటకు వారుపయోగించు నాలుగుగడ్డిపోచలకుమారు పాడిమట్టి నుపయోగింపవచ్చును.

పాకీపనిలో నిపుణుడనగుటవల్ల దొడ్లనూడ్చుటకు పరిశుభ్రమును చవుకయునగు పద్ధతుల నెన్నిటినో నేను చెప్పగలను. కాని యిందులో గ్రామవాసులును పట్టణవాసులును నాకు తోడ్పడవలయును. ఆకర్షణీయమగు యీవిషయమును గురించి యీ చిన్నప్రకటనలో పూర్తిగా వ్రాయజాలను. దీనిని గూర్చి యింకను తెలిసికొనగోరువారు పారిశుద్ధ్యమును

గురించి యిందులో ముఖ్యముగా గ్రామపారిశుద్ధ్యమును గురించి నేను వ్రాసిన వ్యాసములను చూడవచ్చును. దొడ్ల నూడ్చునప్పుడు పాకీవారు తమవృత్తిచిహ్నముగ ప్రత్యేక దుస్తులను ధరింపవలెను. ప్రతిగృహయజమానియో లేక యిట్టియజమానులు పదిమందికలిసియో తమదొడ్లను తుడుచు వారికట్టిదుస్తుల నీయగోరెదను.

తోళ్లనుబాగు చేయుట.

పరిశుభ్రమగు పద్ధతులలో తోళ్ళను బాగుచేయుట ఇంతకంటెను కష్టమైన సమస్య. ఈదేశమునతోళ్ళను బాగు చేయువారు, చచ్చిన జంతువుల చర్మముల తీయుటయందుగాని, వాటిని బాగుచేయు టయందుగాని యాధునికపద్ధతు లెఱుంగరు. తోళ్ళను పదును చేయుట యనుయీమాటయందుచాలపనులు యిమిడియున్నవి. సవర్ణులనబడువారు స్వమతస్థులును, స్వదేశస్థులును, బహుప్రయోజనకారులునగువీరలనతిక్రూరముగా నలక్ష్యముచేసిరి. చచ్చినజంతువుల మోసికొనిపోవుట మొదలుకొని, తోలును బాగుచేయుటవరకును గల యావత్కార్యములు చాలమోటుగా చేయబడుచున్నవి. దీనివల్ల దేశమున కపారనష్టము కలుగుటయేగాక తక్కువరకపు తోళ్ళు తయారగుచున్నవి. మానవసేవాపరాయణులగు శ్రీ మధుసూదనదాసుగారు ఆధునికపద్ధతులమూలమున తోళ్ళను బాగుచేయుట స్వయముగా నేర్చుకొనిరి. అస్పృశ్యత యను

యీమూఢాచారము ధర్మస్వరూపము దాల్చి వర్తించుచుం డుటవల్ల మనదేశమునకు సాలున కెంతనష్టమువచ్చుచున్నదో లెక్కవేసి వారు చూపించిరి. తోళ్ళను బాగుచేయుటకుగల యాధునికమార్గములను హరిజనప్రచారకులు తాము నేర్చుకొని వీలగునంతవరకు తోళ్ళను బాగుచేయువారికి నేర్పవచ్చును.

తాము తినగా మిగిలిన యన్నమును ఇతరపదార్థములను గృహస్థు లతిక్రూరముగా వారిమొగమున పారవేసినప్పుడు వాని నంటకుండునట్లు పాకీవారికి బోధింపవలెను. ఏండ్లకొలదికాలమునుండి యలవాటైపోవుటచే పరిశుభ్రతను గురించినభావములు పాకీవారిలో నశించిపోయినవి. వారు యితరులయెంగిలికూడు తినుటలోగల యసహ్యతను చూడలేకున్నారు. యజమానుల విస్తళ్ళలో మిగిలిపోయిన రుచికరములగు పదార్థములకొరకు వారు దేవులాడుచుందురు. ఇట్టి యెంగిలిపదార్థముల నంగీకరింపవలదనియును, యిండ్లలో తయారుచేసికొనినవానికంటె, జొన్నరొట్టెలతోను గంజితోను తృప్తిపడవలసినదనియును, పాఠశాలలలో నుపాధ్యాయులు బోధించినందున మాదిగవారనేకులు తమపిల్లల నాబనుల నుండి మాన్పించిన సందర్భము లనేకములను నేనెరుంగుదును.

గోమాంసమును, చచ్చినగొడ్డుమాంసమును, తినకుండ చర్మకారకులను హరిజనప్రచారకులు మాన్పించవలెను.

నేను శాకాహారిని. కావున యితరులెందరో పీడినట్లు మాంసాహారమును వీడుడని హరిజనులకు చెప్పుచును. కాని వారీసంస్కారణమునకు సంసిద్ధులుగాకున్నచో యితరమానవులందరిచేత హేయముగ నెంచబడునదియును, అనారోగ్యకరమునగు చచ్చినగొడ్డుమాంసమును, హిందువులందరకును నిషిద్ధమగుటచేత గోమాంసమును వీడునట్లు వారికి బోధింపవలయును. చచ్చినజంతువుల మాంసముకూడ కొంతప్రతిఫలముగా నెంచబడుచున్నదని నే నెరుగుదును. కొన్నిగ్రామములలో చచ్చిన జంతువులమాంసమును తినుటమానిన హరిజనులను, అట్లు వారు తినకుండుట ధర్మవిరుద్ధమని చెప్పుచు గ్రామస్థులు కొట్టిరనియును, హరిజనులు చచ్చిన గొడ్డుమాంసమును తినుట మానినచో, చచ్చినజంతువుల తీసికొనిపోవుటకును, తోళ్ళుతీయుటకును వారు వేరే కూలినడుగుదురని గ్రామస్థుల భయమనియును, డాక్టరు అంబేద్కరుగారు నాతో చెప్పిరి. ఆకష్టమెట్లున్నను, హరిజనులుమాత్రము చచ్చిన గొడ్డుమాంసమును, గోమాంసమును తినుట మానితీరవలయును. హరిజనులపట్ల ఆత్మనిగ్రహము చూపించు యీ యొక్క కార్యమే వారలపై సవర్ణులకు గౌరవము పుట్టించును. దీనివల్ల అస్పృశ్యతానివారణకై పాటుపడుచున్న సవర్ణులగు సంస్కర్తల పని కొంచెము తేలికయగును.

నాలుగు, అయిదు యంశములను గూర్చి వివరింపనక్కరలేదు. వాటియర్థమును సులభముగాగ్రహింపవచ్చును.

అంటరానివారిలోనున్న యంటరానితనమును రూపు మాపుటెట్లనునదే తుదియంశము. ఈపని చాలత్వరగా జరుగవలసినది. అస్పృశ్యులలోగల యీ యస్పృశ్యతను పోగొట్టనిచో నస్పృశ్యతానివారణ చాలకష్టమగును. హరిజనప్రచారకుల కిది చాల దుర్ఘటమగు కార్యమే. హిందూధర్మములో ప్రవేశించిన కలుషమునంతను పారద్రోలుట కుద్దేశింపబడిన ధర్మోద్యమముగా వారీయుద్యమమును గుర్తింపగలిగినచో, యీ మహాసంస్కరణమును కొనసాగించుటకు వలయు ధైర్యము, నాత్మవిశ్వాసమును వారికిలభించును. ఇట్టి యుద్యమమునందు పనిచేయువారు స్వార్థరహితులుగను, సుశీలురుగను, ఉండవలసినదని నేను వేరుగ చెప్పనక్కరలేదు.

అంటరాని వారిలో అంటరానివారు

పైన నేను సూచించిన నిర్మాణకార్యక్రమము హరిజన ప్రచారకులలోని యత్యుత్సాహపరులకుకూడ చేతినిండ పని కల్పించును వారికాలమంతయు దీనికే సరిపోవును. కాని హరిజనప్రచారకులు, హరిజనులుకూడ నీ పవిత్రసమయమున చేయకుండ నుండవలసినవిషయము లొకటి రెండు గలవు. ఏదియెట్లైనను వారిప్పు డుపవాసదీక్షలను బూననక్కరలేదు. సత్యాగ్రహసాధనను ప్రయోగింపనక్కరలేదు. నేడగ్నిపరీక్షకు లోనగుచున్న సవర్ణహిందువులు తమకును హరిజనులకును మధ్యగల యడ్డుగోడల నెట్లు పడగొట్టబోవు

చున్నారో హరిజనులు కనిపెట్టి చూచుచుండెదరు గాక! స్థానికులగు సవర్ణులతో జగడములను దిగకుందురు గాక! మర్యాదగను, గౌరవముతోను, సర్వదా ప్రవర్తించుచుండవలెను. ముఖ్యముగా ప్రస్తుతసమయమునందు వారెఱుంగుట చాల యవసరము. ధర్మముయొక్క శక్తి యాత్మార్పణమువల్లనే ప్రజ్వలితమగును. తమ్మణగద్రొక్కిన వారియెడల దౌర్జన్యప్రయోగము చేయుటచే కాజాలదు. దౌర్జన్యపద్ధతుల నవలంబించినచో వారి కిదియన్నియు సులభముగా లభించును. కాని సవర్ణుల హృదయముల మార్పునొందించి తమహక్కులను పొందుటయందే హరిజనుల ఘనత కనుపించును. అందులో నిప్పుడు వేలకొలది సవర్ణులు తమదోషముల నెఱింగి తాము హరిజనులకు గావించిన యపచారమునకై తగిన పరిహారమిచ్చుటకు వారిసమస్తశక్తుల వినియోగించుచున్నారు. ఆసంగతిని గుర్తించి హరిజనులు కొంత సంతృప్తిని చెందవచ్చును. తమయుద్యమము ధర్మసంబద్ధమైనదని తెలిసికొని దానిని యాత్మార్పణమువల్లనే సాధింపగలమను సంపూర్ణవిశ్వాసమును వారలు కలిగియుందురుగాక! ఉద్యమాభివృద్ధికి మేమేమి చేయవలెనని యడిగిన సవర్ణులకు ముందు ప్రకటనలో జవాబిచ్చెదను.

౬

ఆరవ ప్రకటన 15-11-32

ఉద్యమాభివృద్ధికి హరిజను లేమిచేయవలయునని ప్రశ్నించినవారు శ్రీయుత రాజ్‌భోజ్‌గారొక్కరే. కాని తమపనుల కిబ్బందిలేకుండ తా మేవిధముగ తోడ్పడగలమని భారతదేశమం దన్నిభాగము లనున్న సవర్ణులగు స్త్రీ పురుషులనుండియు, విద్యార్థులు మున్నగువారికడ నుండియు నాకనేకయుత్తరములువచ్చినవి. అస్పృశ్యతానివారణోద్యమము ప్రజలలో హృదయపరివర్తన గావించి తద్వారా హరిజనులయెడల వారి ప్రవర్తన మారునట్లు చేయుట కుద్దేశింపబడినది. కావున హరిజనసేవ జేయగోరుసవర్ణులు తమదైనికవృత్తుల మానుకొనసక్కరలేదు. మొట్టమొదటివిషయ మట్లుప్రశ్నించినవారిలో ప్రతివారును యస్పృశ్యతానివారణోద్యమతత్వమును తాము బాగుగా గ్రహించినట్లు తమ నిత్యజీవితమునందు చూపవలెను. వారట్లుచూపుట కంగీకరించుటయేగాక, హరిజనులు దేవాలయప్రవేశమొనర్చుటకు తమకెట్టి యభ్యంతరము లేకుండుట సరిగదా వారు దేవాలయములలోనికి ప్రవేశించుచుండగను, తదితరహిందువులతోపాటు నూతులను, పాఠశాలలను, ఆస్పత్రులను, రోడ్లను, వైద్యశాలలను యితర ప్రజాసంస్థలనుకూడ నుపయోగించుచుండ చూడగోరెదమనియును ఒక్కమాటలో వచింపవలెనన్న హరిజనులుకూడ

సాంఘిక, ధార్మిక, రాజకీయములందు తమతో సమానముగు స్థితిగతులలో నుండునట్లుగాంచ గోరుచున్నామనినచో నంతట నన్ను ప్రశ్నించినవారు పూర్తిగా ముందడుగిడినట్లే యగును. ఉద్యమతత్వమును పూర్తిగా గ్రహించినట్లే నేను భావింతును.

కాని నన్ను ప్రశ్నించినవారికి కావలసిన దింతమాత్రమే కాదు. పైన నేచెప్పినదెల్ల చేసి యుద్యమాభివృద్ధి కింకేమి చేయవలెనని వారడుగుచున్నారు. వారు

సవర్ణుల కర్తవ్యము.

ప్రచారమునకై తమపరిసరములను దాటి బయటకు పోనక్కరలేదు. అట్టివారు తా మనుదినమును కలిసికొనువారల యభిప్రాయములను తమవైపు త్రిప్పుకొనుటకు ప్రయత్నింతురుగాక ! వారు కలిసికొనినవారలస్పృశ్యతానివారణ మత్యంతావశ్యకమని యెంచకపోయినచో వారిని ఒప్పించుటకు ప్రయత్నించవలెను. అట్లు చేయుటకీప్రశ్నించినవారలకు శక్తి సామర్థ్యములు లేకున్నచో తత్సంబంధములగు గ్రంథములను, కరపత్రములను సంపాదించి వారికందజేయవలెను. అది కాకపోయిన యావత్కాలము నస్పృశ్యతానివారణకై పాటుపడునట్టి ప్రచారకులతో వారికి సంబంధమేర్పరుపవలెను. తమ ప్రాంతములలో నస్పృశ్యతానివారణోద్యమప్రచారము జరిగియుండనియెడల వారిలోపలు కుబడిగలవారు ఉత్సవములను, ప్రదర్శనములను, యేర్పాటు చేయవలెను. ప్రచారకులను పిలిపించి వారిచే బహిరంగసభ

లను చేయింపవలెను. ఇదియెల్ల సవర్ణులలోవారు చేయవలసినపని.

వీరందరును చేయవలసిన పని అసలు నిస్సంశయముగా హరిజనులలోనే గలదు. నా అయిదవప్రకటనను చదివినవారందరును ధనము, కాలము, శక్తియు విశేషవ్యయము లేకుండగను, హడావిడి చేయకుండగను, సవర్ణులు చేయవలసినసేవ చాలయున్న దని గ్రహింపగలుగుదురు. హరిజనులలో పరిశుభ్రతను వెంపొందించుటకు తగిన సౌకర్యములను మంచినీటి సదుపాయములను గలుగజేయుటకు వారు హరిజనప్రచారకుల కెంతయో తోడ్పడవచ్చును. హరిజనులు వసించు ప్రదేశములకు చాపుగానుండు నూతులను, చెరువులను కనుగొని సర్వజనోపయోగమునకై నిర్మింపబడిన వాటి నుపయోగించుటకు హరిజనులకూడ హక్కుగలదన్న సంగతిని చెప్పి సవర్ణులందుల కంగీకరించునట్లు చేయుటకు వారు ప్రయత్నింపవలెను. సవర్ణులొప్పుకొననిచో వారికినొప్పి కలుగని రీతిని హరిజను లానూతులు మున్నగువాటిని వాడుకొనునట్లు చేయవలెను. ఇకపాకీపనివిషయములో- వారు తమ యిరుగు పొరుగువారికడకు పోయి శుభ్రముగను, పారిశుద్ధ్యసూత్రముల ననుసరించి పాకీదొడ్లను తుడుచుటకు హరిజనులకవకాశము గలుగజేయు టవసరమని వారికి నచ్చజెప్పవలెను. ఇట్లు చెప్పవలెనన్న పాకీదొడ్ల నేరీతిని గట్టిన మంచిదో,

మలము నేమిచేయవలయునో యాధునిక శాస్త్రములను చదివి వీరు తెలిసికొను టావశ్యకమగును. గృహస్థుల దగ్గరనుండి పాకీపనిని జేయు హారిజనులకు ప్రత్యేకదుస్తులను వీరు సంపాదింపవలెను తాము స్వయముగా పాకీపనిజేసి, సంఘమునకా సేవజేయుట నీచమును, అగౌరవమును కాదనుభావము హారిజనులమనస్సులలో పాదుకొని పోవునట్లు వీరు చేయవలెను. తాము తినగా మిగిలిన యెంగిలికూడును సవర్ణులు హారిజనుల కీయకుండునట్లును, వారికి తగిన జీతమిచ్చునట్లును, స్వచ్ఛందసేవకులు చూడవలెను. ఇకతోళ్ళను బాగుచేయు పనిమాట చెప్పెదను. విరామకాలమునందు పనిచేయగోరు నీ స్వయంసేవకులలో నుత్సాహపరులును దయార్ద్రహృదయులగు వారెవ్వరో యొకరు పారిశుద్ధ్యసూత్రానుగుణ్యమగు పద్ధతిని, జంతువుల చర్మములు తీయుటయును, వాటిని బాగు చేయుటయును స్వయముగా నేర్చుకొని హారిజనులలోని చర్మకారకుల కాపద్ధతి నేర్పవలెను. ఈవిషయమున వారింకేవిధముగను సహాయపడజాలరు. కాని వారింకొక్కపనిని తప్పకుండ చేయగలరు. చచ్చిన జంతువులను మోసికొనిపోవుటకున్న యాచారవ్యవహారములను తెలిసికొని యాసేవచేయునందులకు హారిజనులకు తగిన కూలివచ్చునట్లు చేయవచ్చును.

శక్తియును, వ్యవధియు నున్నవారు రాత్రిపాఠశాలలనో లేక పగటిబడులనో పెట్టి హారిజనులపిల్లలకు చదువు

చెప్పవచ్చును. శెలవురోజులలోను, వీలైనప్పుడును హరిజనుల పిల్లలను వారు వనభోజనములకును, చిన్న చిన్న యాత్రలకును తీసికొనిపోవుచుండవలెను. హరిజనుల యిండ్లకుపోయి తరచు వారల చూచుచు, యవసరమగునప్పు డెల్ల వారికి వైద్యసహాయము నొసంగుచుండవలెను. మొత్తముమీాద తమకు మంచి రోజులు వచ్చినవనియును, హిందూసంఘముచే నసహ్యముగను, యలక్ష్యముతోడను చూడబడునట్టి నిర్భాగ్యులము తాముకామన్న భావము వారికిపుట్టునట్లు చేయవలెను.

పైన వర్ణించిన దంతయు విద్యార్థిప్రపంచము పూనుకొనినచో—చక్కగను, చులకనగను నిర్వహించగలదు. ఈపనిని శాంతముగ—కార్యాసక్తితోను, దృఢనిశ్చయముతోను, బుద్ధినుపయోగించి చాలమంది చేయమొదలిడినచో మన లక్ష్యమును మనము చాలవరకు సాధించినట్లే యగును. ఈపనిలో దిగిన తరువాత మనము శ్రద్ధవహించి చూడవలసినవిషయము లనేకము లున్నట్లు ముందు ముందు తెలియవచ్చును. నా దేశసంచారములలో కంటపడిన యనేకవిషయములనుండి కొన్నిటిని మాత్రమే పైన చెప్పితిని.

౭

నేను కొన్నిప్రశ్నలకు సమాధానము చెప్పబోవుచున్నాను. ఇవి నే నిదివరకు సమాధానము చెప్పినవే. అయినను, యిట్టివి మరల మరల వచ్చుచుండుటచేత వీలగునంతవరకు వాటిని సంగ్రహించి, యొక్కప్రకటనలోనే వాటికన్నిటికిని సమాధాన మొసగ నెంచితిని. అట్లు చేయుటయే మంచిదని నాకు దోచినది.

ఏడవప్రకటన
16-11-32.

ప్రజలను వారియిష్టములకు విరుద్ధముగా నడచునట్లు మీరు నిర్బంధించుటలేదా యను నదట్టిప్రశ్నలలో నొకటి. ఏది యెట్లైనను నాయుద్దేశము మాత్ర మది కాదు. దుర్బలులను బలవంతులగా జేయుటకును, సోమరులకు చురుకు పుట్టించుటకును, సంశయాత్ములను భక్తిపరులగా జేయుటకును—నే చేయబోవు యుపవాస ముద్దేశింపబడినది. ఈసంస్కరణమునకు ప్రతికూలురుగా నున్నవారి నది యేమాత్రమును బాధింపక పోవుటయే గాక వారికది లాభకారి గావచ్చునని కూడ కొంచె మాలోచించినచో తెలియగలదు. ఈ యుపవాసమువల్ల నేను మరణించుటయే తటస్థించినచో నది వారి కానందదాయకమగు విషయమేయగును. వారి దృక్పథమునుండి చూచినచో బహుశః వారట్లు భావించుకొనుట తప్పు కాదు సరిగదా—న్యాయమును సవ్యమును కూడ గావచ్చును.

కొన్ని
ప్రశ్నలు.

ఆగ్రహావివశుడగు నొకవిలేఖరి నా కీవిషయమును స్పష్టము గావించుటకు వెనుకాడలేదు.

కాని యింకొకవిలేఖరి యిట్లు వ్రాయుచున్నాడు. "సరే! 'ఫలానఫలాన'పని జరుగవలయు నని నాకుద్దేశము లేదని మీరనవచ్చును. కాని మిక్కిలి యుత్సాహవంతులగు మీయనుచరులు తమ్ముహింసింతురన్న భయమువల్ల, బహుజనాభిప్రాయము ననుసరించిపోవు పూర్వాచారపరాయణులనేకులున్నారు! ఈవాదమెట్టి సందర్భములందైన ప్రయోగింపవచ్చును. ఇదివరకిట్టి యుపవాసములతో నిమిత్తము లేకుండ నాజీవితములో ననేకయుద్యమములనునడపితిని. అప్పుడు కూడ నేనిప్పుడు జవాబుచెప్పుచున్న యీవాదమె యనేకమారులు నేతలచుకొనినది చేయకుండ చేయుటకు ప్రయోగింపబడినది. ఈనాయుపవాసమువల్ల నేనుద్దేశించని ఫలితము లెన్ని గల్గిననుసరే నాయాత్మగౌరవముమాట యటుండనిచ్చినను, నాయందు విశ్వాసముగల కోట్లకొలదిజనులను సత్కార్యాచరణదక్షుల గావించుటకైనను నేనట్టిదీక్ష గైకొనవలసియున్నది. ధర్మసంబంధములగు యుద్యమములన్నియుకూడ నిట్లే జరుగుచుండునని నావిశ్వాసము.

"హిందూసంఘములోని యొకశాఖవారిని యింకొకశాఖవారిపైకి తిరుగబడునట్లు మీరు పురిగొల్పుటలేదా "యనునది రెండవప్రశ్న. లేదు. నేనెన్నటికి నట్లు పురిగొ

ల్పుట లేదు. ప్రతిసంస్కరణోద్యమమునకును కొంతవిరోధ ముండకమానదు. కాని సంఘములో కొంతవరకు ప్రతికూల ప్రచారముండుటయును, ఆందోళన జరుగుచుండుటయును ఆసంఘాభివృద్ధికి చిహ్నము లేయగును. సంస్కర్తలు, సనాతన ధర్మావలంబకులు పోరాడి శాశ్వతముగా శతృవులై పోదురన్న భయము నాకు లేదు. సనాతనధర్మావలంబకుల విరోధమును నేనెన్నడును చులకనగా జూడను. వారివిశ్వాసముల త్వ్రణీకార భావముతో గూడ చూడజాలను వారిలో కొందరు సనాతనధర్మమునకిప్పుడు మహావిపత్తు వచ్చినట్లెంచుచున్నారని నాకు పూర్తిగా తెలియును. అయినప్పటికిని, సంస్కర్తలకును, సనాతనధర్మావలంబకులకును. గలభేద మత్యంతస్వల్పమని వారి వాదనలలో గోచరించినది.

సనాతనధర్మవాదులదగ్గరనుండి నాకువచ్చిన లేఖలలో నీక్రిందివిషయములలో వారందరంగీకరించుట చూడ నాకాశ్చర్యము గలిగినది.

(1). హరిజనుల స్థితిగతులను బాగుచేయుట కెంతయో పాటుపడవలసి యున్నదని మేమొప్పుకొందుము.

(2). సవర్ణహిందువులలో చాలమంది హరిజనులను బాధలు పెట్టుచున్నారని మేమంగీకరింతుము.

(3). వారిపిల్లలకు విద్య రావలయుననియును, వారు నివసించుటకు మంచిస్థలములు కావలయుననియు సమ్మతింతుము.

(4). స్నానము చేయుటకును, నీరు తోడుకొనుటకును వారికిసదుపాయముల చేయవలసియున్నదని మేమును తలంచెదము.

(5). వారికి సంపూర్ణమగు రాజకీయహక్కులుండవలెనని యంగీకరింతుము.

(6). పరమేశ్వరు నర్చించుటకు వారికివలయు సౌకర్యముల నొడగూర్పవలెనని యొప్పుకొందుము.

(7). ఇతరులకున్నట్టి పౌరసత్వపుహక్కులన్నియు వారికి కూడ నుండవలెనని యంగీకరింతుము.

అయినను ప్రస్తుతమున్నస్థితిలో హరిజనులను ముట్టుకొనవలెనని గాని వారితో కలిసి తిరుగవలెననిగాని నిర్బంధముండరాదని పై విషయముల నంగీకరించిన యీసనాతన ధర్మావలంబకులు చెప్పెదురు. అట్టివారలకు నా సమాధానమిది.

"హరిజనులను మీతో సమానముగుస్థితికి తీసికొనివచ్చుటవసరమని మీరొప్పుకొనుచున్నారు. సవర్ణులలో కొందరొకయడుగు ముందుకువైచి, మీరు విశ్వసించుశాస్త్రములమీద నాధారపడియె హరిజనుల నస్పృశ్యులగా చూడకుండుటయే తమ విధియనియును, హరిజనులు వెలిగానుండి యనుభవించుటకు మీ రంగీకరించిన హక్కులనన్నిటిని, వారితో పాటుతా మనుభవింతుమని చెప్పినచో మీరేల యాందోళనపడె

దరు ? మీరు యిష్టమువచ్చినట్లు సంచరించుటకు మీకుగల హక్కును మీరు రక్షించుకొనగోరుచున్నారు. నిర్బంధమను మాటయే యుండరాదని చెప్పుచున్నారు. అట్టియెడల మీ కవసరమనితోచిన సంస్కరణములనే, సరిగా మీ రొప్పుకొని నట్టి మార్గములనే సంస్కర్తలు కొనసాగింపవలెనని మీరేల మొగము పెట్టుకొని యడుగగలరు ? హరిజనులను ప్రస్తుత ము వారున్నస్థితిలోనుండి లేవదీయు టవసరమని మీరు కూడ నంగీకరించినను, మీరింతవర కందుకొరకేమియును చేయలేదు. కావున మీకొక మంచిమార్గమును సూచింప సాహసింపుచున్నాను. సంస్కర్తలు వసూలుచేయుచున్న నిధులకు విరివిగా ధనమొసంగుడు. వారిని మీ తరఫున పని చేయువారిగా నెంచుకొని, యుభయులకును సమ్మతమైన కార్యముల కొనసాగించుటకు తోడ్పడుడు. హిందూధర్మము నకు మీరొనర్చు వ్యాఖ్యానములను వారెట్లు గౌరవింపవలె నని మీరు గోరుదురో యట్లే, వారుచేయు వ్యాఖ్యానము లనుగూడ మీరు గౌరవింపుడు. సంస్కర్తలు హరిజనులతో కలిసిమెలిసి తిరుగకూడదని మీరింతవర కభ్యంతరపెట్టలేదు. వారి యిష్టమువచ్చినట్లు వారిని పోనిచ్చిరి. వారిని మీరు బహిష్కరించలేదు. ఈ యుద్యమము పూర్వముకంటె చాల వ్యాప్తిగాంచినది. పూర్వముకంటె నెక్కువ యభివృద్ధినొంది నది. కావున నీ యుద్యమమును మీరు ప్రతిఘటించుటలో అర్థములేదు."

కాని యింకొకచిక్కు మిగిలిపోయినది. ప్రస్తుతము దేశములో ననేక దేవాలయములును, యితర ప్రజాసంస్థలును గలవు. హరిజనులను, చట్టముల ప్రకారము కొన్ని చోట్లను, చాలచోట్ల యన్యాయముగను, దేవాలయములలో ప్రవేశింప కుండగను, ప్రజాసంస్థల నుపయోగింపకుండగను చేసిరి. ఇప్పుడా దేవాలయములును, యితర సంస్థలును, యెవరి యాధీనములో నుండవలెను? ఈ చిక్కును విడదీయుటకొక్క సులభోపాయమున్నది. ఉభయపక్షములవారును కోపతాపములను, ఒండొరులయందుగల యగౌరవభావములను వీడినచో చాలును. ప్రతిగ్రామమునందుననో లేక కొన్నిగ్రామములను గుంపుగా చేర్చియో, ప్రతిపట్టణమందుననో లేక పట్టణమందలి వివిధభాగములయందుననో గల ప్రజల యభిప్రాయము లెట్లున్నవో ఓట్లద్వారా తెలిసికొని, దేవాలయములను, ప్రజాసంస్థలను, యెవ్వరుపయోగింపవలెనో నిర్ణయించుకొనవచ్చును. సనాతనధర్మవాదులకే యెక్కువ ఓట్లు వచ్చినచో, వారు హరిజనులు సంస్కర్తల నుపయోగించుటకు వలయు దేవాలయములకును, యితర సౌకర్యములకును అగుఖర్చును సంస్కర్తలతోపాటు భరించవలెను. నేను హరిజనులను సంస్కర్తలను కలిపివైచితిని. ఏలయన నీసంస్కర్తలు, సంస్కర్తలని పిలువబడుటకు తగినవారైనచో తమ విశ్వాసముల ప్రకారము నడచుకొనువారై

నచో, హరిజనులు సవర్ణులతో సమానపఙ్క్తిని యనుభవింప జాలని యేహక్కునుగాని, యెట్టి సౌకర్యములనుగాని వా రనుభవింపకూడదు. అట్లొనర్చుట వారి విధి. నాకువచ్చిన యుత్తరములను బట్టిచూచినచో సనాతనధర్మావలంబకులు తా మనుభవించుచున్న సర్వసౌకర్యములను, హక్కులను వాటినుండి యింతవరకు వంచింపబడిన హరిజనులుకూడ ననుభవింపవలెనని యొప్పుకొనుచున్నారు. కాబట్టి వారే హరిజనులకును, సంఘ సంస్కర్తలకును, కావలసిన దేవాలయములను కట్టుటకును యితరసౌకర్యముల నేర్పాటు చేయుటకునగు ఖర్చును భరింపవలెను. కాని సనాతనధర్మవాదులు లేనిపోనిపరిస్థితులను మనస్సులలో కల్పించుకొని భయపడకుందురుగాక! యరవాడ యొడంబడిక ననుసరించి గాని, యిప్పుడు క్రొత్తగా నేర్పడిన యఖిలభారతయస్పృశ్యతానివారణసంఘముయొక్క ప్రకటనలను బట్టిగాని, అస్పృశ్యతానివారణమన్న నేను వివరించినదానికంటె నింకేదియుచు గాదని బాగుగా గ్రహింతురుగాక! హరిజనులతో గలసి భోజనములుచేయుట, వారితో వివాహములు చేసికొనుట, దానిలోని భాగములుకావు. నేనును మరికొందరు సవర్ణులును ముందొక యడుగువైచినంతనే సనాతనధర్మవాదులు కలత జెందరాదు. వ్యక్తిస్వాతంత్ర్యమును వ్యక్తుల యభిప్రాయములను వారు అణచివేయ గోరరనుకొందును. వారి

యభిప్రాయములు సరియైనవని, వారికి పూర్ణవిశ్వాసమున్న చో ముందేమి వచ్చునో యని భయపడరాదు. ఒక సంస్కరణ మేదైన కాలానుగుణ్యముగ వచ్చినదైనచో, దాని యందు సారమున్నచో నట్టిదానిని ప్రపంచములోగల యే శక్తియు నిరోధింపజాలదు.

"మీ సాంఘిక ధార్మిక భావముల వైపు ప్రజలదృష్టి మరల్చి, వాటిని ప్రజలచే నొప్పించుటకు తుపానువంటి యాందోళనను హఠాత్తుగ బయలుదేరదీయుటవల్ల మీరు రాజకీయ దాస్యవిముక్తి కడ్డము తగులుటలేదా ?" యని మూడవ ప్రశ్న. ఈప్రశ్నకు నేను ఖైదీనగుటచే పూర్తిగ సమాధానము చెప్పజాలను. అస్పృశ్యతానివారణవిషయమే ప్రచారమొనరింతునని యిచ్చినమాట నతిక్రమింపవలసి వచ్చును. అయినను నే నొక్కమాటమాత్రము చెప్పగలను. సాంఘిక, ధార్మిక రాజకీయ సమస్యలను కన్యోన్య సంబంధ ముండనంతటి విభేదములున్నట్లు నేను తలంచనని నన్నెరిగిన ప్రతివారికిని తెలియును. అవి పరస్పరమాధారపడి యున్న వనియు నందులో నొకసమస్యపరిష్కరింపబడినచో, మిగిలిన సమస్యలుకూడ పరిష్కరింపబడు కాలము చేరువైనట్లే యని యు నేను సర్వదా చెప్పుచుంటిని.

నాకువచ్చిన యుత్తరములనుండి సంగ్రహించినప్రశ్న లింకను గలవు. నాకువచ్చుచున్న యుత్తరములసంఖ్య నానా

టికి హెచ్చుచున్నది. ఇప్పుడున్న సహాయులతో నొప్పాటుతో దీని నెల్ల చూచుకొనుట నాకు చాలకష్టమైన పనియే. మిగిలిన ప్రశ్నలకు ముందు ప్రకటనలో జవాబిచ్చుటకు నాశక్తి కొలది ప్రయత్నించెదను. విలేఖరులు నాయందు దయసూపగోరెదను. ఇంతవరకు నా కందినయుత్తరముల కన్నిటికిని, వాటిలో నొక్కటినైన వదలిపెట్టక జవాబిచ్చితిని. కాని యికనుండి ప్రకటనలద్వారా నేనిచ్చు జవాబులతోనే విలేఖరులు తృప్తినందగోరెదను; వారు ముక్తసరిగ వ్రాసినచో చాల సహాయము చేసినవారగుదురు. అదియును క్రొత్తసూచనలున్ననే వ్రాయగోరెదను. లేదా నేనే తీర్చవలసిన సందేహములుండి, యాసందేహములు తీరిననేగాని యుద్యమ సంబంధమగు యితరవిషయములలో వారొక్కయడుగైన ముందునకు పోజాలని పరిస్థితులలోమాత్రమే వ్రాయగోరెదను.



౮

ఎనిమిదవ ప్రకటన. 17-11-32

"మీకు శాస్త్రముల మీద భక్తి గలదందురు. వాటిని విశ్వసింతుమందురు. శాస్త్రములనగా మీయుద్దేశ మేమియో మాకు తెలియుట లేదు. ఏలన శాస్త్రసమ్మతములగు ననేకవిషయములను మీరు మీయిష్టమువచ్చినట్లు నిరాకరించుచుందురు. మీకు పరమ పూజ్యమైన గీతలో కూడ శాస్త్రముల ప్రకారము నడచుకొనవలెనని యున్నది." అనుప్రశ్నను చాల మంది విలేఖరులడుగుచున్నారు.

శాస్త్రము లనగా నేమి?

దీనికి సమాధానముగ నేను పూర్వప్రకటనలో చెప్పినదానినే మరల చెప్పెదను. గీతోపదేశములకు విరుద్ధముగా నున్నదేదియైనను, యెందు ముద్రింపబడినను, దానిని నేను శాస్త్రముగా భావింపను. పూర్వాచారపరాయణులగు మిత్రులు విస్మయ చిత్తులుగాకుండినచో, నా యభిప్రాయముల నింకను వివరించి చెప్పెదను. లోకమంతటిచే నంగీకరింపబడిన, ప్రాథమికములగు నైతికసూత్రములకు విరుద్ధముగ నున్నదానిని దేనినైనను నేను శాస్త్రముగ చూడను. శాస్త్రములన్నియు ఆ సూత్రములను బలపరచుటకుద్దేశింపబడినవేగాని, వాటినతిక్రమించుటకుగాదు. గీతయన్ననో-యీముఖ్యసూత్రములపై నాధారపడియుండుటయేగాక- యెన్నికష్టములు వచ్చినను

వాటిని వీడకుండుటకు బలవత్కారణములను దెల్పుచున్నది. అందుచేతనే గీతయే నాకుచాలునని చెప్పుచున్నాను. నేను సూచించిన యీఫలభమును, సూక్ష్మము నగుమార్గమే తేకున్నచో నావంటి సామాన్యులగతి చెప్పనక్కరలేదు. పరస్పరవిరుద్ధములగు శాస్త్రములనబడు మహారణ్యములలో దారితెలియక కొట్టుమిట్టులాడుచుండవలసి వచ్చెడిది. లేదా- అందముగ నచ్చువేయబడి యంతకంటె నందముగ బైండుచేయబడిన సంస్కృతగ్రంథసమూహములో చిక్కుకొని, వేటికవియే దివ్యములని చెప్పు ప్రతిస్పర్థులగు పండితులమాటల్ధము చేసికొనలేక తెల్లబోవలసిన స్థితివి.

స్మృతులనేకములు గలవు. అందులో, కొన్ని ప్రాంతములలో గల కొన్నివందలమంది మానవులకుమాత్రమే గౌరవపాత్రములై, యితరులెవ్వరికీ తెలియనిస్మృతులు కొన్ని యున్నవి. అవి యెప్పుడు పుట్టినవో, యేకాలమునందెవ్వరిచే రచింపబడినవో. యెవ్వరికిని తెలియదు. అట్టి స్మృతి నొకదానిని నేనుదక్షిణదేశములోచూచితిని. దానినిగురించి మహాపండితుల నడిగితిని. కాని వారాపేరే వినలేదనిరి. ఇక నాగమము లనేకములున్నవి. వానిలో నొకదానితో మరియొకదానికి పొత్తు కుదురదు. వానిననుసరించు నట్టి యాకొలదిమందికే తక్క నవి మరియెవ్వరికిని బనికిరావు. మహాగ్రంథములన్నియు హిందువులకు ధర్మగ్రంథములైనచో, శాస్త్రార్థ

కారముచూపి సమర్థింపజాలని దుష్కార్యమేదియు నీప్రపం
చములోనుండజాలదని చెప్పవచ్చును. ప్రాచీనములగు ప్రాత
గ్రంథములలోగూడ ప్రక్షిప్తభాగములను దీసివేయకుండి
నచో ఆమహాగ్రంథములందలి ధర్మోపదేశములు సరిగావని
చెప్ప వ్రాతలందులోనే గోచరింపక మానవు కావున భగ
వద్గీతలో నొక్కసందర్భముననే యుపయోగింపబడిన శాస్త్ర
శబ్దమునకు నేనిచ్చిన యర్థమందలి భావము నిర్ణయించుటకా
ధారము యింకేదియైన గ్రంధముకాదు. లేక గీతలో చెప్ప
బడక నింకొకచోట చెప్పబడిన వేరు ధర్మసూత్రములును
గాదు. ఆ శాస్త్రశబ్దమున కర్థము సజీవములైన ముఖ్యసూత్ర
ములపై నాధారపడిన, ధర్మప్రవృత్తి యనియే! ఈనిర్వచన
ముతో విమర్శకులు తృప్తినొందరని నేనెరుంగుదును. నేను
మహాపండితుడను గాను. అందుచేత నుపదేశమెవ్వరికిని
చేయజాలను. కాని శాస్త్రమనగా నే నేమనుకొనుచుంటినో
చెప్పి విమర్శకుల కుతూహలమును మాత్రము తీర్పగలను.

పైప్రశ్న వేసినంతవట్టుదలతోనే విలేఖరు లింకొక
ప్రశ్న వేయుచున్నారు. 'ఈశ్వరప్రేరణ'— 'యంతర్వాణి'
అంతర్వాణి యని మీ రనుచుందురు. దాని కర్థమేమిచెప్పె
దరు? ఇక ప్రతివారు నీశ్వరప్రేరణయనియును,
యంతర్వాణి ప్రబోధమనియును జెప్పి యిరుగుపొరుగు వా

కందరకు విరుద్ధముగా నడువ మొదలుపెట్టినచో మీ రేమ గుదురు ? ప్రపంచ మేమగును ?” అని.

ఇది సముచితమైన ప్రశ్నయే. దివ్యవాణి, యాత్మర క్షణకొరకేదైన నొకయుపాయము చూచుకొనియుండక పో యినచో మనమందరము పెద్దచిక్కులో చిక్కుకొనియుందు ము. తన యంతర్వాణి ప్రబోధమని యందరను చెప్పగలిగి నను, వారిలో కొందరే దానిని సమర్థించుకొనగలిగియుందు రు. ఈశ్వరప్రేరణమనియు, నంతర్వాణిప్రబోధమనియును జెప్పి ప్రజలను మోసగించు నాతడు, రాజానుమతినొందకుం డగనే, రాజుపక్షమున వ్యవహరించిన వానికంటె నధోగతి పాలగును. ఏలన రాజుపేరు చెప్పి మోసగించువాడు పట్టు బడినచో శరీరదండన ననుభవించి బయటబడును. కాని యం తర్వాణిపేరు జెప్పి మోసగించువాడు బయటబడినచో నాతని శరీరాత్మలు రెండును కూడ నశించిపోవును.

విమర్శకులు యుదారహృదలగుయుటచే నేను మోస గించుచున్నా ననిమాత్రము చెప్పుట లేదు. కాని యేదో భ్రాంతిలోబడి నేను ప్రవర్తించుచుండ వచ్చునని సూచించు చున్నారు. వారు సూచించినదే నిజమైనచో, దానివల్ల నాకు గలుగు ఫలితమునకును బుద్ధిపూర్వకముగా నంతర్వాణిపేరు చెప్పి మోసగించినచో, నాకు గలుగుఫలితమునకును విశేష భేదముండదు. అల్పజ్ఞుడగు నావంటివాడు, సత్యాన్వేషణ

మొనర్చుపట్ల చాల జాగరూకతతో నుండవలయును. మన స్థైర్యము చెడకుండ జూచుకొనవలయును. పరమేశ్వరు డాత నికి దారిజూపుటకు ముం దాతడు తన యహంభావమునెల్ల చంపుకొని, వినమ్రుడైయుండవలెను. ఇది యిక విస్తరించను. ఈయంతర్వాణి నాకొక్కనికే యున్నదని గాని, అసామాన్య మైన దని గాని చెప్పను. భక్తితో, పూర్ణముగ భగవదాధీ నము గావించుకొనినవారి నాతడే పాలించును. పరిపూర్ణ నిష్కాములగు వారివలననే భగవంతుడు కార్యసాధనగావిం చుకొనుచుండు నని గీత చెప్పుచున్నది. ఇక్కడ భ్రమ కావచ్చు నన్న ప్రశ్నకు తావు లేదు. ఇది శాస్త్రసిద్ధమును, సర్వసామా న్యమునగు సత్యము. అందులకు వలయు లక్షణముల బడయు టకు కావలసిన యోపిక, యిచ్ఛగలవా రందరీసత్యమును పరీక్షించుకొనవచ్చును. ఆలక్షణముల జెప్పినచో నంత సుల భములా యని దోచును. అవి యలవరచుకొనుటకు బహు సులకమైనవి. దృఢనిశ్చయమున్నచో జాలును.

ఇంతకును నన్నుగురించి యీవిషయములో నెవ్వరును చింతపడనక్కర లేదు. నేను ప్రజలనే 'చేయుడని' కోరుచున్న దెల్ల బుద్ధినుపయోగించి పరీక్షించుటకు శక్యమైనదే. నామ రణానంతరముననైననస్పృశ్యతనురూపుమాపవలసియుండును. ఈయుపవాసము భగవత్ప్రేరితమైనను, గాకున్నను, దానిని గూర్చి నాయాప్తమిత్రులు కూడ విచారింపబని లేదు. వారికి

నాయందు గల ప్రేమవల్ల నీయుద్యమాభివృద్ధికి ద్విగుణీకృతోత్సాహముతో పనిచేయవచ్చును. అప్పుడీయుపవాస దీక్ష మూర్ఖపుపట్టుదల గల నొకస్నేహితుని యవివేక కార్యమని తెలియవచ్చినను ఆపద లేదు. నాయందు నమ్మకముగాని, ప్రేమగాని లేనివారు దానివల్ల నే మాత్రము చలింపరు. కావున రానున్న నాయుపవాసమును గూర్చియు, నావ్రతము బూనుటకు నాకున్న యర్హతను గూర్చియు, నితరంతము పాటు బాటుటవల్ల ప్రజల మనోదృష్టులు వారు సాధింపవలసిన మహత్కార్యముమీద కేంద్రీకరింపబడక యన్యథాపోవచ్చును. అందుచే నాయొద్దనున్న యుత్తరములకట్టలలోనుండి కొన్ని విషాదకరమగు దృశ్యములను పాఠకులకు చూపి యీ ప్రకటనను ముగించెదను.

"విల్లేపార్లే" లోని యీదృశ్యమును చూడుడు! "విల్లేపార్లే" బొంబాయిలోని యొకపేట. ఇందు చాలధనవంతులగు హిందువులు నివసించుచున్నారు. ఇతర చిన్నచిన్న యిండ్లమాట యటుండనిచ్చినను, దీనిలో 17,000 భవనములున్నవి. పురపాలకసంఘమునకు సాలునకు రు 70,000 ఆదాయమువచ్చుచున్నది అందులో రు 31,000, పురపారిశుద్ధ్యమున కుపయోగింపబడుచున్నవి. పాకీవాండ్లున్నచోట రోడ్లు లేవు. మంచినీటి వసతి లేదు. పరిశుభ్రతకు తావు లేదు. వారున్న

పాకీవాండ్రగతి

చోట భూమి చాలపల్లముగానున్నది. వారియిండ్లు పాకీపని కొకప్పు డుపయోగించినపాత రేకు లడ్డముపెట్టిన గుడిసెలు. దీపముల యేర్పాటులేదు. వారియిండ్లసమీపమునందే యీ పేటలోని చెత్తను తీసికొనివచ్చి పడవేయుదురు. ఆచెత్త నుండి యపారమైనదుర్వాసన పుట్టుచుండును. దానిదగ్గరనే యాతుక్కును తీసికొనివచ్చుమోటారులారీలనుంచెడి చావడి యున్నది. అందు మురికిడబ్బాలను కడుగుట కొకకొళాయి యున్నది. అచ్చటనుండు ఓవరుసీరునకు దయవచ్చినచో పాకీ వాండ్ర కా కొళాయినుండి నీరుపట్టుకొనుటకు వీలగును. అవ తలవైపున ఊరిలోని పాకీదొడ్లనుండి తీసుకువచ్చిన మలమును పడవేయుటకు బండ్లు వరుసగా నున్నవి. ఇట్టి పరిసరముల లోనే పాకీవారు తమ జీవితములను గడుపవలసియున్నది. ఈయిండ్లచుట్టును పొలములున్నవి. ఆపొలములలో సర్వసా ధారణముగ నీరుండును. అందువల్ల దోమలు, తేళ్లు, పాము లు, ఎలుకలువారిని బాధించుచుండును. ఇట్టి స్థితిగతులలోనే ముప్పదియొక్కకుటుంబములవారు నివసించుచున్నారు. అందు 35 గురు పురుషులు 20 మందిస్త్రీలు, 34 గురుబాలురు, 15 గురు బాలికలు గలరు. ఈనూట తొమ్మండుగురలోను 9 గురుపిల్లలుమాత్రమే అతికష్టముమీాద చదువగలరు. వ్రాయగలరు. మిగిలిన వారందరు అక్షరజ్ఞానశూన్యులు.

ఈపేటలోనుండు వారన్ననో తమతోడి మానవులగు నీపాకీవారల విషయమాలోచించిన చాలు—తక్షణమే వారు నివసించుటకు శుభ్రమగు ప్రదేశములలో స్థలముల నిచ్చి, పట్టణవాసుల కందరకును లభ్యమగునట్టి యితర సౌకర్యములతో పాటు, మంచినీటికిని, దీపములకును వలయు సదుపాయములు చేయగల ధనవంతులు. ఇక్కడ సనాతన ధర్మావలంబకులకును, సంస్కర్తలకును కూడ చేతినిండ పనిగలదు. "విల్లేపార్లే" పురపాలకసంఘమునకు వచ్చు రు 70 వేల ఆదాయములో రు. 31 వేలు పురపారిశుద్ధ్యముననే వెచ్చింపబడుచున్నవని చెప్పినచో చాలదు. సంఘమున కతిప్రయోజనకారులైన యీసేవకులకొరకు మరికొంతపన్నును భరించగల శక్తి "విల్లేపార్లే" నివాసులకున్నదని నాకు తెలియును. కాని యది చాల నెమ్మదిగా జరుగుపనియని నాయభిప్రాయము. కావున అక్కడ నివసించుచున్న హిందువులందరు తక్షణమే చందాలు వేసికొని యీపాకీవారలకు మంచివసతిస్థలములతో పాటు యితరసదుపాయములను చేయవలెను. అట్లు చేయుట వారివిధి. తోడిమానవులకు వారు చేయవలసిన సహాయమునందదియణుమాత్రమే చేసినట్లగును. పిమ్మట పాకీవాండ్లు సుఖజీవనము గావించుటకు వీలగునట్లు చేయుమని సదుపాయముల కగు ఖర్చును భరించవలసిన దని పురపాలక సంఘము నడుగుటకు వారర్హులగుదురు.

అఖిలభారత యస్పృశ్యతానివారణసంఘకార్యదర్శి గారగు శ్రీ థక్కర్ గారు సంఘముతరఫున సంచారమొనరించుచున్నారు. అక్కడక్కడ పాకీవాండ్లు నివసించుప్రదేశములు వారాయన చూచిరి. ఆయనచూచినవాటినిగురించి యింత విషాదకరమగు దృశ్యమునే చిత్రించుచున్నారు. బీహారురాష్ట్రములో పాట్నా, దానాపూరు మున్నగుపట్టణములలోని పాకీవాండ్ర స్థితిగతులను గురించి హృదయవిదారకమైన కథలనే చెప్పుచున్నారు. అస్పృశ్యతను శాస్త్రము లంగీకరించునా యంగీకరించవా యను వ్యర్థచర్చలతో కాలముగడుపక, మనమందరము నీయస్పృశ్యు లనబడువారి దుస్థితిని బాపుటకు ప్రయత్నించుచున్నచో యెంతబాగుండును! హరిజనోద్ధరణ యందు తమకధికాసక్తిగలదని నమ్మబలుకుచున్న విద్వాంసులగు నీవిలేఖరులందరును చేయుటకు కావలసినంత పనిగలదు.

---

౬

జనవరి యొకటవ తారీఖు సమీపించుకొలది గురువాయూరును గురించి నాకు వచ్చుచున్న లేఖలు అధికమగుచున్నవి. వాటిలోని యొక్కొక ప్రశ్నకే సమాధానము చెప్పుటకుబదులు తద్విషయమై నా యభిప్రాయములనన్నిటిని యీ ప్రకటనలో విశదీకరించుట సులభమగుపనియని తలంచెదను.

తొమ్మిదవ పత్రికటన. 28-11-32.

జనవరి రెండవ తేదీలోపల గురువాయూరు దేవాలయములోనికి, సవర్ణులు పోవునట్లే హరిజనులుకూడ పోయి, భగవద్దర్శనము చేసికొనుటకు గల యభ్యాంతరములు తొలగింపబడనిచో నే నుపవాసము ప్రారంభింతును. కాని యీ దేవాలయముచుట్టుపట్లగల సవర్ణహిందువులలో చాలమంది హరిజనులు దేవాలయప్రవేశ మొనర్చుటకంగీకరింపక పోయినను, లేక వారెల్లరును అంగీకరించినప్పటికిని హరిజనులను దేవాలయములోనికి రానిచ్చుటకు అడ్డమువచ్చునట్టిదియును, జనవరి రెండవ తేదీలోపుగ దిద్దుబాటుచేసికొనుటకు వీలుగానిదియు నగు శాసనసంబంధమగు చిక్కు తటస్థించినను, నాయుపవాస దీక్ష యాగిపోవును. అనుదినము దేవాలయమున కేగు ప్రజలలో చాలమంది హరిజనులు దేవాలయప్రవేశ మొనర్చుట

గురువయ్యూరు సంస్కర్తల కర్తవ్యము.

కనుకూలముగనున్నారని నాకువచ్చు లేఖలలో నధికాంశములం చెప్పుచున్నవి. ఒకరిద్దరు వి లేఖరులుమాత్రము అట్లుగాదనియు, సరిగా ప్రజాభిప్రాయమును గనుగొనమొదలిడి ఓట్లు పుచ్చుకొనినచో దేవాలయప్రవేశమునకు ప్రతికూలముగ నెక్కువ ఓట్లు వచ్చుననియు, వ్రాయుచున్నారు. కాని వారిట్లు దేనిపై నాధారపడి వ్రాయుచున్నారో తెల్పుటలేదు. తక్కినవారు తమకు తోచినవిధమున ప్రజాభిప్రాయమును తెలిసికొంటిమనియును, ప్రజలు దేవాలయప్రవేశమున కంగీకరించుచున్నారనియును వ్రాసిరి. పూర్వాచారపరాయణు లంగీకరించినచో ఉభయపక్షములవా రెన్నుకొనిన మధ్యవర్తులసమక్షమున వెంటనే మరియొకసారి యీవిషయమై ప్రజల ఓట్లను తీసికొనవచ్చును.

క్రిందటి శనివారమునాడు "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రికావిలేఖరి ప్రశ్నలకు సమాధానముగ నేను సూచించిన పద్ధతియెల్ల నిక్కడ మరల వ్రాయను. ఎట్లైనను, కాదనుటకు వీలులేని ఆధారములను చూపి, సంస్కర్తలు తమ వాదమును నెగ్గించుకొనుటలో ఆలస్యమును చేయరాదు. దేవాలయమున కనుదిన మేగు సవర్ణహిందువులెల్లరు తమ కనుకూలముగనున్నను, దేవాలయపు తాళపుచెవి జామరిన్ గారిచేతిలో నున్నదని సంస్కర్త లనుచున్నారు. కొంతవరకది నిజమే—కాని యది జామరిన్‌గారి సొంతదేవాలయము

కాదు. దేవాలయమునకు పోవువారితరఫున ఆయనధర్మకర్త. అందుచేత వారిలో మెక్కువమంది కోరుదానిని ఆయనకా దనజాలరు. చట్టసంబంధములగు చిక్కులున్నచో వాటినిసర్దు కొనుటాయన విధి. ఆయన యట్లుచేయకున్నచో ఆయన విధి యని తేలినదానిని ఆయనచేత చేయింపగలిగినంత బల ముగా ప్రజాభిప్రాయము లేదన్నమాట. కావున నాయుపవాస మాప్రజాభిప్రాయమును దృఢతర మొనరించి, దానిబలమును చూపించును. అందుచే దీని కీలకము ప్రజలచేతులలోనే గలదు. కాని నీతిశాస్త్రములో చెప్పినట్లు, నీతిధర్మములు జాగరూకులైయున్నవారికి సహాయకారులగును కాని, జడు లకుకాదు. అందుచే కేరళదేశ సంస్కర్తలు జామరిన్ గారిని నిందింపకుందురుగాక! ఆయనకు ఏవో దుష్టభావము లారో పించుట గౌరవమైనపనికాదు. అది శుద్ధతప్పు. హరిజనులు దేవాలయప్రవేశ మొనర్చుట కాయన యంగీకరింపకపోయిన చో ప్రజాభిప్రాయ మందులకు అనుకూలముగ నున్నదని ఆయనకు విశ్వాసము పుట్టలేదనియే తలంచెదముగాక! ఆయన నిరాకరించినచో నది మన లోపముల తెలుసుకొనుటకు చిహ్నముగావలెనుకాని ఆయనను తిట్టుటకుకాదు స్పష్టముగా తమ యభిమతమును వెలిబుచ్చినచో తమప్రతినిధియగు జామ రిన్గా రది కాజాలదని ప్రజలు తలంచునట్లు చేయుటయే మిగుల గాంభీర్యమును సముచితమును అగు పద్ధతి యగును.

అప్పుడే గురువయ్యూరు సమస్య అఖిలభారతసమస్యయైనది. భారతదేశమునందు వివిధప్రాంతములలో గల సవర్ణ హిందువు లెల్లరు మేల్కాని హారిజనులను గురువయ్యూరు దేవాలయములోనికి రానిచ్చుట తమ కంగీకారమే యని ప్రకటింతురుగాక! స్వేచ్ఛగను, నిష్కల్మషముగను అట్టి ప్రకటనల గావించినచో వాటినైతికశక్తి నిరోధింపవీలు లేనిదగును.

సనాతనధర్మావలంబకులను, లేదా (రాజప్రతినిధికి వారు చేసిన విజ్ఞాపనలో చెప్పుకొనినట్లు) పూర్వాచారపరాయణులను, సంఘసంస్కర్తలు దూషింపరాదని యిదివరకే హెచ్చరించియుంటిని. వారి యిష్టమైన యభిప్రాయములు వారికి ఉండవచ్చును. అస్పృశ్యతానివారణసమస్యను ధార్మిక సమస్యగనే నేను మొదటినుండి యెంచుచున్నాను. ఒకరి కొకరు దురభిప్రాయము లారోపించుకొనకుండగనే సంస్కర్తలును, పూర్వాచారపరాయణులును ధర్మబుద్ధితో ప్రవర్తింపవలెనని గోరుచున్నాను. ఎట్టి సంస్కరణములనైనను, అందులో ముఖ్యముగా ధర్మసంబంధమగు సంస్కరణములను యింకొకరని నిర్బంధించి కొనసాగింపరాదు. ఈనాయుపవాసముయొక్క ఉద్దేశములను, నిబంధనలను యిదివరకే విస్పష్టమొనరించియుంటిని.

ఒకవిలేఖరి గుజరాతీభాషలో నాకిట్లు వ్రాయుచున్నాడు. "మీ రెవ్వరిని నిర్బంధింప నెంచలేదనుట బాగుగనే

యున్నది. కాని మీపదవి కొందరిని వారియిచ్ఛకు విరుద్ధముగా ప్రవర్తించునట్లు బలవంతపెట్టుచున్నది. మాలో కొందరికి మీ ధర్మబోధలన్నను, మీ సంఘసంస్కరణమన్నను లక్ష్య మణుమాత్రమైన లేదు. అయినను రాజకీయరంగములో పనిచేయుటకు మీరు జీవించియుండవలెనని యే మేము కోరుచున్నాము. కాని మీరు ఉపవాసమున ర్చెదనని పట్టుపట్టినచో, మాయభిప్రాయములమాట తలపెట్టక మీ దేవాలయ ప్రవేశోద్యమములో మేముకూడ చేరవలసివచ్చును. ఇదియే నిర్బంధముగాకున్నచో అమాటకర్థమేమియో మాకు తెలియదు." ఇందులకు నాసమాధానమిది:—భారతదేశప్రజలయందు నే నున్నతస్థానమును బడసియుండుటవల్లగాని, రాజకీయములలో నాకు కొంత పలుకుబడి యుండుటవల్లగాని, నే నతిముఖ్యముగా పరిగణించు నావిశ్వాసములను వీడుదునని యెవ్వరుఁను తలంచగూడదు. రాజకీయరంగములో నాకుగల పలుకుబడిని నిలుపుకొనుటకును, సంఘములో నాకుగల గౌరవపదవిని పోగొట్టుకొనకుండుటకును, నాధర్మవిశ్వాసములను దాచుకొనజాలను. వాటిని అమ్మివేయజాలను. నాకు నావిశ్వాసములను మించినదేదియును లేదు. మిగిలినదెల్ల వానికి లోబడియే యుండును. మీనుమిక్కిలి వానినుండియే నావిధులన్నియు పుట్టుచున్నవి. నావిశ్వాసముల వదలివేయుమనిగాని, వాటిని అణచివైచుకొనుమనిగాని చెప్పుట, నన్ను

ఆత్మహత్య గావించుకొనుమని చెప్పుటకంటెను ఘోరమై నది. ఎవరైన తమ విశ్వాసములను వారికి నాపదవియెడల గల గౌరవమునకును, నారాజకీయమగు పలుకుబడికిని, బలి యిచ్చినచో వారికసలు ధర్మవిశ్వాసములు లేవని చెప్పసాహ సించుచున్నాను. ఒకవేళ యుండినను దృఢమైనవి కావని నా ఉద్దేశము. ధర్మవిశ్వాసములు చాల బలిష్ఠమైనవి. తాము నమ్మినవాటికొరకు జనులు తమ సర్వస్వము ఫణముగానొడ్డిన గాథ లనేకములుగలవు. అట్టి దృఢవిశ్వాసములనే మత మందురు.

అని లేఖరియే మరల నిట్లు వ్రాయుచున్నాడు. "పాప మా జామరిన్‌గారేమిచేయగలరు? ఒకవంకమీరును, కేళ ప్పన్‌గారును ఉపవాసదీక్ష బూననున్నారు. ఇంకొకవంక పూర్వాచారపరాయణు లొకవేయిమంది ఉపవాసదీక్ష బూ నెదమనుచున్నారు. జామరిన్‌గారిందులో నెవరిని సంతృప్తి పరుపవలెను?" వానికి నేను వెనుకాడకుండ నిచ్చుప్రత్యుత్తర మిదియే:— "జామరిన్‌గారు ఇరుపక్షములలో నెవ్వరిని సంతృప్తిపరుపనక్కరలేదు. సత్యస్వరూపుడగు భగవంతునే ఆయన సంతోషపెట్టవలెను. ధర్మకర్తపదవియందుండుటవల్ల తన విధులను ఆయన సరిగా నెరవేర్చవలెను. అందులకు, వేయిమంది పూర్వాచారపరాయణులను, నన్ను, కేళప్పన్ గారినికూడ బలి యీయవలసివచ్చినచో నిస్సంకోచముగా

నట్లొనర్చుట కాయనకు ధైర్యముండవలెను. అట్లొనర్చినందుల కాయనను సమకాలికులును, రాబోవు సంతతులవారును కూడ అభినుతింతురు. ఉపవాసదీక్షలను బూనువారిసంగతి భగవంతుడే చూచుకొనగలడు. ఉపవాసదీక్ష బూనువారలు తాము సత్యమని నమ్మినదానిని రక్షించుకొనుటకే ఆదీక్ష బూనెదరు. కావున సత్యస్వరూపుడగు ఆ పరమేశ్వరుడే వారలను తన యిచ్ఛవచ్చినట్లు చేయగలడు. అంతరాత్మ ప్రబోధమే వారియుపవాసదీక్షలకు కారణమైనచో అదియే దానికి తగిన ప్రతిఫలమీయగలదు."

కాని ఆవిశేఖరియే యిట్లింకను వ్రాయుచున్నాడు. "ఈశ్వరుడు, అంతరాత్మ, అంతర్వాణి యని మీరు చెప్పుచుండుట బాగుగనే యున్నది. ఇతరులు కూడ నట్లే చెప్ప వచ్చును. కాని మావంటివారి గతియేమి? మాకు అంతర్వాణి లేదు. నలుగురిముందర ప్రదర్శించుటకు మీకున్నట్టి భగవంతుడు లేడు. మేము మీలో నెవ్వరిని విశ్వసింపవలెను?" దీనికి నే చెప్పగలిగిన దేమన:—"మీరు మిమ్ములనే నమ్ముకొనియుండవలెను. ఎవ్వరిమీదను ఆధారపడి యుండరాదు. అంతర్వాణిని వినుటకు మీరు ప్రయత్నింపవలెను. అంతర్వాణి యనుమాట మీకు అర్థముగాకున్నచో పోనిండు. బుద్ధి యనెడు దానికైనను మీరు తల యొగ్గవలసియుండును. నలుగురిముందర మీరు భగవంతుని ప్రదర్శింపకపోయినచో యిం

కొకదానిని ప్రదర్శింపవలసివచ్చును. అదియే భగవంతుడని తేలును. అదృష్టవశాత్తు యీప్రపంచములో భగవంతుడు దక్క యన్యమేదియును లేదు. అంతర్వాణి ప్రబోధముప్రకారము నడచుకొనుచున్నామని చెప్పువారందరకును ఆయంతర్వాణి ప్రభోధ ముండియుండదని నా మనవి. ఏలన, తక్కిన యన్నివిద్యలవలెనే సూక్ష్మమగు యీయంతర్వాణిని వినగల శక్తికూడ చిరకాలము సాధన చేయకయును, శిక్షనందకుండగను లభింపదు. బహుశః యితర విద్యల నేర్చుకొనుటకు కావలసినదానికంటె దీనికె యెక్కువసాధన మవసరమగు ననుకొందును. వేలకొలది మనుష్యులు యీవిద్య నభ్యసించితిమని చెప్పినను, అందులో ఏకొలదిమందియో ఋజువుచేయగలిగినను సరే- ఆకొలదిమందికొరకైనను మిగిలిన సందేహాస్పదులగువారియెడల సహనము చూపవచ్చును.”

ఇక్కడితో గుజరాతీవిలేఖరి కథపూర్తి అయినది. ఇంగ్లీషులోవ్రాసిన యొక విలేఖరిప్రశ్నకు జవాబిచ్చుటతో దీనిని పూర్తిచేసెదను. అతడు వ్రాసినది చాలపెద్దఉత్తరము. వాదోపవాదములతో నిండియున్నది. కాని యీక్రింద నేనిచ్చుసంగ్రహ మాతనియభిప్రాయములను సరిగా తెలుపును కొనెదను. “ఇంతవరకును మీకు ప్రత్యేకసంఘాభిమానము లేశమైనను లేదని నాకు తెలియును. కాని నేడు మీరు దానిలో పడిపోయిరి. మీరు స్వరాజ్యముకొరకుగాని

అఖిలభారతజాతీయైక్యతకొరకుగాని, యీ యుపవాసవ్రత ము బూనియున్నచో నాకర్థ మయ్యెడిది. మీ యుపవాస మును నేను సమర్థించి యుందును. కాని హిందూధర్మమునకై మీ రుపవాసదీక్ష బూనుటేమి ? నే నెన్నడు మిమ్ములను హిందువుడని యే అనుకొనలేదు. అందులో సంకుచితబుద్ధిగల హిందువునిగా కలనైన తలంచలేదు. వెళ్లుటకిష్టములేని హరి జనులు ప్రవేశించుటకు దేవాలయులను తెరచుటలో అర్థ మేమి ?"

ఈప్రశ్నచూచిన నాకానందమగుచున్నది. నాఅసలు స్వరూపములోనే గాని యింకొకవిధముగా కనబడవలెనని నాకెన్నటికిని లేదు. నేను హిందువుడననిగాని, నాధర్మము హిందూధర్మమనిగాని చెప్పుకొనుటకు నే నేమాత్రమును సిగ్గునొందను. నావి సంకుచితభావములను మాటను పూర్తి గా కాదనెదను. ఒక్క క్షణమాత్రమైనను, సంకుచితమైన ధర్మమేదియును, నన్ను తనలో నిముడ్చుకొనజాలదని నేను భావించుచున్నాను. అస్పృశ్యతయను మహాభారము హిందూ ధర్మమును, సంకుచితము చేయుచున్నది. కాబట్టియే నేను దానికి ప్రతికూలముగ తిరుగబడితిని. హిందూధర్మమునుండి అస్పృశ్యతాకళంకమును తుడిచివేయుటకు నా ప్రాణమును గడ్డిపోచవలె అర్పింపగలను.

నా హిందూధర్మము తనలో అన్నిటిని యిముడ్చు కొనును. కావున వాలో ప్రత్యేకసంఘాభిమాన మనునది లేదు. అది ఇస్లామునకు విరుద్ధముకాదు. క్రైస్తవమతమునకు విరుద్ధముకాదు. ఇంకేమతమునకుకూడ వ్యతిరిక్తమైనదికాదు. క్రైస్తవ,యిస్లాముమున్నగు సర్వజీవన్మతములకును, అనుకూలమైనదియే! నాకుచూడహిందూధర్మమొక మహావృక్షముయొక్క శాఖవంటిది. ఆమహావృక్షముయొక్క వేళ్లబలిమిని నిర్ణయించు టెట్లు? దాని వివిధశాఖల గుణావగుణములను బట్టియును వాటిసంయుక్తశక్తిని బట్టియును నిర్ణయింతుము. నన్ను పోషించుచున్నట్టియు, నేను కూర్చొనినట్టియు హిందూధర్మమను శాఖలవిషయమై నేను జాగ్రత్తపడినచో మిగిలినశాఖల విషయముకూడ జాగ్రత్తవహించునట్లే యగును. కాని హిందూధర్మశాఖలో విషక్రిములు ప్రవేశించినచో నవి క్రమక్రమముగా చెట్టంతయు ప్రాకిపోవచ్చును. కొమ్మయెండిపోయినచో అంతభాగ మామహావృక్షము బలహీనమైపోవును.

ఈ విలేఖరియును, యితనివలె తలంచువారును నా వ్యాసములను చదువుచుండినయెడల హిందూధర్మమని నేను దేనిని చెప్పుచున్నానో తెలిసికొనగలరు. ఆధర్మముకొరకు ప్రాణార్పణమొనర్చు సౌభాగ్యమే నాకు పరమేశ్వరు డొసంగినచో చాలును. దానివల్ల నేను సర్వజనైక్యతకొరకును,

స్వరాజ్యముకొరకును ప్రాణములర్పించితిననియే వీరికి తెలిసి రాగలదు.

ఇక నే నిదివరకు చెప్పినదానిని మరల నింకొకమారు చెప్పెదను. హరిజనులు దేవాలయప్రవేశ మొనర్పగోరు చున్నారా? ఒకవేళ వారు దేవాలయప్రవేశ మొనర్పరా దను ఆటంకము తొలగిపోయినచో వారు దేవాలయ ప్రవేశ మొనరింతురా? యనుప్రశ్నలు అసందర్భములు. అస్పృశ్యతా నివారణమన్న హరిజనులకేదో మెహర్బానీ చేయుటకాదు. అది సవర్ణులు ఆత్మశుద్ధికొరకు గావించుకొనవలసిన ప్రాయ చిత్తము హరిజనులను దేవాలయములలోనికి రండని వారు ఆ హ్వానించుట యందులో ఒకభాగము.

---

౧౦

'అస్పృశ్యతానివారణ సంఘ'మను పేరుతోనే శ్రీ వి. ఎ. షిండేగారిచే పూర్వము స్థాపింపబడినసంస్థ యింకొకటి గలదు. అందువల్ల అఖిలభారత అస్పృశ్యతానివారణసంఘము పేరు హరిజనసేవకసంఘమని తగినట్లు మార్చబడినది. ఈసంఘసమావేశమునకు హాజరైన నా మిత్రులొకరు వాదప్రతివాదములతో నిండిన ప్రశ్నావళి నొకదానిని నా కిచ్చిరి. సంగ్రహముకొరకు ఆప్రశ్నలలో ముఖ్యమగువానిని యీ క్రింద లేఖరూపమున యిచ్చుచున్నాను.

పదియవ ప్రకటన. 9-12-32.

"అస్పృశ్యతానివారణకొరకు యీసంఘము మీప్రోద్బలమువల్లనే యేర్పడినది. ప్రచారకులు పనిచేయవలసిన మార్గమును మీరే గన్పరచవలెను. మొట్టమొదట నాకు తోచు ప్రశ్నయిది- ప్రచారకులు యెట్లు భావించుకొనవలెను? అస్పృశ్యులను ఉద్ధరించుటకు బయలువెడలిన సంస్కర్తలవలెనా? లేక ఆత్మోన్నతికొరకు పాటుపడువారలుగనా? ఆత్మోన్నతికొరకు పాటుపడుచున్నట్లు యెంచుకొనవలెనన్నచో సవర్ణులలోనే యెక్కువ ప్రచారము జరుగవలెననుట ముఖ్యముకాదా? అయినచో నాపని యెట్లు జరుగవలెను?"

ప్రచారకుల మనోభావములు.

ఇది చాలపెద్దప్రశ్న. ఈ మిత్రుడడిగిన సర్వవిషయములకు జవాబు నియ్య ప్రయత్నించెదను. సవర్ణులు పాపులనియును, అస్పృశ్యులని పిలువబడువారియెడల మహాపాపమొనర్చిరనియు ననేకమారులు చెప్పియుంటిని. అస్పృశ్యుల ప్రస్తుతస్థితికి సవర్ణులే కారకులు. కావున, వారు పశ్చాత్తాపపడి, హరిజనులశిరస్సులనుండి యీ యస్పృశ్యతామహాభారమును తీసివేయవలెను. అట్లు చేసిన తక్షణమే హరిజనులలోకూడ పూర్తిగామార్పుగలుగును. చిరకాలమునుండి వచ్చుచున్న వారిదురలవాటులను, మరుక్షణముననే వారు వదలిపెట్టుదురని నేను చెప్పుటలేదు. కాని వారు కూడ తమ దురభ్యాసములనుండి తప్పించుకొనుటకు ముమ్మాటికిని ప్రయత్నించెదరు. దానికితోడు ప్రతిచోటను చాలమంది సవర్ణులు హరిజనులకు వారిప్రయత్నములలో సహాయముచేయుదురు. ఒకప్పుడు అణచివేయబడిన వారలు మరల తాము తమ కుటుంబములో చేరుచున్నామను ఉత్సాహముతో యింతకాలమునుండి తప్పుదిమియుంచిన వారలను చేరబోవ, వారలు పూర్వపుచరిత్రను జరుగనట్లె భావించి హృదయపూర్వక స్వాగత మిచ్చిన యెట్లుండునో నాకు ప్రస్తుత మస్పృశ్యుల సమస్యకూడ యట్లే తోచుచున్నది. పైనచెప్పినట్లు జరుగుటకింకను కొంతకాలము ఆగవలెనని నాకు తెలియును. ఆమాట నాకు బాధాకరముగనున్నది. కాని యెప్పటికైన యట్లు

జరుగవలెనన్న, మనలో కొందరైన సరియైనదృష్టితో యీ సమస్యను యెదుర్కొనవలెను. విశాలదృష్టిగల ప్రచారకుల లోనే కొందరుహరిజనులు తమ దురభ్యాసముల నువీడి,విద్యావంతులై, పరిశుభ్రజీవనముల గడపుచున్నప్పుడే అస్పృశ్యతను తీసివేయవలెనని చెప్పుచుందురు. అది నాకు తెలియును. కాని వీరొక్క సంగతిని మరచి పోవుచున్నారు. అస్పృశ్యత యున్నంతకాలము హరిజనులు కావలెనన్నను, ప్రచారకులు కోరునట్లు చేయలేరు. విద్యావంతులై, పరిశుభ్రజీవితముల గడపు హరిజనులనుకూడ గౌరవముగను, తమతోసమానముగను సవర్ణులు చూచుటలేదని వీరికి తెలియదు. ఆ హరిజనులకు కావలసిన సామాన్యసదుపాయములుగాని, అనుదినము సవర్ణులతో కలసిమెలసి తిరుగుటకు అవకాశములుగాని లేవని యీప్రచారకులు మరచిపోవుచున్నారు.

హరిజనులై వారు పుట్టుటయే వారికి యావజ్జీవదాస్యశిక్ష విధించుటకాక గొప్ప కారణమై పోవుచున్నది! వారు తమయలవాటులను మార్చుకొనినను, లేక యింకేమిచేసిననుసరే, ఆశిక్షమారుటలేదు. అందుచేత యిప్పటికంటె పరిశుభ్రముగ నుండుటకు వారికి ప్రోద్బలకారణములు లేవు. ఏమిచేసినను లాభములేదన్నభావము వారిమనస్సులలో నాటుకొనిపోయినది. ఈజీవితములోనైన తమ కష్టములు పోవునని వారు ఆశపడవచ్చును. తాము మనుష్యులమన్న

భావమును వారికి పుట్టించుటకును, మానవజన్మమెత్తుట యొకమహాభాగ్యమని వారికి తెలియునట్లు చేయుటకును, ఒక్కటే మార్గము కలదు. సవర్ణహిందువులు వారలను మరతుశేషు విధింపకుండ తమలో కలుపుకొనుటయే. అట్లు తమలో కలుపుకొనినప్పుడే వారిలో నేదైన గొప్పమార్పు గలుగుట కవకాశమున్నది. అందుచేత, తుపానువంటి తీవ్రతర ప్రచారము గావించి, అస్పృశ్యతానిర్మూలనానుకూలముగ వారిభావముల మార్చుటే కార్యక్రమములోని ప్రథమాంశమగును.

ఈపని, యస్పృశ్యతానివారణకరపత్రములతో దేశమునుముంచి చేయుటవల్లను, ప్రతిసవర్ణహిందువుని వ్యక్తిపరముగా కలసుకొని ప్రచారముచేయుటవల్లను, కాగలదు. అసత్యమువలెనే అస్పృశ్యతకూడ పాపమని నలుగురకు సులభముగా తెలియువిషయ మనిమే నాయుద్దేశము. దీనికి శాస్త్రాధారములతో పనిలేదు. అయినను, పుట్టుకచేతనే జనులు అస్పృశ్యులగుదు రనుదానిని సమర్థించుటకు శాస్త్రములను చూపించు పండితు లనేకులు బయలుదేరుటవల్ల ప్రచారకులు సంస్కరణ కనుకూలమైన శాస్త్రములతో సిద్ధముగ నుండవలెను. నేడు ప్రజలందరును నమ్మి గమనించుచున్న రీతిని యస్పృశ్యతను గమనింపవలసిన దని శాస్త్రములం దెక్కడను లేదని దృఢముగా చెప్పుపండితులు నానాటికిని దేశములో

వృద్ధినొందుచున్నారు. ఈపనిని అవమానములను లక్ష్యపెట్టక విపక్షులవాదనలను ఓపికతో విని, సమాధానముల చెప్ప గల సచ్ఛీలురగు ప్రచారకుల కప్పగించవలెను.

ధార్మికసంస్కరణోద్యమములందు దౌర్జన్యమున కెంత మాత్రమును తావులేదు. ప్రత్యేకముగా వ్యక్తులను కలసి కొని సంస్కర్తలు ప్రచారము చేయునప్పుడు సవర్ణహిందువులలో అధికసంఖ్యాకులు అస్పృశ్యతను పాపముగ పరిగణింపక, తన్నివారణ

దౌర్జన్యమునకు తావులేదు.

కును, హరిజనోన్నతికిని ప్రతికూలురైనట్టుల వారికి తెలియ వచ్చినచో, ఆసంస్కర్తలు తమగతిని తామే చూచుకొన వలెను. అంతట వారు ప్రజలపై కినుకబూనక, శాంతముగ, తమ్మెదుర్కొనుకష్టముల భరించుచు, తాము ధర్మమార్గము నందున్నట్లును, ప్రజలలో నధికసంఖ్యాకు లధర్మమార్గము నందున్నట్లు చూపించవలెను. హరిజనులకు లేని సదుపాయ ములను, సౌకర్యములను తాముకూడ వదలిపెట్టి వారితో కలసిమెలసి జీవించుటవల్లనే వారట్లు చూపించగలరు. చాల మంది స్త్రీపురుషు లీరీతి త్యాగ మొనర్చినచో నది హరి జనులలో ఆశయు ఆత్మగౌరవాసక్తియు, కలుగ చేయును. తమ యౌన్నత్యమునకై తామే పాటుపడుటకు వారికి ఉత్సా హమును, ధైర్యమును గలిగించును. హరిజను నొక్కనినైన తమకుటుంబములో వానిగనో లేక కడకు సేవకునిగనో సవ

ర్ణులు తీసికొనునట్లు వారలను ప్రచారకులు ప్రోత్సహింపవ లెను. వార లిది చేసినచో చాలును. ఒక్కడైన అతిథిలేనిదే భోజనము చేయకూడదను పురాతనాచారము హిందువులలో గలదు. ఈరోజులలో నిది తారుమారైనది. ప్రతిరోజును చేయవలసిన పంచయజ్ఞములలో నొకటిగ అతిథిపూజ వర్ణింప బడినది.

మనతో పాటు భోజనముచేయుటకు హరిజను నొక్కని ఉంచుకొనుటకంటె యీయజ్ఞమొనర్చుటకు మంచిమార్గ మింకొకటి నాకు తోచుటలేదు. వర్ణాంతరభోజనములతో దీనినికలపివేయరాదు. ఒకరి ఆహారము నింకొకరు ముట్టుకొని వారితో కలిసి భోజనముచేసినచో నది వర్ణాంతరభోజనమని నాయుద్దేశము. కాని ఒకయింటిలోనే ఒకరినొకరు స్పృశింప కుండ కలసిభుజించుట వర్ణాంతరభోజన మనిపించుకొనదు. హరిజనులమీదనుండి యీ అంటరానితనమును తొలగించి నచో వారితరకులస్థులవలెనే కుటుంబమందరితో కలిసి భుజించుట కభ్యంతర ముండజాలదు. సవర్ణులయిండ్లలో యనేకవిందులు, ఉత్సవములు కార్యములు జరుగుచుండును. వాటికి హరిజనులను పిలువరు. వారియిండ్లలోగల కుక్కలు, గొడ్లు మున్నగునవి వారి విచారమునందును, సంతోషము నందును పాల్గొనవచ్చును. కాని హరిజనులుమాత్రము పనికి రారు. ఒకవేళ వారిని కూడ పిలిచినప్పటికిని యితరులనుండి

వారు వేరని చూపించుటకు మాటిమాటికి "దూరము"ని కేక లిడుచుందురు సవర్ణులు యీపాపనిముక్తు లగుటకు వారిలో జరుగవలసిన ప్రచారమెట్టిదో కొన్ని నిదర్శనములనిచ్చి చూపించితిని. ప్రవాసమునకు పంపినయాతఁడు తిరిగి వచ్చినచో, యింటిలోని వారందరాతని నెల్లాదరించెదరో, ఆరీతిగనే సవర్ణులు హరిజనులలో ప్రచారము గావింపవలెను. అస్పృశ్యత పాపమనుభావము సవర్ణులకు పుట్టినంతనే వారు తాము దాతలమనియును, హరిజనుల కుపదేశకులమనియును తలంపరు. ఋణగ్రస్థుడొకడు తాను అప్పుపుచ్చుకొనినవానికడ కేగునట్లే వారంతటవారే హరిజనులకడ కేగుదురు. వినమ్రభావముతో హరిజనులపిల్లలకు చదువు చెప్పుదురు. తమకు సాధ్యమగునంతవరకును వారికి సహాయపడుచుందురు. ఈనిర్మాణ కార్యక్రమమును ఆచరణలో పెట్టుటకు పూనుకొన్నచో, చాల ఖర్చగుననియును, దానివల్ల ప్రస్తుత మేమంతలాభము లేదనియును కొందరు సూచించిరి. నిజమే; దీనిని ఎవరో కొందరు సంస్కర్తలు పూనుకొనవలసిన కార్యక్రమముగా భావించి యితరులు ఊరక చూచుచుండినచో ఫలితమదియే యగును. కాని దానిని సవర్ణులు ఆత్మశుద్ధికొరకు చేయవలసిన పనులలో నొకటిగ భావించినచో నదియిం కొకరూపు దాల్చును.

పండ్లనుబట్టి చెట్టు మంచిదగునో కాదో చెప్పుదురు. అట్లే సవర్ణులలో తగినప్రబోధము కలిగినదో లేదో ఫలితములవల్లనే నిర్ణయింపవలెను. కావున వారు పదిమంది హరిజనులను ముట్టుకొంటిమని గాని, లేక యేదో యొక హరిజనునకు భోజనము పెట్టితిమని గాని చెప్పినచో చాలదు. హరిజనులయందు వారికి పుట్టిన యీ క్రొత్తప్రేమ వారిచే శక్తివంచన లేకుండ సర్వవిధముల హరిజనులకు వారు తోడ్పడునట్లు చేయవలెను. ఎంతచెప్పినను హిందూసంఘములో నూతనప్రబోధము కలిగినదన్న భావము హరిజనులకు పుట్టవలెను. ప్రతి కార్యమునందును, ప్రతివృత్తిలోను సవర్ణులు వారితో కలసిమెలసి నడచుకొననిచో హరిజనుల కాభావము పుట్టజాలదు. జనులందరిలోను బాగుగా ప్రబోధముకలిగిన నిర్మాణకార్యక్రమమున కంతఖర్చు అవసరముండదు. స్థానికులగు స్వచ్ఛందసేవకులు జీతములు లేకుండగనే తమతమ స్వస్థానములలో పనిచేయుదురు. ప్రజలలో సరియైన ప్రబోధము కలుగనిచో నిర్మాణకార్యక్రమమును కొనసాగించుభారముకూడ ప్రచారకులనెత్తిమీద పడును. కావున త్వరలో నెరవేరినను, లేక చిరకాలముపట్టినను, ఎక్కువధనము ఖర్చుఅయినను, కాకపోయినను యీనిర్మాణకార్యక్రమము 'హరిజనసేవకసంఘము' పెట్టుకొను కార్యక్రమములో నొకభాగము కావలయును. ఆసంఘము రోగులగు

ప్రబోధము.

హరిజనులకందరకును వైద్యసహాయము చేయలేకపోవచ్చును. కొందరకు చేసినను సరే అదిగణనీయమగు సంశమేయగును. ఆసంఘము ముందుముందు చేయగోరుపని కది విఘ్నేశ్వర పూజయే యగును. అదియునుగాక, దేశకాలానుగుణ్యముగ వచ్చిన యీమహాసంస్కరణ నెంతవరకు సవర్ణులర్థము చేసికొనిరో వారలిచ్చుచందాలను బట్టియే తెలియగలదు.

ఈ కార్యక్రమములో దేవాలయప్రవేశము ముఖ్యస్థానము వహించును. ఏలన దేశమునందలి వివిధప్రాంతములలో హిందువులందరికొరకును గట్టిన దేవాలయములన్నిటిలోనికిని హరిజనులను రానిచ్చినచో తమకు మంచిరోజులువచ్చినవన్న భావము వారికి తక్షణమే కలుగును. ఒకప్పుడు సంఘములోనుండి వెలివేయబడితిమన్న మాటనే వారు మరచిపోవుదురు. దేవాలయములో నలుగురితో కలిసితిరుగుటయే వారి జీవితములను పూర్తిగ మార్చివైచును. తమ దురభ్యాసములను వారు వదలిపెట్టుదురు నావిలేఖరులలో కొందరు నాకిట్లు వ్రాసిరి.

**దేవాలయ ప్రవేశము.**

"దేవాలయములకు నేడేమి విలువగలదు? అవి పేరునకు మాత్రమే. నిజమున కవిగుహాలు. వాటిలో జరుగు దుర్మార్గకృత్యములకును, అన్యాయములకును అంతములేదు." నాముందర నొక పత్రికగలదు. అందులో నొక స్త్రీ వ్రాసిన ఉత్తరము ముద్రింపబడినది. ఒక సుప్రసిద్ధ దేవాలయములో

జరుగుచున్న దురంతములను ఆమె వర్ణించెను. అవి యెంత వరకు సత్యములో నేను చెప్పజాలను. కాని ఒక్కమాట మాత్రము నిజము. దేవాలయములు మొట్టమొదట కట్టిన రోజులలో నెట్లుండెడివో నేడుమాత్రి మారీతిగ లేవు. దేవాలయసంస్కరణ మనునది యొక ప్రత్యేకవిషయము. దేవాలయములు పాడైపోయినవన్న సంగతి హరిజనులను వానిలోనికి రానీయకుండుట కొక కారణముగ చెప్పరాదు. దేవాలయములకుపోవు బీదవారనేకులకు అక్కడ జరుగుచున్నవని చెప్పబడు దుర్మార్గకృత్యములసంగతి తెలియదనియును, వారినవియెంతమాత్రి మంటుటలేదనియును, నాకు తెలియును. గొప్పదేవాలయములమాట యెట్లున్నను, పల్లెటూళ్లలోగల దేవాలయములపరిస్థితు లంత చెడిపోలేదనుటకు సందేహములేదు. అవి యిప్పటికిని గ్రామస్థులకు దేవాలయములుగనే యున్నవి. వారి నిత్యజీవితమునందవి కలసిపోయినవి. దేవాలయప్రసక్తిలేని దొక్కటియును వారి జీవితములో కనుపింపదు. బిడ్డ పుట్టినను, పెండ్లియైనను లేక ఎవరైన మృతినొందినను వారు దేవాలయమునకు పోకతప్పదు. పరిస్థితులట్టివైనప్పుడు దేవాలయములోనికి హరిజనులను రానిచ్చుట చాల అవసరమేయగును. కాని యింకొక విలేఖరి ఇట్లు వ్రాయుచున్నాడు. "హరిజనులు పరిశుభ్రత మున్నగు నియమములను పాటింపవలెనని మీరు నొక్కి చెప్పకపోయినచో యిదివరకే పడిపోవుచున్న దేవాలయముల పేరు ప్రతిష్ఠలు యింకను నాశనమైపోవును." అంతటి విపత్తు సంభవిం

చునని నేననుకొనను. దేవదర్శనమునకువచ్చు తదితరహిందువులకు వర్తించని నియమ మేదియును హరిజనులకుండరాదనియే నేచెప్పినది. అస్పృశ్యత పుట్టుకవల్ల వచ్చునదిగాక, దుష్ప్రవర్తనవల్ల వచ్చునదిగా చేయవలెనని భగవాన్‌దాస్ గారు చెప్పిరి. దానికి నేనంగీకరించుచున్నాను. ప్రతివారికిని అంతఃశ్శుద్ధియున్నదో లేదో తెలిసికొనుట దుస్సాధ్యము. కాని బాహ్యాప్రవర్తన మిట్లుండవలెనని చెప్పుటకు వీలగును. ప్రపంచములో నేదేశమునందైనను సదాచారములుగల సంఘము మురికిగ నున్నవారిని వారట్లున్నంతకాలము అస్పృశ్యులుగా చూతురు. వారట్లు మురికిగానుండుటకు కారణమేదైననుసరే. అటులనే దురలవాటులుగలవారిని, స్నానము చేయక అపరిశుభ్రముగ నుండువారిని, త్రాగుమోతులను వారుబాగుపడనంతకాలమును అస్పృశ్యులుగా చూడవలెను. కాని పరిశుభ్రముగ లేరని కాని మరియేయితర పెడవాదములవల్ల కాని, హరిజనులను దూరముగనుంచక సవర్ణులు వారికి తాము చేసినహానికి పరిహారమొసంగవలెను. కావున వారికొరకు ప్రత్యేకనియమములను పెట్టక, యీసంస్కరణోద్యమము బయల్వెడలుటకు పూర్వమున్న నిబంధనలప్రకారమే హరిజనులను దేవాలయములలోనికి రానిచ్చుటయే ప్రప్రథమమున జరుగవలసిన కార్యము. హరిజనులకు సంపూర్ణస్వాతంత్ర్యమును కలుగచేసినపిమ్మట వలసినచో అందరకును వర్తించు రీతిని క్రొత్తనిబంధనలను యేర్పాటుచేసుకొనవచ్చును.

---

# హరిజనసమస్య.

## పంచమ ఖండము.

---

౧

తలనని తలంపుగా 1933 ఏప్రిల్ 30 వ తేదీ ఉదయమున యరవాడమందిరమునుండి గాంధీమహాత్ముడు యిట్లు ప్రకటించెను. "కొన్నిదినములనుండి నాహృదయములో నొక గొప్ప కల్లోలము బయల్దేరెను. నేను దానినణచివేయుటకు చాల ప్రయత్నించితిని. హరిజనసేవాదినము సమీపించెను. అంతట నాఅంతర్వాణి 'నీవింకను యేల శంకించెదవు' యని నన్ను ప్రేరేపింపసాగెను. నేను దానిని ప్రతిఘటించితిని. కానివ్యర్థమయ్యెను. కావున యెట్టిషరతులును లేకుండగను నిరంతరాయముగను 21 దినములు ఉపవాసము చేయుటకు నిశ్చయించుకొంటిని. మే 8 వ తేదీ సోమవారము మధ్యాహ్నం 12 గంటలకు ప్రారంభమై 29 వ తేదీసోమవారం మధ్యాహ్నం 12 గంటలకు ఉపవాసదీక్ష ముగియును.

అంతర్వాణి ప్రబోధము.

యిటీవల చరిత్రను సింహావలోకనము గావించినచో నతిపవిత్రములగు కారణములు ఎన్నియో నన్నియుపవాసము

నకు ప్రేరేపించుచున్నవి. అందుచే నేనింతతొందరగా ఈదృఢ నిశ్చయమునకు రావలసివచ్చినది. ఆకారణములు పరమ పవిత్రములైనవగుటచే వానిని వెల్లడింపజాలను అన్నియు మహత్తరమగు హరిజనసమస్యకు సంబంధించినవే. ఈ ఉప వాసదీక్ష నేను ఏవ్యక్తి నుద్దేశించియు ప్రారంభించుట లేదు. కాని తాముకూడ ఉపవాసదీక్షను బూనకుండ యిందులకు సంతసించు వారందరిపక్షముననుకూడ నేను దీనిని ప్రారంభించుచున్నాను. నేనును నామిత్రులును యిప్పటికంటె నెక్కుడు శ్రద్ధతోను చురుకుదనముతోను కృషిచేయగల్గుటకై మేము ధికమగు ఆత్మశుద్ధిని బడయవలసియున్నది గాన అందులకే నేనీదీక్షను వహించుచున్నాను. ఇది పవిత్రవంతము హృదయపూర్వకమునగు దైవప్రార్థన. నేను ప్రారంభింపనైయున్న యుపవాసదీక్ష నామోదించిన స్త్రీపురుషులెవ్వరునుకూడ నాతోబాటు ఉపవాసవ్రతమును ప్రారంభింపరాదు. వారటుల గావించినచో వారి ప్రాణములకును నాప్రాణములకును కూడ బాధకల్గించినవారగుదురు. నేనీదీక్షను ముగించినపిదప నాకంటె పవిత్రులును అర్హులునగువారలకు నిది మార్గదర్శియగునుగాక.

గతసెప్టెంబరు మాసమునుండియు నేటివరకును నాకు వచ్చుచున్న లేఖలను, తదితర గ్రంథసముదాయమును, పత్రికలను శ్రద్ధగా నేను పరిశీలించుచునే యున్నాను. విద్యాధికుల

తోను, విద్యావిహీనులతోను హరిజనులతోను, యితరుల తోను సంభాషణలను జరుపుచునేయున్నాను. ఈ అనర్థము నేనూహించినదానికంటె వేయిమణుంగులు అధికముగానున్నది. బాహ్యముగా ధనమును సమకూర్చుట, సంఘముల నేర్పాటుచేయుట, హరిజనులకు రాజకీయాధికారములనిచ్చుట యను మూడును యవసరమైనవే యైనను యెంతమాత్రమును నీయనర్థము అంతరించదు. కాని వాటితోబాటు ఆత్మౌన్నత్యము, ఆత్మశిక్షణము, ఆత్మశక్తి అనగా ఆత్మశుద్ధియే అత్యవసరమైనది. అందులకు ఉపవాసవ్రతము దైవప్రార్థనయు మాత్రమే ఉత్కృష్టసాధనములు. ఆర్తులకుండెడి వినయశీలము మూలముననేగాని అహంకారమువలన సత్యస్వరూపుడగు భగవానుని సాన్నిధ్యము బడయజాలము.

మనఃపూర్వకముగా గాక కేవలము శారీరకమగు నుపవాసము చేయుటచే నెట్టిలాభము కలుగబోదు. సత్యమునేగాని మరి దేనిని వెల్లడింపరాదను దృఢతమమగు సంకల్పముండవలెను. అది ఆత్మోపవాసమని మనఃపూర్వకముగా గుర్తెరుంగవలెను. కావున సత్యముకొరకు పాటుపడినవారును ప్రతిపక్షులనుకూడ ప్రేమించువారును, యింద్రియముల జయించినవారును, ప్రాపంచక వాంఛలను త్రుంచివైచిన వారును మాత్రమే ఉపవసించుట కర్హులు. కావున సరియైన సాధనలేనివారు యిట్టి యుపవాసములకు పూనుకొనరాదు.

నాయుపవాసదీక్షను గురించి దురభిప్రాయ పడనక్కరలేదు. నాకు మరణింపవలెనని కోరిక లేదు. హరిజనోద్యమముకొరకు ప్రాణములను అర్పింపవలసియే వచ్చినచో నేనందులకు సిద్ధముగనే యున్నాను గాని ఆయుద్యమముకొరకే నేను జీవింప వాంఛించుచున్నాను. నాసహచరులగు హరిజన సేవకులకు కూడ పవిత్రమైన ఆత్మశుద్ధి, కార్యదీక్ష, స్వార్థత్యాగము చేకూరవలసియున్నది. నిర్దుష్టమైన పవిత్రవర్తనముగలవారు యీహరిజనోద్యమమున కృషి చేయుటకై కావలసియున్నారు. కొందరతిహేయముగ ప్రవర్తించిరనినాకు తెలిసినది. అట్టివారు ఈ నాఉపవాసదీక్షను విజ్ఞప్తిగాదలంచి వెంటనే ఈయుద్యమమునుండి విరమించెదరుగాక!

ఈయుద్యమమొక రాజకీయపన్నాగమని చాలమంది సనాతనులును యితరులును తలచుచున్నారని నే నెరుగుదును. ఇది కేవలము మతసంబంధమైన యుద్యమమేగాని యెంతమాత్రము రాజకీయముకాదను దృఢనమ్మకము వారికందరికిని ఈ ఉపవాసమువలన కలుగునుగాక యని నేను మనః పూర్వకముగా ప్రార్థించుచున్నాను. ఈ శరీరమువలన యింకను పని పుచ్చుకొనవలెనని భగవంతుడు సంకల్పించియే యున్నచో భౌతికమగు ఆహారము లభింపకపోయినను ఆతడు నాజీవముల నీశరీరమున నిలుప గలడు. ఆతడు నాకు దివ్యమగు ఆధ్యాత్మికాహారమును ప్రసాదించును. భగవంతుడు

భౌతికస్వరూపములచేతనే యాతని సంకల్పములను సాధించు చుండును. అస్పృశ్యతను నిర్మూలించుటత్యవసరమని నమ్ము వారందరును సవర్ణ హిందువులపక్షమున హరిజనులకొసగ బడిన వాగ్దానమును పూర్తిగా నేరవేర్చుటకు సర్వశక్తులను వినియోగించునెడల నదియే నాకు ఆహారముకాగలదు. హరిజనసేవకు లెవ్వరును ఈ దీక్షనుగూర్చి ఆందోళనము చెందరాదు దీనివలన వారికి మరింతబలము చేకూరునని యే వారు భావింపవలెను. వారు తమ తావులను విడనాడక తమవిధిని నెరవేర్చుచుండవలెను. అత్యావశ్యకమైన విశ్రాంతి కొరకుగాని వ్యాధి నివారణకొరకుగాని తత్కాలికముగా కార్యరంగమునుండి విరమించుచున్నవారుకూడ సేవచేయు చున్నట్లే భావింపవలెను.

హరిజనోద్యమమునకు సంబంధించిన విషయములను గూర్చి సంప్రతించుటకు గాక మరెందులకును యెవరును కూడ నాదగ్గరకు రానక్కరలేదు. ఉపవాసమును మాను మనిగాని కొంతకాలము గడచినపిమ్మట ప్రారంభింపమనిగాని నన్నెవరును కోరవలదని మిత్రులను ప్రార్థించుచున్నాను. వారటులకోరుట నిరుపయోగము

ఈ సంకల్పము కేవలముఈశ్వరేచ్ఛానుసారమనియే నేను చెప్పుచున్నాను. ఇందెట్టి అతిశయోక్తియు లేదని మీరు నమ్మెదరుగాక! "ఈ ఉపవాసము నిరపాయకరముగా

ముగియుగాక! నేనుజీవించినను, మృతినొందినను యేయుద్య మముకొరకు నేనీయుపవాసమును ప్రారంభించితినో యది నెరవేరుగాక!”యని భారతీయులును విదేశీయులు నగు మిత్రు లెల్లరును నాకొరకు నాతోబాటు భగవంతుని నిరంతరము ప్రార్థింపగోరుచున్నాను. ఈ ఉపవాసముయొక్క ఫలితము నాయెడల నెట్లు పరిణమించినను సరియేగాని సనాతనవాదు లగు నాసోదరులకు సత్యధర్మమును ప్రత్యక్షము చేసుకొను టకై నిజస్వరూపమును మరుగుపరచిన ముూతతీసివేయుమని యీశ్వరుని మీరు ప్రార్థించెదరుగాకయని కోరుచు న్నాను.”

ఈ సందేశము వెంటనే ఉరుముతోడి మెరుపువలె ప్రపంచమంతటను మిరుమిట్లుగొల్పెను. భారతదేశముననేగాక ఆధ్యాత్మికదృష్టిగల పాశ్చాత్య ధీమంతుల నందరనుకూడ కల వరపెట్టెను. దేశీయనాయకులెల్లరును ఈ యుపద్రవమును మరలించుటకై వ్యాకులపడసాగిరి.

మే 1 వ తేదీని మానవ్రతానంతరము మహాత్ముడు పత్రికాప్రతినిధులతో నిట్లు వాక్రుచ్చెను. “ఈదీక్షను గైకొ నుటకు ఏ యొకసందర్భమును ప్రత్యేక కారణమని చెప్పుటకు ఏలులేదు. చాలవిషయములు నన్నిందుకు ప్రేరేపించినవి. వానిని గూర్చి నేనింతకుపూర్వము ఏమరిపాటుతో నుంటినని తలంచరాదు. అవి తెలియకుండగనే నామనస్సుపై పనిచేయు చున్నవి.

ఇది కేవలము అంకురార్పణ మాత్రమే. దీనిని జయప్రదముగా ముగింపగల్గినచో నేను మరియొకయుపవాసదీక్ష బూనుటకై ప్రేరేపింపబడవచ్చును. క్రిందటి సెప్టెంబరు నెలలో నేజేసిన యుపవాసమునకును దీనికిని వ్యత్యాసముగలదు. అది కేవలమొక కార్యమును సాధించుటకే గావింపబడినది. ఇందు ప్రత్యేకముగ కార్యసాధనమేదియు లేదు. కావున దీని నెప్పుడైనను ప్రారంభింపవచ్చును. ఇది హిందూధర్మసమ్మతమైనదే. మహోత్తరమగు సంస్కారణోద్యమము సాగింపబడుచున్నప్పుడది పవిత్రవంతముగనుండుటకును, సత్వరఫలితముల బడయుటకును యుపవాసదీక్షబూనుట సామాన్యధర్మమే. అట్టి దీక్ష సత్ఫలితముల నొసంగునని యెల్లరంగీకరించిన విషయమే. ఉపవాసమహిమయే ఉపవాసమునకు కారణము. నిస్సంశయముగ నేను యీవ్రతము నవలంబింపవలసియున్నది అట్లు గావించుటకు యేలనోగాని నాకు ధైర్యము చాల లేదు. నాపై నత్యధికమగు బాధ్యతకలదు. అందుచే ననేకసార్లు ప్రేరేపింపబడియు నేను సందేహపడితిని. ఏధర్మయుద్ధమును గూడ మానసికము భౌతికము నగు సంపత్తిపై నాధారపడి యుండలేదు. దానికి వలయునది ఆధ్యాత్మికసంపద- అది బడయుటకు ఉపవాసవ్రతమే అత్యుత్తమమగు సాధనము. కాని ప్రతియుపవాసమువలనను కోరిన ఫలితము కలుగదు.

నేను పూర్వమొకసారి 21 దినము లుపవాసముజరిపి జీవింపగల్గితిని. అది 10 సంవత్సరముక్రితమనుమాట నిజమే. కాని నాకంటె బలహీనులింతకంటె నెక్కుడుదినము లుపవసించియుకూడ జీవింపగల్గిరి. ఆధ్యాత్మికాహారము యెంతపనియైనను చేయగలదు. క్రిందటి సెప్టెంబరుమాసము ఉపవాసదీక్షాసందర్భమున నేను 6 దినములలోనే మరణావస్థకు వచ్చితినని మీరు చెప్పుచున్నారు. కాని మహిమలయుగము అంతరించలేదు." ఈసందేశమందలి యదార్థము నేడు రుజువుగానైయున్నది.

సింహావలోకనము.

కాని మహాత్ముడెందులకీ యుపవాసమును బూనెనో, యందలి అంతరార్థమేమో, యాతని సహచరులలో నెవ్వరే లోపముల నొనరించిరో తెలుసుకొనజాలకప్రజలు యాతత్రిపడసాగిరి. మహాత్ములచర్యలు దురవగాహములు. అయినను ఆతనిపట్ల దేశీయులును ప్రభుత్వమును గావించిన యపచారములను విమర్శించుచు మే 6 వ తేదీ కృష్ణాపత్రికా సంపాదకీయవ్యాసములో నిట్లు వ్రాయబడెను. "ప్రభుత్వమువారేమి, భారతీయులేమి మహాత్మున కెన్నిబాధలు పెట్టుచుండిరో, ఒక్కమారు సింహావలోకన మొనర్చినచో తెలియగలదు. రమ్సేమెక్‌డొనల్‌యవార్డు సందర్భమున ప్రాయోపవేశము జేసెదనని ప్రకటించినంతనే 'హరిఃఓం' అని మేగ్డనాల్డుమంత్రి మహావ

రాధమొనర్చెను. అది తలచుకొనినయెడల ఎవరిహృదయాంతరాళము శూలములతో పొడిడిచినట్లు ఆక్రందన మొందకుండును? నిమ్నజాతులు శాసనసభలయందు జేరి వారి యిక్కట్టులను వెలిబుచ్చుదు రేమోయని అక్కసుచే నిమ్నజాతుల యభివృద్ధికి అడ్డుదగుల జూచుచున్నట్లు మాక్డునాల్డు నిందించెను. ఎంతమాట! శాసనమడ్డులేనియెడల తాను సుముఖుడై యున్నట్లు ప్రధమమునఁ జామరిను ప్రకటించెను. కెళప్పను ప్రాయోపవేశము విరమించినంతనే జామరిన్ తాడిచెట్టెక్కి కూర్చుండెను. రామచంద్రఅయ్యరు మద్రాసునందు లాయర్లసభ ఫెళఫెళలాడించి శాసనమడ్డుతగులకుండ నేమిరామా వెలిగించెదనని కెలప్పను ప్రాయోపవేశము విరమించువఱకును బీరములు పల్కెను. ఏరుదాటినపిదప తెప్ప తగులవేయు చందమున అమాంతము ఎక్స్ట్రాసనాతనిష్టుడై హరిజనులు హిందువులే కాదని ఊదివైచెను.

దేవాలయపు బిల్లులసందర్భమున మాలవ్యాజీవంటి మహనీయుడు తొట్రుపాటుజెంది మహాత్మునికి తపోహంకార మారోపించెను. ఇక శాసనసభికుల చిత్రచర్యలు వర్ణింప నవసరమే లేదు. వారు తలచుకొనినయెడల దేవాలయపు బిల్లులవరకే అమలులోనికి రాకుండునా?..................

వెల్లింగ్టన్ ప్రభువుచమత్కారము చెప్పనే అక్కరలేదు. ఎన్ని బిల్లులు నోటమాట నోటనుండగనే అర్ధరాత్రిలందు పరి

హ్కారమగుటలేదు. దేవాలయపు బిల్లులనినచో గెజెటులో పచురించి కార్యము నడపుటకైనను అంగీకరించలేదు పూర్వము ప్రభుత్వమువారు హారిజనుల నుద్ధరించుటకే నాకలోకమునుండి దిగివచ్చినట్లు నటించుచుండిరి. హారిజనోద్యమము ప్రారంభమైనది. సవతిప్రేమ జనియించినది ఎమ్. సి. రాజా హారిజనులవెంటగొని వైనాయిని దర్శించెను. ఎవరిగతి వారు జూచుకొనవలసినదని చాటివైచెను. ఇక ప్రభుత్వనీడలన దగిన సి. పి. మున్నగు దాక్షిణాత్య విప్రుల ద్వంద్వవర్తన లోకవిదితము. సనాతనిష్టులు దేవాలయప్రవేశమున కంగీకరింపముగాని, ఆర్థిక, నైతిక, విద్యావిషయములందు సాయమొనర్చుటకు సంసిద్ధులమని ఘంటాపథముగ జెప్పిరి. చివరకు నక్కనీతులుగా పరిణమించినవి. రేపు రాబోవు ఎసెంబ్లీ సమావేశము నందైనను దేవాలయపు బిల్లులకు మనశాసన సభకు లేమేమి వ్యాఘాతములు కల్పింతురో చెప్పలేము. పూనాయొడంబడిక మార్పుజెందవలెనని బెంగాలు వెనుకంగ వేసినది. ఎన్నికలపద్ధతి మారవలెనని అంబేద్కరు పూనాయొడంబడికను కదలివేయజూచుచున్నాడు.

అఖిలభారత హారిజనసేవాసంఘకార్యదర్శి- దక్కరు గారు నేడు పచురించిన విషయములు చూచినచో యెట్టికైనను విచారము జనింపకమానదు. కొందరు హారిజన ప్రచారకులు జవాబుల నిచ్చుటకూడ మానివైచిరట. హారిజన

వరిచారకు లింకేమి యకృత్యము లొనర్చుచుండిరో బయట బడ లేదు. మహాత్ముడానీలకంఠునివగిది గరళన్య స్తమొనర్చుకొనుచున్నాడు. ఎన్ని యపచారములు మహాత్ముని భాధించి ఈ పాయశ్చిత్తకాండకు పురికొల్పినవో ఆపరమాత్మునికే యెరుక."

ఇందలి వాంశములన్నియు యధార్థములే యని యొప్పుకొనక తప్పదు. మరియు పూనాయొడంబడిక సమయముననే యందలిసవర్ణులవాగ్దానములు నిర్వర్తింపబడకున్నను అస్పృశ్యతానివారణమునకు నిజమైన కృషి జరుగకున్నను మరల పాయోపవేశ మొనరింపవలసివచ్చునని ఆరుమాసములక్రిందటనే మహాత్ముడు చెప్పియేయున్నాడు. ఈవిషయములను విమర్శించుచు మహాత్ముడు వ్రాసిన వ్యాసములు వేరొకచో నొసగబడెను.

---

## ౨

మహాత్ముడు 21 దినములు ఉపవాసదీక్ష గైకొనెనని ప్రకటింపబడినవెంటనే భారతదేశముగాక ప్రపంచమంతయు నొక్కమారు తారుమారాయెను. మహాత్ముని మిత్రులును, అనుచరులును, ఆప్తులునువలదని యనేకవిధముల వేడుకొనిరి. కుమారుడగు దేవదాసుగాంధి, రాజగోపాలాచారి, సరోజినీదేవి, మున్నగు అనుచరులు యాతని వారింపవలెనని యనేకవిధముల ప్రయత్నించిరి. తదితర నాయకులు ననేక విజ్ఞప్తులనంపిరి. అందుకొన్నిటి నీక్రింద నుదహరించుచున్నాను.

విజ్ఞాపనలు.

జనరల్ స్మట్సుగారు కేప్ టౌన్ నుండియిట్లుత్తరమంపిరి.

"మీయస్పృశ్యతానివారణప్రయత్నములవలన ఆశకుమించిన ఫలితముకల్గినది. కొంచెము వోపికపట్టినచో ఆధునికయుగములో మిక్కిలిమహత్తరమైన హిందూ సంఘసంస్కరణమును మీరు జయప్రదముగ నెరవేర్పగలరు. అంతియగాక భారతవర్షమున నూతనశకము ప్రారంభముకానున్నది. అందుచే పూర్వముకంటె నధికముగ బాధ్యతను వహించి మీరు మార్గదర్శకులుగావలసియున్నది. ఇట్టిసందర్భములో మీ జీవితమునకు ముప్పువచ్చినయెడల దేశమునకు భయంకరమగు యిక్కట్టు సంభవింపవచ్చును. మన పూర్వస్నేహమునుపురస్కరించుకొని హరిజనోద్యమక్షేమము

స్మట్సుసేనాని

కొరకే మీ రీయుపవాసదీక్షను కొంత కాలమువరకు నిలుప వలసిన దని నేను కోరుచున్నాను."

ఇంకను యనేకమంది పాశ్చాత్యమిత్రులు విజ్ఞప్తుల నంపిరి. దీనబంధు సి. ఎఫ్. ఏండ్రూస్‌గారు బర్మింగ్‌హాము నగరమున నుండగా ఈవార్త విని లండను నగరమునకు వచ్చి మిత్రులతో సంప్రతించి మహాత్మునకీక్రింది తంతినంపెను. "మీ నిర్ణయమంగీకరించుచున్నాను. అవగాహనమయ్యెను. ప్రేమతో ఛార్లీ."

ఆండ్రూస్.

దక్షిణాఫ్రికాలో మహాత్ముడు నడిపిన సత్యాగ్రహోద్యమమందు ఆతని కండయైనిలచి కష్టనిష్ఠురముల కోర్చిన పోలక్ మహాశయుడు, వారి సతీమణియు నీ యుపవాసదీక్షనామోదించుచు తంతినంపిరి.

లండన్ ఇండియాలీగు వారును, ఆండ్రూసుప్రభృతులును బ్రిటిషుమిత్రులతో ముచ్చటించి వెంటనే మహాత్ముని విడుదలకై ప్రయత్నింపసాగిరి.

మహాత్ముడు హరిజనోద్యమమునకై ప్రాణములు విడుచుటకన్న సజీవుడైయుండుటవల్లనే హరిజనోద్యమమునకెక్కువమేలు కల్గును గనుక ఉపవాసమువలదని ఎమ్. సి. రాజా తంతినంపిరి. డాక్టరు అన్సారి, శ్రీనివాసశాస్త్రి, కేల్కారు, డాక్టరు ఆలమ్ మొదలగువారు అనేకవిజ్ఞప్తుల నంపిరి. రవీంద్రనాథఠాగూర్‌గారిట్లు ప్రకటించిరి.

“మహాత్ముడు మరియొక ఉపవాసమును సాగింప నిర్ణయించెనని విని నేను చాల సంతాపమందితిని. అట్టి మహా

శపించుడు.

త్తరమగు దివ్యకీర్తి ఆవిధముగా ప్రాయశ్చిత్త మొనర్చుకొనుచూ నంతమొందుట నాకెంత మాత్రమును సమ్మతముకాదు. తన మృత్యువువలన తానెవరికొర కుపవసించుచున్నాడో వారు దిక్కులేని పక్షులగుదురు. సత్యసాధనదీక్షాబద్ధుడైన మహాత్ముడు ప్రాణములనర్పించి చేయగలుగు సేవకంటె సజీవుడైయుండి చేయగల్గు సేవయే వేయిరెట్లుఅధికమని మేమందరమును హృదయపూర్వకముగా విశ్వసించుచున్నాము.”

ఆకవిశేఖరుడు పత్రికావిలేఖరిద్వారా నిట్లు మహాత్మునికి తంతినంపెను. “మీదీక్షవార్తను విని దేశమంతయు కలవరపడుచున్నది. మిమ్ములను ఈసమయమున మానవజాతి కోల్పోవలేదు. కావున మీ నిర్ణయమును మార్చుకొనుడని ప్రార్థించుచున్నాను. భారతదేశ మిపుడు సందిగ్ధావస్థలోనున్నది. భావిచరిత్ర స్వరూపమంతయు నేడు నిర్ణయముకానున్నది. భారతదేశములోని ముప్పదికోట్ల ప్రజలునుమీసలహాకొరకు యెదురు చూచుచుందురు. సజీవులైయుండి మాకందరికిని మార్గదర్శులగుదురు గాక!”

అఖలభారతకాంగ్రెసు కార్యదర్శియగు సయ్యద్ మహమ్మద్ గారు యిదివరలో మహాత్ముడొనర్చిన హరిజన

సేవ ప్రశంసించుచు హరిజనోద్యమ విజయమునకై మహాత్ముడు జీవించియుండుటయే యావశ్యకముగాన యాతని యుపవాసదీక్ష విరమింపుమని గోరుచు తంతినంపెను. జయరామ్‌దాస్ దౌలత్‌రామ్‌గారు (కాంగ్రెసుకార్యదర్శి)యిట్లు తంతినంపిరి.

జయరామ్‌దాస్ దౌలత్‌రామ్.

"మహాత్ముడు 21 దినముల ఉపవాసదీక్ష చేయబూనుట హిందూదేశములో నెవరికిని ఆశ్చర్యముకలుగవలసిన పనిలేదు. ఈనిర్ణయం మహాత్ముని 20 సంవత్సరముల దేశసేవ కనుగుణముగానే యున్నది. ఈఉపవాసదీక్ష జయప్రదముగా కొనసాగుననుటలో సందియములేదు. భగవంతుడే అతనికి మార్గము చూపుచున్నాడు."

పండితజవహర్‌లాల్ నెహ్రూగారు.

పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు మహాత్మునికీ క్రింది తంతివార్తనంపిరి. "ఇప్పుడు మీరు మహోద్యమోన్ముఖులైయున్నారు. కావున ప్రేమపూర్వకమగు నాయభివందనములు తెల్పుచు, నికనేమి సంభవించినను శుభమే యనియు, మీకు విజయమే చేకూరుననియు నాకు విస్పష్టమగు విశ్వాసము కలదని తెలియజేయుచున్నాను."

మే 2 వ తేదీని మహాత్ముడు పండిత మదనమోహన మాలవ్యాగారి కిట్లు జాబువ్రాసిరి. "ఇప్పుడు రాత్రి 2 గంట లైనది. రాబోవు యజ్ఞమునకు మీ యాశీర్వాదముల పంపుట కిష్టమైనచో దయచేసి యట్లొ ర్పుడు. నా చిన్నతనములో మా తల్లిదండ్రులు నాకు నేర్పి దానినే నే నాచరణములో పెట్టుచున్నాను. మాజనని జీవిత కాలములో సగము భాగము ఉపవాసములతో గడిపినది. నే నేమిచేయను? హరిజనసేవ కేవలము వాదములతోనె నే చేయ జాలను. ఇట్లు—మీచిన్నతమ్ముడు—మోహనదాస్.—"

పండితమాలవ్యాగారు.

అందులకు మాలవ్యాగారు యిట్లు జవాబువ్రాసిరి. "పరమేశ్వరుడు మిమ్మాశీర్వదించుగాక. నేను వెనుక చెప్పి నట్లు పరమేశ్వరుడే మీ కీనిశ్చయమును కలుగజేసెనని పూ ర్తిగా విశ్వసించుచున్నాను. ఈమహావ్రతములో మీకు తగిన శక్తినొసంగుటకై నేను సర్వదా ఈశ్వరారాధన గావించుచు న్నాను. ఈశ్వరుడు మీకట్టి శక్తినొసంగి తీరుననియే నావిశ్వా సము. అనన్యభావము కల్గియుండుడు. సాధ్యమయినంతవరకు పరమేశ్వరుని గూర్చినవి తక్క యితరమగు భావములను మీ లోన చొరనీయకుడు—ఆతడే మనతోడునీడ. ద్వాదశాక్షరీ మంత్రమునకు తోడు 'సోహం' మంత్రమును గూడ ఉచ్ఛ్వా సనిశ్వాసములతో పాటు జపించుచుండుడు. ఇదిలోని ప్రాణ వాహినిని చేబట్టుటకు బనికివచ్చును. మహాతపస్వీలు

కొందరు మిమ్ము స్మృతిజాగ్రత్తతో కనిపెట్టియున్నారు. దేశమంతయు మీయాకార కీశ్వరోన్ముఖమై ప్రార్థించుచున్నది. సర్వభూతాంతర్యామియైన వాసుదేవశబ్దముచే గాక తదితరములచే మీపరిసరములు కలతనొందకుండును గాక! ఈశ్వరాదేశమును స్మరింపుడు. 'మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి'. కొంచెముయోపిక వచ్చినంతనే వచ్చి కలుసుకొందును."

---

3

మహాత్ముడు హరిజనపత్రికలో నిట్లు వ్రాసెను "స్మట్సు సేనాని నాయుపవాసదీక్ష విరమింపుమని మిక్కిలి జాలికరము గా నాకు తంతివార్తనంపెను. డాక్టరు అన్సారీ గారు దృఢతరమైన ప్రేమపాశములతో నన్ను బంధించివైచెను. మొదట నేను హాకీముసాహెబ్ అజ్మల్ ఖాన్ గారిని తరువాత డాక్టరు అన్సారీగారిని ఆ 'సయామీసు కవల' ద్వారానే మిత్రులుగా నొనరించుకొంటిని. కాని వారు నన్ను పరిత్యజించినప్పుడు కూడ అన్సారీగారు, నాకు మహమ్మదీయులపై మహాగౌరవము, ఈయుభయజాతులవారము ఒకే భారతమాతగర్భవాసమున జన్మించినవారమగుటచే రక్తసంబంధులమను నాభావమును సంశయించి యుండ లేదు. ఆయన నాచిరకాలమిత్రుడు, సహచరుడు, మాయింటి వైద్యుడు. ఇన్ని యధికారములతో నాయుపవాసము మానుకొనవలసిన దని జాలికల్గునట్లుగా ప్రార్థించెను. నాయంతరాత్మకు సంరక్షకుడగు రాజగోపాలాచారిగారు నాయుపవాస దీక్ష మూలకారణమునే ఖండించుచునొకదీర్ఘమైన లేఖ వ్రాసెను. ఇక వీనియన్నిటితో బాటు నాకడనారికుమారుడును నాయనుచరులలో ముఖ్యుడు నగు దేవదాసు కన్నీరుమున్నీరుగా వలదు వలదని ఘోషించెను. ఇట్టి ముఖ్యులప్రార్థనలు కూడ నన్నావంతయైనను చలింపజేయలేదన్నచో, నన్ను పూ

మహాత్ముని సమాధానము.

త్రిగా పరాజితునొనర్చ యిట్టి ప్రార్థనల నన్నిటిని అంగీకరింపకుండ జేయుచున్న మహాశక్తి యేదో నన్ను వశపరచుకొని యున్నదని పాఠకులు తెలుసుకొందురుగాక!

ఈ ప్రార్థనలలో నిగూఢమగునొక యంతరార్థమున్నది. నా యుపవాసదీక్ష ఈశ్వర ప్రేరితమని వీరికి విశ్వాసము లేదు. అనగా నా మాటలో వారికి నమ్మకము లేదని కాదు. కాని నే నేదో వ్యామోహములో బడియున్నానని వారియూహ. ఏదో తలంపులయుద్రేకములో, జైలుగోడల వేడిమిలో జిక్కుకొని యిట్లెంచితినని వారెంచుచున్నారు. అట్టిది యసంభవమని నే ననను. కాని నా విశ్వాసము అన్యథా నుండుటచే నా మనస్సునకు యిది నచ్చుటలేదు. నేను జైళ్ళ కలవడిన వాడనే. జైలులో నున్నంతమాత్రమున నా భావనావిధానము చెడిపోయిగాని, నేను మానసికజిజ్ఞాసలో బడిపోయిగాని యెన్నడునుండలేదు. ఎన్నిమార్లు కారాగృహవాసము సంభవించినను నిరంతరము కర్మతంత్రమున చిక్కుకొని యుండుటవలన నాకు జిజ్ఞాసగావించుటకు తీరిక లేకపోయినది. కాని హరిజనులకు జరిగిన యపచారములనుగూర్చి జిజ్ఞాస యొనరించినమాట సత్యమే. కావున నా జిజ్ఞాస యెప్పుడును కార్యరూపమును పొందినది.

భయంకరమగు ఆనాటిరాత్రికి వెనుకటిదినమున నేనూహించుచున్నది నిజముగా నీయుపవాసమును గూర్చి

కాదు. ఈశ్వరవాణి వినగలభాగ్యము నాకు భగవంతు డొసంగెనని నేడు నేను క్రొత్తగా తెలుపలేదుగాని ఈవిషయము నిజమేయని ప్రజలు నమ్మునట్లు చేయగలది దాని ఫలితము తప్ప మఱేదియును లేదు. అల్పజ్ఞులును, తనచే సృష్టింపబడినవారునగు తుచ్ఛమానవులు తన్ను పరీక్షించుటకు భగవంతు డంగీకరించినచో నతడు భగవంతుడు కాజాలడు. కాని యా భగవంతుడు తనయనన్యదాసు లెట్టి అగ్ని పరీక్షలనైన దాటగల్గిన శక్తి నొసంగితీరును కఠినశాసనుడగు నా దేవునికి నే నేబదియేండ్లు మనఃపూర్వకముగా సర్వసమర్పణ మొనరించి దాసుడనై యుంటిని. కాలము గడచిన కొలదియు భగవత్ప్రేరణను నేను మరింత స్పష్టముగా వినగల్గుచున్నాను. మహాభయంకరదశయందుకూడ నన్నాయన విడనాడలేదు. నాయింద్రియములబారినుండిగూడ నన్నా మహాస్వామి కాపాడెను. నే నాతని కొక నీచసేవకుడను. నాకెట్టిస్వాతంత్ర్యము లేదు. నే నెంతఆత్మార్పణము చేయగల్గుచున్నానో నాకంత అధిక ఆనందము కల్గుచున్నది. నేనిపుడు ప్రారంభింపనున్న ఉపవాసమును గూర్చిన నిర్ణయము సరియైనదేయని ఆఖరుకు దయామయులగు నామిత్రులు గ్రహింపగల్గుదురను గట్టినమ్మకము నాకు కలదు. నేను జీవించినను మృతినొందినను వారి కిది తెలిసిరాగలదు. ఈశ్వరుని విధానము లగ్రాహ్యములు.

నేను జీవించియుండుటకంటె మృతినొందుటవలననే అధికమగులాభము చేకూరవచ్చును. కాబట్టియే నేను మృతినొందుట భగవదిచ్ఛ కావచ్చును. ఈభౌతికశరీరమందు ప్రస్తుతమున్న జీవుడు యీ స్థూలశరీరము విడువగానే వానికి గల క్రియాశక్తి లేక సేవాశక్తి అంతరించునని తలచుట చాల నిరుత్సాహకరము. రామకృష్ణపరమహంస, దయానందసరస్వతి, వివేకానంద, రామతీర్థ మున్నగు మహనీయుల ఆత్మలీనాటికిని ప్రపంచమంతట పనిచేయుట లేదని యెవ్వరన గలరు? వారు జీవించియున్నప్పటికంటె నిపుడే అధికమగు సేవనుచేయు శక్తి గలిగియుండవచ్చును. మనుజులొనర్చిన సత్కార్యములన్నియు వారితోబాటు నంతమొందుననుటలో సత్యము లేదు. మనుజులొనర్చు దుష్కార్యములను వారుమృతినొందగానే మనము మరచిపోదుము. కాని వారొనర్చిన సత్కర్మలను మనము జ్ఞప్తియందుంచుకొందుము. కాలము గడచినకొలదియు వాటి ప్రశంస హెచ్చునుగాని తగ్గదు.

నేను దుర్భ్రమలో చిక్కుకొనియుండలేదని జనరల్ స్మట్సున్నగు మిత్రులు నమ్మవలెను. ఈ యుపవాసము నిరపాయకరముగా ముగియునట్లనుగ్రహింపుమని యెల్లరును పరమేశ్వరుని ప్రార్థింపవలసినదని వేడుచున్నాను. ఈభూతలమునందేపనినైన నాచేత చేయించవలెనను కోరిక పరమేశ్వరుని కున్నచో నాడాక్టరు మిత్రులెంతభయపడినను గూడ

భగవంతుడు నాప్రాణములను గాపాడితీరును"—"హరిజనుల నడచివేసిన సవర్ణుల వంశమందే నేను పుట్టితిని. నేను ఆహారము గ్రహించునప్పటికంటె ఉపవాసము చేసినప్పుడే ఎక్కువపని జరుగగలదు"—అని మహాత్ముడు తన ఆశ్రమములోని ఒక హరిజనునకు వ్రాసెను.

మహాత్ముడీ సమాధానమొసంగినంతనే నాయకులు ఉపవాసదీక్ష మాన్పు ప్రయత్నముల మానివేసి భావికర్తవ్యమును గురించి ఆలోచించిరి. మహాత్ముని విడుదలచేయవలసినదిగా ఇంగ్లండులోను ఇండియాలోను ప్రముఖులు ప్రభుత్వమున కొత్తిడి కలుగజేసిరి. పూనాలో "సత్కాల్" అను పత్రికలో మహాత్ముడుపవాసము ప్రారంభింపగనే ప్రభుత్వమువారు విడిచిపెట్టెదరని వ్రాసెను. లండన్ "న్యూస్టేట్సుమన్ పత్రిక" కూడ మహాత్ముని విడుదలచేయకోరెను. లాన్సుబరీగారు కూడ లండనునుండి వైస్రాయిగారికి మహాత్ముని వెంటనే విడుదలచేయుట యుక్తమని హెచ్చరించుచు తంతివార్త నంపిరి.

ఉపవాసదీక్ష ప్రారంభించుట నిశ్చయమయ్యెను. ఉపవాసములో వైద్యసహాయము మున్నగు యేర్పాటులగురించి సరోజినీదేవి, రాజగోపాలాచారి, ఎమ్.ఎస్. ఆనీ మున్నగువారాలోచనలు సాగించిరి. మహాత్ముడీ యుపవాసమును నిరపాయకరముగా నెరవేర్చుటకు తగినశక్తినొసంగి కాపాడు

మని భక్తిపూర్వకముగా భగవంతుని ప్రార్థించుటతప్ప మరే మియు చేయదగినది లేదని నాయకులు సందేశమిచ్చిరి.

భారత హరిజనసేవాసంఘాధ్యక్షులగు జి. డి. బిర్లా గారు యిట్లు ప్రకటించిరి. "గాంధిమహాత్ముడు మే నెల 8 వ తేదీ సోమవారమునాడు అస్పృశ్యతానిర్మూలనముకొరకు ఉపవాసము మరల ప్రారంభించును. ఈపర్యాయము 21 రోజులు ఉపవాసముచేయును గాన 8 వ తేదీ దేశమునందంతటను ప్రజలు ఎవరంతటవారు విడివిడిగాను, అందరు కలిసియును మహాత్ముని ఉపవాసము జయప్రదముగా ముగియునట్లనుగ్రహింపుమనియును, ఆయనకు దీర్ఘాయురారోగ్యముల ప్రసాదింపుమనియుచు పరిశుద్ధాత్మతో భక్తిపూర్వకముగా పరమేశ్వరుని ప్రార్థింపగోరెదను. ఆనాడు ఆబాలగోపాలమును స్త్రీపురుషులందరును 24 గంటలును ఉపవాస మొనరింపగోరెదను. హరిజనోత్తముడగు మహాత్మునియొక్కయు, హరిజనసంఘముయొక్కయు మేలును మనఃపూర్వకముగా గోరువారందరునుఆనాడుపవాసమును, ప్రార్థనలుజరుపగోరెదను. మన దేశమునుండి అస్పృశ్యతను రూపుమాపవలెనన్నచో ఆనాడందరును దైవసాక్షిగా ప్రమాణము చేయవలెను. ఇంతవరకు యీయుద్యమమున పనిచేయుచున్నవారును, క్రొత్తవారును, స్త్రీపురుషులు తప్పక ప్రమాణముచేసి ఆరీతిగా అధిక

బిర్లాగారి విజ్ఞప్తి.

మగు దీక్షతో పనిచేయగోరెదను. హరిజనుల విద్యాభివృద్ధికిని ఆర్థికాభివృద్ధికినిగూడ అందరును సర్వశక్తులను వినియోగింపగోరెదను. ఆదినము పరమపవిత్రమగు పర్వదినమని అందరును భావించి చాల నిష్ఠగా నుండగోరెదను. అనగా నిష్కల్మష భావములతోనుండవలెను.

ఆంధ్రనాయకులును, ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతానివారణ సంఘాధ్యక్షులునగు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, గాంధిమహాత్ముడు పాపపరిహారార్థము 8 వ తేదీ సోమవారముపవాసవ్రత మారంభించుననియు, అవర్ణులును సవర్ణులును నీదీక్షాకాలమందు తమకుగల యవకాశములను తమ ప్రాయశ్చిత్తమునకును మహాత్ముని సంకల్పసిద్ధికిని వినియోగించి భగవదనుగ్రహము బడయుటకై ఆంధ్రమహాజనులందరు నీమూడువారములును గూడ మహాత్ముడు కోరినట్లు చిత్తశుద్ధిగలిగి తమధర్మమును నిర్వర్తించెదరుగాకయని హెచ్చరించిరి.

ఆంధ్రదేశమున హరిజనోద్యమము మరింత తీవ్రతరముగ వర్ధిల్లెను. జాతీయనాయకులందరును బద్ధకంకణులై ప్రచారము సాగించిరి.

మే నెల 8 వ తేదీ మధ్యాహ్నము 12 గంటలు అయ్యెను. యరవాడ జైలు సింహద్వారమువద్ద వేనకువేలు ప్రజలు గుమిగూడిరి. శ్రీయుతులు కీకా కలేల్కార్, మధురదాస్ త్రికంజీ, లేడీవిఠల్ దాస్, పండిత సంతానం, పండిత హరిహర శర్మ, గంగా బేన్, సబర్మతీ ఆశ్రమవాసులు కొందరునుకూడ వచ్చియుండిరి. అంతలో దేవదాస్‌గాంధిగారు పత్రికావిలేఖరులను, తదితరులను దీక్షాప్రారంభమును చూచుటకు లోనికి తీసికొనిపోయెను. ఆదృశ్యము వర్ణనాతీతము. అంతయు ప్రశాంతముగనుండెను. 12 గంటలు కాకమునుపే ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్సు కల్నల్ డాయిల్‌గారు అన్నియేర్పాట్లు సరిగా నున్నవని చూచుకొని సంతృప్తిజెంది చూడవచ్చినవారిని లోనికిరానిచ్చెను. 'నిశ్శబ్దముగా నుండవలెను' అని మాత్రము పత్రికావిలేఖరులను హెచ్చరించెను.

దీక్షాప్రారంభము.

మహాత్ముడు తెల్లనివస్త్రము ధరించి వరాండాలో కాళ్లుముడుచుకొని నొక ఖాదీతివాచీపై జైలుగోడనానుకొని కూర్చొనియుండెను. వేడిమూలమున తలపై తడిబట్టనుంచుకొనెను. ఆయన కెడమవైపున ఆయనకనిష్ఠపుత్రుడు దేవదాస్‌గాంధి పూర్తియైన ఉత్సాహముతోను, జైలు యూనిఫారము ధరించిన మహాదేవదేశాయి అతి వినమ్రుడయ్యును, కూర్చుండిరి. శ్రీమతి సరోజినీనాయుడు, లేడీవిఠల్ దాస్, మరి

కొందరు స్త్రీలును గాంధిగారికి కుడివైపున కూర్చుండిరి. మిగతవారందరు మహదేవదేశాయి ప్రక్కన ఆసీనులైరి. సరిగా 11-30 గంటలకు మౌనము చాలించి మహాత్ముడు నారింజపండ్లరసముకు గ్రోలెను. మహదేవదేశాయిగారు గద్గదస్వరముతో ప్రార్థన మొదలిడిరి. మహాత్మునికి ప్రియమైన భగవత్సాన్నిధ్యము పొందగలిగినమార్గము వీరాగ్రేసరులే తెలుసుకొనగలరు' అనుగీతమును పాడిరి. గీతమును వినినప్పుడు మహాత్ముని తన్మయత్వమునకు మేరలేదు. దేవదాస్‌గాంధీగారు 'రఘుపతిరాఘవ రాజారామ్'అను గీతమును హృదయరంజకమగునట్లు పాడిరి. మహాత్మునికి ప్రియమైన 'వైష్ణవజనతో'అనుగీతమును, భగవద్గీతలోని కొన్ని శ్లోకములనుకూడ చదివిరి. ఇంత యుత్సాహముతో సరిగా 12 గంటలకు మహాత్ముని యుపవాసదీక్ష ప్రారంభమయ్యెను. రెండునిముషములు తర్వాత మహాత్ముడు అందరివద్దను సెలవు పుచ్చుకొనెను. ఇటువంటి కఠినసమయమందుకూడ మహాత్ముడు పత్రికావిలేఖరులతో పరిహాసములాడుచునేయుండెను. తనకు యీ 21 రోజులును సంపూర్ణమగు విశ్రాంతి నొసగవలెనని మహాత్ముడు తెల్పెను. ఉపవాసము ప్రారంభముకాగానే ఈదిగువ సందేశమును మహాత్ముడు పత్రికావిలేఖరుల కందజేసెను.

"దినములు గడచినకొలందియు సత్యస్వరూపుడగు భగవంతుడు నాకొసంగిన అగ్నిపరీక్ష తగినదేయను యుద్దేశ్యము నాలో వృద్ధియగుచున్నది. ఈయుపవాసము నేను ప్రారంభింపనిచో నాకు తెలిసిన విషయములవలన నేను నిర్విణ్ణుడనయియుందును. ఇందు నేను తుదిదాకనిలచి బ్రతికియున్నను లేకున్నను అదియంత ముఖ్యవిషయముకాదు. కాని యీ దీక్షయే నేబూనకున్నచో నేనికముందు హరిజనసేవకే గాక మరియే సేవ యొనరించుటకైనను అనర్హుడనగుదును.

మహాత్ముని సందేశము.

ఈయుపవాసమును విరమింపుమని నన్ను నిర్బంధించుచు లేఖలువ్రాసిన మిత్రులెల్లరును నావంటివానికిట్టి ఉపవాసములు అనివార్యములని గుర్తించెదరుగాక. ఇది కేవలము భగవత్ప్రేరణమే గాని యిందునాశక్తియేమియు లేదు. నాకు తంతివార్తలనంపినవారందరికి నేను వేర్వేరుగా కృతజ్ఞత తెల్పజాలనందుకు క్షమించెదరుగాక. ప్రస్తుతమున్న పనితొందరలో తంతివార్తలకు సమాధానములు వ్రాయుటకు సావకాశము చాలతక్కువగా నున్నది.

సర్వేశ్వరుడీయవలసినదేతప్ప నాశరీరములో శక్తియేమాత్రము లేదని ఒప్పుకొనుచున్నాను. ఇదివరకెన్నడు ఆయన నన్ను పరిత్యజించలేదు. కావున యిప్పుడుకూడనన్ను పరాజితునిచేయడని నమ్ముచున్నాను. ఒక హరిజనసంఘ కార్యదర్శి ఈయుద్యమములో హరిజనులకు సవర్ణులసహాయ

మవసరము లేదు గాన మీరుపవసింప పని లేదని తంతివార్తనం పెను. కాని వారు గ్రహింపవలసినసంగతి యేమనగా ఈయు పవాసము హరిజనులకుపకారము చేయుటకు కాదు. నాఆ త్మశుద్ధికొరకు, సహచరుల కళంకరహిత మొనర్చుటకు ఉద్దేశిం పబడినది. సవర్ణులు హరిజనసేవచేయుట వారికర్తవ్యము వారు నెరవేర్చుట తప్పమరేమియు కాదు. తమ ఆప్తులయెడల తామొనరించిన దోషపరిహారార్థము ప్రాయశ్చిత్తముగా సవర్ణులీతీవ్ర సంకల్ప మనుష్ఠింపవలసియున్నది. కొందరుహరి జనులు కోపించి అట్లుకాదనుటయు నాకవగాహనయగుచు న్నది. అసంఖ్యాకులీ ప్రాయశ్చిత్త మంగీకరించుటకు ఇంకను కాలము మించిపోలేదు. నాకువచ్చిన సందేశములందిట్టి సంశ యమున కవకాశము కన్పించుట లేదు.

ఈఉపవాసముకూడ నొక నిర్బంధచర్యయని సనా తనహిందువు లనుకొనుచున్నారు. దేవాలయములన్నిటిలోను హరిజనప్రవేశము జరిగినప్పటికిని, అస్పృశ్యతాపిశాచము పూర్తిగా తరిమివేయబడినప్పటికిని, యీఉపవాసము 21 దిన ములు కానిదే ముగియదు. అప్పుడే వారిందు సంఘర్షణకు తావు లేదని గ్రహింపగల్గుదురు.

ఈయుపవాసము, అహంకారము నణగద్రొక్కి, హృదయమాలిన్యమును రూపుమాపి, యీఉద్యమము కేవ లము ధర్మపరులచే నిర్వహింపబడదగిన సత్కార్యమని ఋజు వుచేయుట కుద్దేశింపబడినది. పరాత్పరుడీకఠోరవ్రతము నాశీర్వదించి దాని యుద్దేశ్యమును సఫలీకృత మొనర్చుగాక!"

---

౫

మే 8 వ తేదీ సాయంకాలము 6-45 గంటలకు మహాత్ముని విడుదలఆర్డరు వచ్చెను. మహాత్మునికప్పటివరకు విడుదలసంగతియే తెలియదు. ఆనాటిసాయంకాలము బొంబాయినుంచి ప్రత్యేకముగా నొక వార్తావహుడు విడుదలయాజ్ఞాపత్రమును తీసికొనివచ్చెను.

మహాత్ముని విడుదల.

7-30 గంటలకు పోలీసుఇనస్పెక్టర్ జనరల్ విల్సన్ గారు, జైళ్లఇన్స్పెక్టర్ జనరల్ కల్నల్ డాయిల్ గారును, జైలుసూపరింటెండెంట్ మార్టిన్ గారు యరవాడజైలులోనికి వచ్చిరి. సరోజనీదేవిని సూపరింటెండెంటు ఆఫీసులోనికిపిల్చి ఈశుభవార్త చెప్పిరి. ఆమెవెంటనే మహాత్మునికీసంగతి తెలియజేసెను. బొంబాయి రెగ్యులేషన్ క్రింద గాంధిగారిపైనున్న ఆర్డరు ఉపసంహరింపబడినదని విల్సన్ గారు మహాత్మునికి తెలియజేసిరి ప్రార్థనజరిపినతర్వాత పోవచ్చునాయని మహాత్ముడడిగెను. మోటారొకటి తమకొరకు సిద్ధముగానుంచెదమనియు ఎక్కడికి పోదలచుకొన్నది తెలియజేయజేయవలసినదియు అధికారులడిగిరి. కొంతసేపాలోచనలు జరిగినపిమ్మట లేడీ థాకర్సేగారి బంగాళాకు వెళ్లుటకు నిశ్చయించుకొనిరి. విల్సన్ గారు తదితర అధికార్లు ఈసంగతి తెలుసుకొని అచ్చటినుంచి మరలిరి. వల్లభాయిపటేలుగారు

## హరిజనసమస్య.

సరోజినీదేవి, దేశాయిగార్లు మహాత్మునితో కలసి ప్రార్థనలు జరిపిరి.

మహాదేవదేశాయిగారు, సరోజనీదేవిగారు మహాత్ముని సామగ్రినంతయు మూటకట్టిరి. 8-45 గంటలకు కల్నల్ డాయిల్ గారు, మార్టిన్ గారు తిరుగవచ్చిరి. మోటారు జైలుసింహాద్వారమువద్ద యుంచిరి. పత్రికావిలేఖరుల హడావిడి ఎక్కువగనుండెను. సరిగా 9 గంటలకు జైలు సింహాద్వారము తెరువబడెను. మొదట కల్నల్ డాయిల్, మార్టిన్ గార్లును, పిమ్మట సరోజినీదేవిని యూతగా నానుకొని మహాత్ముడును మందహాసముతో బయటకు వచ్చెను. కల్నల్ డాయిల్ గారు మహాత్ముని సరోజినీదేవిని కూర్చుండబెట్టి ఎరవాడకొండపైనున్న థాకర్సేసతిగారి చలువరాతిభవమునకు మోటారును పోనిచ్చెను. పత్రికావిలేఖరులు గాంధీగారి కారు వెనుకబడిరి. థాకర్సేసతిగారి బంగాళాలో ఈవార్త యెవరికిని తెలియదు. అక్కడనున్న దేవదాసుగారుకూడ షికారు బోయిరి. గాంధీగారు బంగాళావద్దను చేరుసరికి దేవదాసుగారు కూడ వచ్చిరి. దేవదాసుగారి సహాయముతో మహాత్ముడు మేడమెట్లెక్కి పైకిబోయి విశ్రమించెను. మేడమీాద థాకర్సే సతిగారు మహాత్ముని ఆహ్వానించిరి. మహాత్ముడొక సోఫాపై ఆసీనుడయ్యెను. అక్కడనున్న చిన్నపిల్లలు మహాత్మునిదగ్గరకువచ్చినంతనే మహాత్ముడు వారిని బుజ్జగిం

చెను. తర్వాత పత్రికావిలేఖరులను పిలిచెను. మహాత్ముడు అసోసియేటెడ్ ప్రెస్‌విలేఖరికి తనను విడుదలచేసినట్లు కల్నల్ డాయిల్‌గారు 6-45 గంటలకు తెలియజేసిరని చెప్పెను. పిమ్మట మహాత్మునికి బడలికచే నిద్దురపట్టెను.

మహాత్మునివిడుదలచేయు సందర్భమున ఇండియాప్రభుత్వమువారు "గాంధీగారు తనయుపవాసమునకు గవర్నమెంటుతో నెట్టిసంబంధము లేదనియు, యది కేవలము హరిజనోద్యమమునకే సంబంధించినదనియు, 21 రోజులుపవాసము గావించెదరనియు ప్రభుత్వమువారికి తంతివార్తనంపినందువల్ల గాంధీగారిని విడుదలచేసితిమ"ని మాత్రము ప్రకటించిరి.

మహాత్ముడు విడుదలయినతర్వాత ఈ క్రిందిప్రకటన గావించెను. "ఈవిడుదలవల్ల నాకుకలిగిన సంతోషమేమియు లేదు. సర్దార్ వల్లభాయిగారు చెప్పినట్లు ఈ విడుదలను పురస్కరించుకొని శాసనోల్లంఘనము తిరుగ నిర్వహించుటకు గాని నడుపుటకుగాని యెట్లుపూనుకొనగలను ? కావున

శాసనోల్లంఘనము—తాత్కాలికోపసంహారము.

ఋజుమార్గాన్వేషణకుడనై ఆత్మగౌరవమునకు పెనుగులాడు నాపై నీవిడుదల గొప్పభారమును పడవేసినది. ఈ యుపవాసము తుదివరకు కొనసాగవలసినదే. నేనేవిధమగు ఆలోచనములయందును పాల్గొనకుండుటకును, ఉద్రేకమును కలిగించుకొనకుండుటకును నిశ్చయించుకొంటిని. హరిజనోద్య

మమునకు సంబంధించని ఏహాంశమును నా ఆలోచనలోనికి రానిచ్చినను నా ఉపవాసదీక్షయొక్క ఉద్దేశ్యము భంగమగును. అయినప్పటికి కారాగృహావిముక్తుడనగుటచే శాసనోల్లంఘన పరిస్థితులుకూడ అవగాహనచేసికొనుటకు కొంత బుద్ధి నుపయోగించవలసిన విధి నాపైనున్నది.

ఇప్పటివరకు శాసనోల్లంఘనవిషయమై నాయభిప్రాయము లేమియు మార్పుజెందలేదనియే నేను చెప్పగలను. దేశములో నసంఖ్యాకులైన దేశభక్తులధైర్యత్యాగములు ప్రశంసనార్హములు. కాని శాసనోల్లంఘనోద్యమమున కేర్పడిన రహస్యతంత్ర స్వరూపము దానియపజయమునకే కారణమగుచున్నదని చెప్పకతప్పదు. దేశములో వివిధప్రాంతముల నీమహోద్యమమును నడుపుచున్న వీరికీరహస్యభావమును బరిత్యజింపుడని గట్టిగా చెప్పుచున్నాను. ఇందువల్ల ఒక్కసత్యాగ్రహి గూడ దొరకకపోయినను నేను లక్ష్యపెట్టను.

సామాన్యజనులు భీతినొందిరనుటలో సంశయము లేదు. ఆర్డినెన్సులు వారిని హడలగొట్టినవి. ఈ రహస్యభావముకూడ ప్రజలిట్లు భయపడుటకు కొంత తోడ్పడుచున్నదని నేను తలంచుచున్నాను. దానియందు పాల్గొనుచున్న స్త్రీపురుషుల యర్హతపైనే శాసనోల్లంఘనమాధారపడియుండునుగాని వారిచర్యలపై నాధారపడియుండలేదు. నేనే ఈ

యుద్యమమును నడుపుచుండినచో సత్యాగ్రహుల సంఖ్యను పాటింపక, వారియర్హతనే పరిగణించుచుండును. ఇట్లు జరిగినచో ఉద్యమమభివృద్ధి నొందదు.

ఇక యుద్యమముయొక్క ప్రస్తుత ప్రయోగమును గూర్చి నేనేమి తర్కించను. ఇప్పుడు వెల్లడిజేసిన భావములన్నిటిని యింతకాలము తొక్కిపెట్టియుంచితిని. వల్లభాయి గారుకూడ ఈ యభిప్రాయములోనే యున్నారు.

అది నాకిష్టమున్నను లేకపోయినను, సత్యాగ్రహులు ఈ ఉపవాసము మూడువారములును గ్రహ్యములో నుందురు కావున కాంగ్రెసు తాత్కాలికాధ్యక్షులైన బాపుజీ మాధవరావు ఆనీగారు శాసనోల్లంఘనము నొక్కమాసము గాని లేక 6 వారములుగాని నిలిపివేయుట యుచితము.

ఇప్పుడు ప్రభుత్వమునకొక విన్నపము. వారికీదేశములో నిజమైన శాంతిస్థాపన కావలెనన్నచో, నిజమైన శాంతి లేదని వారు తలంచుచుండినచో, ఆర్డినెన్సు పరిపాలనమే పరిపాలనము కాదని వారుగుర్తెరిగినచో నీతాత్కాలిక శాసనోల్లంఘనోపసంహారమును వారవకాశముగ గైకొని సత్యాగ్రహులనెల్లరను ఎట్టిషరతులు కోరకుండ విముక్తులగావింపవలెను. నేనీ కఠోరదీక్ష గడచి బ్రతికినచో, పరిస్థితుల సరిగా నవగాహనజేసికొని కాంగ్రెసువారికిని, అవసరమైనచో ప్రభుత్వమువారికిని సలహానిచ్చుట కవకాశము

కల్గును. ఈ సూత్రమును ఇంగ్లాండునుండి నేనుతిరిగివచ్చిన నాటినుండియు బరిగ్రహింతును.

నాకృషివలన కాంగ్రెసునకును ప్రభుత్వమునకును రాజీ కుదరక, శాసనోల్లంఘనము మరల ప్రారంభింపబడిన చో, అప్పుడు ప్రభుత్వమువారి కిష్టమున్నచో మరల ఆర్డి నెన్సు పరిపాలనము సాగింపవచ్చును.

ప్రభుత్వమువారి కిష్టమున్నచో నేదో యొక రాజీ కుదురు మధ్యమార్గము కనిపెట్టవచ్చును. ఇందులో నాకు సంబంధించినంతవరకు సత్యాగ్రహులు ఖైదీలయి యుండ గా, శాసనోల్లంఘన ముపసంహరించుట కష్టసాధ్యమని నా నిశ్చితాభిప్రాయము. ఎంతకాలము సర్దార్ వల్లభాయి, ఖాన్ సాహెబ్, అబ్దుల్ గఫర్ ఖాన్, పండిత్ జవహరిలాల్ నెహ్రూ మున్నగువారు బ్రతికియుండగనే పాతిపెట్టబడియుండెదరో అంతకాలము యెట్టియొడంబడికలు జరుగనేరవు. నిజము నకు జైలువెలుపలనున్నవారికి శాసనోల్లంఘనము విరమించు నధికారము లేదు. నేనెరస్టుచేయబడినప్పుడున్న కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారికి మాత్రమే విరమించుటకు అధి కారముగలదు.

శాసనోల్లంఘనము గూర్చి ఇంకేమియు జెప్పను. చెప్పినది చాలయెక్కువ. నాశరీరములో బలమున్నంతవరకే మిచెప్పినను చెప్పగల్గుదును. పత్రికావిలేఖరులు నన్నింక

బాధించరాదు. నాదర్శనమునుగోరు ప్రేక్షకులు గూడ ఈ విషయములో నిగ్రహము చాలవరకు జూపవలయునని కోరుచున్నాను. నే నింకను జైలులోనే యున్నట్లు వారు భావింపవలెను. నేను రాజకీయచర్చలుగాని, మరియే ఆలోచనలుగాని చేయుటకు అశక్తుడనై యుందును.

నన్ను పరిశాంతముగ నుండనిండు. ఈ విడుదల నెంతమాత్రము దుర్వియోగపరచనని ప్రభుత్వమువారికి చెప్పుచున్నాను. ఈ ఉపవాసమున బ్రదికి బయటపడి, అప్పటికిని రాజకీయపరిస్థితు లీనాటివలెనే అగమ్యగోచరముగా నున్నచో, నేను రహస్యముగా గాని, బహిరంగముగా గాని, శాసనోల్లంఘనము పునరుద్ధరించుట కెట్టికార్యము చేయక, అన్యాయముగ విడిచివచ్చిన మిత్రులను గలిసికొనుటకు మరల యరవాడ మందిరమునకు గొనిపొమ్మని ప్రభుత్వమువారిని నేను కోరెదను.

నేను సర్దారు వల్లభాయిగారితో కలిసియుండుట నా మహాభాగ్యము. ఆయన యద్వితీయధైర్య శౌర్యములను ఆయనయొక్క అకుంఠితదేశభక్తియున్ను, నే నెఱుంగుదును. ఇంతకాలము 16 మాసములు ఆయనతో కలిసియుండుట నాకెన్నడు తటస్థించలేదు. అయినను నాపైగల ప్రేమజూచినచో మా యమ్మ ప్రేమనాకు జ్ఞప్తికివచ్చుచున్నది. ఆయనలో నింత మాతృప్రేమ యున్నదని నాకు తెలియదు. నాకు

గావలసిన యుపచారములలో ప్రతివిషయమును ఆయన పరిశీలించి కనుగొనుచుండెను. నాకు ముల్లుగుచ్చుకొన్నను సరే, ఆనాడాయన నిద్రమేల్కొనియుండవలసినదే. ఆయనయు, తదితరసహచరులును ఆలోచించి చేసినట్లుగా నన్నొక్కపనియైన ముట్టుకొననిచ్చిరికారు. ఎప్పుడేవిషయమును గూర్చి చర్చించినను వల్లభాయిగారు ప్రభుత్వమువారి యిబ్బందులకూడ గుర్తెరింగి విచారించుచుండెనన్నచో ప్రభుత్వమువారు నామాట విశ్వసించెదరుగాక. బార్డోలీకెయిరా జిల్లారయితులపై నాయన జూపెడు ప్రేమ నాకెన్నటికి మరచెదవన్నను మరపురాదు.

---

కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

# జాతీయ గ్రంథమాల.

సంపాదకులు { బాలాంత్రపు సత్యనారాయణరావు,
పైడిమఱ్ఱి సత్యనారాయణమూర్తి.

ఇందు పిన్నలకును, పెద్దలకును, ముఖ్యముగా గ్రామ ప్రజలందరకును ఆర్థిక, సాంఘిక, రాజకీయ, చారిత్రక, పారిశ్రామిక విజ్ఞానము కలుగజేసి, జాతీయాభ్యుదయమునకు తోడ్పడు ఉత్తమ గ్రంథములు తెలుగున వాడుక భాషలో ప్రచురింపబడును. క్రౌను సైజున ప్రతి 1 కి సుమారు 250 పేజీలు గల రేపరు బైండున 4 పుస్తకములు సంవత్సరమునకు వెలువడుచుండును.

ప్రవేశరుసుము 4 అణాలు.

| | | |
|---|---|---|
| సంవత్సర చందా ( ... పోస్టేజీ సహా) | రు | 3 లు. |
| సహాయభృతి (సంవత్సరమునకు ... ) | రు | 5 లు. |
| శాశ్వతనిధి (ఒకేమారు ... ) | రు | 50 లు. |

వివరములకు:— మేనేజరు,

భారతీనికేతనము, కాకినాడ.